## ధ్వజభంగమునకుచికిత్స.

శ్లో॥ ధ్వజభంగక్షతంక్లైబ్యంజ్ఞాత్వాతస్యాచరేత్క్రియాం । ప్రదేహాన్పరిషేకాంశ్చకుర్యాద్వారక్తమోక్షణం ॥ స్నేహపానంచకుర్వీతసస్నేహంవావిశోధనం । అన్వాసనంతతఃకుర్యాదథవాస్థాపనంపునః ॥ వ్రణవచ్చక్రియాస్సర్వాస్తత్రకుర్యాద్విచక్షణః॥ ❊

తా॥ ధ్వజభంగనపుంసకమును, నిదానపూర్వకముగ తెలుసుకొని అందుకు తగినచికిత్సనుచేయవలసినది. అనగా పూతలు, సేచనములు, నరమునుభేదించిరక్తమునుతీయడము వీటినిచేయించవలసినది. మరిన్ని ఘృతము, తైలము మొదలైనవాట్లను సేవించడము, స్నేహయుక్తకషాయాదులచేత విరేచనములు చేయించడము, అనువాసనవస్తికర్మలేక ఆస్థాపనవస్తికర్మ వీటినిచేయించవలయును. నేర్పరియగు వైద్యుడు సకలచికిత్సలను వ్రణమునకుచేయునట్లు చేయవలయును.

## జరాసంభవక్షయజన్యనపుంసకచికిత్స.

శ్లో॥ జరాసంభవజేక్లైబ్యేక్షయజేచైవకారయేత్। స్నేహస్వేదోపపన్నస్యసస్నేహంశోధనంహితం । క్షీరసర్పిర్వృష్యయోగావస్తయశ్చైవయాపనాః। రసాయనప్రయోగాశ్చతయోర్భేషజముచ్యతే। విస్తరేణైతదుద్దిష్టంక్లైబ్యానాంభేషజంమయా॥

తా॥ ముసలితనమువలనకలుగు నపుంసకదోషమునందును, క్షయజన్యనపుంసకదోషమునందును, తైలాదులతోపూయడము, ఉష్ణోదకముతో వాత్తడము వేయడము, తైలాదులచేత రేచనద్వారావస్తికర్మ వీటినిచేయవలయును. మరిన్ని పాలు, నెయ్యి, బలకరయోగములు, యాపనవస్తికర్మ, రసాయనప్రయోగములు, యిపైనజెప్పినరెండు నపుంసకదోషములకును జేయవలయును. మరియును విస్తారముగా నపుంసకదోషములకు యీ చికిత్సలే నాచేత జెప్పబడినవి.

## వాజీకరణయోగము.

శ్లో॥ వాజీకరణమన్విచ్ఛేత్పురుషోనిత్యమాత్మవాన్ । తదాయత్తాహిధర్మార్థాప్రీతిశ్చయశఏవచ । పుత్రస్యాయతనంహ్యేత

ద్గుణాశ్చైతేసుతాశ్రయాః । వాజీకరణమగ్ర్యంచ క్షేత్రంస్త్రీ
యాప్రహర్షిణీ। యత్కించిన్మధురంస్నిగ్ధంజీవనంబృంహణం
గురు । హర్షణంమనసశ్చైవసర్వంతద్వృష్యముచ్యతే।ద్రవ్యై
రేవంవిధైస్తస్మాద్భావితఃప్రమదాంవ్రజేత్ । ఆత్మవేగేనచో
దీర్ణఃస్త్రీగుణైశ్చప్రహర్షితః॥ *

తా॥ ధైర్యముగలపురుషుఁడు, వాజీకరణయోగమును ఎల్లప్పుడుకోరవలయును. ధర్మము, అర్థము వాజీకరణయోగమునందున్నవి. మరియును స్త్రీపురుషులకు కలిగెడుస్నేహము, కీర్తి, వాజీకరణమువలన నేకలుగుచున్నవి. మఱియు పుత్రోత్పత్తికి కారణభూతములైయున్నవి. సద్గుణములు కలుగుటకు పుత్రోత్పత్తియేప్రధానమైనది. వాజీకరణమువల్లకలుగువట్టి సుఖమునకుముఖ్యస్థానము. ఆసంతోషమును యిచ్చునట్టిది స్త్రీయైయున్నది. కొంచెము మధురపదార్థము, స్నిగ్ధపదార్థము, తనకుయిష్టమైనమంచిపదార్థములు, వీర్యవృద్ధిచేయునట్టిపదార్థములు, మనస్సుకు సంతోషముచేయుపదార్థములు,యివియన్నియును వాజీకరణయోగమునందుపయోగించుచున్నవి. అనగా ఈపదార్థములనుభుజించినయెడల వీర్యము బలమైవెంటనే స్త్రీసమీపమునకు పరుగెత్తును. పిమ్మట తనకుకలిగిన కామవేగముచేతనున్ను, స్త్రీయొక్కహావభావవిలాసాదిచేష్టలచేతనున్ను సంతోషించి స్త్రీసంభోగముచేయును.

శ్లో॥ గత్వాస్నాత్వాపయఃపీత్వారసంవానుశయీతనా । తథా
చాప్యాయతేభూయఃశుక్రంచబలమేవచ॥ *

తా॥ ఈప్రకారముగా స్త్రీసంభోగముచేసినవెంటనే స్నానముచేసి (శక్కర, అక్రోటా, వీటితోమిళితమైన) పాలుత్రాగవలయును. మఱియును మాంసాదిరసమున్ను, రసాయనమునుసేవించి సుఖముగాపరుండవలయు. ఈప్రకారము చేయుచువచ్చిన మనుజునికివీర్యము, బలము ఇవి వృద్ధియగును.

## వీర్యవృద్ధికిసామాన్యచికిత్స.

శ్లో॥ శర్కరాయాస్తులైకాస్యాదేకాగవ్యస్యసర్పిషః । ప్రస్థంవి
ధాత్ర్యాఃచూర్ణస్యపిప్పల్యాఃప్రస్థమేవచ । అర్ధాఢకంతుగా

క్షీర్యాః క్షౌద్రస్యాభినవస్యచ । తత్సర్వంమిశ్రితంతిష్ఠేన్మార్తి
కేఘృతభాజనే । మాత్రామగ్నిసమాంతస్య ప్రాతః ప్రాతః
ప్రయోజయేత్ । ఏషవృష్యఃపరంయోగః కంఠోబృంహణ
ఏవచ॥ ❋

తా॥ శర్కర (౪౦౦) తులములు, ఆవునెయ్యి (౬౪) తులములు, నేల
గుమ్మడుగడ్డచూర్ణము (౬౪) తులములు, పిప్పలిచూర్ణము(౬౪)తులములు, తవక్షీరి
(౧౨౮) తులములు, కొత్తతేనె (౧౨౮) తులములు, వీటినన్నిటిని నేకముగ కలిపి
నేతితో మాగినమట్టికుండయందుపోసి దానినోటికి వాసెనకట్టివుంచి, అగ్నిపుష్టినె
టిగి ప్రతిదినము ప్రాతఃకాలమునందు పుచ్చుకొనిన బలము, వీర్యవృద్ధియిచిగలుగు
టయేగాక కంఠశుద్ధిరక్తపుష్టి యిచిసగాగలుగు.

సుశ్రుతగ్రంధములోనివాజీకరణయోగము.

శ్లో॥ విధిర్వాజీకరోయస్తుతంప్రవక్ష్యామ్యతఃపరం।తిలమాషవిదా
రీణాంశాలీనాంచూర్ణమేకవా । పౌండ్రకేక్షురసేనార్ద్ర
మర్దితంసైంధవాన్వితం । వరాహమేదసాయుక్తాంఘృతేనో
త్కారికాంపచేత్ । తాంభక్ష్యయిత్వాపురుషోగచ్ఛేత్తుప్ర
మదాశతం॥ ❋

తా॥ నువ్వులు, మినుములు, నేలగుమ్మడుగడ్డ, శాలిపిష్టముఅనగా ఎఱ్ఱ
బియ్యపుపిండి, వీటిని పౌండ్రికచెఱుకురసముచేతను, ఇక్షురసముచేతనుమర్దించి
సైంధవలవణచూర్ణమునువైచి పందిక్రొవ్వు నేతితోటిపచనముజేయవలయు. దా
నిని పురుషుడుసేవించినయెడల నూరుగురు స్త్రీలతోరమించుటకు శక్తిగలవాడగు.

వీర్యవృద్ధికిపాయసము.

శ్లో॥ గవాంవిరూఢవత్సానాంసిద్ధంపయసిపాయసం।తథాగోధూ
మచూర్ణంచసితామధుఘృతాన్వితం । భుక్త్వాహృష్యతిజీర్ణే౽
పిదశదారాన్వ్రజత్యపి॥ ❋

తా॥ తరిపిమాడలుగల ఆవులకుక్కపాలయందు గోధుమచూర్ణమువైచి
పాయసముకాచి అందుశర్కర, తేనె, నెయ్యివేసి సేవించినయెడల జీర్ణమయ్యెడి
సమయమునకు వీర్యవృద్ధిగలిగి పదుగురుస్త్రీలతోనైనను రమించుశక్తిగల వీర్య
వృద్ధిగలుగు.

## వీర్యవృద్ధికిచక్కిలములు.

శ్లో॥ తిలాశ్వగంధాకపికచ్ఛుమూలైర్విదారికాషష్టికపిష్టయోగః॥ఆ
జేనపిష్టఃపయసాఘృతేనపక్వాభవేచ్ఛషుటికాఽతివృష్యా॥

తా॥ నల్లనువ్వులు, పెన్నేరుగడ్డ, దూలగొండివిత్తులు, నేలగుమ్మడుగడ్డ, శాలిపిష్టము, వీటినీ సమముగచూర్ణముజేసి వీటికన్నిటికిని సమముగ మేకపాలు బోసి కలియబెట్టి మేకనేతితో చక్కిలములుకాల్చి సేవించినయడల వీర్యవృద్ధి యగును.

## వీర్యవృద్ధికిక్షీరపానము.

శ్లో॥ క్షీరేణబస్తాండయుజాశ్ఱృతేనసంప్లావ్యకామీబహుశస్తిలాన్యః।
సుశోషితాన త్తిపిబేత్పయశ్చతస్యాగ్రతఃకించటకఃకరోతి॥ ❊

తా॥ మేకవృషణములను ఆవుపాలలోవైచి బాగుగ కాచి, ఆవృషణములను తీసి, ఆపాలలో నల్లనువ్వులనువైచి భావనచేయవలను. ఇటుల అనేకపర్యాయములు భావనచేసి ఆనువ్వులనుబాగుగ నెండించి, దినమునకు (౧) తులముచొప్పున సేవించి శర్కరతోకూడిన ఆవుపాలను పుచ్చుకొనినయడల వానిముందర ఊరపిచ్చుకయేమిచేయగలదు? అనగాపిచ్చుక అనేకపర్యాయములు మైథునముచేయనట్లు మనుష్యుడు పిచ్చుకకంటె అధికముగా మైథునముచేయు సామర్థ్యముకలవాడగుననుటు.

## వీర్యవృద్ధికివిదారియోగము.

శ్లో॥ విదారీకందకల్కంతుఘృతేనపయసానరః । ఉదుంబరసమం
ఖాదన్వృద్ధోపితరుణాయతే॥ ❊

తా॥ నేలగుమ్మడుగడ్డరసమునుపాలలోచేర్చిపుడికించి లేహ్యపక్వముగునపుడు నెయ్యిచేర్చి కలియబెట్టి దించి ప్రతిదినమునందును అత్తిపండంత సేవించిన ముసలివాడైనను యౌవ్వనవంతుడగు.

## వీర్యవృద్ధికిస్వయంగుప్తక్షీరము.

శ్లో॥ స్వయంగుప్తేక్షురకయోర్బీజచూర్ణంసశర్కరం । ధారోష్ణే
ననరఃపీత్వాపయసానక్షయంవ్రజేత్॥ ❊

తా॥ దూలగొండివిత్తులు, నీరుగొబ్బివిత్తులు, వీటినిచూర్ణముచేసి సమమున శర్కరకలిపి, కాగిన పాలలోవైచి చల్లారినపిదప పుచ్చుకొనిన వీర్యవృద్ధియగును.

వీర్యవృద్ధికిశతావర్యాదిచూర్ణము.

శ్లో॥ ఉచ్చటాపూర్ణమప్యేవంక్షీరేణోత్తమముచ్యతే । శతావర్యుచ్చటాచూర్ణంపేయమేవంసుఖార్థినా॥ ❊

తా॥ ఉడుగవిత్తులచూర్ణమును పాలలోవైచి శర్కరకలిపిత్రాగినను, శకచల్లపిల్లిగడ్డలచూర్ణము, ఉడుగవిత్తులచూర్ణము వీటిని పాలలోవైచి శర్కరచేర్చి పుచ్చుకొనినను వీర్యవృద్ధిగలిగి మిగుల బలమును గలుగంజేయు.

వీర్యవృద్ధికియష్టిమధుకాదిపానము.

శ్లో॥ కర్షంమధుకచూర్ణస్యఘృతక్షౌద్రసమాంశికం । ప్రయుక్తేయఃపయశ్చానునిత్యవేగస్సనాభవేత్॥ ❊

తా॥ యష్టిమధుకచూర్ణము (౧) తులము, ఆవునెయ్యి (౧) తులము, తేనె (౧) తులము ఇటులచేర్చి భక్షించి పిమ్మట శర్కరవేసినపాలనుత్రాగిన పురుషుడు సదావీర్య వృద్ధిగలవాడగు.

వీర్యవృద్ధికివిదారీచూర్ణము.

శ్లో॥ చూర్ణంవిదార్యాస్సుకృతంస్వరసేనైవభావితం । సర్పిఃక్షౌద్రయుతంలీఢ్వాశతంగచ్ఛేద్వరాఙ్గనాః॥ ❊

తా॥ నేలగుమ్ముడుగడ్డనుచూర్ణముచేసి, ఆగడ్డరసములో భావనచేసి యెండించి నెయ్యి, తేనెలనుపానముతోసేవించిన నూరుగురుస్త్రీలతోరమించు శక్తిగల వాడగును.

వీర్యవృద్ధికిఆమలకీచూర్ణము.

శ్లో॥ ఏవమామలకంచూర్ణంస్వరసేనైవభావితం । శర్కరామధుసర్పిర్భిర్యుక్తంలీఢ్వాపయఃపిబేత్ । ఏతేనాశీతివర్షోపియువేవపరిహృష్యతే॥ ❊

తా॥ ఉసిరికవలుపునుయెండించి చూర్ణముచేసి ఉసిరికపండ్లరసములో భావనచేసి నీడనెండించి శర్కర, నెయ్యి, తేనె యీయనుపానముతోసేవించి పాలు

త్రాగిన (౭౦) సంవత్సరములు వయస్సుకల ముసలివాడైనను (౧౬) సంవత్సరములు వయస్సుగలవాని దేహపటుత్వముకలిగి స్త్రీలోలుడగును.

## వీర్యవృద్ధికి అతిరసములు.

శ్లో॥ పిప్పలీమాషశాలీనాంయవగోధూమయోస్తథా । చూర్ణభాగైఃసమైస్తైస్తుఘృతేపూపాలికాంపచేత్। తాంభక్షయిత్వా పీత్వాతుశర్కరామధురంపయః । నరశ్చటకవద్గచ్ఛేచ్ఛతవారంనిరంతరం॥

తా॥ పిప్పళ్లు, మినపప్పు, శాలిపిష్టము (బియ్యపుపిండి) యవలు, గోధుమలు, వీటినిపిండిచేసి, సమభాగములుగచేర్చి నీళ్లుపోసి పిసికినేతితో అతిరసములుకాల్చి భక్షించి శర్కరవేసిన ఆవుపాలనుత్రాగినయెడల పిచ్చికవలెనూరుగురుస్త్రీలను నిరంతరము రమించగలడు.

## వీర్యవృద్ధికిబస్తాండయోగము.

శ్లో॥ పిప్పలీలవణోపేతౌబస్తాండౌక్షీరసర్పిషా । సాధితౌభక్షయేద్యస్తుసగచ్ఛేత్ప్రమదాశతం॥ ❋

తా॥ మేకవృషణములురెండింటిని ముందుగా నీళ్లతోకడిగి పిమ్మట అవృషణములకు పిప్పలిచూర్ణము, సైంధవలవణము వీటిని సమభాగములుగపట్టించి ఆవుపాలలోవుడికించి తర్వాత నేతిలోవేల్చి, భక్షించిన నూరుగురుస్త్రీలను రమించగల సామర్థ్యముగలవాడగు.

## వీర్యవృద్ధికి గోక్షురకాదిచూర్ణము.

శ్లో॥ గోక్షురకఃక్షురకశ్శతమూలీవానరినాగబలాతిబలాచ।చూర్ణమిదంపయసానిశిపేయంయస్యగృహేప్రమదాశతమస్తి॥ ❋

తా॥ పల్లేరు, కాకిచెరుకు, పిల్లపీచర, తీటకోవిలవిత్తులు, జిబిలిక, చిన్నముత్తవపులగము, వీటిని సమభాగములుగ చూర్ణముచేసి రాత్రులయందుసేవించి పాలుత్రాగినయెడల, నూరుగురుస్త్రీల రమించుశక్తిగలవాడగు.

## వీర్యవృద్ధికి మాషపాయసము.

శ్లో॥ ఘృతభృష్టోముద్గమాషపాయసోవృష్యఉత్తమః॥ ❋

తా॥ మినప్పప్పును పాలలో నైచి పాయసముచేసి అందు ఆవునెయ్యికలిపి త్రాగినయడల సర్వోత్తమమైన వీర్యవృద్ధిగలుగును.

శ్లో॥ దధ్నస్సరంశరచ్చంద్రసన్నిభందోషవర్జితం । శర్కరా రాక్షౌద్ర
మరిచైస్తుగాక్షీర్యాచబుద్ధిమాన్ । యుక్త్యాయుక్తంససూక్ష్మే
లంనవేకుంభేశుచౌపటే । మార్జితేప్రక్షిపేచ్చీతేష్వృతాఢ్యంతష
ష్టికౌదనం। తద్దద్యాదుపరిష్టాచ్చరసాలాంమాత్రయాపిబేత్।
వర్ణస్వరబలోపేతఃపుమాంస్తేనవృషాయతే॥ ✻

తా॥ ఆవుపాలలోనీళ్లుపోయకనే పేరపెట్టిన తియ్యనిపెరుగు (౫) సేర్లను మంచిగుడ్డలో మూటగట్టి పైనవ్రేలాడునట్లుంచి అందలినీరుపోయినపిమ్మట, అందు తెల్లశర్కర ౧౹ శేరుకలిపి దానిని మాతకబట్టలో వుంచి చేతితో బాగుగమర్దించిన అందలి రసము క్రిందవుంచినక్రొత్తకుండలోనికిజారును. అందుతేనె ౪ శేరు,నల్ల మిరియాలు, వెదురుప్పు, చిన్నయాలకులు వీటిచూర్ణములను తగుమాత్రముగచేర్చి వుంచుకొని,నెయ్యికలిపిన సన్నబియ్యపు అన్నమునుభుజించినపిమ్మట పైరసాలమును తగుమాత్రము పుచ్చుకొనిన, శరీరకాంతి, కంఠస్వరము, బలము, యివికలిగి అధికపుంస్త్వము కలవాడగును.

## రసాలా లక్షణము.

శ్లో॥ సచతుర్జాతకాజాజీసగుడార్ద్రికనాగరం । రసాలాస్యాచ్ఛిఖ
రణీసుఘృష్టంససరందధి॥ ✻

తా॥ నాగకేసరములు, పెద్దయాలకులు, లవంగపట్ట, జీలకర్ర, బెల్లము అల్లము, శొంఠి వీటినిచూర్ణముచేసి (పైప్రకారమువడియగట్టి మర్దింపబడిన) పెరుగులోకలిపి వుంచవలను. దీనినే రసాలమనియును,శిఖరణీయనియును జెప్పంబడు.

## రెండవరసాలము.

శ్లో॥ అర్ధాఢకంసుచిరపర్యుషితస్యదధ్నః ఖండస్యషోడశపలానిశశి
ప్రభస్య । సర్పిఃపలంమధుపలంమరిచార్ధికర్షంశుంఠ్యాస్తథా
ర్ధపలమర్ధపలంచతుర్ణాం। శుక్లేపటేలలనయామృదుపాణిఘృ
ష్టాకర్పూరగంధసురభిర్నవభాండసంస్థా । ఏషావృకోదరకృ
తాసురసారసాలాయాస్వాదితాభగవతామధుసూదనేన॥✻

తా॥ నీళ్లుపోయక బాగా పేరపెట్టబడి తయారైన (౨) శేర్ల పెరుగునందు తెల్లచక్కెర (౧) శేరు కలిపి దానిని మంచిబట్టలో వైచి సౌందర్యవతియగు స్త్రీయొక్క మృదుహస్తముతో మర్దించి కర్పూరముచే పరిమళించుచున్న క్రొత్తకుండలోనికి జారునట్లు జేసి అందు ఆవునెయ్యి (౧) పలము, తేనె (౧) పలము, మిరియాలు (౪) వరహాలయెత్తు, శొంఠి (౨) తులములు, ఏలకులు, నాగకేసరములు, దాల్చిన్ని, జాపత్రి వీటిని ప్రత్యేక ప్రత్యేకముగ చూర్ణము జేసి యుక్త్యానుసారముగ జేర్చి, సేవించవలెను. ఈరసాలము భీమునిచేత జేయబడి భగవంతుడైన శ్రీకృష్ణమూర్తిచేత సేవింపబడి అనేక స్త్రీలతో సంభోగము చేసిన వాడాయెను.

శ్లో॥ ఆర్ద్రాణిమత్స్యమాంసానిశఫరీంవాజ్యభర్జితాం । తప్తేసర్పి
షియఃఖాదేత్సగచ్ఛేత్ స్త్రీషునక్షయం॥ ❋

తా॥ అప్పుడుచంపి తెచ్చిన మత్స్యమాంసమునుగాని, బెత్తుచాపలనుగాని నేతిలో వేల్చి, ఆమాంసమునుయెవడు భక్షించునో, అట్టివాడు యెంతమంది స్త్రీలతో రమించినను వీర్యవృద్ధిగలవాడగు.

నారసింహచూర్ణము.

శ్లో॥ శతావరీరజఃప్రస్థంప్రస్థంగోక్షురకస్యచ । వారాహ్యావిం
శతిపలంగుడూచ్యాఃపంచవింశతిః । భల్లాతకానాంద్వాత్రిం
శచ్చిత్రకస్యదశైవతు। తిలానాంశోధితానాంచప్రస్థందద్యా
త్సుచూర్ణితం । త్ర్యూషణస్యపలాన్యష్టౌశర్కరాయాశ్చస
ప్తతిః । మాక్షికంశర్కరార్ధేనమాక్షికార్ధేనవైఘృతం।శతా
వరీసమందేయంవిదారీకందజంరజః । ఏతదేకీకృతంచూర్ణం
స్నిగ్ధేభాండేనిధాపయేత్ । పలార్ధముపయుంజీతయథేష్టం
చాపిభోజనం । మాసైకముపయోగేనజరాంహంతిరుజామపి
వలీపలితఖాలిత్యమేహపాండ్వాద్యపీనసాన్ । హంత్యష్టాద
శకుష్ఠానితథాష్ఠాబుదరాణిచ । భగందరంమూత్రకృచ్ఛ్రం
గృధ్రసీంసహలీమకం । క్షయంచైవమహాశ్వాసాన్పంచకా
సాన్సుదారుణాన్। అశీతివాతజాన్రోగాన్చత్వారింశచ్చపై
త్తికాన్। వింశతిశ్లేష్మికాంశ్చైవసంసృష్టాన్సాన్నిపాతికాన్।

సర్వాన్రోగాన్హంతివృక్షమింద్రాశనిర్యథా । సకాంచనా
భో మృగరాజవిక్రమస్తురంగమంచాప్యనుయాతివేగతః । స్త్రీ
ణాంశతంగచ్ఛతిసో తిరేకంప్రకృష్టదృష్టిశ్చయథావిహంగః ।
పుత్రాన్సంజనయేద్వీరాన్నరసింహనిభాంస్తథా । నారసిం
హమిదంచూర్ణంసర్వరోగహరంనృణాం ॥ (వారాహీకంద
సంజ్ఞస్తుచర్మకారాలుకోమతః । పశ్చిమేఘృష్టిశబ్దాఖ్యోవరా
హాఇవలోమవాన్॥) ※

తా॥ పిల్లపీచరగడ్డలచూర్ణము (౧) ప్రస్థము, సన్నపల్లేరుచూర్ణము (౧) ప్రస్థము, నేలతాడిగడ్డలచూర్ణము (౨౦) పలములు, తిప్పసత్తు (౨౫) పలములు, నల్లజీడిగింజలు (౩౨) పలములు, చిత్రమూలము (౧౦) పలములు, కడిగినమంచినువ్వులచూర్ణము (౧) ప్రస్థము, త్ర్యూషణములు అనగా శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిచూర్ణములు ప్రత్యేక ప్రత్యేకముగ (౮) పలములు, కలకండ (౭౦) పలములు, తేనె (౩౫) పలములు, ఆవునెయ్యి (౧౭।) పలము, నేలగుమ్ముడుగడ్డచూర్ణము (౧) ప్రస్థము, వీటినినేకముగ జేర్చి పాతకుండయందునిచి ప్రతిదినము ౪ పలముచొప్పున సేవించి యథేష్టముగ భోజనము చేయవలయును. ఇటులనొకమాసము సేవించినయెడల, మాసనితనము, రోగము, వలీపలితములు, ఖాలిత్యము, ప్రమేహములు పీనస, అష్టాదశకుష్ఠువులు, యోనిమీది వ్రుదరరోగములు, భగందరము, మూత్రకృఛ్రము, గృధ్రసీవాయువు, హలీమకవాయువు, క్షయరోగము, మహాశ్వాసరోగములు, పంచకాసము, అశీతివాతరోగములు. నలభైపిత్తరోగములు, యిరువైశ్లేష్మజాడ్యములు, సంస్పష్టములైన అసాధ్యసన్నిపాతములు, అర్శోరోగము, యివియన్నియు "పిడుగుపడుటచే వృక్షమునశించుచందంబున" నశించు. ఈచూర్ణమును సేవించినమనుజుడు బంగారుతో తుల్యముగు శరీరకాంతికలవాడును, సింహముతో సమానమైన శరీరదార్ఢ్యముకలవాడును, వేగముగ గుర్రముతో సమానమైన పరుగు గలవాడునునై నూఱుగురుస్త్రీలనైనను రమించుటకు శక్తికలవాడగు. మఱియు పక్షివలె దూరదృష్టిగలవాడగు. మఱియు నరసింహమూర్తితో సమానమైన పరాక్రమముగల సంతానమును బొందును. ఈనారసింహచూర్ణము, సర్వరోగములబోగొట్టును. (వారాహికందమునకుచర్మకారాలు అనినామాంతరముకలదు. దీనినేపశ్చిమదేశమునందు ఘృష్టిఅనివాడుకొనుచున్నారు. అయితే యీనేలతాడిగడ్డకుపందిరోమమువంటిరోమములువుండును.)

## వీర్యవృద్ధికిపయఃపానము.

శ్లో॥ అశ్వత్థఫలమూలత్వక్శృంగాసిద్ధంపయోనరః । పీత్వాసశర్కరాక్షౌద్రంకులింగంఇవహృష్యతి॥ ※

తా॥ రావిపండ్లు, రావివేరుపట్ట, రావిచిగుళ్లు, వీటిచూర్ణములను సమముగ పాలయందువైచికాచి అందుశర్కర, తేనెవైచి సేవించినయెడల పిచ్చికవలె రమించును.

శ్లో॥ గుప్తాఫలంగోక్షురకాచ్చబీజంతథోచ్చటాంగోపయసావిపాచ్య । ఖజాహతంశర్కరయాచయుక్తంపీత్వానరోహృష్యతి సర్వరాత్రం॥ ※

తా॥ దూలగొండివిత్తులు, సన్నపల్లేరుకాయలు, ఊసగవిత్తులు వీటినిచూర్ణించి, కాచినఅవుపాలలోవైచి చల్లారినపిమ్మట కలకండచూర్ణముచేర్చి పుచ్చుకొనినయెడల సర్వరాత్రమునందును స్త్రీరమించ యిచ్ఛగలవాడగు.

శ్లో॥ మాషాన్విదారీంపిసోచ్చటాంచ క్షీరేగవాం క్షౌద్రఘృతోపపన్నాం । పీత్వానరఃశర్కరయాసుయుక్తాంకులింగవద్ధృష్యతి సర్వరాత్రం॥ ※

తా॥ మినపప్పు, నేలగుమ్మడుగడ్డ, ఊడుగవిత్తులు వీటిని చూర్ణముచేసి కాచిన ఆవుపాలయందువైచి అందుతేనె,ఆవునెయ్యి,కలకండచూర్ణము వీటినిచేర్చి సేవించిన, పిచ్చికవలె సర్వరాత్రమునందును రమించును.

శ్లో॥ గృష్టీనాంవృద్ధవత్సానాంమాషపర్ణభృతాంగవాం । యత్క్షీరం తత్ప్రశంసంతిబలకామేషుజంతుషు । ఏతేవాజీకరాయోగాః ప్రీత్యపత్యబలప్రదాః । సేవ్యావిశుద్ధోపచితదేహైః కాలాద్యపేక్షయా॥ ※

తా॥ మినపతీగెలు తినినటువంటి, తరిపిదూడలుగల తొలుచూరి ఆవుపాలు బలకరమైన వాజీకరణౌషధములలో ముఖ్యమైనదానినిగా జెప్పుచున్నారు. ఈపాలనుత్రాగినయెడల స్త్రీలయందధిక ప్రీతి, సంతానవృద్ధి, బలము యివియన్నియును గలుగు. ఇదివాజీకరణయోగములలో ప్రశస్తమైనది. ఈయోగమును సేవించుటకు ముందు వమనవిరేచనాదులచేత దేహమునుశుద్ధిజేసికొని దేశకాలానుసారముగ సేవించవలెను.

శతావరీఘృతము.

శ్లో॥ ఘృతంశతావరీగర్భంక్షీరేదశగుణేపచేత్। శర్కరాపిప్పలీక్షౌ
ద్రయుక్తం తద్వృష్యముచ్యతే॥ *

తా॥ చల్లపిల్లిగడ్డలరసమునందు నెయ్యిపోసి, రెంటికిపదింతలుఆవుపాలుపోసి, నెయ్యిమిగులునట్లుకాచి,అందు కండపిప్పలిచూర్ణము,తేనె వీటిని సమముగ చేర్చి సేవించినయెడల మిగులవీర్యవృద్ధిగలుగు.

గోధూమాదిఘృతము,

శ్లో॥ గోధూమాచ్చపలశతంనిఃక్వాథ్యసలిలాఢకే। పాదావశేషేపూ
తేచద్రవ్యాణీమానిదాపయేత్। గోధూమంగుంజాతఫలంమాష
ద్రాక్షాపరూషకం । కాకోళీక్షీరకాకోళీజీవంతీసశతావరీ। అ
శ్వగంధాసఖర్జూరంమధుకంత్ర్యూషణంసితా । భల్లాతకమా
త్మగుప్తాసమభాగానికారయేత్ । ఘృతప్రస్థంపచేదేకంక్షీరం
దత్వాచతుర్గుణం । మృద్వగ్నినాచసంసిద్ధేద్రవ్యాణ్యేతానినిక్షి
పేత్ । త్వగేలాపిప్పలీధాన్యకర్పూరం నాగకేసరం । యథా
లాభంవినిక్షిప్య సితాక్షౌద్రపలాష్టకం । దుగ్ధేక్షుదండేనాలో
డ్యవిధివద్వినియోజయేత్। శాల్యోదనేనభుంజీతపిబేన్మాంసరసే
నవా । కేవలస్యపిబేదస్యపలమాత్రంప్రమాణతః। నతస్యలింగ
శైథిల్యం నచశుక్రక్షయోభవేత్ । బల్యంపరంవాతహరంశుక్ర
సంజననంపరం। మూత్రకృఛ్రప్రశమనంవృద్ధానాంచాపిశస్యతే।
పలద్వయంతదశ్నీయాద్దశరాత్రమతంద్రితః । స్త్రీణాంశతంచ
భజతేపీత్వాచానుపిబేత్పయః। అశ్విభ్యాంనిర్మితంచైతద్గోధూ
మాఖ్యంరసాయనం। జలద్రోణేతుగోధూమక్వాథేతచ్ఛేషమా
ఢకం ॥ కల్కద్రవ్యసమంమానంత్వగాదేఃసాహచర్యతః॥ *

తా॥ (౧౦౦) పలములతెల్లనిగోధుమనూకను తూమెడునీళ్ళయందువైచిమూడుపాళ్లుయిగురువరకుకాచిదానిని గుడ్డమైఆరబోసి,గోధుమనూక, తెల్లగురుగింజలు, మినపప్పు, ద్రాక్షపండు, ఫాలసాపండు, కాకోళి, క్షీరకాకోళి తివ్వసత్తు,పిల్ల

పీచర, పెన్నేరుగడ్డ, ఖర్జూరము, యష్టిమధుకము, శొంఠి, పిప్పలి, మిరియాలు, కలకండ, జీడిగింజలు, మాలగొండిపిత్తులు వీటినన్నిటిని సమముగచూర్ణించి వకప్రస్థము ఆవునేతిలోకలిపి, నాలుగుప్రస్థములు ఆవుపాలుపోసి మందాగ్నిచే కాచి, అందు లవంగపట్ట, ఏలకులు, పిప్పళ్లు, ధనియాలు, పచ్చకర్పూరము. నాగకేసరములు వీటిచూర్ణములను జేర్చి చల్లారినపిదప, కలకండ(౮)పలములు, తేనె (౮) పలములు వైచి, దానినిచెలుకుగడతో కలియబెట్టి మైనూకహాల్వాలో చేర్చి శాస్త్రప్రకారముగ సేవించుచు, పాతసన్నబియ్యపుఅన్నము భుజించుచుండవలయు. లేకమాంసరసము త్రాగవలయు. ఈ ఔషధము (౧) పలముచొప్పన సేవించవలయు. దీనినిసేవించుటవలనలింగశైథిల్యము, శుక్రక్షయము, వీటిని బోగొట్టి అధికబలము, వీర్యవృద్ధి వీటినిగలుగంజేసి వాతరోగము, మూత్రకృఛ్రము వీటినినశింపంజేయు. ఈ యోగమును వృద్ధులుసగా సేవించవచ్చును. దీనిని పదిదినములు రెండుపలములచొప్పన సేవించుచు పాలునుత్రాగుచుండిన, నూరుగురుస్త్రీలనైనారమించు శక్తిగలవాడగు. ఈగోధూమాదిరసాయనము అశ్వినీదేవతలచే నిర్మింపబడినది. లవంగపట్ట మొదలగువాటికి భాగముచెప్పనందున పైకల్కద్రవ్యములకు సమముగ జేర్చుకొనవలయును.

## శతావర్యాది చూర్ణము.

శ్లో॥ శతావరీనాగబలావిదారీత్రికంటకైరామలకీఫల్వాన్వితైః। విచూర్ణితైః పంచభిరేకశః పృథక్ప్రికల్పితైర్వా ఘృతమాక్షికప్లుతైః॥
ఇతిప్రయోగాఃషడిమే భిషగ్వరైరుదీరితాః శర్కరయాసమన్వితాః।నృణాంమదాన్ధప్రమదోపసర్పిణాంప్రధానధాతోరతిరేక కారణం॥ ❋

టీ॥ పిల్లపీచర, చిన్నముత్తవపులగము, నేలగుమ్ముడుగడ్డ, సన్నపల్లేరు, ఉశిరికవలుపు వీటిచూర్ణములను సమభాగములుగ నేకముగకలిపి, అందు తేనె, నెయ్యి, శర్కరవీటిని చేర్చిసేవించవలయును. వైద్యులు యిటువంటిప్రయోగములను ఆఱింటినివచించియున్నారు. యీయారుప్రయోగములలో, మదముచేత క్రొవ్విన స్త్రీల మానభంగమొనర్చుటకు ఇష్టులైన పురుషులకు వీర్యవృద్ధిగలుగజేయుటకు యీ ప్రయోగము ముఖ్యమైనది.

## ముసల్యాదిచూర్ణము.

శ్లో॥ ముసలికోకిలగోక్షురచూర్ణకం శశివిలోచనరామమతంపచేత్।

పయసిప్రాతరిదందికోష్ణకేసితయా టంకకషట్కయాతుశత్॥
త్రిగుణస ప్తదినం పరిభక్షయేచ్ఛతవయా అపికాంక్షతికామినీం:
కిముహాచిత్రముదిత్వరయౌవనః శశిముఖీశయనాన్నజహాతిసః॥

తా॥ నల్లనేలతాటిగడ్డ (౧) భాగము, తీటకోవిలవిత్తులు (౨) భాగములు, చన్నపల్లేరు (౩) భాగములు, వీటినిచూర్ణించి నేకముగగలిపి ప్రాతఃకాలమునందు సూకలుగనుండు ఖండశర్కరనుకలిపిన వేడిపాలలో పైమిశ్రితచూర్ణమును (౪) వరహాలయెత్తుగాని లేక (౬) వరహాలయెత్తుగాని కలిపిపుచ్చుకొనవలయును. ఇటుల ౨౧ దినములుసేవించినయెడల, నూరువత్సరములువయస్సుగల ముసలివాడైనను స్త్రీని కోరకమానడు. యౌవ్వనపురుషుడైనయెడల స్త్రీశయనమును విడువడనుటకు సేమిసందియము?

## వానరీగుటిక.

శ్లో॥ బీజానిహీకపికచ్ఛోఃకుడవమితానిస్తుస్వేదయేచ్ఛనకైః । ప్రస్థే
గోభవదుగ్ధేదుగ్ధంయావద్ఘవేద్గాఢం॥ త్వగ్రహితానిచకృత్వా
సూక్ష్మంసంపేషయేత్తాని । పిష్టికాయాఃసువటికాః కృత్వాగ
వ్యేపచేదాజ్యే ॥ ద్విగుణితశర్కరయా తావటికాఃసంపక్వయా
లేప్యాః। వటికామాక్షికమధ్యేమజ్జనయోగేఽఖిలాఃస్థాప్యాః॥
పంచటంకమితాస్తాస్తుప్రాతస్సాయంచభక్షయేత్। అనేనశీఘ్రి
ద్రావీయోయశ్చస్యాత్పతితఽధ్వజః॥సోఽపిప్రాప్నోతిసురతేసా
మర్థ్యమతివాజివత్।నానేనసదృశంకించిద్ద్రవ్యంవాజీకరంపరం॥

తా॥ పావుసేరుతీటకోవిలవిత్తులను వాకసేరుఆవుపాలలో వైచి, పాలుచిక్కబడునంతవరకుకాచి, పిమ్మటఆవిత్తులనుయెత్తిపొట్టుతీసి ఖల్వమునందువైచి నూరి దానిని అయిదుటంకములయెత్తుచొప్పున వటుకములుగావించి, వాటినిఆవునేతిలో వేచ్చియెత్తుకొని, రెండుభాగములు, అనగా ౪ సేరుఖండశర్కరచూర్ణమునువాటి పైచల్లి ఆవటుకములను తేనెలోమునుగునటులవుంచి ప్రతిదినముప్రాతఃసాయంకాలములయందు, అయిదువరహాలయెత్తుచొప్పున సేవించవలయును. ఇటులచేసినయెడల శీఘ్రిముగస్ఖలనము, లింగభంగము, యుపికలవాడైనను, సురతమునందు గుఱ్ఱముకంటె నెక్కువసామర్థ్యముకలవాడగు. వాజీకరణయోగముల నన్నిటియందును యీయోగముకన్న అధికమైనది మరియొకటిలేదు.

## లఘుశతావర్యాదిచూర్ణము.

శ్లో॥ శతావరీగోక్షురకాశ్చగన్ధాపునర్నవా నాగబలాముసల్యా। ఘృతేనఖండేనతుభక్షణీయాఃక్షీణాఃనరానాగబలాభవంతి॥ ❊

తా॥ పిల్లపీచర, సన్నపల్లేరు, పెన్నేరుగడ్డ, తెల్లగలిజేరు, చిన్నముత్తవపులగము, నేలతాటిగడ్డ వీటిని సమభాగములుగ చూర్ణించి అందునెయ్యి, శర్కర కలిపి భక్షించినయెడల క్షీణరేతస్సుకలవారైనను యేనుగుతో సమానమైన బలము కలవారగుదురు.

## అన్యచ్చ

శ్లో॥ శతావర్యుచ్చటాచూర్ణం పేయమేవంసుఖార్థినా॥ ❊

తా॥ చల్లపిల్లిగడ్డలు, తెల్లగురుగింజలు, వీటిని చూర్ణముజేసి ఆవుపాలలో వేచి పుచ్చుకొనిన విశేషముగ వీర్యవృద్ధిగలుగు.

## మధ్వాదిక్షీరపానము.

శ్లో॥ సితామధుఘృతంక్షీరం పలాండురససంయుతం। పిబేన్నరోభవేత్తారూ మీవృద్ధోఽపితరుణాయతే॥ ❊

తా॥ కలకండ, తేనె, నెయ్యి, పాలు, వీటిని నీరుల్లిగడ్డలరసముతో చేర్చి పుచ్చుకొనిన ముసలివాడైనను వయస్సువాడగును.

## గోక్షురాదిక్షీరపానము.

శ్లో॥ శమయతిగోక్షురచూర్ణంఛాగక్షీరేణసాధితంసమధు। భుక్తం క్షపయతిషాండ్యంయుజ్జనితంకుప్రయోగేణ॥ ❊

తా॥ కువైద్యచికిత్సలచే పుంస్త్వముపోగొట్టుకొనిన నపుంసకుడు, సన్నపల్లేరుచూర్ణమును మేకపాలలో వైచి అందు తేనెవైచి సేవించినయెడల పుంస్త్వముకలవాడగు.

## అమృతభల్లాతకపాకము.

శ్లో॥ భల్లాతకానాంపవనోత్థితానాంతరుచ్యుతానాంచయదాఢకం స్యాత్। ఘృష్టేష్టికాచూర్ణకణైర్జలైశ్చప్రక్షాళ్యసంశోష్యచమాడుతేన॥ శుష్కాణితానిద్విదళీకృతానివిపాచయేదప్సు

చతుర్గుణాసు। తత్పాదశేషమ్పునరేవశీతంత్రీరేణతుల్యేనవిపా
చయేత్తత్ ॥ తదర్ధయాశర్కరయానిమిశ్ర్య పశ్చాచ్ఛితజేనో
న్మథనంవిధాయ। సత్ర్యూషణంత్రైఫలచంద్రమాంసీత్రివృచ్చ
వంశీఖదిరామృతంచ ॥ సచందనాకల్లకణాకభావం సదేవపు
ష్పంముసలీద్వయంచ। కంకోలమోచాహ్వయదీప్యయుగ్మం
నతంసమాతంగకణావిదారీ ॥ జాతీఫలంముస్తకజాతిపత్రీకు
బేరజీరాగురుసాబ్ధిశోషం। మేదాద్వయంలోహరసేంద్రవం
గంమభ్రంతథాకుంకుమకంచకర్షం ॥ తత్సప్తరాత్రాదతిజాత
వీర్యంసుధారసాదప్యధికంవదంతి। ప్రాతఃప్రబుద్ధఃకృతదేవ
కార్యోమాత్రాంభజేత్స్వాత్మ్యశరీరయోగ్యాం ॥ నచానుపా
నేపరిహార్యమస్తినచాతపేనాధ్వనిమైథునేచ। యథేష్టచేష్టో
విచరేత్ప్రయోగాన్నరోభవేత్కాంచనరాశిగౌరః ॥ అనేన
మేధానరసింహవీర్యోధృఢేంద్రియోవ్యాధిగతస్సుబుద్ధిః। దన్తా
విశీర్ణాఃపునరేవదివ్యాఃకేశాశ్చశుభ్రాఃపునరేవకృష్ణాః। నీలాం
చనాళిప్రతిమాభవన్తిత్వచోవిశీర్ణాఃపునరేవభవ్యాః। విశీర్ణ
కర్ణాంగుళినాసికోపికృమ్యర్దితోభిన్నగలోఽపిపుష్టిః ॥ శుష్కాః
పునస్స్యాద్గతమూలశాఖస్తరుర్యథాభాతినవాంబుసిక్తః। బృ
హస్పతేరప్యధికోహిబుద్ధ్యాగ్రంథంవిశాలంచనవంకరోతి॥ గృ
హ్ణాతిసద్యోనచవిస్మృతించకరోతికల్పాయురనల్పవీర్యం। కుర్వ
న్నిమంకల్పమనల్పబుద్ధిర్జీవన్నరోవర్షశతంసుఖీస్యాత్॥ ❋

తా॥ పండియెండిచెట్టునుంచిరాలిన జీడిగింజలు (౪) సేర్లను యిటుకరాయిపొడితో చక్కగరుద్ది నీళ్లతోకడిగి గాలికినీడనుయెండించి, పిమ్మట వాటిని పగలగొట్టి (౧౬) సేర్లనీళ్లలోవైచి నాలుగుసేర్లుగాకాచి చల్లారినపిదప, మరలనాలుగుసేర్లపాలలోవైచికాచి అందురెండుసేర్ల కలకండపొడినివైచి ఖల్వమునమర్దించి, పిమ్మట శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, తాండ్ర, యుసిరికలు, కర్పూరము, జటామాంసి, తెల్లతెగడ, వెదురుప్పు, చంద్రచావపొడి, గరళము, మంచి గంధపుచెక్కపొడి, అక్కలకర్ర, పిప్పళ్లు, కబాబచీని, లవంగాలు నల్లనేలతాటిగడ్డ,

## నపుంసకసంజీవనము.

తెల్లనేలతాటిగడ్డ, తక్కోలము, అరటిదుంపరసము, ఓమము, అజామోదము, గ్రంధితగరము, ఏనుగపిప్పలి, నేలగుమ్ముడుగడ్డ, జాజికాయ, తుంగముస్తెలు, జావత్రి, కలుప్రానుగ, జీలకర్ర, అగరు, సముద్రఫేనము, మేధ, మహామేధ, లోహభస్మము, పూర్ణచంద్రోదయము, వంగేశ్వరము, అభ్రకము యివియన్నియు ప్రత్యేకముగ (౧) తులము, కుంకుమపువ్వు (౧) వరహాయెత్తు వీటినన్నిటిని నేకముగజేర్చి దళమైనబట్టను వాళినగట్టివుంచి, యేడుదినములు గడచినపిమ్మట ఆయౌషధమును, అమృతమునకన్న నధికముగ వీర్యవృద్ధిని జేయునదిగ జెప్పుచున్నారు. గాన ప్రాతఃకాలమునందు నిద్రలేచి తనకుకలిగిన నిత్యకర్మలనుతీర్చుకొని, పిమ్మట శరీరదార్ఢ్యమునకు తగినట్లుసేవించవలయును. ఇందుకు అనుపానమనక్కరలేదు. దీనిని సేవించునపుడు యెండలోతిరుగుట, దారినడచుట, వీటినివర్జించవలయును మైధునముమొదలైన యథేష్టకార్యములనుచేసినయడల అతిసమర్థుడగును. మఱియు బంగారుతో సమానమైనదేహకాంతి, అధికబుద్ధి, నరసింహపరాక్రమము, యింద్రియపటుత్వము, యివికలుగుటయేగాక, సకలరోగములునశించి పరిశుద్ధుడగు. ఇంతచెప్పనేల ! పండ్లురాలిపోయినను మరలమొలచును. వెండ్రుకలు తెల్లనైనను మరల నలుపుజారి కాటుక, తుమ్మెదలు వీటితో సమానమైన రంగుగలిగియుండును. తోళ్లు ముడతలుపడినన్ను మరల ఆముడతలుబోవును. చెవులు, వేళ్లు, ముక్కు యివియూడిపోయి పురుగులుపడి కంఠస్వరముచెడి కుష్ఠరోగము కలవాడైనను "ఎండి వాడిపోయినచెట్లు నీళ్లతడితగిలినవెంటనే యెటులచిగిర్చునో" అరీతిగరోగ విముక్తుడగు. మఱియును బృహస్పతితోసమానమైన బుద్ధికలవాడై నూతనగ్రంధములనుచేయుటయందు సామర్థ్యముకలవాడగును. మరుపువుండదు. ఈఔషధమునుసేవించునరుడు నూరుసంవత్సరములు సుఖముగా వీర్యవృద్ధికలిగిజీవించు.

## కాశ్మీరకావలేహము.

శ్లో॥ వ్యోషంచతుర్జాతఫలత్రికంచలవంగకృష్ణాగరుచందనంచ । ఇక్షురబీజంకరహాటకంచజాతీఫలంమర్కటికాఫలంచ॥శాల్మల్య
నిర్యాసబలాశ్వగంధాగోక్షురబీజంముసలీకృమిఘ్నం । సముద్రశోషం విషపంజరంచ పుష్కరం సుజాత్యుద్భవకంకబీజం॥
సర్వైఃసమంయోజ్యసు కుంకుమంచసు చూర్ణితంవింశతిభాగ
యుక్తం । కస్తూరికాషోడశభాగచూర్ణంఖండంచతుర్భాగ

యుతంవిపక్వం ॥ వంగంరసేంద్రం గగనంసులోహంకాంతం
హితాభ్రంరవిభాగయుక్తం । దలానిహేమ్నాద్విశతానిద
త్వాతథైవదేయానిచరాజతాని । ఏకత్రసర్వంవినిధాయవై
ద్యోజయాష్టభాగం విదధీతలేహం ॥ జాతీఫలప్రమాణేనభక్ష
యేత్ప్రాతరుత్థితః । వీర్యవృద్ధికరోత్యేష సర్వవ్యాధివినాశనః॥
శతంచరమతే స్త్రీణాంకామతుల్యోభవేన్నరః । సర్వాన్వా
తామయాన్హంతిప్రవృద్ధం వాతశోణితం ॥ అస్థిరోగంశిరోరో
గంసంధిరోగంచనాశయేత్ । అస్యసేవనమాత్రేణ వృద్ధోఽ
పితరుణాయతే ॥ ధన్యంయశస్కరంసమ్యగాయురారోగ్య
వర్ధనం । కాశ్మీరకావలేహోఽయంబలకాన్తివివర్ధనః॥ ❋

తా॥ త్రికటుకములు (అనగా శొంఠి, పిప్పలి, మిరియాలు,) చాతుర్జాతక
ము (అనగా దాల్చిన్ని, లవంగపట్ట, యాలకులు, ఆకుపత్రి, నాగకేసరములు,)
త్రిఫలములు (అనగా కరక, తాండ్ర, వుసిరికలు,) లవంగములు, కృష్ణాగరు, మం
చిగంధము, కాకిచెఱుకువిత్తులు, అక్కలకర్ర, జాజికాయ, తీటకోవిలవిత్తులు, బూ
రుగబంక, ముత్తవపులగము, పెన్నేరు, సన్నపల్లేరుకాయలు, నేలతాటిగడ్డ, వా
యువిళంగములు, సముద్రశోషము, విషపంజరము, జాపత్రి, కంకబీజములు, వీటి
చూర్ణములను సమముగజేర్చి, యీచూర్ణములకు (౨౦) వభాగము కుంకుమపు
వ్వునుచేర్చి కలిపి, అందు మరల ౧౬ వభాగము కస్తూరినికలిపి, పైభాగములయా
త్రకు నాలుగవవంతు కలకండచూర్ణమునుకలిపి సిద్ధముజేసి, అందువంగభస్మము,
చంద్రోదయము, అభ్రకము, లోహసారము, కాంతసారము, తామ్రభస్మము,
వీటినన్నిటిని (౧౨) వభాగముపైచి బంగారురేకులు (౨౦౦) వెండిరేకులు(౨౦౦)
వీటినన్నిటిని వొకటిగాచేర్చి, దీనికి యెనిమిదవవంతు గంజాయివేసికలిపి, యీఅ
వలేహమును సిద్ధపరచి గాజుపాత్రలోనిండించి దానిపైనమూతవేసివుంచి, ప్రతిదిన
ము ప్రాతఃకాలమునందు జాజికాయప్రమాణముచొప్పున సేవించిన సకలవ్యాధు
లనుబాగొట్టి వీర్యవృద్ధినిగలుగంజేయు. మరియు మన్మథునితోసమానమైన దేహ
పటుత్వముకలిగి నూరుగురుస్త్రీలనైనను రమించును. మఱియు సకలవాతవ్యాధు
లు, వాతరక్తము, అస్థిరోగము, శిరోరోగము, సంధిరోగము, వీటినినశింపఁ

జేయు. ఈ యౌషధసేవనచే ముసలివాడైనను యౌవ్వనవంతుడగు. మఱియుకీర్తి, ఆయువు, ఆరోగ్యము, బలము, కాంతి వీటినివృద్ధిబొందించు. ఇది కాశ్మీరకావలేహమని జెప్పంబడు.

## రతివృద్ధిమోదకములు.

శ్లో॥ గోక్షురేక్షురబీజానివాజీగంధాశతావరీ । ముసలీవానరీబీజం యష్టీనాగబలాబలా ॥ ఏషాంచూర్ణందుగ్ధసిద్ధంగవ్యేనాజ్యేన భర్జితం । సితయామోదకంకృత్వాభక్ష్యంవాజీకరంపరం॥ చూర్ణాదష్టగుణంక్షీరంఘృతంచూర్ణసమంస్మృతం । సర్వతోద్విగుణంఖండంఖాదేదగ్నిబలంయథా ॥ వాజీకరాణిభూరీణిసంగృహ్యారచితోయతః । తస్మాద్బహుషుయోగేషుయోగోయం ప్రవరోమతః॥ ❋

టీ॥ సన్నపల్లేరుకాయలు, కొకిచెఱుకువిత్తులు, పెన్నేరుగడ్డ, చల్లపిల్లిగడ్డ, నేలతాటిగడ్డ, దురదగొండివిత్తులు, యష్టిమధుకము, చిన్నముత్తవపులగము, చిట్టాముట్టి, వీటిచూర్ణములను సమభాగములుగ గ్రహించి, ఆవుపాలలోవైచి గట్టిగకాచి, పిమ్మట ఆవునెయ్యి, కలకండచూర్ణము వైచి కలియబెట్టి వుసిరికపండంతవుంటలు జేసి సేవించిన, సురతమునందు సామర్థ్యముకలవాడగు. ఔషధముచేయునప్డు చూర్ణమునకు (౮) భాగములుపాలు, చూర్ణమునకు సమము నెయ్యి, చూర్ణమునకు రెండింతలు కలకండపొడి యిటులచేర్చుకొని అగ్నిబలము నెఱిగి సేవించవలయు. అనేక వాజీకరణయోగములను సంగ్రహించి యీయోగమును జెప్పినాము. కనుక వాటికన్నిటికంటె యీయోగము ప్రశస్తమైనది.

## రతివల్లభపూగపాకము.

శ్లో॥ పూగందక్షిణదేశజందశపలోన్మానంబృశంకర్తయేత్ఛిన్నం జలయోగతోమృదుతరంసంకుట్యచూర్ణీకృతం । తచ్చూర్ణంపటశోధితంవసుగుణేగోశుద్ధదుగ్ధేపచేద్గవ్యాంజాంజలిసంయుతేఽతినిబిడేదద్యాత్తులార్ధాంసితాం। పక్వంతజ్జ్వలనాత్క్షితింప్రతినయేత్తస్మిన్పునః । ప్రక్షిపేద్దద్యాత్తత్తదుదీరయామి బహులా దృష్ట్వాదరాత్సంహితా । ఏలానాగబలాబలాసచపలాజాతీ

ఫలంలింగతా । జాతీపత్రకమత్రపత్రకయుగళంతచ్చత్వచా
సంయుతం॥ విశ్వావీరణవారివారిదవరాచాంసీబరీవానరీ। ద్రా
క్షాసేక్షురగోక్షురాథమహాతీక్షుర్జూరికాక్షీరికా । ధన్యాకంస
కసేరుకంసమధుకంశృంగాటకంజీరకం। పృథ్వీకాథయవానికా
వరటికామాంసీమిసిగ్రంథికా॥ కంజేష్వత్రవిదారికాథముసలీగం
ధర్వగంధాతథా। కచ్చూరంకరికేసరంసమరిచంచారస్యబీజం
నవం । బీజంశాల్మలిసంభవంకరకణాబీజంచరాజీవజం । శ్వే
తంచందనమత్రరక్తమపిచశ్రీసంజ్ఞపుష్పైస్సమం ॥ సర్వంచేతి
పృథక్పృథక్ఫలమితంసంచూర్ణ్యతత్రక్షిపే । తూ్నాతంవంగభు
జంగలోహగగనం సన్మారితంస్వేచ్ఛయా ॥ కస్తూరీఘనసార
చూర్ణమపిచప్రాప్తంతథాప్రక్షిపేత్।పశ్చాదస్యతుమోదకా
న్విరచయేద్బిల్వప్రమాణానథ ॥ తాన్భుక్త్వాతిసదాయథానల
బలంభుంజీతనామ్లంరసం । పూర్వస్మిన్నసితేగతేపరిణతింప్రా
గ్భోజనాగ్భక్షయేత్॥ నిత్యశ్రీరతివల్లభాఖ్యకమనుంయఃపూగ
పాకంభజేత్సస్యాద్వీర్యవివృద్ధివృద్ధమదనోవాజీవశక్తోరతౌ॥ దీ
ప్తాగ్నిర్బలవాన్బలీవిరహితోహృష్టఃసుపుష్టస్సదావృద్ధోయోఽ
పియువేవసోపిరుచిరఃపూర్ణేందువత్సుందరః॥ ❋

తా॥ దక్షిణదేశమునందలిపండినమంచిపోకచెక్కలు (౮౦) తులములు తె
చ్చి సన్నముగాకత్తిరించిఆపొడినీని రోలో వైచి మెత్తగనానినపిమ్మట దంచిఆరబో
సిఆరినపిమ్మట చూర్ణముచేసి వస్త్రఘాలితమొనర్చి దానికి ౨ భాగములు (అనగా
౩౨౦ తులములు) ఆవుపాలుపోసి హల్వావలెనగువరకుకాచి అందు ఆవునెయ్యివై
చికలియబెట్టి (౨౦౦) తులముల కలకండపొడివైచి పాకమగునట్లుకాచి దించి చ
ల్లారినపిదప అందువేయదగినవస్తువులను అనేకవైద్యగ్రంథములనుచూచిచెప్పుచున్నా
ను. ఏలక్కాయగింజలు, చిన్నముత్తవపులగము, చిట్టాముట్టి, పిప్పళ్లు, జాజికా
యలు, శివలింగి, జాపత్రి, ఆకుపత్రి, తాళిసపత్రి, లవంగపట్ట, శొంఠి, వట్టివేళ్లు,
సుగంధపాల, నేలతాటిగడ్డ, కరకపిందెలు, వెదురుప్పు, పిల్లపీచర, దురదగొండి
విత్తులు, నల్లద్రాక్షపండు, కాకిచెఱుకువిత్తులు, సన్నపల్లేరుకాయలు, నేలములక,

ఖర్జూరకాయలు, చిరుపాల, క్షీరకాకోళి, ధనియాలు, తుంగముస్తెలు, యష్టిమధుకము, పరికెగడ్డ, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ, ఓమము, తామరగుద్దులోనిగింజలు, జటామాంసి, సోపు, మెంతులు, (గడ్డలలో) నేలగుమ్ముడుగడ్డ, నేలతాటిగడ్డ, పెన్నేరుగడ్డ, కచోరములు, నాగకేసరములు, నల్లమిరియాలు, కొత్తసారపప్పు, బూరుగవిత్తులు, గజపిప్పలి, తామరగడ్డ, శ్వేతచందనము, రక్తచందనము, లవంగములు వీటినన్నిటిని ప్రత్యేకముగ నాలుగుతులములచొప్పునచూర్ణించి పైఔషధమునందు వైచి కలియబెట్టి, ఆంపు చంద్రోదయము, వంగభస్మము, సీసభస్మము, లోహభస్మము, అభ్రికభస్మము, కస్తూరి, పచ్చకర్పూరము, వీటిని వైద్యునియిష్టప్రకారము చేర్చి పిమ్మట దీనిని మారేడుకాయలంత (౨ పలములు) వుంటలుచేసి అగ్నిపుష్టినెఱిగి సేవించవలయును. ఈ ఔషధమును సేవించునపుడు పులుసు, కారము యిత్యాదులను వర్జించవలయును. ఈ ఔషధమును భోజనాత్పూర్వమునందు సేవించవలయును. ఈ రతివల్లభపూగపాకమోదకమును సేవించునరుడు, వీర్యవృద్ధికలిగి గుఱ్ఱమువలె మైథునకార్యమునందు సామర్థ్యముకలవాడై అగ్నిదీపనము, బలము, సంతోషము, శరీరదార్ఢ్యము, యివికలిగినవాడగును. ఈ ఔషధమును ముసలివాడు సగాసేవించినను శరీరదార్ఢ్యము, సౌందర్యముయివికలిగియౌవ్వనవంతుడగును.

## కామేశ్వరమోదకము.

శ్లో॥ ఏతస్మిన్రతివల్లభే యదిపునః సమ్యక్ఖురాసానికా ధత్తూరస్యచబీజ
మర్కకరభః పాఠోధిశోష స్తథా। సన్మాజూఫలకంతథాస్వసఫ
లంత్వక్చాపినిక్షిప్య తేచూర్ణార్ధావిజయాతథాసహిభవేత్కా
మేశ్వరోమోదకః॥ ❋

తా॥ పైజెప్పబడిన రతివల్లభపూగపాకమునందు ఖురాసానిఓమము, ఉమ్మెత్తవిత్తులు, అక్కలకఱ్ఱ, సముద్రపునురుగు, మాదీఫలము, గసగసాలు, పోస్తుకాయలు వీటిచూర్ణము, చూర్ణమునకుసగము గంజాయి వీటినిచేర్చి వుంటలుచేసినయెడల కామేశ్వరమోదకమనబడును. దీనినిసేవించుటచే వీర్యస్తంభనముకలుగును.

## ఆమ్రపాకము.

శ్లో॥ పక్వామ్రస్యరసద్రోణే సితామాఢకసమ్మితాం। ఘృతంప్రస్థ
మితందద్యాన్నాగరస్యపలాష్టకం। మరిచస్యాఢకార్ధాన్నం

పిప్పలీంద్విపలోన్మితాం। సలిలస్యాఢకందత్వాసర్వమేకత్రకార
యేత్। పచేత్తన్మృన్మయేపాత్రేదాయుదర్వ్యాప్రచాలయేత్।
చూర్ణాన్యేషాంక్షిపేత్తత్రఘనీభూతేవతారితే। ధాన్యకంజీర
కంచిత్రంపత్రకంముస్తకంత్వచం। బృహజ్జీరకమప్యత్రగ్రంధికం
నాగకేసరం। ఏలాంపత్రీంలవంగంచపృథక్జాతీఫలంపలం। సిద్ధే
శీతేప్రదద్యాచ్చ మధునఃకుడవద్వయం। భక్షయేద్భోజనాద
ర్వాక్పలమాత్రమిదంనరః। అథవానియతానాత్రమాత్రాఖా
దేద్యథానలం। మానవఃసేవనాదస్యావా జీషత్సురతేభవేత్।
సమర్థోబలవాన్పుష్టోహృష్టోనిత్యంనిరామయః। గ్రహణీనాశ
యేదేషక్షయంశ్వాసమరోచకం। ఆమ్లపిత్తంచపిత్తంచకుష్ఠం
పైపాండుతామపి॥ ❋

తా॥ ప్రశస్తమైన మామిడిపండ్లరసము (౧) తూము (౧౬-సేర్లు) వొకకుం
డలోపోసి అందుకలకండపొడి (౮) సేర్లు, మంచిఆవునెయ్యి (౧) సేరు, చేర్చి మ
రల శొంఠి (౪) సేరు, నల్లమిరియాలు (౧) సేరు, పిప్పళ్లు (౨) పలములు వీటిచూ
ర్ణములనువైచిమంచినీళ్లు (౮) సేర్లుపోసి పొయిమీదనునిచి తెడ్డుతో కలియబెట్టుచు
తాగిచిక్క బడినపిమ్మట దించి అందు ధనియాలు, జీలకర్ర, చిత్రమూలము, ఆకు
పత్రి, తుంగముస్తెలు, లవంగపట్ట, నల్లజీలకర్ర, మోడి, నాగకేసరములు, ఏలక
లు, జాపత్రి, లవంగములు, జాజికాయ వీటిని ప్రత్యేకముగ వొకపలముచొప్పున
చేర్చి కలియబెట్టి స్వాంగశీతలమునదించి అందు (౪) సేరుమంచితేనెవైచి కలియబె
ట్టివుంచుకొనవలయును. దీనిని ప్రతిదినము భోజనమునకుముందు వొకపలముచొప్పు
న సేవించవలయును. అట్లుకానియెడల అగ్నిబలము నెఱిగిసేవించవలయును. ఇట్లు
సేవించుటవలన, గుఱ్ఱమువలెసురతముచేయుటయందు సామర్థ్యముకలవాడగును.
మఱియు, సామర్థ్యము,బలము,సంతోషము యివికలిగి రోగరహితుడైయుండును.
మఱిన్ని గ్రహణి, క్షయము, శ్వాస, అరోచకము, అమ్లపిత్తము, పిత్తము, కుష్ఠము
పాండువు యివి నశించును.

## కామాగ్నిసందీపన మోదకము.

శ్లో॥ కర్షోరసోగంధకమభ్రకంచద్విక్షారచిత్రంలవణానిపంచ। శ
టీయవానీద్వయుకీటహారీతాలీసపత్రాణిపరంవిషంచ। జీరం

చతుర్జాతలవంగజాతీఫలంచకర్ష త్రయమేవమన్యత్। సువృద్ధస
ర్వాంకటుకత్రయంచతథాచతుష్కర్ష మదంనిబోధ। ధాన్యాకయ
ష్టీమధుకంకసేరూపలంపృథక్పంచపలంవిదారీ। దంతీకణాచా
తిబలాత్మగుప్తాబీజంతథాగోక్షురకస్యబీజం। సబీజపూరేం
ద్రరజఃసమానంసమాసితాక్షౌద్రయుతాచతుల్యం। కర్షైకమిం
దోరథమోదకంచకామాగ్నిసందీపనమేనమాహుః। వృష్యం
తథాపరతరంసతతంసదీప్యమేనం నిషేవ్యమనుజఃప్రమదా స
హస్రం। గచ్ఛేన్నలింగంశిథిలత్వమేవనాగాధిపం విజయతేబ
లతఃప్రమత్తః। వాతానశీతిమథపిత్తభవాంశ్చరోగాన్మేహాతి
సారకృమిహృద్గ్రహణీవికారాన్। కాసజ్వరశ్వసనయక్ష్మక
ఫప్రతీశ్యాశూలామవాతసహితాశ్చరుజస్సమస్తాః। హత్వాగ
దాన్బహువిధాంస్తదపత్యకారీసర్వత్రపథ్యమథసర్వ సుఖప్ర
దాయా। బల్యాంవలీపలితహారిరసాయనస్యాన్మూలంతదేవకథి
తంపరమంపవిత్రం॥ ❊

తా॥ శుద్ధిజేసినపాదరసము (౧) తులము, శుద్ధిజేసినగంధకము, అభ్రకభ
స్మము, సద్యక్షారము, యవక్షారము, చిత్రమూలము, పంచలవణములు, కచోరము
లు, ఓమము, కురాసానిఓమము, వాయువిళంగములు, తాళిసపత్రి, అతివస, ఏల
కర్ర, చాతుర్జాతకములు, లవంగములు, జాజికాయ, యివిప్రత్యేకప్రత్యేకముగా
జేసితులములు, శొంఠి (౪) తులములు, మిరియాలు, (౫) తులములు, పిప్పళ్లు (౬)
తులములు, ధనియాలు, అతిమధురము, తామరగడ్డ యివి ప్రత్యేకముగ (౪) తుల
ములు, నేలగుమ్మడుగడ్డ, (౫) పలములు, దంతివేరు, పిప్పళ్లు, ముత్తవపులగము,
తీటకోవిలవిత్తులు, పల్లేరుకాయలు, మాదీఫలచూర్ణము యివి ప్రత్యేకము వొక్కొ
క్కపలము, యీఔషధముయావత్తుకు సమభాగముగ ఖండశర్కర, తేనెచేర్చి
కలిపి వొకతులమెత్తుచొప్పున వటుకములు చేయవలెను. దీనినే కామాగ్ని సం
దీపనమోదకమనిజెప్పంబడు. ఈ ఔషధసేవనచే దేహపటుత్వము విశేషముగఅ
గ్నిదీపనము యివికలిగి (౧౦౧౦) స్త్రీలతోరమించు శక్తిగలవాడగును. లింగశైథి
ల్యము కలుగనేరదు. ఏనుగతోసమానమైన బలముకలవాడగును. మఱియు, యెనభై

వాతరోగములు, పిత్తరోగములు, ప్రమేహములు, అతిసారము, కృమిరోగములు, సంగ్రహణి, దగ్గు, జ్వరములు, ఉబ్బసము, క్షయరోగము, కఫరోగములు,శూల, ఆమవాతము, వలీపలితములు, యివిమొదలైనసకలరోగములను నశింపజేసి, సంతానమును వృద్ధిబొందించును. దీనిని రసాయనమనియెదరు.

శ్లో॥ కల్కేనవాజిగంధాయాః విపచేద్ఘృతముత్తమం । చతుర్గుణమజాక్షీరందత్వాద్ధృత్యాథశీతలే । సితాంసమాంప్రదాయాద్యాద్బలపుష్టివివృద్ధయే॥ ❋

తా॥ పెన్నేరుగడ్డరసమునందు మంచిఆవునెయ్యిపోసి ఆవునేతికినాలుగురెట్లు మేకపాలుపోసి, నెయ్యిమిగులువరకుకాచిదించి స్వాంగశీతలమైనపిమ్మట అందుకుసమము కలకండపొడివైచి నిత్యముసేవించినయడల బలము, పుష్టి యివి వృద్ధిపొందును.

## చందనాదితైలము.

శ్లో॥ ద్రవ్యాణిచందనాదేస్తుచందనంరక్తచందనం । పతంగమథకాలీయాగరుకృష్ణాగరూణిచ । దేవద్రుమఃసరలః పద్మకంక్రమకోపిచ । కర్పూరోమృగనాభిశ్చలతాకస్తూరికాపిచ। సిల్హకః కుంకుమంగవ్యంసజాతీఫలమేవచ । జాతీపత్రలవంగంచ సూక్ష్మైలామహతీతథా। కంకోలఫలకంత్వక్చపద్మకంనాగకేసరం। బాలకంచతథోశీరం మాంసీదారుసితాపిచ । మురాకర్పూరకశ్చాపిశైలేయం భద్రముస్తకం। రేణుకశ్చప్రియంగుశ్చశ్రీవాసోగుగ్గులుస్తథా। లాక్షానఖశ్చరాలశ్చధాతకీకుసుమంతథా। గ్రంథిపర్ణంచమంజిష్ఠా తగరంసిక్థకస్తథా । ఏతానిశాణమానానికల్కీకృత్యశనైఃపచేత్ । తైలప్రస్థంమితంసమ్యగేతత్ప్రాత్రేణభేషిపేత్ । అనేనాభ్యక్తగాత్రస్తువృద్ధోఽశీతిసమోఽపియః । సుఖీభవతిశుక్రాఢ్యస్త్రీణామత్యంతవల్లభః।వంధ్యాపిలభతేగర్భంషండోపితరుణాయతే । అపుత్రపుత్రమాప్నోతిజీవేచ్చశరదాంశతం । చందనాదిమహాతైలం రక్తపిత్తంక్షయం జ్వరం। దాహంప్రస్వేదదౌర్గంధ్యంకుష్ఠంకండూంవినాశయేత్॥

తా॥ చందనాదితైలమునందు చేర్చదగిన ద్రవ్యములను వివరించెద. తెల్లచందనము, రక్తచందనము, పతంగము, కాలాగరు, కృష్ణాగరు, దేవదారు, సరళదేవదారు, తామరదుంప, పోకచెక్కలు, పచ్చకర్పూరము, కస్తూరి, లతాకస్తూరి, (తక్కోలములు) అందుగబంక, కుంకుమపువ్వు, ఆవునెయ్యి, జాజికాయ, జాపత్రి, లవంగములు, సన్నయేలకలు, పెద్దయేలకలు, కంకోలఫలము, కంకోలపట్ట, తామరసుంప, నాగకేసరములు, కురువేరు, వట్టివేళ్లు, జటామాంసి, పెద్దలవంగపట్ట, మురయనెడు గ్రంధిద్రవ్యము, కచ్చూరములు, శిలాజితు, తుంగముస్తెలు, రేణుకద్రవ్యము, ప్రేంఖణము, శ్రీవాసకము, (దేవదారుబంకతో చేసిన ధూపద్రవ్యము) గుగ్గిలము, లక్క, నఖంచిప్పలు, రాళము (అందుగబంకతో చేసిన ధూపద్రవ్యము) ఆరెపువ్వు, స్థౌణేయమను గంధ్యము, మంజిష్ఠ, గ్రంధితగరము, మైనము యివియన్నియు ప్రత్యేకముగ (౪) మాషములయెత్తు చొప్పున చేర్చి కల్కముచేసి కుంచెడు నూనెలో బోసి తైలశాస్త్ర ప్రకారము కాచి వుంచుకొనవలయును. దీనిని అభ్యంజనము చేసిన నరుడు, ౭౦ సంవత్సరముల వయస్సుగల ముసలివాడైనను, దేహపటుత్వము, శుక్రవృద్ధి యివిగలిగి స్త్రీలయందు మిగుల యిచ్ఛగలవాడై యుండును. సంతానములేని స్త్రీ యీ తైలమును అభ్యంజనము చేసుకొనిన గర్భవతియగును. నపుంసకుడు దీనిసేవనచే పుంస్త్వముకలవాడగును. సంతానములేనివాడు సంతానవంతుడై ౧౦౦ సంవత్సరములు జీవించును. మఱియు రక్తపిత్తము, క్షయము, జ్వరము, దాహము, చమట, దుర్వాసన, కుష్ఠము, దురద యివి నశించును.

## మహాసుగంధ తైలము.

శ్లో॥ కర్పూరాగరుచోచపత్రనలికాలాక్షాశటీధాతుకీపుష్పైః సప్రప
    శైలవాలుసరళైః శైలేయమాంసీప్లవైః। ఏలాకుంకుమరోచనా
    దమనకైః శ్రీవాసజాతీఫలైః కంకోల క్రముకోచ్చటామదమురా
    కాంతాలవంగాపుర్యైః। వాలోశీరహరేణుకామలయజస్థౌణే
    యచండాతఖై । ర్జాతీకోశకులీరపద్మకనతైః స్పృక్కాన్వితై
    పాలికైః। లాక్షాయోజనవల్లిలోధ్రసలిలై స్తైలంవిపాచ్యాఢకం।
    తైలాభ్యక్తతనుర్జరన్నపిభవేత్ స్త్రీణాంపరంవల్లభః। శుక్రా
    ఢ్యోద్యుతిమాననల్పతనయః షండోపిరత్యుత్సుకోవంధ్యాగర్భ

వతీభవేదపితథావృద్ధాపిసూతేసుతం। కండూస్వేదవిచర్చికా
మలహారంచౌర్గంధ్య కుష్ఠాపహామశ్విభ్యాంపరికీర్తితం బహు
ణంతైలంసుగంధంమహాత్॥ ❊

తా॥ పచ్చకర్పూరము, కాలాగరు, లవంగపట్ట, జాపత్రి, తామరసుంప, కలువదుంప, లక్క, కచ్చూరములు, ఆరెపువ్వు, ఏడాకులఅరటి, మాతురుబుడమ, దేవదారు, శైలేయము, జటామాంసి, కురువేరు, ఏలకులు, కుంకుమపువ్వు, గోరోచనము, దవనము, శ్రీవాసకము, జాజికాయ, కంకోలము, పోకచెక్కలు, తుంగముస్తెలు, కస్తూరి, మురయనెడు గ్రంధిద్రవ్యము, ప్రేంఖణము, లవంగములు, చెంగల్వకోష్టు, కురువేరు, వట్టివేళ్లు, రేణుకద్రవ్యము, చందనము, స్థాణేయము, పిన్నకచోరములు, నఖద్రవ్యము, జాపత్రి, కాకడశింగి, తామరదుంప, నతము, (దేవదారు బంకతోచేసినధూపద్రవ్యము) స్పృక్క (సుగంధద్రవ్యము,)మల్లెపుష్పములు,లక్క మంజిష్ట, లొద్దుగ వీటిని కషాయముపెట్టి అకషాయమునందు మంచినువ్వులనూనె వాకకుంచమాబోసికాచి సిద్ధపరచుకొనవలయును. ఈతైలమును అభ్యంజనముచేసుకొనిన ముసలివాడైనను స్త్రీలయందుచాలాయిష్టముకలవాడును, వీర్యవృద్ధిన్ని, తేజోవంతుడునునయి అనేకసంతానములనుపొందును. దీనిని నపుంసకుడు సేవించిన పుంస్త్వముకలవాడగును. గొడ్రాలుసేవించిన గర్భిణియగును. ముసలి ఆడుది సేవించిన సంతానముకలుగును. మఱియు నీతైలసేవనచే దురద, చెమట, విచర్చిక, దుర్వాసన, కుష్ఠము యివిమొదలైన రోగములునశించును. ఇది అశ్వినీదేవతలచే జె[illegible]ంబడియె.

## వీర్యవృద్ధికిత్రిఫలచూర్ణము.

శ్లో॥ త్రిసప్తదేక్షుతోయేనత్రిఫలాభావితాస్పృహాం। సేవితాశర్క
రాయుక్తావీర్యవృద్ధికరీభవేత్॥ ❊

తా॥ కరక, తాండ్ర, యుసిరికలచూర్ణమును చెఱుకు రసముతో ౨౧ పరియాయములు భావనచేసి అందుఖండశర్కరచూర్ణమును సమముగవైచి సేవించిన వీర్యవృద్ధిగలుగును.

## వీర్యవృద్ధికిమత్స్యయోగము.

శ్లో॥ వాలుకాంతఃస్థితం మత్స్యంసుపక్వం భక్షయేత్తదాత్। షం
డోఽపిజాయతేకామీనారిబద్ధోవిముచ్యతే॥ ❊

తా॥ ఇసుకనీళ్ళలోని చాపనుపక్వముగవండి భక్షించినయడల నపుంసకునికైనను వీర్యవృద్ధికలిగి స్త్రీలతోరమించును.

వీర్యవృద్ధికి ఊర్ణనాభిలేపము.

శ్లో॥ ఊర్ణనాభిస్తుయోజీవోమధునాసహ పేషయేత్ । తేననాభిప్రలేపేన బద్ధషండోవిముంచతి॥ *

తా॥ సాలెపురుగును తేనెతోమర్దించి, దానిని బొడ్డుచుట్టు లేపనముచేసు కొనిన నపుంసకునికైనను వీర్యవృద్ధిగలుగును.

చంద్రోదయరసము.

శ్లో॥ పలంమృదుస్స్వర్ణదళం రసేంద్రాత్పలాష్టకంషోడశగంధకస్య । శోణైస్తుకార్పాసభవైః ప్రసూనైః సర్వంవిమర్ద్యాథ కుమారకాద్భిః । తత్కాచకుంభేనిహితంసుగాఢేమృత్కర్పటైస్తద్దివసత్రయంచ । పచేత్క్రమాగ్నౌసికతాఖ్యయంత్రేతతోరసఃపల్లవరాగరమ్యః । సౌవర్ణమేతత్సకలామయఘ్నంసర్వేషుయోగేషుచయోజనీయం । నిగృహ్యచైతస్యపలంపలానిచత్వారి కర్పూరరజస్తథైవ । జాతీఫలంచోషణమింద్రపుష్పం కస్తూరికాయామహశాణఏకః । చంద్రోదయోయంకథితోస్యమాషో భుక్తోహివల్లీదళమధ్యవర్తీ । మదోద్ధతానాంప్రమదాశతానాంగర్వాధికత్వంశ్లథయత్యవశ్యం । ఘృతంఘనీభూతమతీవదుగ్ధం మృదూనిమాంసానిసమండకాని । మాషాన్నపిష్టానిరసేంద్రపథ్యమానందదాయీన్యపరాణిచాత్ర । వలీపలితనాశనస్తనుభృతాంవయస్తంభనః సమస్తగదఖండనః ప్రచురరోగపంచాననః । గృహేచరసరాడయంభవతి యస్యచంద్రోదయఃసపంచశరదర్పితోమృగదృశాంభవేద్వల్లభః॥ *

తా॥ మేలైన అపరంజిరేకు (౪) తులములు, శుద్ధిజేసినరసము (౩౨) తులములు, శుద్ధిజేసినగంధకము (౬౪) తులములు వీటినిఖజ్జలిజేసి, ఎఱ్ఱపత్తిపూలరసముతోటి మర్దనజేసి,పిమ్మట కలుబందరసముతో మరలనాలుగుయామములుమర్దించి

గాజుకుప్పెయందునించి యేడుగుడ్డలతో యేడుమార్లుచీలయిచ్చి, వాలుకాయంత్రమునందు మూడుదినములు మంద - మధ్యమ - గాఢాగ్నులయందు పచనజేయవలయును. (అనగా ౨౪ యామములుపచనజేయవలయుననుట) ఇటులజేసిన చిగురుటాకువలె నెఱ్ఱనైన సింధూరమగును. ఈసింధూరము (౪) తులములు, భీమసేన (పచ్చ)కర్పూరము (౧౬) తులములు, జాజికాయ, నల్లమిరియాలు, లవంగములు యీమూడున్ను చేర్చి (౧౬) తులములు, కస్తూరి (౪) మాషములు వీటినన్నిటిని ఖల్వమునందునించినూరి వుంచుకొని మినపగింజయెత్తు ఔషధమును తమలపాకులోనునిచి భక్షించినయెడల, మదించినటువంటి సుందరవతులగు స్త్రీలగర్వమునుసణచుటకు సమర్థవంతుడగు. దీనినిసేవించునపుడు చిక్కగాకాచబడినపాలు, మృదువైనమాంసములు, మీగడ, మాషపదార్థములు, గోధుమపదార్థములు వీటినిపుచ్చుకొనవలయును. మఱియు ఆనందమును కలుగజేయునట్టి యితరపదార్థములనుకూడపుచ్చుకొనవలయును. దీనిని సేవించుటవలన వలీపలితములు నశించును. వయస్థాపనము గలుగును. సమస్తరోగములనుబోగొట్టును. ఇది ప్రబలమైన రోగములనెడి ఏనుగులకు సింహమువంటిఔషధము. ఈ చంద్రోదయము యెవనియింటియందుండునో అట్టివాడు మన్మథబాణపీడితుడై స్త్రీవల్లభుడైయుండును.

## మదనమంజరీవటీ.

శ్లో॥ చత్వారోవ్యోమభాగా స్తదనునిగదితంభాగయుగ్మంచవంగం।
భాగైకంశంభుబీజంత్రితయమపిమతంతత్సమాసిద్ధమూలీ। చా
తుర్జాతంసజాతీఫలమరిచకణానాగరందేవపుష్పం। జాతీప
త్రంచభాగద్వితయమపిపృథక్సర్వమేకత్రచూర్ణం। సర్వార్థాం
శాసితాస్యాద్ఘృతమధుసహితంమోదకీకృత్యచైత। త్ఖాదేద
గ్నింసమీక్ష్యప్రసభమభినవానందసంవర్ధనాయ। యోగోవా
జీకరాఖ్యోఽయమిహనిగదితో భైరవానందనామ్నా। నిశ్శేష
వ్యాధిహంతాదళితబహువధూద్దామకందర్పదర్పః॥ ❋

తా॥ అభ్రకభస్మము (౪) భాగములు, వంగభస్మము (౨) భాగములు, చంద్రోదయము (౧) భాగము యీమూటికిసమము గంజాయి, చాతుర్జాతకము, జాజికాయ, నల్లమిరియాలు, సన్నపిప్పళ్లు, శొంఠి, లవంగములు, జాపత్రి యివిప్రత్యేకము రెండేసిభాగములు, వీటినన్నిటినిచూర్ణముజేసి యీచూర్ణమునకుసమము

కలకండపొడిచేర్చి పిమ్మట నెయ్యి, తేనెవేసికలిపి వటుకములుగాచేసి అగ్నిబలానుసారముగ సేవించిన మిగుల శరీరదార్ఢ్యమును గలుగంజేయు. ఈయోగము భైరవానందయోగిచేత లోకహితార్థమై చెప్పబడినది. ఇదిసకలరోగములను బోగొట్టుటయేగాక, అనేకస్త్రీల మన్మథోద్రేకమును బోగొట్టుటయందు మిగులసమర్థమైనది.

## పంచబాణరసము.

శ్లో॥ సూతాభ్రలోహారగవంగశంఖకపర్దికాశ్చైవసమంవిధాయ।
సూతార్ధభాగంకనకస్యదద్యాద్వారత్రయం క్షీరవిభావయేత్తత్ । పోస్తైస్తథాభావితమేకవింశద్వారంతథాయష్టిసువర్ణకానాం । లవంగకాకల్లకవిశ్వజాతీఫలత్రికంకోలకచందనానాం।
ఏషాంద్రవైర్భావయసప్తవారం పృథక్తథైకంమృగనాభికాయాః । రసోఽయముక్తోపరమేశ్వరేణశ్రీపంచబాణోరతిశక్తిదోనృణాం । ఏతస్మాదధికంచనాస్తిభువనేవీర్యాధికంధీప్రదం।
ఆయుఃకాంతికరంహితంవసుమతాం నృణాముదారాత్మనాం । ఆజ్ఞాసిద్ధమిదంరసాయనవరంబల్యంవయఃస్థాపనం। మేహప్లీహజలోదరాశ్మరిరుజాపస్మారవిధ్వంసనం॥ *

తా॥ చంద్రోదయము, అభ్రకభస్మము, లోహభస్మము, సీసభస్మము, వంగభస్మము, శంఖభస్మము, గవ్వలభస్మము, వీటిని సమభాగములుగ గ్రహించి చంద్రోదయమునకు సగముభాగము ఉమ్మెత్తవిత్తులచూర్ణము వీటినన్నిటిని ఖల్వమునందునిచి ఆవుపాలతో మూడుమార్లును, పోస్తుకాయలరసముతో (౨౧) మార్లును యష్టిమధుకము, ఉమ్మెత్తవిత్తులు, లవంగములు, అక్కలకర్ర, శొంఠి, జాజికాయ జాపత్రి, త్రికంకోలములు, చందనము వీట్లరసముతోనైనను లేక కషాయముతోనైనను వెవ్వేరుగ యేడేసిమార్లును, కస్తూరికలిపిన ఉదకముతో వొకమారును, భావన జేయవలయును. పరమేశ్వరుడు మనుష్యులకు మైథున శక్తివిశేషము కలిగించుటయందలి దయచే యీపంచబాణరసమును జెప్పియున్నాడు. మఱియు ఆయుస్సు, కాంతి, బుద్ధి వీటినికలుగజేసి అధిక వీర్యవృద్ధినికలుగ జేయుటయందు యింతకన్న నెక్కువయైన యౌషధము మఱియొకటిలేదు. ఇదిధనవంతులైన పుణ్యాత్ములయొక్క

ఆజ్ఞను నెరవేర్చుటయందు సమర్థమైనది. ఈరసాయనము వళులనుబోగొట్టి వయస్సునునిలిపి మేహము, ప్లీహము, జలోదరము, అశ్మరి, అపస్మారము వీటిని బోగొట్టును.

### వీర్యవృద్ధికిమధుకాదిచూర్ణము.

శ్లో॥ సహితేనఘృతేనమధునామధుకంపరిసేవితంపిబతియోనుపయః।
నవసుభ్రువాంసుఖకరఃసతతంబహువీర్యపూరపూరితోభవతి॥

తా॥ యష్టిమధుకచూర్ణమునందు తేనె నెయ్యివైచిభక్షించి, కలకండపొడి చేర్చిన పాలునుద్రాగిన, కొత్తయౌవనస్త్రీలతో రమించుటయందు మిక్కిలి సమర్థుడగును.

### వీర్యవృద్ధికిఉచ్చటాదిక్షీరపానము.

శ్లో॥ ఉచ్చటామర్కటీగోక్షురైశ్చూర్ణితైఃశర్కరాదుగ్ధసమ్మిశ్రితైః
పాచితైః । సేవితైర్వార్ధకేమానవోమానినీమానముచ్ఛేదయే
త్కింపునర్యౌవనే॥ ❋

తా॥ ఊడుగవిత్తులు. తీటకోవిలవిత్తులు, ఏనుగపల్లేరుకాయలు వీటిచూర్ణముతో కలకండపొడిచేర్చి కాచినపాలలోవైచి త్రాగినను, లేకపాకముజేసిభక్షించినను, మదించిన స్త్రీలమానభంగముజేయుటయందు ముసలివాడైనను సమర్థుడగును. యౌవనవంతులు సేవించినట్లయిన మానభంగముచేయుదురని చెప్పనేల.

### వీర్యవృద్ధికిశతావరిక్షీరపానము.

శ్లో॥ భుక్త్వావరీంక్షీరయుతాంవిలాసీభుఙ్త్తేశతంసుందరిసుందరీణాం।
త్వంతావదేకాసిమయాతుసాధ్య భుక్త్వారతౌపశ్యకుతూహ
లంమే॥ ❋

తా॥ ఓసుందరీ! విలాసపురుషుడు శతావరీచూర్ణమును ఆవుపాలలోవైచి సేవించునో అట్టివాడు నూరుగురుస్త్రీలనైనను రమించును. నీవైతేనొక్కదానవు, నాతోటిసంభోగముచేసి నాశక్తినిచూడుము.

### వీర్యవృద్ధికిక్షీరపానము.

శ్లో॥ సౌభాగ్యపుష్టిబలశుక్రవివర్ధనానికింసంతినోభువిబహూనిరసా
యనాని । కందర్పవర్ధనిపరంతుసితాజ్యయుక్తాద్దుగ్ధాదృతేన
మమకోపిమతఃప్రయోగః॥ ❋

తా॥ సౌభాగ్యము, పుష్టి, బలము, శుక్రవృద్ధి వీటినికలుగజేయు ఔషధములు అనేకములుండినను, చక్కెర, నెయ్యిచేర్చిన ఆవుపాలకంటే మఱియొక ప్రయోగము నాకుయిష్టముగాదు. (అనగాత్రేదనుట.)

## పుష్పధన్వరసము.

శ్లో॥ కనకహారజకాంతంతాప్యకంవృద్ధిభావ్యం ద్విజకువలయయష్టీ
శాల్మలీనాగవల్యాః । ఘృతమధుపయోఖండంపుష్పధన్వాద్వివ
ల్లోరమయతిబహుకాంతాదీర్ఘమాయుర్బలీస్యాత్॥

తా॥ ఉమ్మెత్తవిత్తులు, శుద్ధిజేసినపాదరసము, స్వర్ణమాక్షికభస్మము వీటిని క్రమముగ ౧-౨-౩-భాగములవంతునజేర్చి, తెల్లతామరపుష్పములు, యష్టిమధుకము, బూరుగబంక తమలపాకులు, నెయ్యి, తేనె, పాలు, ఖండశర్కర వీటితో భావనజేసి సేవించవలయును. ఈపుష్పధన్వరససేవన ప్రభావముచేత అనేకస్త్రీలతోఁ జసంభోగముచేయుటయందు అతిసమర్థుడై అధిక ఆయువు, బలము యివి కలవాడగును.

## లఘుపుష్పధన్వరసము.

శ్లో॥ హారజభుజగలోహాన్యభ్రకంచత్రిభాగం । కనకవిజయయష్టీ
శాల్మలీనాగవల్యాః । సితమధుఘృతదుగ్ధైస్సేవితోవీర్యవృద్ధిః
రమయతిబహుకాంతాపుష్పధన్వారసఃస్యాత్॥ ❋

తా॥ శుద్ధిజేసినరసము (౧) భాగము, సీసభస్మము (౧) భాగము, లోహభస్మము (౧) భాగము, అభ్రకభస్మము (౩) భాగములు వీటినన్నిటిని ఖల్వములోనునిచి ఉమ్మెత్తవిత్తులు, గంజాయి, యష్టిమధుకము, బూరుగ, తమలపాకులు వీటితోభావనజేసి అందు తేనె, ఖండశర్కర, పాలు, నెయ్యి వీటినిచేర్చిసేవించిన వీర్యవృద్ధిగలిగి అనేకస్త్రీలతో రమించును.

## మదనకామదేవరసము.

శ్లో॥ తారంవజ్రంసువర్ణంచతామ్రంసూతకగంధకమ్ । లోహంక్ర
మవివృద్ధానికుర్యాదేతానిమాత్రయా । విమర్ద్యకన్యకాద్రా
వైర్ద్యేసేతాంచమయేషుకే । విముద్ర్యపిఠరీమధ్యేధారయే

త్సైంధవావృతే । పిఠరీంముద్రయేత్సమ్యక్తతశ్చుల్ల్యాంనివేశ
యేత్ । వహ్న్యాంశనైశ్శనైః కుర్యాద్దినైకంతతఉద్ధరేత్ । స్వాంగ
శీతంచసంచూర్ణ్య భావయేదరకాదుగ్ధకైః । అశ్వగంధాచకా
కోలీవానరీముసలీక్షురా । త్రిత్రివేలంరసైరేషాంశతావర్యా
శ్చభావయేత్ । పద్మకందకసేరూణాంరసైఃకాశస్యభావయే
త్ । కస్తూరీవ్యోషకర్పూరకంకోలైలాలవంగకమ్ । పూర్వచూ
ర్ణాదష్టమాంశమేతచ్చూర్ణంవిమిశ్రయేత్ । సర్వైస్సమాం
శర్కరాంచదత్వాశాణోన్మితంపిబేత్ । గోదుగ్ధద్విపలేనైవ
మధురాహారసేవకః । అస్యప్రభావాత్సౌందర్యంలభతేనాత్ర
సంశయః । తరుణీరమయేద్బహ్వీశ్శుక్రహానిర్నజాయతే॥ *

తా॥ రజితభస్మము (౧) భాగము - వజ్రభస్మము (౨) భాగములు-స్వర్ణభస్మము (౩) భాగములు - తామ్రభస్మము (౪) భాగములు - శుద్ధిజేసినపాదరసము (౫) భాగములు - శుద్ధిచేసినగంధకము (౬) భాగములు- లోహభస్మము (౭) భాగములు వీటినన్నిటిని ఖల్వమునందునిచి కలుబందరసముచేమర్దించి- కాచకుప్పెయందునిచి దానికోటికి మట్టిచేచీలయిచ్చి బాగుగనెండించి - పిదప నొకకుండను గ్రహించి దాని గొంతువరకు సైంధవలవణము చేతనిండించి యందాకాచకుప్పెను నిచి నాకుండకుపైన మరియొక చిన్నకుండనుబోర్లించి చీలమన్నుజేసి పొయిమీదను నిచి నొకదినమంతయు కమలాగ్నిచేమంటవేసి నదిచల్లారినపిదప యందలి యౌషధమునుగ్రహించి జిల్లేడుపాలు, పెన్నేరుగడ్డ - (కాకోళి) దీనిఅభావంబున పెన్నేరుగడ్డ దురదగొండివిత్తులు - నేలతాటిగడ్డలు - పెద్దపల్లేరు- చల్లపిల్లిగడ్డలు-తామరమంప - తుంగముస్తెలు - రెల్లు - వీటిరసములతో నొక్కొక్క దానిచే మూమ్మార్లుమర్దించి భావనజేసి నీరసాయనమున కెనిమిదవభాగము కస్తూరి - శొంఠి - మిరియాలు - పిప్పళ్లు - పచ్చకర్పూరము - కంకోలములు - ఏలకులు - లవంగములు- వీటినిచూర్ణముజేసి పైభావనజేసిన దానియందుకలిపి యందొక కర్షప్రమాణమునుగ్రహించి అందు కర్షప్రమాణము శర్కర - రెండుపలముల ఆవుపాలుజేర్చి పుచ్చుకొనిన శరీరకాంతి - బలము - తేజస్సు యివిగలుగుటయగాక ననేక యౌవనస్త్రీలతోరమించినను శుక్రధాతుక్షయము గలుగకయుండు - ఈరసాయనమునుసేవించునపుడు పులుసునువర్జించి మధురాహారములను భుజించుట పథ్యకరము.

## మదనసుందరరసము.

శ్లో॥ గంధకేనరసఃపిష్టఃకల్హారరసమర్దితః । విపక్వోవాలుకాయంత్రేవృష్యోమదనసుందరః॥ ❋

తా॥ శుద్ధిజేసినగంధకము - పాదరసము వీటిని వొకటిగానూరి పిమ్మట దానిని ఎఱ్ఱకలువ పూలరసముచేతమర్దించి వాలుకాయంత్రమునందు పచనముజేసిన దానిని మదనసుందరరసమనంబడు. దీనిని సేవించిన విశేషముగవీర్యవృద్ధిగలుగును.

## పూర్ణచంద్రరసము.

శ్లో॥ కామదేవఇహస్సోచ్చటారసోరక్తపుష్పమునిసారభావితః। పూర్ణచంద్రఇతివిశ్రుతోరసఃప్రాణినాంచరమధాతుపూరకః॥ రహస్యంకుసుమాస్త్రస్యశృంగారస్యాధిదైవతం । కార్శ్యంసుదృశామాచేరసత్రయమిదంహరః॥ ❋

తా॥ పైజెప్పబడిన కామదేవరసమును ఊదుగురసము - ఎఱ్ఱఆగిసెరసము వీటియందుభావనజేసినయెడల పూర్ణచంద్రరసము సిద్ధమగును. ఇదికామదేవరసమునకు రహస్యప్రయోగము. (అనగా శృంగారరసమునకు అధిదేవతయైయున్నది) కామదేవరసము - మదనసుందరరసము - పూర్ణచంద్రరసము యీమూటిని స్త్రీలమానభంగముచేయుటకై ఈశ్వరునిచేత చెప్పబడెను.

## పూర్ణేందురసము.

శ్లో॥ శాల్మల్యాశ్చైర్ద్రవైర్మర్ద్యపక్షైకంశుద్ధసూతకం। యామద్వయంపచేదాజ్యేవస్త్రైర్బధ్వాథమర్దయేత్॥ దినైకంశాల్మలీద్రావైర్మర్దయిత్వావటీంకృతాం। వేష్టయేన్నాగవల్ల్యాచనిక్షిపేత్కాచభాజనే ॥ భాజనంశాల్మలీద్రావైః పూర్ణంయామద్వయంపచేత్ । వాలుకాయంత్రమధ్యేతుద్రవేజీర్ణేసముద్ధరేత్ । ద్విగుంజంభక్షయేత్ప్రాతః నాగవల్లీదళాంతరే । ముసలీంసమ్మితాంక్షీరైఃపలైకంపాచయేదను॥ రసఃపూర్ణేందునామాయంసమ్యక్వీర్యకరోభవేత్। కామినీనాంసహస్రైకంనరఃకామయతేధ్రువమ్॥ ❋

తా॥ బూరుగపేళ్ళరసముతో ౧౨ దినములు మర్దనజేసిన శుద్ధపాదరసము
ను గుడ్డలోమూటగట్టి ఆవునేతిలో రెండుఝాములువండి పిమ్మట ఆగుడ్డనుతీసివేసి
మరల పైరసముతోనే యేకదినము మర్దించి వటుకములుగావించి, ఆవటుకములకు
తమలపాకులుజుట్టి వాటినికాచకుప్పెయందునిచి దానిని పైపట్టురసముచేత నేనిండిం
చి వాలుకాయంత్రమధ్యమునందునిచి రసము యిగురువరకు రెండు యామములు
కాచిన సిద్ధమగును. ఇది పూర్ణేందురసమనంబడు. దీనిని ప్రతిదినము ప్రాతః కాల
మునందు రెండుగుంజములయెత్తు తమలపాకులోచుట్టి పుచ్చుకొనవలయును. పిదప
పాలలోశుద్ధిజేసిన నేలతాటిచూర్ణము యేకపలము, రెండుపలములు చక్కెర
వీటినిమిళితముజేసియుంచుకొని ఔషధమునుసేవించునపుడెల్ల (1 తులము) పాలలో
వైచి కాచిపుచ్చుకొనవలయును. ఇటులజేసినమిగుల వీర్యవృద్ధిగలిగి సహస్రస్త్రీల
తోనైన రమించు శక్తిగలుగును.

## కామినీమదభంజనరసము.

శ్లో॥ శుద్ధంసూతంసమంగంధంత్ర్యహంకల్హారజద్రవైః। మర్దితంవాలు
కాయంత్రేయామంసంపుటగంపచేత్॥ రక్తాగస్తిద్రవైర్భావ్యం
దినైకంతుసితాయుతం । యథేష్టంభక్షయేచ్చానుకామయే
త్కామినీశతం॥

తా॥ శుద్ధపాదరసము, శుద్ధగంధకము యీరెంటిని సమముగచేర్చి మూడు
దినములు యెఱ్ఱకలువపూలరసముచేత మర్దించి కాచకుప్పెయందునిచి చీలయిచ్చి
వాలుకాయంత్రమునందు యేకయామము పచనజేసి పిమ్మట యెఱ్ఱఅగసెయాకు ర
సముచేత యేకదినము మర్దించి ఖండశర్కరచేర్చి ప్రతిదినముప్రాతఃకాలమునందు
రెండుగురిగింజలయెత్తుచొప్పున సేవించుచు పాలనుద్రాగిన నూరుగురుస్త్రీలనైనా
రమించుశక్తిగల వీర్యవృద్ధిగలుగు.

## మదనోదయరసము.

శ్లో॥ శుద్ధంసూతంసమంగంధంరక్తోత్పలదళద్రవైః। యామం మర్ద్యం
పునర్గంధంపూర్వార్ధంవినిక్షిపేత్ । తద్ద్రవైర్మర్దయేద్దివసం
పునర్గంధంచమర్దయేత్। పూర్వద్రావైర్దినైకంతుకాచకూప్యాం
నిరుధ్యచ । దినైకంవాలుకాయంత్రేపక్వముద్ధృత్యభక్షయేత్।
పంచగుంజాసితాసార్థంరసోఽయంమదనోదయః॥ సమూలం

వానరీబీజంముసలీశర్కరాసమం। గవాంక్షీరేణతత్పేయంపలా
ర్థమనుపానకం॥ ❋ ❋

తా॥ శుద్ధపాదరసము, శుద్ధగంధకము యీరెంటిని సమముగ కజ్జలిజేసి పిమ్మట ఎఱ్ఱకలువపూల రసముచేత నొకయామము మర్దించి మరల పైగంధకమునకు అర్ధభాగముగంధకమును పైకజ్జలితోచేర్చి ఎఱ్ఱకలువపూలరసముతో నొకదినము మరలమర్దించి, మూడవసారిమరల రసమునకు అర్ధభాగముగంధకముచేర్చి, పై రసముచేతనే నొకదినముమర్దించి కాచకుప్పెయందునిచి ౭ గుడ్డలతో ౭ మార్లు చీలయిచ్చి పిమ్మట వాలుకాయంత్రమునందు నొకదినము పచనజేసి చల్లారినపిమ్మట దించినసిద్ధమగును. ఇది మదనోదయరసమనంబడు. దీనిని ౫ గురిగింజలయెత్తు ఖండశర్కరతోచేర్చి సేవించినపిదప, మరదగొండిసమూలము, నేలతాటిగడ్డ పీటిచూర్ణములను మిళితముజేసవుంచుకొని, ౨ తులములుచొప్పున పాలలోవైచి కాచి పుచ్చుకొనవలయును.

## అనంగసుందరరసము.

శ్లో॥ పలద్వయంద్వయంశుద్ధంపారదంగంధకంతథా। మృతహేమ్న
స్తుకర్షైకంతులైకంమృతతామ్రకం। మృతతారంచతుర్నిష్కం
మర్ద్యంపంచామృతైర్దినం। రుద్ధ్వాతువైపుటేత్పశ్చాద్దినైకంతు
సముద్ధరేత్॥పిష్ట్వాపంచామృతైఃకుర్యాద్వటికాంబదరాకృతీమ్।
అనంగసుందరోనామ పరంపుష్టిప్రదాయకః॥ ❋

తా॥ శుద్ధపాదరసము (౨) పలములు, శుద్ధగంధకము (౨) పలములు,స్వర్ణభస్మము (౧) కర్షము, తామ్రభస్మము (౧) తులము,రజితభస్మము (౪) నిష్కములు, వీటిని నేకముగజేర్చి నొకదినముపంచామృతముచేత మర్దించి, చీలయిచ్చి, వాలుకాయంత్రమునందువండి నొకదినముఅయినతర్వాతదీసి మరల పంచామృతముతోమర్దనజేసి, రేగుగింజలంతమాత్రలుజేసి వుంచవలయును. ఇది అనంగసుందరరసమనంబడు. దీనిని సేవించిన శరీరమునకు అధికపుష్టిగలుగును.

## కామేశ్వరరసము.

శ్లో॥ సమ్యక్జారితమభ్రకం కటుఫలంకుష్ఠాశ్వగంధామృతా। మేథీ
మోచరసోవిదారిముసలీగోక్షూరకంక్షూరకం॥ రంభాకంద

శతావరీఅజమోదామాషాస్తిలాధాన్యకం । జ్యేష్ఠీనాగబలాక
చూరమదనం జాతీఫలంసైంధవం । భార్జీకర్కటశృంగికాత్రిక
టుకంజీరద్వయంచిత్రకం। చాతుర్జాతపునర్నవాగజకణాద్రా
క్షాసమంవాసకం । బీజంమర్కటిశాల్మలీఫలత్రికం చూర్ణంస
మంకల్పయే । తత్కర్షార్ధాగుటికావలేహమథవాసేవ్యం సదా
సర్వథా ॥ పేయంక్షీరసితాతువీర్యకరణం స్తంభోప్యయంకా
మినీ। రామావశ్యకరంసుఖాతిసుఖదంప్రౌఢాంగనాద్రావకం।
క్షీణేపుష్టికరంక్షయక్షయహరంసర్వామయధ్వంసనం । కాస
శ్వాసమహాతిసారశమనం మందాగ్నిసందీపనం । ధాతోర్వృ
ద్ధికరంరసాయనవరంనాస్త్యన్యదస్మాత్పరం । అర్శాంసిగ్రహణీ
ప్రమేహనిచయ శ్లేష్మాతిరక్తప్రణుత్ । నిత్యానందకరం విశేష
కవినాంవాచాంవిలాసోద్భవం । అభ్యాసేననిహంతిమృత్యుప
లితంకామేశ్వరోవత్సరాత్ । సర్వేషాంహితకారకోనిగదితః
శ్రీవైద్యనాథేనయః॥ ❋

తా॥ అభ్రికభస్మము - కాయఫలము - చంగ్వకోష్టు - పెన్నేరుగడ్డ- తిప్పతీగె - మేధి - రసము - నేలగుమ్ముడుగడ్డ - నేలతాటిగడ్డ - పల్లేరు - కాకిచెరుకు- అరటిదుంప - పిల్లిపీచర - అజామోదము - ఉద్దులు - నువ్వులు- ధనియాలు- పెద్దజిబిలిక - కచూరములు - మంగకాయలు - జాజికాయలు- సైంధవలవణము- గంటుభారంగి - కర్కాటకశృంగి - త్రికటుకములు - జీరకద్వయము - చిత్రమూలము - చాతుర్జాతకములు - గలిజేరువేరు - గజపిప్పళ్లు - ద్రాక్ష - అడ్డసరము-తీటకోవిలవిత్తులు - బూరుగ - త్రిఫలములు వీటినన్నిటిని ప్రత్యేకముగ చూర్ణించిసమభాగములుగ చేర్చివుంచుకొని అర్ధకర్షముచొప్పున మాత్రలు జేసిగాని, లేక చట్నీగా జేసుకొనిగాని సేవించి పిమ్మట కలకండపొడిచేర్చిన పాలుత్రాగినయెడల వీర్యవృద్ధికలిగి స్తంభనమగును. మఱియు స్త్రీలనువశపరచును. సుఖమునిచ్చును. మఱియు నవయవ్వనముకల స్త్రీలనైనను ద్రవింపజేసును. క్షీణసత్వముకలమనుష్యులకు పుష్టినిగలుగజేయును. క్షయాదిసకలరోగములను నశింపజేయు. మఱియు కాస, శ్వాస, అతిసారము, మందాగ్ని వీటిని బోగొట్టి ధాతుపుష్టినిగలుగంజేయు. రసాయనములలో దీనికిమించినదిలేదు. మఱియు అర్శ - గ్రహణి- ప్రమేహము - శ్లేష్మము-

రక్తపిత్తము - వీటినిబాగొట్టివిశేషసంతోషమును గలుగంజేయు. మంచికవీశ్వరులకువాగ్విలాసమునుగలుగంజేయు. మఱియు దీనినొకసంవత్సరముసేవించుటచే మృత్యువు, పలితము, యివి నశించు. ఇది సమస్తజనులకు సుఖమును గలుగజేయునదియని వైద్యనాథుడు చెప్పియున్నాడు. ఇది కామేశ్వరరసమని బరంగు.

## కామదేవరసము.

శ్లో॥ హేమపాదయుతఃసూతోమర్దితఃశాల్మలీరసైః । కదలీకంద
నిర్యాసేక్షీరేక్షురసగోఘృతే ॥ మాక్షికేచాసకృత్స్విన్నేశా
ల్మలీక్షీరగోక్షురైః । శర్కరామలకద్రాక్షాముసలీమాషమా
క్షికైః ॥ యుక్తోరంభాఫలందత్వాకామదేవఇతిస్మృతః । సే
వనాదూర్ధ్వలింగోవాద్రావయేద్వనితాశతం॥ *

తా॥ మేలిమిబంగారురేకు (౪) తులములు - శుద్ధపాదరసము (౧) తులము వీటిని బూరుగపట్టరసము - అరటిగడ్డరసము - ఆవుపాలు - చెఱుకురసము-ఆవునెయ్యి - వీటితోమర్దించి - పిదప - బూరుగబంకచూర్ణము - పల్లేరుచూర్ణము-ఉసిరికపలుపుచూర్ణము - నేలతాడిచూర్ణము - మినపపిండి-వీటినిపైకజ్జలిలోచేర్చి-అందు ద్రాక్ష - తేనె - ఖండశర్కర-తగుమాత్రపు అరటిపండ్లరసము వీటినిచేర్చి లేహ్యపక్వముగకలుపుకొనిన కామదేవరసముసిద్ధమగు - దీనినిసేవించిన - నూర్ధ్వలింగముగలవాడై నూరుగురుస్త్రీలతోరమించు వీర్యవృద్ధి గలవాడగును.

## వాజీకరణం.

శ్లో॥ స్వర్ణమాక్షికలోహంచపారదశ్చశిలాజతు । పథ్యావిడంగ
ధత్తూరవిజయాజాతిపత్రికా ॥ అశ్వగంధాగోక్షురాణాం
రైర్భావ్యంపృథక్పృథక్ । సప్తభాగంతువిశ్వైకంమథ్వా
జ్యాభ్యాంలిహేత్తతః ॥ గవాంవిరూఢవత్సానాంసిద్ధంపయసి
పాయసం । గోధూమచూర్ణంతుతథాసితామధుఘృతాన్వి
తం ॥ భుక్త్వాహివ్యక్తిజీర్ణేఽపిదశదారాన్వ్రజత్యపి । బ్రహ్మచ
ర్యంప్రకర్తవ్యమేకవింశద్దినావధి॥ *

తా॥ స్వర్ణమాక్షికము - లోహము - పాదరసము - శిలాజతు - కరక్కాయలు - వాయువిడంగములు - ఉమ్మెత్త - గంజాయి - జాపత్రి - పెన్నేరు-పల్లేరు - వీటిరసములయందు వేర్వేఱుగభావనజేసి పిమ్మట (౭) భాగములు

శొంఠిచూర్ణముజేర్చి దానిని (౧) భాగముసేతితో మిళితముజేసి తేనెతో పుచ్చు కొని తరిపిమీఁడలుగల ఆవులయొక్క పాలతో సిద్ధముజేయబడిన గోధుమనూక పాయసమునందు చక్కెర తేనె నెయ్యివేసి త్రాగినయడల, అదిజీర్ణమైనపిమ్మట పదునారుస్త్రీలనైనా రమించగలడు. దీనిని ౨౧ దినముసేవించుచు స్త్రీసంభోగము మానియుండవలను.

## ధాతువృద్ధికినవాయసాదిచూర్ణము.

శ్లో॥ చిత్రకంత్రిఫలాముస్తంవిడంగంత్ర్యూషణానిచ । సమభాగా
నికార్యాణినవభాగాహతాయసః । ఏతదేకీకృతంచూర్ణంమ
ధుసర్పిర్యుతంలిహేత్ । గోమూత్రమథవాతక్రమనుపానేప్ర
శస్యతే । పాండురోగంజయత్యుగ్రంత్రిదోషంచభగందరం ।
శోఫకుష్ఠోదరార్శాంసిమందాగ్నిమరుచింకృమీన్॥

తా॥ చిత్రమూలము, త్రిఫలములు, తుంగగడ్డలు, వాయువిడంగములు, శొంఠి మిరియాలు, పిప్పళ్లు, వీటిని సమభాగములుగ చూర్ణముజేసి, యీచూర్ణమునకు తొమ్మిదవభాగము లోహభస్మముకలిపి తేనె, నెయ్యిగాని, గోమూత్రముగాని ఆవుమజ్జిగగాని, అనుపానముజేసి పుచ్చుకొనిన ప్రబలమగు పాండురోగము, త్రిదోషవికారములు, భగందరము, వాపు, కుష్ఠము, ఉదరరోగము, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, అరుచి, జంతువికారములు, ఇవియన్నియు నశించు.

## వీర్యవృద్ధికిఆమలక్యాదిచూర్ణము.

శ్లో॥ అమృతామలకీత్రికణ్టకానాంహవిషాశర్కరయానిషేవణేన ।
అజరాఅమరాఅపారవీర్యాఅఖిలేశాఅదితేస్సుతాఅభూవన్॥

తా॥ ఉసిరికెవరుగుచూర్ణము - సన్నపల్లేరుకాయలచూర్ణము - వీటిని సమముగ గ్రహించి అందుతిప్పసత్తు నెయ్యి, చక్కెరకలిపి సేవించిన అపారమైనవీర్య వృద్ధిగలిగి దేవతాతుల్యముగనుండెదరు. మఱియు వెండ్రుకలు నల్లనగును.

## ధాతుపుష్టికిమాషాదిమోదకము.

శ్లో॥ నిస్తుషంమాషచూర్ణంస్యాత్తథాగోధూమసంభవమ్। నిస్తుషం
యవచూర్ణంచశాలితండులజంతథా । సూక్ష్మంచపిప్పలీచూ
ర్ణంపలికాన్యుపకల్పయేత్ । ఏతదేకీకృతంసర్వంభర్జయేద్గో

ఘృతేనచ । అర్ధమాత్రేణసర్వేభ్య స్తతఃఖండంసమంక్షిపేత్ । జలంచద్విగుణందత్వాపాచయేత్తచ్ఛనైశ్శనైః । తతఃపక్వంస ముద్ధృత్యవృత్తాన్ కుర్వీతమోదకాన్ । భుంక్త్వాసాయంప్రాతై కంచపిబేత్క్షీరంచతుర్గుణమ్। వర్జనీయావిశేషేణక్షారామ్లాదీన్ రసానపి । కృత్వైవంరమయేన్నారీర్బహ్వీర్నక్షీయతేనరః॥

తా॥ పైపొట్టుదీసినమినపప్పు, పైపొట్టుదీసిన గోధుమలు, పైపొట్టుదీసిన యవలు, బియ్యము, పిప్పళ్లు, వీటిని దినుసుకొక్కొక్కపలముచొప్పున చూర్ణము చేసి దీనికి యర్ధాంశముగ ఆవునెయ్యిబోసివేయించి, దానికి సమంబుగశర్కర(౨౦) పలములయుదకముబోసి, మందాగ్నిచేపాకముజేసి జక్కగకలియబెట్టి పలప్రమాణ ముగ మోదకములుజేసి ప్రతిదినము సాయంకాలమునందొక్కొక్క మోదకముచొ ప్పునసేవించి నాలుగుపలముల యావుపాలనుద్రాగి క్షారము, పులుసు, వీటినివర్జిం చియుండిన ననేకస్త్రీలతోరమించినను మనుజునికి బలముతగ్గకయుండును.

## వీర్యవృద్ధికిమరిచాదిలేహము.

శ్లో॥ శర్కరాక్షౌద్రమరిచైస్తుగాక్షీర్యాచబుద్ధిమాన్ । యుక్త్వాస్య యుక్తంసస్నేహం లేహంభేషజంచాపురే ॥ భార్జితేప్రక్షిపే చ్ఛితేఘృతాఢ్యంషష్టికౌదనమ్ ॥ తందద్యాద్యుపరిష్టాచ్చరసా నంమాత్రయాపిబేత్ ॥ వర్ణస్వరబలోపేతఃపుమాంస్తేనవృషా యతే॥

తా॥ మిరియాలు - వెదురుప్పు - సన్నయేలక్కాయలు - వీటిని సమభాగ ములుగచూర్ణముజేసి యుంచుకొని, యొకమృణ్మయభాండమును నెయ్యిగనగునటుల కాల్చి కించిదుష్ణముగనుండునపుడు అందుతగుమాత్రముగ శర్కర - తేనె - ఆవు నెయ్యి - అరువదిదినంబులకు పండెడి ధాన్యపు అన్నమునువైచి పైచూర్ణమునుకలిపి యన్నిటిని యేకంబొనర్చి ప్రత్యహముభక్షింపుచుండిన వీర్యవృద్ధిగలుగు.

## వీర్యవృద్ధికిగుడకూశ్మాండకలేహము.

శ్లో॥ కూశ్మాండకాత్పలశతంసుస్విన్నంనిష్కులీకృతం । ప్రస్థంఘృత స్యతైలస్యతస్మింస్తప్తేప్రదాపయేత్ ॥ త్వక్పత్రధాన్యాకవ్యోష

జీరకైలాద్వయంనలం । గ్రంధికంచవ్యమానంగ పిప్పలీవిశ్వ
భేషజం ॥ శృంగాటకంకశేరుంచప్రలంబంతాళమస్తకం । చూ
ర్ణీకృతంపలాంశంచగుడస్యచతులాంపచేత్ ॥ శీతీభూతేపలా
న్యష్టౌమధునస్సంప్రదాపయేత్ । కఫపిత్తానిలహరంమందాగ్ని
నాంచశస్యతే ॥ కృశానాంబృంహణంశ్రేష్ఠంవాజీకరణముత్త
మం । ప్రమదాసుప్రసక్తానాంయేచస్యుఃక్షీణరేతసః ॥ క్షయే
నచగృహీతానాంపరమేతద్భిషగ్జితం । కాసంశ్వాసంజ్వరం
హిక్కాంహంతిఛర్దిమరోచకం ॥ గుడకూశ్మాండకంఖ్యాతమ
శ్విభ్యాంసముదాహృతమ్॥ ✻

తా॥ నువ్వులనూనె (౧) పడి - నెయ్యి (౧) పడి - వీటిని చక్కగకాచి యందు(౧౦౦)పలములుపైబెరడుదీసిన బూడిదగుమ్మడుపండును బద్దలుచేసి యుడికించి పిదప అందులవంగపట్ట - లవంగపత్రి - ధనియాలు - శొంఠి - పిప్పలి-మిరియాలు - జీలకఱ్ఱ - చిన్నయేలకులు - పెద్దయేలకులు - చిత్రమూలము - మోడి-చవ్యము - తీటకోవిలవిత్తులు-పిప్పలి - శొంఠి - పరికగడ్డలు- తుంగగడ్డలు - చిట్టాముట్టి - నేలతాటిగడ్డలు -వీటిని దినుసుకొక్కొక్కతులముచొప్పున చూర్ణముచేసి వైచి, యందు (౧౦౦) పలముల పాతబెల్లమునుకలిపి, లేహపక్వముగవండి చల్లార్చి యందెనిమిది పలముల తేనెకలిపి తగుమాత్రముగభక్షించిన వాత, పిత్త, శ్లేష్మదోషములు, మందాగ్ని, క్షయము, కాసశ్వాసలు, జ్వరము, ఎక్కిళ్లు, వాంతి, అరుచి, ఇవినశించుటయగాక కృశించెడివారలకు బలంబును, మిగుల స్త్రీసంగమంబొనర్చుటచే క్షీణరేతస్సుగలవారలకు వీర్యవృద్ధియును గలుగు. (ఇది) అశ్వినీదేవతలచేనిర్మింపబడినది.

## వీర్యవృద్ధికి శతావరీ రసాయనము.

శ్లో॥ శతావరీవిదారీక్షు కూశ్మాండకరసోఝటా । వారాహీమోచ
ముద్గాత్మగుప్తాధాత్రీరసస్తథా । నారికేళోదకంక్షీరంసితా
రంభాఫలంతథా । ప్రత్యేకంప్రస్థమాత్రంతుఘృతంవింశత్పలంభ
వేత్ । ఆదాయసర్వమేకంతు లేహయేన్మృదునాగ్నినా । త్రి
జాతకతుగాద్రాక్షా వాజిగంధాకశేరుకం । సారిబామధుకం

శృంగీమధూకంజాతిపత్రకం । కోకిలాక్షశ్చజాజీచవర్గాష్టక మధూళికా । ప్రియాళుమజ్జస్త్రీబేరంద్విపిపార్థంపృథక్పృథక్ । కృష్ణాశుంఠీపలేద్వేద్వే సర్వంసంచూర్ణయేత్ భిషేత్ । సితామధుపలాన్యష్టక్షిప్త్వాసంలేహయేత్తతః । ధాన్యరాశౌస్థితం పక్షంశుద్ధంకోష్టంయథాబలం । ఏకవారప్రయోగేణ స్త్రీశతంరమతేముదా । త్రివారంసేవనాద్గచ్ఛేన్నారీణాంనిత్యంసహస్రకం। వంధ్యాచలభతేగర్భంక్లీబత్వాన్ముచ్యతేపుమాన్। బాలార్ణవశరంచైవరుచ్యహాయుష్కరంపరం । అసృగ్దరంరక్తపిత్తం ఆమ్లపిత్తంచనాశయేత్ । కామిలాంపాండురోగంచరాజయక్ష్మాదికారుజః । సోమరోగం మూత్రకృఛ్రం శుక్లస్రావంచనాశయేత్ । సర్వపిత్తభవాన్రోగాన్ వింశతిమేహనాశనం। రసాయనమిదంశ్రేష్ఠం నారాయణవినిర్మితం॥ ❋

తా॥ పిల్లిగడ్డలరసము - నేలగుమ్ముడుగడ్డలరసము - చెరుకుపాలు-బూడిదెగుమ్మడికాయరసము - నేలపులిరికరసము - నేలతాడిగడ్డలరసము - మానగపట్టరసము - మాలగొండిరసము - నల్లపెసరకట్టు- పులిరికపండ్లరసము టెంకాయపాలు-ఆవుపాలు - తులసిరసము - అరటిపండ్లరసము - వీటినన్నియు ప్రత్యేకము-౨౪కప్రస్థము చేర్చి - అందుచక్కెర- ౪- శేర్లు ఆవునెయ్యి- ౨౦- పలములు వైచి-లేహ్యపాకముగవచ్చునపుడు - ఏలకులు - లవంగపుచెక్క - ఆకుపత్రి - తవక్షీరి -కాకోలి-పెన్నేరుగడ్డ - ధనియాలు - గూడపాలవేరు - అతిమధురము - ఇప్పపూలు- కర్కాటకశృంగి - జాపత్రి - తీటకోవిలవిత్తులు - సహజీర అష్టవర్గములు- చాగ- ద్రాక్ష-తామరగడ్డ - కురువేరు - ఇవి ప్రత్యేకము ౧ తులముసొత్తు-శొంఠి-పిప్పళ్లు- ప్రత్యేకము ౨ పలములు, వీటినన్నియుచూర్ణించివైచి, బాగుగకలియబెట్టి- దించి- ఆరినపిదప- ౮- పలములతేనెవైచి- ౧౫- దినములు - ధాన్యరాశియందుంచి - పిదప-బలానుసారముగ - ప్రతిదినము ఏకవారము సేవించిన - నూరుస్త్రీలతోరమించునటులను, త్రివారముసేవించిన, నిత్యము ౧౦౦౦, స్త్రీలతోరమించునటులను, పటుత్వమునుగలుగంజేయు, మరియు, వంధ్యాస్త్రీలుసేవించిన, గర్భమును, నపుంసకుడుసేవించిన, పుంస్త్వమునగలుగు, మరియు) అసృగ్దరము,రక్తపిత్తము, ఆమ్లపిత్తము కామిల,పాండురోగము, రాజయక్ష్మాదిరోగములు,సోమరోగము,మూత్రకృచ్ఛ్రము

శుక్లస్రావము, సమస్తపిత్తములు, వింశతిమేహములు, ఇవియన్నియు నశించుటయేగాక, అధికముగబలము, రుచి, ఆయుస్సు వీటిని గలుగంజేయు. ఇదియు, నారాయణమూర్తిచే నిర్మింపబడిన, శతావరీరసాయనము.

## వీర్యవృద్ధికి అశ్వగంధ రసాయనము.

శ్లో॥ పలంవింశత్యశ్వగంధాంసూక్ష్మచూర్ణంతుకారయేత్ । ద్రోణద్వయంగవాంక్షీరంగోఘృతం ప్రస్థమాత్రకం ॥ సర్వమేకీకృతం పాత్రేశనైర్మృద్వగ్నినాపచేత్ । చిక్కణం పక్వమాయాతిసితాదశపలంతథా॥ చాతుర్జాతకధాన్యాకంద్రాక్షాఖర్జూరచందనం । జాతీఫలంశఠీగ్రంధిస్తుగాక్షీరీకటుత్రయం ॥ హ్రీంబేరం దేవకుసుమంగ్రంధికంచవ్యచిత్రకం । ప్రత్యేకం కర్షమాత్రంతు ఘృతార్ధంమాక్షికంక్షిపేత్ ॥ శీతీభూతంనిధాతవ్యం ధాన్యేపక్షంతథైవచ॥సాయంప్రాతశ్చసేవేతజ్ఞాత్వాచాగ్నిబలంనరః। షడ్విధాంశ్చక్షయాన్హంతితథైకాదశరూపిణః ॥ రక్తపిత్తంచామ్లపిత్తంకామిలాంపాండుతామపి । అస్థిజ్వరంపురాణంచనాశయేన్నాత్రసంశయః ॥ అగ్నిదీప్తికరంచైవ హ్యోజోబలవివర్ధనం । గర్భిణీవృద్ధబాలానాంసౌకుమార్యంప్రశస్యతే ॥ కృశానోర్బృంహణంబల్యం క్షీణవీర్యప్రవర్ధనం । భాషితం కామదేవేనహ్యశ్వగంధారసాయనం॥

తా॥ పెన్నేరుగడ్డలు - ౨౦- పలములు మెత్తగచూర్ణించి - రెండు ద్రోణము ఆవుపాలు - ఆవునెయ్యి - వకప్రస్థము వీటినివకపాత్రయందునిచి - అందు పైచూర్ణమునువైచి -మృద్వగ్నిచే చిక్కగనగువరకువండి-పదిపలములచక్కెరవైచి- పక్వమగువరకుకాచి అందు- లవంగపట్ట - లవంగపత్రి - నాగకేసరములు - యాలకులు - ధనియాలు - ద్రాక్ష - ఖర్జూరము - చందనము - జాజకాయ - కచ్చూరములు - గ్రంధితగరము - తవక్షీరి - త్రికటుకములు- కురువేరు - లవంగములు- మోడి-చవ్యము - చిత్రమూలము - వీటిని సమముగ కర్షప్రమాణములుగ - గ్రహించి చూర్ణించిచేర్చి పక్వముగవండి - అర్ధప్రస్థము తేనెచేర్చి కలిపి సాంగశీతలమునదీసి ౧౫- దినములుధాన్యపుటమిడి-ప్రాతస్సాయంకాలములయందుసేవించిన - ఏకాదశరూపములుగల షడ్విధక్షయలు - రక్తపిత్తము - ఆమ్లపిత్తము-కామిల- పాండువు

అస్థిగతజ్వరము - పురాణజ్వరము - వీటినినశింపజేయుటయేగాక - అగ్నిదీప్తి- తేజస్సు - బలము -గర్భిణీ-వృద్ధులు- బాలురు- వీర్లకుసుకుమారత్వము-అగ్నిపుష్టి-క్షీణవీర్యవృద్ధి-వీటినిగలుగంజేయు- నిది కామదేవునిచే జెప్పంబడిన అశ్వగంధరసాయనమని యెరుంగవలయు.

వీర్యవృద్ధికి భృహద్గోక్షురాదిలేహ్యము.

శ్లో॥ గోకంటకంపలశతంకుశమూలంతథైవచ । పాషాణభేదోష్టపలంగుడూచీపలపంచకం । ఏరండోఽభీరురష్టాచ మూలందశఫలంపృథక్ । పద్మమూలంచాశ్వగంధా(ప్రత్యేకంపలవింశతిః। సర్వమేకత్రసంకుట్యజలద్రోణేవిపాచయేత్ । పాదశేషంతుసంగ్రాహ్య వస్త్రపూతంసమాక్షిపేత్॥ గవ్యాజ్యంప్రస్థమేకంతుశిలాజంచతథాస్మృతం । ఘనీభూతేతుసంజాతేద్రవ్యాణిమానిదాపయేత్ । తాలమూలీశతాహ్వాచ త్రికటుత్రిఫలాతథాస్వాత్మైలాభూతకేశీచహ్రీబేరంనాగకేశరం।పద్మకంజాతిపత్రత్వ్వజ్మధుయష్టిస్సరోచనా । జాతీఫలముశీరంచ త్రివృతారక్తచందనం । ధాన్యకంకటుకాక్షారౌ నాగవల్లీచశృంగికా । పుష్కరాహ్వంసటీదారుసీసంలోహంచవంగకం ।ద్రవ్యాణిమానిసంగృహ్య ప్రత్యేకంపలమాత్రకం । ఖాదేద్బలాగ్నిసంప్రేక్ష్యపథ్యంసేవేతమానవః । స్నిగ్ధభాండేనిధాయాథనిత్యంలిహ్యాత్పలోన్మితం । అశ్మరీమూత్రకృఛ్రంచమూత్రాఘాతోవిబంధకః। ప్రమేహావింశతిశ్చైవశుక్రదోషస్తథైవచ। ధాతుక్షయశ్చోష్ణవాతోవాతకుండలికాదయః। లేసర్వేప్రశమంయాంతిభాస్కరేణతమోయథా । నాతఃపరతరంకించి తల్పృష్టాత్రియేణపూజితః॥ *

తా॥ పల్లేరు (౧౦౦) పలములు, కుశదర్భవేరు (౧౦౦) పలములు, పాషాణభేది (౮) పలములు, తిప్పతీగె (౫) పలములు, ఆముదపువేరు (౮) పలములు, పిల్లపీచర (౧౦) పలములు, తామరదుంపలు - పెన్నేరుగడ్డ - ఇవిప్రత్యేకము (౨౦) పలములు, వీటినన్నిటిని చేర్చి నలియగొట్టి, ద్రోణప్రమాణోదకమునందువైచి, నాల

వపాలు మిగులునటుల కషాయముకాచి వడియగట్టి అందు ఆవునెయ్యి (౧) ప్రస్థము, శిలాజితుభస్మము (౧) ప్రస్థము, వీటిని జేర్చి లేహ్యపాకముగవండి, నేలతాడిగడ్డలు - పిల్లపీచర - త్రికటుకములు - త్రిఫలములు - సన్నఏలకలు - జటామాంసి-కురువేరు - నాగకేశరములు - తామరకాడలు - జాపత్రి - లవంగపట్ట - అతిమధురము - వెదురుప్పు - జాజికాయులు - వట్టివేరు - తెగడ - రక్తచందనము - ధనియాలు - కటుకరోహిణి - యవక్షారము - వెలిగారము - నాగవల్లి . కర్కాటకశృంగి - పుష్కరమూలము - కచ్చూరములు - మానిపసపు - వీటిని ప్రత్యేకము ౧-పలమువంతున చూర్ణించి, నాగభస్మము - లోహభస్మము - వంగభస్మము - వీటిని ప్రత్యేకము (౧) పలముచేర్చి అందువైచి కలియబెట్టి దానిని, నేతితోమాగిన కుండయందునిచి, ప్రాతఃకాలపలముచొప్పున సేవించిన, అశ్మరి, మూత్రకృఛ్రము, మూత్రాఘాతము, మూత్రబంధము, వింశతిమేహములు, శుక్రదోషములు, నష్టవీర్యము, అమ్లపిత్తము, ధాతుక్షయము, ఉష్ణవాతము, వాతకుండలి, ఇవినశించు.

## వీర్యవృద్ధికి మధుస్నుహీరసాయనము.

శ్లో॥ ఫలత్రయంకటుత్రయంసుయోజయే ద్విషగ్వరస్త్రిజాతకం యవా
వానియుగ్మవహ్ని జీరకంతథా । రాస్నభార్గివహ్నిచవ్య ధాన్య
యుగ్మజీరకంమాంసికుష్ఠవజ్రకేశ్యశారిభావరాహకం॥అశ్వగం
ధిసంయుతపృథక్చ కర్షసంయుతం । మధుస్నుహీచతత్సమాస
శర్కరాసమాక్షికం । గోఘృతంసుపక్వకంరసాయనం మనో
హరం । మేహపైత్యవాతకుష్ఠగుల్మశూలహారకం । సప్తధా
తువర్ధనంసుదీపనంయశస్కరంపూజ్యపాదనిర్మితంరసాయనం
సుపూజితం॥ ❊

తా॥ త్రిఫలములు - త్రికటుకములు - త్రిజాతకములు - ఓమము -కురాసాని ఓమము - చిత్రమూలము - జీలకఱ్ఱ - దుంపరాస్న - భారంగి - పిప్పళ్లు- చవ్యము-ధనియాలు - మెంతులు . నల్లజీలకఱ్ఱ - జటామాంసి - కోష్టు - వట్టివేళ్లు, సుగంధపాలవేళ్ళవలుపు- నేలతాడిగడ్డలు - పెన్నేరుగడ్డ - వీటిని ప్రత్యేకము - వకకర్షము చొప్పునచేర్చి - చూర్ణించి వీటికిసమము - పరంగిచక్క చూర్ణమును జేర్చి (౩౦) పలములుచక్కెరపాకముబెట్టి - ఆపాకునందు పైనుదహరింపబడిన చూర్ణమును కలిపి

ఆవునెయ్యివైచి - పక్వముగవండి - అందు, (౧౬) పలముల, తేనెచేర్చికలిపిసేవించిన- మేహ-పైత్యవాతము, కుష్ఠువు, గుల్మము, శూల వీటిని నశింపజేయుటయే గాక, సప్తధాతువృద్ధి, దీపనము, యశస్సు ఇవిగలుగు.

## షండత్వనాశనము.

శ్లో॥ తిలగోక్షురయోశ్చూర్ణంఛాగీదుగ్ధేనపాచితమ్ । శీతలంమధు
నాయుక్తంభుక్తంషండత్వనాశనమ్॥ ❋

తా॥ నువ్వులు-పల్లేరు-వీటిచూర్ణములను మేకపాలలోవైచికాచి చల్లారిన పిమ్మట తేనెవైచి సేవించినయడల షండత్వమునశించును.

## కుప్రయోగజనితషండత్వనాశనము.

శ్లో॥ సమతిలగోక్షురచూర్ణంఛాగీక్షీరేణసాధితంసమధు। భుక్తంత్య
పయతిషాండ్యంయజ్జనితంకుప్రయోగేణ॥ ❋

తా॥ తెల్లనువ్వులు-పల్లేరుకాయలు-వీటినిచూర్ణముగావించి అందుమేకపాలు తేనెవైచి బాగుగకలియబెట్టిభక్షించిన కుప్రయోగముచేజనించిన నపుంసకత్వము తొలగి మిక్కిలి వీర్యవృద్ధియగు.

## మేఢ్రభంగమునకుచికిత్స.

శ్లో॥ క్షౌద్రేణచసమంఘృష్టంపుండరీకస్యకేసరమ్ । ధ్వస్తంకుర్యా
త్తతోమేఢ్రంరత్యన్యత్రాప్యసంశయః॥ ❋

తా॥ తామరకింజల్కములను తేనెతోనూరి లింగమునకులేపముజేసికొనిన యడల, రతికాలముదప్ప మఱియొకకాలమునందు లేపనముగలుగనేరదు.

## షండత్వకరణము.

శ్లో॥ అనూరాధా సునక్షత్రేలాంగలీ మూలికాధృవమ్ । నిఖాతా
మైథునస్థానేపుంస్త్వ ఖండత్వకారిణీ ॥ నిశాపట్టిందుచూర్ణేన
భావితేనాజవారిణా । పానాశనప్రయుక్తేనషండత్వంజాయ
తేనృణామ్॥ ❋

తా॥ నేలతాడి వేరును, అనూరాధనక్షత్రమునందు తీసుకొనివచ్చి మైథున ప్రదేశమునందు పాతిపెట్టిన పుంస్త్వమునుభోగొట్టును. మఱియుపసపు - నల్లతుమికి వీటిచూర్ణములను మేకమూత్రములో భావనజేసి నీటిలోగాని, అన్నములోగాని కలిపి లోపలికియిచ్చిన యడల షండత్వముకలుగును.

మేఢ్రస్థూలీకరణము.

శ్లో॥ వరాహవసయాలింగంమధునాసహలేపయేత్ । స్థూలంద్రుఢం
చదీర్ఘంచపుంసోలింగంప్రజాయతే॥ ❋

తా॥ పందిక్రొవ్వును తేనెతోచేర్చి లింగమునకు లేపముజేసినయడల, మేఢ్రములావుగను, దృఢముగను పొడుగుగనునగు.

మేఢ్రదృఢీకరణము.

శ్లో॥ భల్లాతకబృహతీఫలదాడిమఫలకల్కసాధితంకురుతే । లింగం
మర్దనవిధినాకటుతైలంవాజిలింగాభమ్॥ ❋

తా॥ శుద్ధిజేసినజీడిగింజలు . వాకుడుపండ్లు - దాడింబపండ్లు - వీటిరసములనుకల్కముజేసి సేవించుటయగాక, ఆవనూనెను శిశ్నమునకులేపముజేసికొని సురతంబొనర్చిన, శిశ్నము అశ్వమేహనమువలె బలిమిగనుండుటయగాక శైతస్థలనము సగాగాకయుండు.

అన్యచ్చ.

శ్లో॥ కనకరసమసృణవర్తితహయగంధామూలవిశ్వపన్యుషితమ్ ।
మాహిషమివనవనీతంగతబీజేకనకఫలమధ్యే ॥ గోమయాగా
థోద్వర్తితంపూర్వంపశ్చాదనేనసంలిప్తమ్ । భవతిహయలిం
గసదృశంలింగంకఠినాంగనాదయితమ్॥ ❋

తా॥ పెన్నేరుగడ్డను నల్లయుమ్మెత్తాకురసముచే బాగుగనూరి అందుబర్రెవెన్నకలిపి శుద్ధచేసి నల్లయుమ్మెత్తకాయబొంగులలోనునిచి ఆవుపేడపొదిగి, లఘుపుటమువేసి, దానిని స్వాంగశీతలమునదీసి నల్లయుమ్మెత్తకాయలరసముచేఖల్వమున మర్దించి శిశ్నమునకు లేపముజేసికొనిన నశ్వమేఢ్రమువలె బలిమిగనుండుటచేమదించిన స్త్రీలతోరమించిన, నాయువతులకు హితంబుగనుండు.

అన్యచ్చ.

శ్లో॥ అశ్వగంధావరీకుష్ఠమాంసీసింహీఫలాన్వితమ్ । చతుర్గుణేన
    దుగ్ధేనతిలతైలంవిపాచయేత్ ॥ స్తనలింగకర్ణపాలివర్ధనం(మ
    క్షణాదిదమ్॥ *

తా॥ పెన్నేరుగడ్డ - చల్లపిల్లిగడ్డ - కోష్ఠు - జటామాంసి - పెద్దములక పండ్లు - వీటిని సమభాగములుగదంచి యొకభాండమునందునిచి, దీనికి నాలుగింతలు ఆవుపాలువైచి, వీటికన్నిటికి సమముగ నువ్వులనూనెబోసి సూక్ష్మాగ్నిచే తైలపక్వముగవండిదించుకొని శిశ్నము, స్తనములు, వీటికి, లేపముజేసిన నవి మిగుల కఠినంబులగు. (ఇదిఅశ్వగంధతైలము.)

శ్లో॥ మూలేన హయగంధాయా మాహిషీసలమర్దితే పూర్వమథ
    లిప్తమ్।భవతిలఘుకృతరాసభలింగంధు)వంపుంసామ్॥ *

తా॥ పెన్నేరుగడ్డను, గంధముతీసి బఱ్ఱెమూత్రమునకలిపి మేహనమునకు లేపనముజేసికొనిన గార్ధభశిశ్నమువలె బలిమిగనుండు.

శ్లో॥ నీలోత్పలసితపంకజకేసరమధుశర్కరావలిప్తేన । సురతేసుచి
    రంరమతేదృఢలింగోభవతినాభివివరేణ॥ *

తా॥ నల్లకలువగడ్డలు - తెల్లతామరకుసుమములు - వీటిని సమభాగములుగచూర్ణముజేసి యందు తగుమాత్రము చక్కెర, తేనె,కలిపి మర్దించి లింగమునకు లేపముజేసికొని సురతంబొనర్చిన నత్యంతసుఖముగనుండుటయగాక మేఢ్రము దృఢంబుగనుండు.

స్త్రీ అనుకూల్యత.

శ్లో॥ మధుసైంధవసంయుక్తం పారావతమలాన్వితం । ఏతల్లిప్తేన్ద్రి
    యోరామాంచాసీవతురారు తేరతా॥ *

తా॥ తేనె - సైంధవలవణము - పావురపుపిట్టమలము- వీటినినూరిలింగమునకులేపముజేసుకొని సురతంబొనర్చిన స్త్రీని దాసినిగాజేయును. (లేపము జేసుకొను నెడల ప్రక్షాళనమునుగావించిసురతంబొనర్చవలయును.)

అన్యచ్చ.

శ్లో॥ కపీంద్రియంశశీసూతంకుంకుమంకనకంమధు । ఏతల్లిప్తేన్ద్రియో రామాందాసీవతుర్తరు తేరతే॥ ❋

తా॥ దురదగొండివిత్తులు - పచ్చకర్పూరము - పాదరసము - కుంకుమపువ్వు ఉమ్మెత్తవిత్తులు - తేనె - వీటినన్నిటినినూరి లింగలేపముజేసి సురతంబొనర్చిన స్త్రీని దాసీనిగా జేసును.

అన్యచ్చ.

శ్లో॥ గోరేకోన్నతశృంగత్వగ్భవచూర్ణేనధూపితంవస్త్రమ్ । పరిధాయభజలలనాం నైకాంఙ్జేభవతిహన్తా క్తః॥ ❋

తా॥ మిక్కిలిపొడవుగలఆవుకొమ్ముల పై పైరదనుచూర్ణముజేసి యగ్నియం దువైచి యొకవస్త్రంబునకుధూపమువేసి యావస్త్రంబును ధరించి తనకిష్టంబైనస్త్రీతో సంగంమంబొనర్చిన నా కన్యాలలామ తనకనుకూల్యముగనుండు.

అన్యచ్చ.

శ్లో॥ చందనంతగరంకుష్ఠంప్రియంగుంనాగకేసరం। కృష్ణాంఖింతిడికం చైవసమభాగానికారయేత్ ॥ దాపయేచ్చైవసప్తాహమాత్మ పంచమలేనతు । ఖానేపానేప్రదాతవ్యం స్త్రీయంవాపురుషం తథా । యావజ్జీవేత్సదాసీఆత్మనాచధనేనచ ॥ ఓంనమోభగవతే ఉమామాహేశ్వరాయ ఓంనమోమోహినీయేమిలిమిలి శ్రీభగేస్వాహా॥ ❋

(అనేన సప్తాభిమంత్రితంకృత్వానిర్యోజయేత్ వశీకరణంభవతి॥)

తా॥ చందనము - తగరము - చంగల్వకోష్టు - ప్రేంఖణము - నాగకేసరములు - పిప్పళ్లు - చింతగింజలు - వీటిని సమభాగములుగ గ్రహించి, పురుషుని యొక్కగాని స్త్రీయొక్కగాని పంచమలములతోటిమర్దించి,అన్నమునందుగాని,నీళ్లలో కలిపిగాని యిచ్చినయెడల తానుజీవించియుండువరకుతనచేతను, ధనముచేతను దాసీగానుండును. ఈ ఔషధమును ,,ఓన్నమోభగవతే,, అనుమంత్రముతో ౭పర్యాయములు మంత్రించి యిచ్చినయడల అనుకూల్యముగనుండును.

అన్యచ్చ.

శ్లో॥ శంఖపుష్పీమధుపుష్పీతథాకుంచికపత్రికా । శ్వేతగిరిసమాయు
క్తాసమభాగానికారయేత్ ॥ సప్తాహందాపయేద్యుక్తా ఆత్మ
పంచమలేనతు । ఖానేపానే ప్రదాతవ్యం వశీకరణముత్తమం॥
(పూర్వోక్తమంత్రేణసప్తాభిమంత్రితంకృత్వాదాపయేత్॥)

తా॥ తెల్లదింటెన - ఇప్పపూలు - క్రాలుగచ్చఆకు - తెల్లకూతురుబుడమ-
వీటినన్నిటిని గ్రహించి (౭) దినములవరకు పంచమలముతోచేర్చి నూరి పూర్వో
క్తమంత్రముతో యేడుమార్లు మంత్రించి భోజనము పానము వీటియందు యిచ్చిన
అనుకూల్యముగనుండును.



స్త్రీకర్షణము.

శ్లో॥ చూర్ణితేమధుసంయుక్తేమహారిష్టఫలచ్ఛదైః । లింగలేపేనసు
రతేద్రావోభవతియోషితామ్॥ *

తా॥ పెద్దవేపపండ్లతోలును తేనెతోమర్దించి లింగమునకు లేపనముజేసుకొ
ని రమించినస్త్రీ ద్రావణమగును.

స్త్రీద్రావణము.

శ్లో॥ ఏకఏవమహాద్రావీమాలతీసంభవోరసః । కింపునర్యదియుజ్యేత
మధుకర్పూరపారదైః॥

తా॥ కాచాకురసమును స్త్రీకియిచ్చి తానురమించినయెడల స్త్రీకియోనిద్ర
వించును. ఆకాచాకురసమునందుతేనె, కర్పూరము, పాదరసము, వీటినిజేర్చి సేవిం
పజేసిన తక్షణమే యోనిద్రవించుటకు సందేహములేదు.

అన్యచ్చ.

శ్లో॥ ఆర్ద్రికంగంధకంచైవరాజికంచాథటంకణం। సంపేష్య సమమా
త్రాణిక్షేపయేన్నింబుజేజలే ॥ స్థాపయేద్ఘటికాస్త్రీ స్రోహస్తే
వైధారయేత్తతః । యావన్త్యోలలనాః పంచఆఘ్రాయస్త్రీద్ర
వంతివై॥ *

తా॥ అల్లము - గంధకము - నల్లఆవాలు - వెలిగారము - వీటిని నేకముగ నూరి మాత్రలుజేసి, వేపరసమునందు మూడుఘడియలు భావనజేసి దానిని చేతిలో ధరించినయడల, యెంతమంచి స్త్రీలు ఆవాసనను ఆఘ్రాణింతురో అందరున్ను ద్రవింతురు.

భగసంకోచము.

శ్లో॥ ప్రక్షాళనేభగేనిత్యంకృతేచామలవల్కలైః । వృద్ధాపికామినీ కామంబాలేవకురుతేరతిమ్॥ *

తా॥ ఉసిరికపట్టరసముతో యోనినికడిగినయడల వృద్ధస్త్రీయైనను, కామముగలిగి ౧౬సంవత్సరముల స్త్రీతో సమానముగా సంభోగమును జేయును.

వీర్యరోధినీగుటిక.

శ్లో॥ నాగవల్లీదళద్రావైఃసప్తాహంశుద్ధసూతకం । మర్దయేత్తాళయేదమ్లైశ్చతుర్నిష్కప్రమాణకం । విషకందగతంకృత్వావిషేణైవ నిరోధయేత్॥తతశ్శ్యాకరమాంసస్యగర్భేకృత్వాథసించయేత్। సంధ్యాకాలేబలిందత్వాకుకుటీవానరీయుతం॥ తతశ్చుల్యాం లోహపాత్రేతైలేధత్తూరసంయుతే । క్షిప్త్వాత్రింశత్పలే పాచ్యంతద్రసంమాంసపిండగం। సంధ్యామారభ్యమందాగ్నాయావత్సూర్యోదయంపచేత్ । హటాజ్జాగరణంకుర్యాదన్యథా తన్నసిద్ధిభాక్ ॥ ప్రాతరుద్ధృత్యగుటికాంక్షీరభాండేవినిక్షిపేత్। తక్షీరంశుష్యతిక్షిప్రమేతత్ప్రత్యయకారకం॥ రతికాలేముఖేదార్యాగుటికావీర్యరోధినీ । క్షీరంపీత్వారమేద్రామాం కామాంకులకులాన్వితాం॥స్వముఖాద్ధారయేద్యేతదావీర్యంవిముంచతి॥

తా॥ తమలపాకులరసముతో శుద్ధమైన పాదరసము నేడుదినములు మర్దించి అందు (౪) నిష్కములపాదరసమును గ్రహించి దానిని చింతాకురసముచేతకడిగి దానిని విషకందమునందునిచి విషముచేతనే నిరోధించి దానిని పందిమాంసములో పొదిగి దానికి సంధ్యాకాలమునందు కోడి, కల్లు వీటిని బలినొసంగిలోహపాత్రమునందు రెండుసేర్లనూనె, ఉమ్మెత్తరసము, వీటినిపోసి అందామాంసపుముద్దనునిచి సాయంకాలము మొదలుకొని సూర్యోదయమువరకు మందాగ్నియందు ఆనూనె,

రసముయిగురునంతవరకుకాచి తెల్లవారువరకు జాగరణముచేయవలయును. అట్లు జాగరణముచేయనియెడల ఔషధము సిద్ధించనేరదు. ప్రాతఃకాలమునందు దానిని యెత్తి, ఆమాంసపుముద్దలోని రసగుటికను పాలకుండలో వుంచగా ఆపాలు యిగిరినయెడల ఔషధముచక్కగాసిద్ధించినదని యెంచి, రతికాలమునందు ఆగుటికను నోటిలోవుంచుకొని పాలుత్రాగి రమించగా వీర్యస్ఖలనముకాకస్థంభించియుండును. అట్టిసమయములో ఆగుటికను నోటిలోనుంచి బైటికితీసి హస్తమునందుంచుకొని రమించగా వీర్యస్ఖలనమగును.

## వీర్యస్తంభనమునకుఆకారకరభాదిచూర్ణము.

శ్లో॥ ఆకారకరభశ్శుంఠీకంకోలం కుంకుమంకణా । జాతీఫలంలవం
గంచచందనంచేతికార్షి కాః। చూర్ణానిమాం స్తతఃకుర్యాదహి
ఫేనంపలోన్మితం । సర్వమేకీకృతం చూర్ణంమాషైకంమధునా
లిహేత్ । శుక్ర స్తంభకరంచూర్ణంపుంసామానందకారకమ్।
నారీణాంప్రీతిజననంసేవేతనిశికాముకః॥ ❋

తా॥ అక్కలకర్ర - శొంఠి - కంకోలము - కుంకుమపువ్వు - పిప్పళ్లు - జాజికాయ - లవంగములు - శ్రీగంధము - యివి దినుసుకొక్కక్కకర్షము, నల్లమందు (౧) పలము - ఇటుల వీటినెల్లజక్కగచూర్ణముజేసి మాషప్రమాణము రాత్రియందు తేనెతోపుచ్చుకొనిన ధాతుస్తంభనమై పురుషులకానందంబును, స్త్రీలకతి ప్రీతియును గలుగు.

## వీర్యస్తంభనమునకు చికిత్స.

శ్లో॥ సిద్ధంకుసుంభతైలంభూమిలతాచూర్ణమిశ్రితంకురుతే । చరణా
భ్యాంగేనరతేర్బీజస్తంభాద్దృఢంలింగమ్॥ ❋

తా॥ భూమిలతను చూర్ణముగావించి కుసుంభతైలమునవైచి దానిని పాదములకురుద్దుకొని రతికేళిందేలినవీర్యము స్తంభించియుండుటయేగాక శిశ్నంబు దృఢంబుగనుండు.

అన్యచ్చ.

శ్లో॥ కర్పూరంటంకణంసూతంతుల్యంమునిరసంమధు । మర్దయిత్వా లిప్తేల్లింగంస్థిత్వాయామంత్రైవచ । తతఃప్రక్షాళయల్లింగం రమేద్రామాంయథోచితామ్॥ వీర్యస్తంభనకరం పుంసాంస మ్యక్ నాగార్జునోదితమ్॥ ❋

తా॥ కర్పూరము - వెలిగారము - పాదరసము - వీటిని సమభాగములుగ గ్రహించి అగసిఆకురసము, తేనె, వీటితో ప్రత్యేక ప్రత్యేకముగ మర్దించి దానిని లింగమునకు లేపముజేసికొని మూడు యామము (౩ ఘంటలు) వుంచుకొని పిమ్మట కడిగికొని స్త్రీలతో సంభోగము చేసినయడల వీర్యస్తంభనమగును. (ఇది నాగార్జునిచే జెప్పంబడినది.)

అన్యచ్చ.

శ్లో॥ కృకలాసస్యపుచ్ఛాగ్రముద్రికాప్రోతతంతుభిః। వేష్ట్యాకనిష్ఠికా ధార్యానరోవీర్యంనముంచతి॥ ❋

తా॥ తొండతోకయొక్క కొనను గ్రహించి దానిని తునకలుచేసి దారములో గుచ్చి చిటికినవేలికి ఉంగరమునుంచుకొని స్త్రీసంగమంబొనర్చిన వీర్యస్తంభనమగును.

అన్యచ్చ.

శ్లో॥ మధునాపద్మబీజానిపిష్ట్వానాభింప్రలేపయేత్ । యావత్తిష్ఠత్యసౌలేపస్తావద్వీర్యంనముంచతి॥ ❋

తా॥ తామరవిత్తులను తేనెతో నూరి బొడ్డునకు లేపముజేసికొని స్త్రీలరమించగా, ఆలేపముండువరకు వీర్యస్తంభనముగలుగు.

అన్యచ్చ.

శ్లో॥ చటకాండంతుసంగ్రాహ్యనవనీతేనపేషయేత్ । తేనప్రలేపయే త్పాదౌశుక్రస్తంభఃప్రజాయతే ॥ యావన్నస్పృశతేభూమిం తావద్వీర్యంనముంచతి॥ ❋

తా॥ పిచ్చికగుడ్డును వెన్నతోమర్దించి అరికాళ్లకు పూసుకొని సురతంబొనర్చగా, తనపాదములు భూమికితగలకుండువఱకు వీర్యస్తంభనమగును.

అన్యచ్చ.

శ్లో॥ సప్తాహంఛాగభవసలిలసంస్థంకరభవారుణీమూలమ్ । గా
ఢోద్వర్తనవిధినాలింగస్తంభంకురుతే॥ *

తా॥ దుష్టుపువేరు - చాగవేరు - వీటినిఏడుదినములు మేకమూత్రములో నానబెట్టి గంధముతీసి మేహనమునకు దట్టముగ లేపముజేసికొని సురతంబొనర్చిన వీర్యస్తంభనమగును.

అన్యచ్చ.

శ్లో॥ వనక్రోడస్యదంష్ట్రాగ్రందక్షిణంచసమాహరేత్ । కట్యాముపరి
యదాబధ్వాశుక్రస్తంభఃప్రజాయతే॥ *

తా॥ అడవిపందియొక్క కుడివైపుకోరను పెరికితెచ్చి కటిప్రదేశమునకు (నడుము) కట్టుకొనిరమించగా వీర్యస్తంభనమగును.

అన్యచ్చ.

శ్లో॥ దుండుభోనామతఃసర్పఃకృష్ణవర్ణస్తమాహరేత్। తస్యాస్థిధా
రయేత్కట్యాంనరోవీర్యంనముంచతి ॥ విముంచతివిముక్తేన
సిద్ధియోగఉదాహృతః॥ *

తా॥ దుండుభమనుసర్పముయొక్క వీపుయెముకను నడుమునకుకట్టుకొని సురతంబొనర్చగా వీర్యము స్తంభించియుండును. ఆయెముకను నడుమునుంచి తీయగా వీర్యస్ఖలనమగును.

అన్యచ్చ.

శ్లో॥ రక్తాపామార్గమూలంతుసోమవారాభిమంత్రితమ్। భౌమేప్రా
తస్సముద్ధృత్యకట్యాంబధ్వానవీర్యముక్॥ *

తా॥ ఎఱ్ఱమోదుగచెట్టువేరును సోమవారమునాడు పూజజేసి మంగళవారముదయమున తెచ్చి నడుమునకు కట్టుకొని రమించగా వీర్యస్తంభనమగును.

అన్యచ్చ.

శ్లో॥ కట్ఫలశుంఠీక్వాథః షోడశశేషోనగుడేనసిశిపీతః । కురుతేరతౌ
నపుంసోరేతఃపతనంవినాశ్లేన॥ ❋

తా॥ కట్ఫలము (కాయఫలము) శొంఠి, వీటిని కషాయముపెట్టి పదహారవ భాగముగదించుకొని అందుబెల్లమువైచి రాత్రిపానముజేసి సంభోగముచేసినయెడల రేతస్స్ఖలనముగాక స్తంభించియుండును. దీనిని సేవించునపుడు పులుసునువర్జించవలయును.

అన్యచ్చ.

శ్లో॥ సూరణంతులసీమూలంతాంబూలేనసహభక్షయేత్ । నముంచతినరోవీర్యమేకైకేననసంశయః॥ ❋

తా॥ కందదుంప - తులసివేరు - వీటినితాంబూలముతోభక్షించి సంభోగముచేయగా వీర్యస్తంభనమగును.

లోమశాతనము.

శ్లో॥ హరితాళచూర్ణకలికాలేపాత్తైవవారిణాసద్యః । నిపితంతి
కేశనిచయాఃకౌతుకమిదమద్భుతంకురుతే॥ ❋

తా॥ హరిదళము - సున్నము - వీటినిసున్నపునీళ్లతోనూరి పూసుకొనిరుద్ధగా వెండ్రుకలురాలిపోవును.

అన్యచ్చ.

శ్లో॥ పలాశచించాతిలమాషశంఖందహేదపామార్గసపిప్పలోపి। మ
నశ్శిలాతాళకచూర్ణలేపాత్కరోతినిర్లోమశిరఃక్షణేన॥ ❋

తా॥ మోదుగువిత్తులు - చింతగింజలు - మినుములు - శంఖము - ఉత్తరేణివిత్తులు - పిప్పళ్లు - మనుశిల - హరిదళము - సున్నము - వీటినన్నిటినినూరి లేపముజేసికొన్నయెడల వెండ్రుకలైనను రాలిపోవును.

## స్తనములుగట్టిపడుటకుచికిత్స.

శ్లో॥ సపద్మబీజంసితయాభక్షితంపయసావారిణా । దృఢం స్త్రీణాం స్తనద్వంద్వంమాసేనకురుతేభృశమ్॥ *

తా॥ తామరవిత్తులను పాలతోనూరి చక్కెరచేర్చి నాకమాసముపుచ్చుకొనిన స్తనములు దృఢపడును.

### అన్యచ్చ.

శ్లో॥ ముండీచూర్ణకషాయేణయుతంతైలంవిపాచితమ్। పతితంయావ్వసంయస్యాస్తస్యాస్తనోన్నతిర్భవేత్॥

తా॥ బోడతరచూర్ణకషాయమునందు మంచినూనెపోసి తైలపక్వముగకాచి దించుకొని ఆతైలమును స్తనములకుపట్టించిన నవికొత్తయౌవ్వన స్త్రీ స్తనములవలె దృఢముగానుండును.

ఈ గ్రంథముయొక్క రెండవకూర్పునందు యింకా
విశేషచికిత్సలనుజేర్పఁబడి
ముద్రింపబడును.





శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

వైద్యశాస్త్రాపేక్షితులకు మిగుల నుపయుక్తంబగు

# నాడీజ్ఞానము.

ఆంధ్రతాత్పర్యసహితము

ఇది,

నివృత్తి - వీరాస్వామిశాస్త్రులవారు

కో - వేంకటకృష్ణశాస్త్రులవారు

వీరిరువురిచే లేఖక ప్రమాదజనితదోషంబులు లేకుండునట్లు

పరిష్కరింపబడి

మైసరు

పువ్వాడ - వెంకటరావుచే

హిందూరత్నాకరముద్రాక్షరశాల

యందు

(ఆఱవతూరి)

ముద్రింపించి ప్రచురింపంబడియె.

1910.

MADRAS

# ప్రకటన.

ఇందు గ్రిందు పొందు పరుపబడిన శీర్షికచే నెల్ల సుజనులయుల్లంబుల పల్లవింపజేయు సందేశం బేదియనిన :—

ఆర్యులారా! ఇదివఱకు మదీయజనక జనకుండైన పువ్వాడ- రామచంద్రరావు పంతులుగారిచే భైషజ్యరత్నాంతర్గత ఘృతతరంగము ముద్రాక్షరాంకితము జేయబడియుండుట యందఱకు హృద్యమేకదా? ఇప్పుడు సుమారు **500** విధములైన గొప్పతైలములు, పెక్కు ఆయుర్వేద గ్రంథంబులనుండి సంగ్రహింపంబడి ముద్రాక్షరాంకితమునకు సిద్ధముగనున్నయది. ఈగ్రంథరాజంబునకు ప్రతి ౧-కి రూ. ౩-౦-౦ విలువ విధింపబడి యున్నయది. **1910** సం॥ ఆగస్టునెలలో పూర్తియగును. ఇంతకులోపుగా సదరు గ్రంథమునకు దరఖాస్తులు పంపువారికి తపాలఖర్చులు లేకనే గ్రంథములను వీ - పీగా పంపబడును. తతిమ్మా లేహ్యతరంగాదులు వొకటొకటిగా పూర్తిఅయినతోడనే ముద్రింపబడును. వలయువారు చెన్నపట్టణం పెద్దినాయునిపేట కొండలయ్యావీధి **28** నెంబరు యింట్లోయుండే సదరు పువ్వాడ - రామచంద్రరావుగారి పేరటికి దరఖాస్తులు పంపవలయును.

ఇట్లు,

**1910** సంవత్సరము.
ఏప్రపల్ నెల **10** వ తేది.

పువ్వాడ- వెంకటరావు.
(మైనరు.)



శ్రీ ర స్తు.

# నా డీ జ్ఞా న వి ష య సూ చి క.

(పుటసంఖ్య.)

(పుటసంఖ్య.)

(పుటసంఖ్య.)



విషయసూచిక ముగిసెను.





శ్రీ ర స్తు.

శ్రీ మ ద్ధ న్వం త ర యే న మః.

యామళాద్యనేకతంత్రములయందుగల

# నా డీ జ్ఞా న ము.

శ్లో॥ యేవైయావద్వికారాః ప్రకృతివికృతయోయాశ్చ తేషాంజ నిత్రీయే దేవాశ్చతుస్రాదేరథసకలమిదంయత్స్వమూర్తైర్విసృష్టం। యత్సం శోభా త్రిమూర్తిః ప్రథితమిహయతఃపాలనాదిస్వసిద్ధా। సామూలా ఖ్యాజనేభ్యోవితరతుసుసుఖంముక్తమేనశ్చభూయాత్॥

వాక్యం ॥ ఆద్యంతావన్నాడికావిజ్ఞానాదేవవాతప్రభృతిజనితా నామామయానాం సాధ్యాసాధ్యసభేదకజ్ఞానం ప్రాప్యతేఅతఏవతన్ని రూప్యతఇతి॥ ॥౧॥

తాత్పర్యము॥ వైద్యుడు ప్రథమంబున వాతపిత్తాదిపై షమ్యములచే జనించెడివ్యాధుల సాధ్యాసాధ్యంబులను, తత్తద్వ్యాధిభేదంబులను, నెఱుంగుటకు నాడీజ్ఞానమేమూలకారణముగనుండు. అట్టినాడీగతి విశేషజ్ఞానముకలిగెనేని రోగస్వరూపంబును దెలిసికొని తగిన చికిత్సజేయందగు. కావున ఆనాడుల స్వరూపంబులను దెలియంజేసెద.

శ్లో॥ కందమధ్యేస్థితానాడీసుషుమ్నేతిప్రకీర్తితా। తిష్ఠంతిపరిత స్సర్వాశ్చక్రేస్మిన్నాడికాస్తతః॥ ॥౨॥

తా॥ శరీరమునందలి మూలాధార మధ్యంబున సుషుమ్నయను నొకనాడి యున్నయది. మఱియు వచింపంబోయెడి ఇళాపింగళాదినాడులీ సుషుమ్నానాడిని చుట్టుకొనియుండు.

శ్లో॥ సార్ధత్రికోట్యోనాడ్యోహిస్థూలా సూక్ష్మాశ్చదేహినామ్ నాభికన్దనిబద్ధాస్తాస్తిర్యగూర్ధ్వమధస్థితాః॥ ॥౩॥

తా॥ మనుజుల దేహంబున స్థూలసూక్ష్మంబులగు మూడుకోట్ల యేబదిలక్షల నాడులున్నయవి. అన్నాడులు మూలాధారంబును నాశ్రయించి కొన్నియూర్ధ్వభాగంబునను కొన్నియధోభాగంబునను, మఱికొన్నితిర్యగ్భాగంబునను, వ్యాపించియున్నయవి.

శ్లో॥ త్రిస్రఃకోట్యోర్ధకోటీచయానిలోమానిమానుషే । నాడీముఖానిసర్వాణిఘర్మబిందుంక్షరంతిచ॥ ॥౪॥

తా॥ మఱియు పైనాడులను నాశ్రయించి మూడుకోట్ల ఏబదిలక్షల రోమంబులున్నయవి. ఆరోమంబులే నాడులకు ముఖంబులనఁబడు,అందుండియే చమటస్రవించు

శ్లో॥ నానానాడీప్రసవగంసర్వభూతాన్తరాత్మని। ఊర్ధ్వమూలమధశ్శాఖంవాయుమార్గేణసర్వగమ్॥ ॥౫॥

తా॥ మనుజుల దేహమందు పైజెప్పినసనాడుల కాధారభూతంబై పరబ్రహ్మస్వరూపమగు నొకసూక్ష్మవాయువుగలదు. అదిప్రాణాదివాయువులద్వారా దేహమంతటను వ్యాపింపుచుండు.

శ్లో॥ ద్విసప్తతిసహస్రాణినాడ్యస్స్యుర్వాయుగోచరాః । కర్మమార్గేణసుషిరాతిర్యంచసుషిరాత్మికా॥ ॥౬॥

తా॥ ఈపైనాడులలో డెబ్బదిరెండువేల నాడులు వాయుసంచార యోగ్యంబులై యుండు. మఱియు ఆనాడులు వాయుమార్గముద్వారా పునరావృత్తిప్రాపకకర్మరూప ఛిద్రవిశిష్టంబులై తిర్యగ్గతరంధ్రప్రధాన భూతంబులుగనుండు.

శ్లో॥ తర్పయంతిరసైర్దేహంనద్యస్తోయైరివార్ణవమ్ । ద్వాసప్తతిసహస్రంతుతాసాంస్థూలాఃప్రకీర్తితాః॥ ॥౭॥

తా॥ నదులు నిజజలంబులచే సాగరంబును సమృద్ధిగావించు చందంబున పైనాడులు దేహిసేవించెడి యన్నపానాదుల రసంబుచే దేహంబును వృద్ధిజేయుచున్నయది. అందువెయ్యిన్ని డెబ్బదిరెండునాడులు స్థూలనాడులుగ నున్నయవి.

శ్లో॥ దేహేంధమనోర్ధన్యాస్తాఃపంచేంద్రియగుణావహాః । నాభికందస్థితాస్తాస్తునాభౌచక్రేప్రవేష్టితాః॥ ॥౮॥

తా॥ పైనాడులలో శబ్దస్పర్శరూపరసగంధాత్మక పంచేంద్రియగుణగ్రాహకంబులగు నాడులేమిగుల శ్రేష్ఠంబులుగనుండు. అయ్యైదునాడులు మూలాధారంబునాశ్రయించి నాభిచక్రంబునం బ్రవేశించి యున్నయవి.

శ్లో॥ తాసాంచసూక్ష్మసుషిరాణిశతానిసప్తస్వచ్ఛానియైరసకృదన్నరసంవహద్భిః । ఆప్యాయతేవపురిదంహినృణామమీషామభ్రస్రవద్భిరివసింధుశతైస్సముద్రమ్॥ ॥౯॥

తా॥ పైజెప్పబడిన స్థూలనాడులను నాశ్రయించి నిర్మలమైన దేబదునూర్లప్రధాన నాడులు సూక్ష్మఛిద్రములతోగూడియుండును. ఇవి ప్రతిదినము మనుజులు భక్షించెడి యన్నపానాదుల రసమును వహించుచు సముద్రమును నానావిధనదులు వృద్ధిబొందించుచందంబున, శరీరమును వృద్ధిజేయుచున్నయవి.

శ్లో॥ ఆపాదతః ప్రభృతిగాత్రమశేషమాసా మామస్తకాదపిచ నాభిపురస్థితేన। ఏతన్మృదంగఇవచర్మచయేనబద్ధంకాయంనృణామిహాసిరాశతసప్తకేన॥ ॥౧౦॥

తా॥ మూలాధారంబును నాశ్రయించి పాదము మొదలు శిరము పర్యంతము వ్యాపించియుండెడి దేబదునూర్ల నాడులచే మనుష్యదేహము, మృదంగము చర్మముచేగట్టంబడియుండుతెఱంగున, బంధింపంబడి యున్నయది.

శ్లో॥ ఇళాచపింగళాచైవసుషుమ్నాచసరస్వతీ। వారుణీచైవపూషాచహస్తిజిహ్వాయశస్వినీ॥ విశ్వోదరీకుహూశ్చైవశంఖినీచపయస్వినీ। అలంబుసాచగాంధారీముఖ్యాశ్చైతాశ్చతుర్దశ॥ ॥౧౧॥

తా॥ పైనాడులలో ఇళాపింగళా, సుషుమ్నా, సరస్వతీ, వారుణి, పూషా, హస్తిజిహ్వా, యశస్విని, విశ్వోదరీ, కుహూ, శంఖిణి, పయస్వినీ, అలంబుసా, గాంధారీ, ఆనునీ, పదునాలుగునాడులు ముఖ్యంబులుగనుండును.

శ్లో॥ ఇళాచపింగళాచైవసుషుమ్నాచసరస్వతీ।గాంధారీహస్తిజిహ్వాచకుహూఃపూషాయశస్వినీ॥ చారణాళంబుసావిశ్వా శంఖినీచపయస్వినీ। ఏతాఃప్రాణవహానాడ్యోజీవకోశేప్రతిష్ఠితాః॥ ॥౧౨॥

తా॥ నామాంతరములుగల పై పదునాలుగునాడులు ప్రాణవాహినులై జీవకోశంబునం బ్రతిష్ఠింపంబడి యున్నయవి.

శ్లో॥ తత్రప్రధానానాడ్యస్తుదశవాయుప్రవాహికాః॥ ॥౧౩॥

తా॥ పై పదునాలుగునాడులలో పదిప్రాణాదివాయువాహినులై యుండుటవలన నవి మిగుల ప్రధానంబులుగనుండును.

శ్లో॥ ఇళాపింగళయోశ్చైవ సుషుమ్నాచోర్ధ్వగామినీ । గాంధారీహస్తిజిహ్వాచప్రసారగమనేస్థితా॥అలంబుసాయశస్విన్యాదక్షిణాంగేసమన్వితే। కుహూంకశంఖినీచైవవామాంగేచావలంబితా॥ ఏతాసుదశనాడీషునానాకార్యప్రసూతికా॥ ॥౧౪॥

తా॥ ఇళా, పింగళా, సుషుమ్నా, యను నిమ్మూడునాడులు శరీరమునందూర్ధ్వగాములై యుండు, గాంధారీ, హస్తి, జిహ్వా, యను నాడులు చేతులు మొదలగునవి జాచుటకును, ముడుచుటకును, నుపయుక్తంబులై యుండు. అలంబుసా, యశస్వినీ, యను రెండునాడులు దక్షిణాంగంబునను, కుహూ, శంఖినీ, యను నాడులు వామాంగంబునను, వ్యాపించియుండు. అప్పదినాడులలో మధ్యమంబుననుండెడి పూష యను ప్రసూతికానాడి సమస్తకార్యంబులను జేయుచుండు.

శ్లో॥ ఇళాచవామనాసాయాందక్షిణేపింగళామతా। సుషుమ్నా బ్రహ్మరంధ్రేచగాంధారీనామచక్షుషి ॥ దక్షిణేహస్తిజిహ్వాచపూషాకర్ణేథదక్షిణే । వామేయశస్వినీజ్ఞేయాముఖేచాలంబుసామతా ॥ కుహూశ్చలింగమూలేస్యాచ్ఛంఖినీశిరసోపరి। ఏవంద్వారంసమాశ్రిత్యతిష్ఠంతిదశనాడికాః॥ ॥౧౫॥

తా॥ వామనాసికయందు ఇళయు, దక్షిణనాసికయందు పింగళయు, బ్రహ్మరంధ్రంబున సుషుమ్నయు, వామనేత్రంబున గాంధారియు, దక్షిణనేత్రంబున హస్తిజహ్వయు, దక్షిణకర్ణంబున పూషయు, వామకర్ణంబున యశస్వినియు, జిహ్వయందలంబుసయు శిశ్నంబున కుహువు, శిరంబున శంఖినియు, వ్యాపించియుండు.

పదినాడులను ఆశ్రయించి యుండెడి

పది వాయువులు.

శ్లో॥ ప్రాణోపానస్సమానశ్చఉదానోవ్యానఏవచ । నాగఃకూర్మశ్చకృకరోదేవదత్తోధనంజయః॥ ఏతేనాడీషుసర్వాసు చరంతిదశవాయవః। ఏతేషునాయవఃపంచముఖ్యాఃప్రాణాదయస్మృతాః ॥ తేషుముఖ్యతమావేతౌప్రాణాపానౌనరోత్తమే । ప్రాణఏవైతయోర్ముఖ్యస్సర్వప్రాణిభృతాంసదా॥ ॥౧౬॥

తా॥ ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, దనంజయము, అను నీపదివాయువులు సర్వనాడులయందును సంచరింపుచుండు. అయిన నిప్పదివాయువులలో ప్రాణాది పంచవాయువులు ముఖ్యంబులుగను, అందు ప్రాణాపానంబులు మిగుల ముఖ్యంబులుగను, వానిలో ప్రాణమత్యంత ముఖ్యంబుగను నుండు.

శ్లో॥ శబ్దగ్రహౌశ్రుతౌనాడీరూపగ్రహౌచలోచనే । గంధగ్రహౌనాసికాయాంరసనాయాంరసావహా ॥ ఏవంత్వక్షుస్పర్శవహాశబ్దకృద్ధృ

దయాన్ముఖే । మనోబుద్ధ్యాదికంసర్వంహృదయేషుప్రతిష్ఠితమ్ ॥ పురీతత్యాంమనస్థిత్యానిద్రాసమధిజాయతే॥ ॥౧౭॥

తా॥ కర్ణంబులయందు వ్యాపించియుండు నాడులు శబ్దగ్రాహకంబులుగను నయనంబులయందుండునవి రూపగ్రాహకంబులుగను నాసికయందుండునవి గంధగ్రాహకములుగను, జిహ్వయందుండునది రసగ్రాహకముగను, చర్మమునందుండునది స్పర్శగ్రాహకముగను, హృదయము, ముఖము, వీటియందుండునవి శబ్దోచ్చారణమునకును, నుపయుక్తముగనుండు. మనస్సు, బుద్ధి, ఇవి హృదయంబున ప్రతిష్ఠింపంబడియుండు. పురీతతియను నాడియందు మనస్సు లీనంబయ్యోనేని నప్పుడు నరునికి నిదురంబట్టు.

వాక్యం ॥ అన్యాసాంనామాన్యపిశారదాయాం॥

తా॥ పైజెప్పబడిన పదునాలుగు నాడీ నామములుగాక నితర నాడులనామంబులు శారదయను గ్రంథమునందు జెప్పబడి యున్నయది.

శ్లో॥ గాంధారీహస్తిజిహ్వాఖ్యాసపూషాలంబుసామతా । యశస్వినీశంఖినీచకుహూస్సప్తనాడయః॥ ॥౧౮॥

వాక్యం॥ తాసాంస్థితిస్స్వరూపంయోగార్ణవే॥

తా॥ గాంధారీ, హస్తిజిహ్వా, పూషా, ఆలంబుసా, యశస్వినీ, శంఖినీ, కుహూయను నామంబులుగల యేడునాడులు స్వరూపంబును, స్థితియు, యోగార్ణవమను గ్రంథంబున జెప్పంబడియున్నయది.

శ్లో॥ ఇళాపృష్ఠేతుగాంధారీమయూరగళసన్నిభా। సవ్యపాదాదినేత్రాంతాగాన్ధారీపరికీర్తితా॥ ॥౧౯॥

తా॥ గాంధారీయనునాడి మయూరకంఠవర్ణముగలదినై ఇళయనునాడికి పృష్ఠము, నాశ్రయించి సవ్యపాదముమొదలు నేత్రాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ హస్తిజిహ్వోత్పలప్రేక్షానాడీకాస్యాఃపురస్థితా । సవ్యభాగస్యమూర్ధాదిపాదాంగుష్ఠాంకమాశ్రితా॥ ॥౨౦॥

తా॥ హస్తిజిహ్వయనునాడి నల్లకలువ వర్ణము గలదినై ఇళయనునాడికి ముందుభాగము నాశ్రయించి సవ్యభాగమున శిరస్సు మొదలు పాదాంగుష్ఠమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ పూషాతుపింగళాపృష్ఠేనీలజీమూతసన్నిభా । యామ్యభాగస్యనేత్రాంతాయావత్పాదతలంగతా॥ ॥౨౧॥

తా॥ పూషయనునాడి నల్లనిమేఘచ్ఛాయగలదినై పింగళయనునాడికి పృష్ఠభా

గమునుండి దక్షిణభాగమున పాదాంగుష్ఠము మొదలుకొని నేత్రాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ అలంబుసారక్తవర్ణానాడీతస్యాఃపురస్థితా । పాదాంగుష్ఠాంతమారభ్య నేత్రాంతందక్షిణేశ్రితా॥ ॥౨౨॥

తా॥ అలంబుసయనునాడిరక్తవర్ణముగలదియై పింగళయనునాడికిముందుభాగమునాశ్రయించుకొని కుడిపాదాంగుష్ఠము మొదలు నేత్రాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ యశస్వినీశంఖవర్ణాపింగళాపూర్వదేశగా । పాదాంగుష్ఠాంతమారభ్యదక్షమూర్ధాంతమాశ్రితా॥ ॥౨౩॥

తా॥ యశస్వినియనునాడి శంఖవర్ణముగలదియై పింగళయనునాడికి పూర్వభాగమునాశ్రయించుకొని దక్షిణభాగమునందు పాదాంగుష్ఠాంతము మొదలు శిరంబువరకు వ్యాపించియుండు.

శ్లో॥ గాంధార్యాశ్చసరస్వత్యామధ్యస్థాశంఖినీమతా । సువర్ణవర్ణాపాదాదికర్ణాంతాసవ్యభాగకే॥ ॥౨౪॥

తా॥ శంఖినియనునాడి స్వర్ణ వర్ణముగలదియై గాంధారీ, సరస్వతీ,యనునాడులకు మధ్యమునాశ్రయించి సవ్యపాదము మొదలు కర్ణాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ కుహూఃప్రోక్తా శ్వేతవర్ణావారుణీపూషమధ్యగా । పాదాంగుష్ఠాదిమూర్ధాంతాయామ్యభాగేకుహూర్మతా॥ ॥౨౫॥

తా॥ కుహువనునాడి శ్వేతవర్ణముగలదియై వారుణీ, పూషా, యనునాడులు మధ్యము నాశ్రయించుకొని యామ్య పాదాంగుష్ఠము మొదలు శిరస్సువరకు వ్యాపించియుండు.

వాక్యం ॥ రావనాసరస్వతీవిశ్వోదరీశంఖినీఏతాఅపిప్రధానత్వేనోక్తాః। ఉక్తంచ॥ ॥౨౬॥

తా॥ రావనా, సరస్వతీ, విశ్వోదరీ, శంఖినీ, యను నాడులును ప్రధానంబులుగ జెప్పంబడియున్నయవి.

శ్లో॥ ముక్తిమార్గేసుషుమ్నాసాబ్రహ్మరంధ్రేతికీర్తితా । అవ్యక్తాసాచవిజ్ఞేయాసుషుమ్నావైష్ణవీస్థితా॥ ॥౨౭॥

తా॥ సుషుమ్నయనునాడి ముక్తిమార్గమునందుండుటచే బ్రహ్మరంధ్రంబని చెప్పంబడు. అన్నాడి విష్ణుదేవతాకమై అవ్యక్తముగనుండు.

శ్లో॥ తాసాంతిస్రః ప్రధానాస్తుతిసృష్వేకోత్తమామతా। ఇళా చపింగళాచైవసుషుమ్నాచతృతీయకా॥ ॥౨౮॥

తా॥ పైజెప్పంబడిన పదినాడులలో ఇళా, పింగళా, సుషుమ్నా, యనునూడునాడులును ప్రధానంబులుగ నున్నయవి. వాటిలో సుషుమ్నయనునాడి నుత్తమోత్తమముగనుండు.

శ్లో॥ తత్రైకావామతోయాతిద్వితీయాదక్షిణేతథా। మధ్యేవాయుపథంవిద్యాత్త్రిభిస్తుల్యంగతాగతమ్॥ ॥౨౯॥

తా॥ ఇళయనునాడి యెడమపార్శ్వమునందును, పింగళయనునాడి కుడిపార్శ్వమునందును, సుషుమ్నయనునాడి యీనాడులకు మధ్యంబునను, నుండుటయగాక నిమ్మూడునాడులయందును తుల్యముగ సంచరించెడి వాయుమార్గము గలిగియుండు.

ఇళాపింగళానాడీ స్వరూపము.

శ్లో॥ ఇళాచశంఖచంద్రాభాతస్యావామేవ్యవస్థితా। పింగళాసితరక్తాభాదక్షిణంపార్శ్వమాశ్రితా॥ ॥౩౦॥

తా॥ పింగళయనునాడి శంఖమువలెను, చంద్రునివలెను, ప్రకాశించుచు సుషుమ్నయనునాడికి వామభాగమునందుండు. పింగళయనునాడి నలుపు యెరుపుగల మిశ్రవర్ణముగలదియై ప్రకాశించుచు సుషుమ్నానాడికి దక్షిణభాగమునాశ్రయించియుండు.

శ్లో॥ చంద్రసూర్యోగ్నిమరుచ్చైవత్రయస్తిసృష్వవస్థితాః। తథా రజస్తమస్సత్వంరాత్ర్యహఃకాలఏవచ॥ ॥౩౧॥

తా॥ ఇళయనునాడి చంద్రదేవతాకమై రజోగుణప్రధానమైయుండుటయగాక రాత్రిరూప ఖండకాలయుక్తముగనుండు. పింగళయనునాడి సూర్యదేవతాకమై తమోగుణప్రధానమైయుండుటయగాక అహః కాలస్వరూప ఖండకాలయుక్తముగనుండు సుషుమ్నయనునాడి వాయుదేవతాకమై సత్వగుణప్రధానమైయుండుటయగాక అఖండకాలయుక్తమైయుండు.

శ్లో॥ ఇళాదోషమయాప్రోక్తాపింగళావహ్నిరూపిణీ। వాయ్వాగ్నేయాసుషుమ్నాచబ్రహ్మద్వారపథానుగా॥ ॥౩౨॥

తా॥ దోషరూపమగు ఇళయనునాడియు, తేజోరూపమగు పింగళయనునాడియు వాయ్వగ్నిరూపమగు సుషుమ్నయనునాడియు, బ్రహ్మద్వారము నాశ్రయించుకొనియుండు.

శ్లో॥ పద్మకోశప్రతీకాశంసుషిరైశ్చవిభూషితమ్। హృదయంతద్విజానీయాద్విశ్వస్యాయతనంహితత్॥ ॥౩౩॥

తా॥ తామరమొగ్గవలె అగ్రమునందు రంధ్రములుగలిగి (అధోముఖంబయి నాభికూర్ధ్వంబుగనుండెడి) హృత్పుండరీకము బ్రహ్మకు నివాసస్థానంబుగ నున్నయది.

శ్లో॥ దక్షిణాపింగళానాడీవహ్నిమండలగోచరా । దేవయానమితిజ్ఞేయాపుణ్యకర్మానుసారిణీ॥ ॥౩౪॥

తా॥ యజ్ఞాది పుణ్యకర్మములు జేసినవారిని, పింగళయనునాడి మూలాధారమునుండివెడలి హృత్పుండరీక దక్షిణభాగముగ శిరంబుననుండెడి సహస్రారమను చక్రము నాధారపఱచుకొని వహ్నిమండలమువరకు వ్యాపించి అర్చిరాది మార్గముగ దేవలోకము జెందునటులం జేయు.

శ్లో॥ ఇళాచవామనిశ్వాసాసోమమండలగోచరా। పితృయానమితిజ్ఞేయావామమాశ్రిత్యతిష్ఠతి॥ ॥౩౫॥

తా॥ పితృలోకప్రాప్తి హేతుభూతమగు సత్కర్మములు జేసినవారిని ఇళయనునాడి మూలాధారమునుండివెడలి హృత్పుండరీక వామభాగముగ శిరంబుననుండెడి సహస్రారచక్రము నాధారపరచుకొని చంద్రమండలమువరకువ్యాపించి ధూమాదిమార్గముగ పితృలోకమును జెందునటులంజేయు. ఈ ఇళాపింగళయనునాడులే ఉచ్ఛ్వాస నిశ్వాసముల కాధారభూతంబులై యున్నయవి.

శ్లో॥ గుదస్యపృష్ఠభాగేస్మిన్ వీణాదండస్యదేహభృత్ । దీర్ఘాస్థిమూర్ధపర్యంతంబ్రహ్మదండేతికథ్యతే॥ ॥౩౬॥

తా॥ గుదస్థానము మొదలు శిరస్సువరకువ్యాపించి, వీణాదండాకారంబుగనుండెడియస్థి బ్రహ్మలోకప్రాప్తికి హేతుభూతమగు సుషుమ్నానాడి కాధారమగుటచే బ్రహ్మదండమనంబడు.

శ్లో॥ తస్యాంతేసుషిరంసూక్ష్మంబ్రహ్మనాడీతిసూరిభిః । ఇళాపింగళయోర్మధ్యేసుషుమ్నాసూక్ష్మరూపిణీ॥ ॥౩౭॥

తా॥ బ్రహ్మలోకప్రాప్తి హేతుభూతమగు దహరాద్యుపాసన జేసినవారికి, సూక్ష్మరూపియగు సుషుమ్నానాడి మూలాధారమునుండి ఇళా, పింగళ, మధ్యమునందువెడలి సూక్ష్మరూపమై, వీణాదండాకారంబుగనుండెడి, వీపుయెముకద్వారమునందుజొచ్చి సహస్రారచక్రమను బ్రహ్మరంధ్రమూలముగ సూర్యమండలమువరకు వ్యాపించి బ్రహ్మలోకమును గలుగంజేయు.

శ్లో॥ సర్వంప్రతిష్ఠితంయస్మిన్సర్వగంసర్వతోముఖమ్।తస్యామధ్యగతాస్సూర్యసోమాగ్నిపరమేశ్వరాః॥ భూతాలోకాదిశః క్షేత్రంసము

ద్రాః పర్వతాశ్శిలాః । ద్వీపాశ్చ నిమ్నగా వేదశ్శాస్త్రవిద్యాకలాక్షరాః॥
స్వరమంత్రపురాణాని గుణాశ్చైతాని సర్వశః। బీజజీవాత్మకస్తేషాం క్షేత్ర
జ్ఞాః ప్రాణవాయవః। సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్॥

తా॥ సర్వప్రపంచాత్మక పరంజ్యోతి స్వరూపియగు బ్రహ్మయీ సుషుమ్నా నాడియందే నివసించుచుండు, మఱియు నీనాడి నానామార్గములు గలిగి బహుముఖంబులతోఁ వ్యాపించు. ఈనాడియే శుద్ధబ్రహ్మమునకు రూపాంతరముగ నుండెడి సూర్యచంద్రాగ్ని పరమేశ్వరులకును, పృథివ్యాది పంచభూతంబులకును, చతుర్దశభువనంబులకును, ప్రాగాది దశదిక్కులకును, కాశ్యాది ధర్మక్షేత్రములకును, లవణాది సప్తసముద్రములకును, మేర్వాది పర్వతములకును, రత్నాది శిలలకును, సప్తద్వీపములకును, గంగాది నదులకును, వేదములకును, మీమాంసాది సకలశాస్త్రములకును, చతుష్షష్టి విద్యలకును, బ్రాహ్మణాది జాతులకును, అకారాది వర్ణములకును, ఉదాత్తాది స్వరములకును, సప్తకోటి మహామంత్రములకును, బ్రహ్మాది పురాణములకును, సత్వరజస్తమోగుణములకును, మహదాది చతుర్వింశతి తత్వములకును, జీవునికిని, క్షేత్రజ్ఞునికిని, ప్రాణాది పంచవాయువులకును, నాగాద్యుపవాయువులకును, సమస్తప్రపంచమునకును, నాధారంబుగ నున్నయది.

నాడ్యుత్పత్తి ప్రకరణము ముగిసెను.

---

## నా డీ జ్ఞా న ప్రా రం భ ము.

శ్లో॥ క్వచిచ్చక్రం క్వచిత్కోశశ్చ క్వచిజ్జీవగృహం స్థితమ్ । అస్మింశ్చ
క్షేత్రే స్థితో జీవః పుణ్యాపుణ్యప్రవేశతః॥ ॥౧॥

తా॥ కొన్ని స్థలములయందు నాభ్యాది చక్రాకారముగను, కొన్ని స్థలములయందు ఆమాశయాది కోశాకారములుగను, కొన్ని స్థలములయందు హృదయాది జీవగృహములుగ నునుండెడి యీశరీరమునందు జీవుఁడు పుణ్యాపాపగతి విశేషమువలన నివసించుచుండును.

శ్లో॥ ప్రాణానిసమమారూఢో దేహే భ్రమతి సర్వదా। తం
పంజరమధ్యస్థా యథా భ్రమతి లూతికా॥ ॥౨॥

తా॥ సాలుపురుగు తంతుపంజర మధ్యభాగమునందెడ తెగక సంచరించెడి చందంబున నీజీవుఁడు శరీరమునందు పంచప్రాణాదులతోఁడ నెడతెగక సంచరించుచుండును.

శ్లో॥ యస్తమభ్యసతే నిత్యం తద్గతేనాంతరాత్మనా । న తస్య జా
యతే మృత్యురితి సర్వాగమోదితమ్॥ ॥౩॥

తా॥ యెవఁడు పైఁజెప్పిన జీవుని యోగాభ్యాసముచే పరబ్రహ్మనిష్ఠంబుగఁ జేయుచుండునో యట్టివాఁడు పూర్ణాయుష్మంతుఁడుగ నుండును.

శ్లో॥ నాభిరోజో గుదంశుక్రంశోణితంశంఖకౌతథా । మూర్ధాంసకాండహృదయంప్రాణస్యాయతనందశ॥ ॥౪॥

తా॥ నాభి, ధాతువు, గుదము, వీర్యము, రక్తము, కణతలు, శిరము, భుజములసంధి, హృదయము, ఈపదియు ప్రాణవాయువుల వునికిపట్టుగనుండును.

శ్లో॥ త్రింశద్ధస్తప్రమాణాత్తు వినోదరీద్వయాధికా । ఏకహస్తప్రమాణాస్యాత్కంఠదేశస్యనాడికా॥ ॥౫॥

తా॥ ముప్పదిరెండుమూరలుగల వినోదరియను నాడి యుదరంబుననున్నయది. అందొకమూర కంఠస్థానమును నాశ్రయించియుండును,

శ్లో॥ దశహస్తాతతఃపశ్చాత్కామాశయాప్రకీర్తితా । పచ్యమానాశయాజ్ఞేయాదశహస్తాతతఃపరమ్ ॥ పక్వాశయాతతఃపశ్చార్ధశహస్తాప్రకీర్తితా । ఏకహస్తాంహ్యదేశేశంఖావర్తాతుటాడికా॥ ॥౬॥

తా॥ కంఠము నాశ్రయించియుండెడి పైనాడికిదిగువ పదిమూరలలో ఆమాశయంబును, దానికి పదిమూరలలో పచ్యమానాశయంబును, దానికిపదిమూరలలో పక్వాశయంబును, నున్నయది, తక్కిన నొకమూర శంఖావర్తమై గుదస్థానముననుండును.

శ్లో॥ భుక్తమామాశయేతిష్ఠేత్పచ్యమానాశయేపచేత్ । పక్వంపక్వాశయేతిష్ఠేద్వహ్నిఃపక్వాశయోపరి॥ పచ్యమానాశయేపక్వంమలంపక్వాశయేవ్రజేత్॥ ॥౭॥

తా॥ మనుజులుభక్షించెడియాహారము మొదట ఆమాశయమునందు బ్రవేశించియుండి పచ్యమానాశయమునందుజేరి దానికి దిగువనుండెడి జాఠరాగ్నిచే పక్వమై అందలి పిప్పి పక్వాశయమునందుజేరు.

శ్లో॥ రసోభోజ్యాదికానాంచ నాభినాడ్యాకళేబరమ్ । సకలంయాతిమరుతానీయమానస్స్వమాశ్రయాత్॥ ॥౮॥

తా॥ పైపచ్యమానాశయములో పక్వంబైన భక్షిత ద్రవ్యసారము నాభినాళమునందు బ్రవేశించి వాయుప్రేరితమై సమస్తనాడులద్వారముగ శరీరమున వ్యాపించుచున్నయది.

శ్లో॥ నాభిస్తుకూర్మరూపస్స్యాత్సమహానాడ్యష్టపాద్భవేత్ । చతస్రః పృష్ఠదేశేస్యుశ్చతస్రఃక్రోడదేశగాః॥ ॥౯॥

తా॥ కూర్మాకారంబగునాభి మహానాడులను నెనిమిదిపాదంబులతోడంగూడియుండును. అయ్యెనిమిది నాడులలో నాలుగు పృష్ఠదేశంబును, నాలుగువక్షస్థలంబును నాశ్రయించియున్నయవి.

శ్లో॥ ద్వేద్వేఊర్ధ్వమధశ్చాపి నాడికేఅంతగామినీ । ఊర్ధ్వగా గళదేశేతు ద్విపల్లవాః ప్రకీర్తితాః ॥ తదేకాంగళతఃపంచ పల్లవానాడి కాస్స్మృతా॥ ॥౧౦॥

తా॥ అకూర్మాకారంబగు నాభిపృష్ఠ దేశంబును నాశ్రయించియుండెడు పై నాలుగునాడులు శరీరోర్ధ్వభాగంబుగ వెడలి శిరంబువరకును, వక్షస్థలము నాశ్రయించి యుండెడి నాలుగునాడులు పాదాంతనువరకును, వ్యాపించియుండు. మఱియు ఊర్ధ్వంబుగ వెడలిన నాలుగునాడులు రెండురెండుగ జీలి యెనిమిదిగ పరిణమిల్లి యందొకటి అయిదునాడులుగ విలసిలు.

శ్లో॥ చక్షుషోర్నాలకారంధ్రే జిహ్వాయాంశ్రవణాధరే । ఆకుంచనకరీఖ్యాతా ఏవంపృష్ఠాత్ప్రసారిణీ॥ ॥౧౧॥

తా॥ ఐదుగ పరిణమిల్లినట్టు పైజెప్పబడిన నాడులలో రెండు నేత్రములయందును, రెండు నాసికారంధ్రంబులయందును, ఒకటి జిహ్వాయందును, వ్యాపించె. తక్కిన రెండునాడులు శ్రవణములయందును. మఱి రెండు ఊర్ధ్వాధరోష్ఠంబులయందును, వ్యాపించియుండు. ఈప్రకారమే మఱియొకనాడి పైవెడలిన తొమ్మిదినాడులకు సహాయంబుగనుండి మూసుట, తెరుచుట, మొదలగు కార్యంబులను జేయుచున్నయది.

శ్లో॥ తదేకాస్కంధదేశాత్తుహస్తగా పంచపల్లవా। అంగుళీక్రీడగాసైవ ఆకుంచనకరీస్మృతా । ఏవంపృష్ఠాత్సమాగత్య ప్రసారణకరీస్స్మృతా॥ ॥౧౨॥

తా॥ శిరంబునవ్యాపించినట్లు పైజెప్పిననాడులుగాక రెండునాడులు హస్తములయందువ్యాపించి అయిదైదుశాఖలుగ జీలి వ్రేళ్లయందుజొచ్చి చేతులుబాచుట, ముడచుట, మొదలగు కృత్యంబులను జేయుచుండు.

శ్లో॥ అధోగాఊరుసంధ్యంతర్నాకాఃపంచపల్లవాః । పాదాంగుళగతాసైవ ఆకుంచనకరీస్మృతా॥ ఏవంపృష్ఠాత్సమాగత్యప్రసారణకరీస్స్మృతా॥ ॥౧౩॥

• తా॥ కూర్మాకారంబగు నాభియొక్క వక్షస్థలంబునాశ్రయించినట్లు పైజెప్పబడిన నాలుగునాడులలో రెండునాడులు కటిప్రదేశమున జేరి ఊరుసంధులమూలమున పూర్వభాగముగ పాదాంతములవరకువ్యాపించి పంచపల్లవములు గలవియై అంగుళులనందుజొచ్చి ముడుచునటులంజేయు. మఱియు నితర రెండు నాడులు వెనకటి సంధులద్వారా పాదాంతములవరకు వ్యాపించి చాచునటులం జేయుచున్నయది.

శ్లో॥ కూర్మస్యనవమఃపాదో లింగనాడీతికీర్త్యతే । మూత్రశు క్రవహేనాడ్యౌతస్యాఃపల్లవతోఃపునః॥ ॥౧౪॥

తా॥ అకూర్మమునందే తొమ్మిదవదియగు మఱియొకలింగనాడి యుద్భవిల్లి మేఢ్రమునందువ్యాపించి యందు రెండుదళంబులై యందొకటి మూత్రంబును, మఱియొకటి శుక్లంబును, వెడలునటులంజేయు.

శ్లో॥ తిర్యక్కూర్మో దేహినాం నాభిదేశేవామేవక్త్రంతస్యపుచ్ఛంచయామ్యే । ఊర్ధ్వేభాగేహస్తపాదౌచవామౌతస్యాధస్తాద్దక్షిణౌసంస్థితౌతౌ॥ ॥౧౫॥

తా॥ పైనాభికూర్మము మనుజుల నాభిస్థానమునం డెడమపార్శ్వమున ముఖమును, కుడిపార్శ్వమున పుచ్ఛమును, గలదియై యుండుటయగాక ఊర్ధ్వముఖంబుల గువామహస్తపాదములు గలదిగను, అధోముఖంబులగు దక్షిణహస్తపాదములు గలదిగను నున్నయది.

శ్లో॥ వక్త్రేనాడీద్వయంతస్యపుచ్ఛేనాడీద్వయంతథా । పంచపంచకరేపాదేవామదక్షిణభాగయోః॥ ౧౬॥

తా॥ మఱియు అకూర్మముఖమునందు రెండు నాడులును, పుచ్ఛమునందు రెండునాడులును, దక్షిణహస్తమునందైదునాడులును, దక్షిణపాదమునందైదునాడులును, వామహస్తమునందైదునాడులును, వామపాదమునందైదునాడులును, నున్నయవి.

నాడీస్పర్శనవిధి.

శ్లో॥ సవ్యేనరోగధృతికూర్పరభాగమధ్యం పీడ్యాథదక్షిణకరాంగుళికాత్రయేణ । అంగుష్ఠమూలమధిపశ్చిమభాగమధ్యేనాడీప్రభంజనగతింసతతంపరీక్షేత్॥ ॥౧౭॥

తా॥ వైద్యుఁడు రోగియొక్క దక్షిణహస్తమును మోచెయ్యి మొదలుకొని తన వామహస్తముచే జక్కగపిసికి ఆహస్తమునందలి అంగుష్ఠమూలమునందు లోభాగమధ్యమున తనవామాంగుళిత్రయములచే సదావాతగతిని బరీక్షించి రోగనిదానంబు దెలియవలయు.

వైద్యునికర్తవ్యము.

శ్లో॥ ప్రాతఃకృతసమాచారఃకృతాచారపరిగ్రహమ్ । సుఖాసీనస్సుఖాసీనంపరీక్షార్థముపాచరేత్॥ ॥౧౮॥

తా॥ వైద్యుడు ప్రాతఃకాలమునందు స్నానసంధ్యావందనాది క్రియలనొనరుకొని పరిశుద్ధుడై సుఖాసీనుండగు రోగికడకేతెంచి తానును సుఖాసీనుండై రోగనిదానంబు నెఱుంగవలయు.

నాడీపరీక్షానిషేధకాలము.

శ్లో॥ తైలాభ్యంగేచసుప్తేచతథావైభోజనాన్తరే। తదానజ్ఞాయతేనాడీయథాదుర్గతరానదీ॥ ॥౯॥

తా॥ తైలాభ్యంజనము గావించిన వానికిని, నిదురబోయి మేల్కొనినవానికిని, భోజనము జేసినవానికిని, "వేగముగ ప్రవహించెడి నది చందంబున" నాడి అతివేగంబుగ నడచుచుండుగాన నట్టికాలంబున నాడిని బరీక్షింపం జనదు.

స్త్రీపురుషుల నాడీభేదము.

శ్లో॥ వామభాగేస్త్రియాఙ్యోజ్యానాడీపుంసస్తుదక్షిణే। ఇతిప్రోక్తంమయాదేవిసర్వదేహేషుదేహినామ్॥ ॥౧౦॥

తా॥ స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును, నాడిని పరీక్షింపవలయునని పార్వతితో పరమేశ్వరుండు వచించె.

శ్లో॥ స్త్రీణామూర్ధ్వముఖఃకూర్మఃపుంసాంపునరధోముఖః। అతఃకూర్మవ్యతిక్రాంతాత్సర్వత్రైవవ్యతిక్రమః॥ లక్ష్యతేదక్షిణేపుంసాంయాచనాడీవిచక్షణైః। కూర్మభేదేననారీణాంవామేచైవావలోక్యతే॥

తా॥ పైజెప్పిన నాభికూర్మము స్త్రీలకూర్ధ్వముఖంబుగను, పురుషులకధోముఖంబుగను నుండుటచే, స్త్రీపురుషులకు నాడులును వ్యత్యస్తముగనుండుగాన స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును, నాడిని బరీక్షింపవలయు. మఱియు నపుంసకుండుగనుండెనేని అట్టివాని స్త్రీపురుష రూపభేదంబుల నెఱింగి వామ దక్షిణ క్రమంబుగ నాడిని బరీక్షింపవలయు.

జీవసాక్షిణీనాడీకథనము.

శ్లో॥ అంగుష్ఠస్యతుమూలేయసానాడీజీవసాక్షిణీ। తస్యాగతివశాద్విద్యాత్సుఖందుఃఖంచరోగిణామ్॥ ౧౧॥

తా॥ అంగుష్ఠ మూలమునందలి నాడి జీవసాక్షియనిబఱంగు. దానిగతి విశేషముచే రోగియొక్క సుఖదుఃఖంబుల నెఱుంగవలయు.

నాడీనామములు.

శ్లో॥ స్నాయుర్నాడీవనాహింస్రాధమనీధామనీధరా। తంతుకీజీవితజ్ఞాచసిరాపర్యాయవాచకాః॥ ॥౧౨॥

తా॥ నాడికిస్నాయువనియు, వసయనియు, హింస్రయనియు, ధమనియనియు, ధామనియనియు, ధరయనియు, తంతుకియనియు, జీవితజ్ఞయనియు, సిరయనియు, పర్యాయ నామంబులు గలవు.

నాడీచిహ్నములు.

శ్లో॥ ఆదౌచవహతేవాతోమధ్యేపిత్తంతథైవచ। అంతేచవహతే శ్లేష్మనాడీకాత్రయలక్షణమ్॥ ॥౧౪॥

తా॥ రోగి మణిబంధమునందు ధాతువును వైద్యుడు పరీక్షించునపుడు తన తర్జనికి స్పృశించెడినాడి వాతమనియు, మధ్యమాంగుళికిస్పృశించెడినాడి పిత్తమనియు, అనామికాంగుళికి స్పృశించెడినాడి శ్లేష్మమనియు, నెఱుంగవలయు.

శ్లో॥ వాతాధికావహేన్మధ్యేత్వగ్రేవహతిపిత్తలా। అంతేచవహేత్ శ్లేష్మమిశ్రితేశ్రితాభవేత్॥ ॥౧౫॥

తా॥ మధ్యమాంగుళియందునాడి అతివేగంబుగ నడుచుచుండెనేని వాతరోగంబనియు, తర్జనియందునాడి అతివేగంబుగ నడుచుచుండెనేని పిత్తరోగంబనియు, అనామికయందతివేగముగనాడి నడుచుచుండెనేని శ్లేష్మరోగంబనియు, మధ్యమ తర్జనుల యందు మిశ్రమమై యతివేగంబుగనాడి నడుచుచుండెనేని పిత్తవాతంబనియు, మధ్యమానామికలయందు మిశ్రమమై యతివేగంబుగనాడి నడుచుచుండెనేని వాతశీతలంబనియు. మధ్యమాంగుళినాడి క్షీణించి అనామికా తర్జనీనాడులు మిశ్రమమై యతివేగముగనడుచుచుండెనేని పిత్తశీతలంబనియు, వాత, పిత్త, శ్లేష్మములు, మూడును సంకరంబయ్యెనేని త్రిదోషంబనియు, నెఱుంగవలయు.

శ్లో॥ తృణంపురస్సరంకృత్వాయథావాతోవహేద్భలీ। శేషస్థం తృణమాదాయపృథివ్యాంవక్రగాయథా॥ తథామధ్యగతోవాయుఃకృత్వాపిత్తంపురస్సరమ్। శేషస్థంకఫమాదాయనాడ్యాంవహతిసర్వదా॥ వాక్యమ్॥ అతఏవపిత్తస్యచంచలాగతిర్వాయోరగ్రత్వాత్। కఫస్యామందాగతిర్వాయుపృష్ఠత్వాత్॥ ॥౧౬॥

తా॥ వాయువు వీచునపుడు దానికెదుటనుండు తృణము విశేషంబుగను, వెనకనుండు తృణము మందముగను, చలించెడి చందంబున, మధ్యమునందుండెడి వాతము యెదుటనుండెడి పిత్తమును అధికముగ చలించునటులను, వెనకనుండెడి శ్లేష్మమును మందముగ చలించునటులను జేయు.

శ్లో॥ (అన్యచ్చ) పిత్తశ్లేష్మగతిర్నాస్తివాతస్యగమనేగతిః। తస్మాత్త్వగ్రేవహేద్వాయుర్జలూకావక్రగాయథా॥ ॥౨౭॥

తా॥ పిత్తశ్లేష్మనాడులు స్వతంత్రరహితంబులుగనుండును. వాతనాడిగమనము ననుసరించే పిత్తశ్లేష్మంబులకును గమనముగలిగియుండునుగాన "వక్రముగసంచరించెడిజలూకచందంబున" నాడులకు అగ్రంబుననుండెడి వాతనాడిచలించెనేని, పిత్తశ్లేష్మంబులును చలించు.

## స్వస్థనాడీలక్షణము.

శ్లో॥ భూలతాభుజగప్రాయాస్వచ్ఛాస్వాస్థ్యమయీసిరా। సుఖితస్యస్థితాజ్ఞేయాతథాబలవతీమతా॥ ॥౨౮॥

తా॥ రోగరహితుడగు మనుజునినాడి భూలతయనంబడు. ఆనాడి ఆఱ్ఱివానికి, సర్పము చలించెడి చందంబున, స్థిరముగను, బలిష్ఠముగను, నడుచుచుండు.

శ్లో॥ (అన్యచ్చ) ప్రాతస్స్నిగ్ధమయీనాడీమధ్యాహ్నేప్యుష్ణతాన్వితా। సాయాహ్నేధావమానాచచిరాద్రోగవివర్జితా॥ ౨౯॥

తా॥ చిరకాలముగ నీరోగిగనుండెడి వానినాడి ప్రాతఃకాలంబున రూక్షరహితంబుగను, మధ్యాహ్నంబున నుష్ణప్రకోపంబుగను, సాయాహ్నంబున తీవ్రముగను, నడుచుచుండు.

## దోషనాడీలక్షణము.

శ్లో॥ వాతాద్వక్రగతానాడీచపలాపిత్తవాహినీ। స్థిరాశ్లేష్మవతీజ్ఞేయామిశ్రితేమిశ్రితాభవేత్॥ ॥౩౦॥

తా॥ నాడివాతరోగంబున వక్రంబుగను, పిత్తరోగంబున చంచలముగను, శ్లేష్మరోగంబున స్థిరముగను, ద్వంద్వరోగంబున మిశ్రమముగను నడుచు.

## వాతపిత్తరోగనాడీలక్షణము.

శ్లో॥ సర్పజలౌకాదిగతింవదంతివిద్వాంసఃప్రభంజనేనాడీమ్। పిత్తేచకాకలావకభేకాదిగతింవిదుస్సుధియః॥ ॥౩౧॥

తా॥ వాతరోగంబున నాడి సర్పము, జలూకము, వీటివలెను, పిత్తరోగంబున నాడి కాకి, లావుకపిట్ట, కప్ప, వీటివలెను నడుచు.

## శ్లేష్మరోగనాడీలక్షణము.

శ్లో॥ రాజహంసమయూరాణాంపారావతకపోతయోః। కుక్కుటాదిగతింధత్తేధమనీకఫసంవృతా॥ ॥౩౨॥

తా॥ శ్లేష్మరోగంబున నాడి హంస, నెమలి, పావురము, గువ్వ, కోడి, వీటి వలె నడుచు.

### వాతపిత్తరోగ నాడీలక్షణము.

శ్లో॥ ముహుస్సర్పగతిర్నాడీముహుర్భేకగతిస్తథా । వాతపిత్తద్వయోద్భూతాంప్రవదంతివిచక్షణాః॥ ॥౩౩॥

తా॥ వాతపిత్తరోగంబున నాడి పలుమారు సర్పగతికలదిగను, మాటిమాటికి కప్పవలెను నడుచును.

### వాతశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ భుజగాదిగతిస్తస్యారాజహంసగతిస్తథా । వాతశ్లేష్మద్వయోద్భూతాంభాషంతేతద్విదోజనాః॥ ॥౩౪॥

తా॥ వాతశ్లేష్మనాడి సర్పము, రాజహంస, వీటివలె నడుచు.

### పిత్తశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ మండూకాదిగతింనాడీంమయూరాదిగతింధరామ్। పిత్తశ్లేష్మసముద్భూతాంప్రవదంతిమనీషిణః ॥ సూక్ష్మాశీతాస్థితానాడీపిత్తశ్లేష్మసముద్భవా॥ ॥౩౫॥

తా॥ పిత్తశ్లేష్మనాడి కప్ప, నెమలి, ఇవి మొదలగు వాటివలె నడుచుటయగాక సూక్ష్మంబుగను, శీతలంబుగను నుండు.

### ప్రకారాంతవాతశ్లేష్మ నాడీలక్షణము.

శ్లో॥ కఫవాతోద్భవానాడీసర్పహంసగతిర్భవేత్॥ ॥౩౬॥

తా॥ వాతశ్లేష్మనాడి సర్పము, హంస, వీటివలె నడుచు.

### వాతపిత్తకఫసన్నిపాతనాడీలక్షణము

శ్లో॥ లావతిత్తిరివర్తకగమనంసన్నిపాతతః। కదాచిన్మందగానాడీకదాచిచ్ఛీఘ్రగాభవేత్ । త్రిదోషప్రభవేరోగేవిజ్ఞేయాచభిషగ్వరైః॥

తా॥ త్రిదోషమిశ్రితంబగు సన్నిపాతనాడి లావుకపిట్టవలెను, తిత్తిరిపక్షివలెను, మీనవల్లంకిపిట్టవలెను, నడుచుటయగాక ఒకానొకసమయంబున మందగతిగను, మఱియొకసమయంబున శీఘ్రముగను నడుచు.

### అసాధ్యరోగనాడీలక్షణము.

శ్లో॥మందంమందంశిథిలశిథిలంవ్యాకులంవ్యాకులంవాస్థిత్వాస్థిత్వావహతిధమనీయాతినాశంచసూక్ష్మా । నిత్యంస్థానాత్స్ఖలతిపునరప్యంగుళీస్సంస్పృశేద్యాభావైరేవంబహువిధవిధైస్సన్నిపాతేప్యసాధ్యా॥ ౩౮॥

స్థి త్వావహంత్యథమునీ యాతినాశంచసూక్ష్మానిత్యంస్థానాత్ స్ఖలంస్ఫీనరస్యాపి
గుళీస్సంస్పృశేద్వ్యాధావైరేవంబహువిధా ద్వైస్సన్నిపాతేత్వసాధ్యా॥

తా॥ అసాధ్యసన్నిపాతంబున నాడి అతిమందముగను, మిగుల శిథిలంబుగను, మి గుల వ్యాకులముగను, నిలిచినిలిచియును, అతిసూక్ష్మంబుగను, నశించినట్లుగను, పలుమా రు స్థానచ్యుతంబయ్యును, పలుమారు వ్రేళ్ళయందును, ఇటుల యనేకరీతులుగ నడుచును.

శ్లో॥ (అన్యచ్చ) యాత్యుష్ణకాస్థిరాత్యంతా యాచేయంమాం
సవాహానీ। యాచసూక్ష్మాచవక్రాచ తామసాధ్యాంవిదుర్బుధాః॥ ౩౯॥

తా॥ అతివేగముగ నెగయుచును, మిగుల స్థిరంబుగను, మాంసంబున సంచరిం చుచును, అతిసూక్ష్మంబుగను, అతివక్రముగను, నుండెడినాడి యసాధ్యంబని తెలియం గవలయు.

శ్లో॥ (అన్యచ్చ) ముహుః మహోష్ణశీతత్వంశీతత్వేతాపతాసిరా
నానావిధాగతిర్యస్యతస్యమృత్యుర్నసంశయః॥ ౪౦॥

తా॥ ఎవనినాడి అత్యుష్ణంబుగనుండునపు డతిశీతలంబుగను, శీతలంబుగనుండున పు డతితాపంబుగను నుండుటయగాక నానావిధ గతియు గలిగియుండునో అట్టివా డు నిశ్చయముగ మరణంబుజెందు.

శ్లో॥ (అన్యచ్చ) త్రిదోషేస్పందతేనాడీమృత్యుకాలేచనిశ్చలా
జ్ఞేయాసర్వవికారేషువైద్యైఃకుశలకర్మభిః॥ ౪౧॥

తా॥ త్రిదోషంబున నాడి సర్వదా చలింపుచును, మృత్యుకాలమాసన్నంబైన పుడు నిశ్చలంబుగనుండు. ఇట్టిభేదంబులను సర్వసన్నిపాతంబులయందును తెలియం గవలయు.

సాధ్యరోగనాడీలక్షణము.

శ్లో॥ పూర్వంపిత్తగతింప్రభంజనగతిం శ్లేష్మాణమాబిభ్రతీంస
త్వానభ్రమణంముహుర్విదధతీంచక్రాధిరూఢామివ। తీవ్రత్వందధతీక
దాహీగతికాం సూక్ష్మత్వమాతన్వతీంనాసాధ్యాం ధమనీంవదంతిసు
ధియోనాడీగతిజ్ఞానినః॥ ౪౨॥

తా॥ "చక్రాధిరూఢంబగువాడు సంచరింపుచుండంబున" నాడి ప్రథమం బున పిత్తగతియు, పిదప వాతగతియు, కడపటు శ్లేష్మగతియుగలిగి సంచరింపుచు కొం తకాలం బతితీవ్రంబుగను, సర్పగతికలదిగను, కొంతకాలము సూక్ష్మంబుగను, నడిచి చుండెనేని అట్టినాడి సాధ్యనాడియని నాడీజ్ఞానవేత్తలు పలికెదరు.

మాసాంతమృత్యునాడీలక్షణము.

శ్లో॥ ఘూలతాభుజగాకారానాడీదేహస్యసంక్రమాత్। విశీర్ణే క్షీణతాంయాతిమాసాంతేమరణంధ్రువమ్॥ ౪౩॥

తా॥ దేహమందలి భుజగాకారమగు ఘూలతయనునాడి దేహసంక్రమము వలన శిథిలంబు జెందినను, జీర్ణంబైనను, నట్టివాడు మాసాంతంబున మరణంబుజెందు.

ఏడవదినమృత్యునాడీలక్షణము.

శ్లో॥ క్షణాగచ్ఛతివేగేనశాంతతాంలభతేక్షణాత్ । సప్తాహా న్మరణంతస్యయద్యంగేశోథవర్జితః॥ ౪౪॥

తా॥ దేహము శోభవర్జితముగ నుండునపుడే నాడి స్వగతిదప్పి క్షణకాలము తీవ్రంబుగను, క్షణకాలము శాంతంబుగను నడుచుచుండెనేని నట్టినాడిగలవాడే డుదినంబులలో యమపురనివాసియగు.

మూడవదినమృత్యునాడీలక్షణము.

శ్లో॥ హిమవద్విషదానాడీజ్వరదాహేనతాపినామ్ । త్రిదోష స్పర్శంభజతాంతదామృత్యుర్దినత్రయాత్॥ ౪౫॥

తా॥ అత్యంతక్రూరంబగు జ్వరము గలిగియుండునపుడు నాడి మంచువలెను, శీతలంబుగను, నుండుటయగాక త్రిదోషస్పర్శ సంబంధంబును గలిగియుండెనేని నట్టి నాడిగలవాడు మూడవదినంబున మార్తాండనందనుని గృహంబునకేగు.

నాలవదివసమృత్యునాడీలక్షణము.

శ్లో॥ నిరీక్ష్యదక్షిణేపాదేనాడీమేకాంవిశేషతః । ముఖంనాడీంవ హేన్నిత్యంతదాదినచతుష్టయమ్॥ ౪౬॥

తా॥ దక్షిణపాదంబున నొకనాడి యతితీవ్రంబుగ నడుచుచుండుటయగాక, ముఖంబునను, నాడి నడుచుచుండెనేని నట్టినాడిగలవాడు నాలవదినంబున మృత్యువుపాలగు.

పండ్రెండుఝాములమృత్యునాడీలక్షణము.

శ్లో॥ గతింభ్రమరకస్యేవావచ్ఛేదకదినేనతు । స్కంధేచస్పంద తేనిత్యంపునర్నగతిచాంగుళౌ । మధ్యేద్వాదశయామానాంమృత్యురేవ నసంశయః॥ ౪౭॥

తా॥ నాడి గిర్రుమని భ్రమరంబువలె బఱుగిడుచును, భుజములయందు చలింపుచును, అంగుళములయందు చలింపకను, నెవనికినుండునో నట్టివాడు పండ్రెండు ఝాములలో యమమందిరంబునకేగు.

## దినాంతంబునమృత్యునాడీలక్షణము.

శ్లో॥ స్థిత్వానాడీముఖేయస్యవిద్యుజ్జ్యోతిరివేక్ష్యతే । దినైకంజీవి
తంతస్యద్వితీయేమరణంభవేత్॥ ౪౮॥

తా॥ ముఖంబుననాడి నిలిచి నిలిచి "వర్షాకాలంబున మెరపు మెరయుచందంబున" మిగుల తీవ్రగతిగలిగియుండెనేని నట్టివాడొకదినము జీవితుడై మరునాడుదయంబున మృత్యువునుగాంచు.

## జ్వాలావధిమృత్యులక్షణము.

శ్లో॥ స్వస్థానవిచ్యుతానాడీయదావహతివాసవా। జ్వాలాచహృ
దయేతీవ్రంతదాజ్వాలావధిస్థితిః॥ ౪౯।

తా॥ హస్తమునందలి నాడులు స్వస్థానంబునువదలి కొండొకస్థలంబున నాడి సంచరింపుచునైనను, సంచరింపకనైనను, నుండుటయగాక హృదయంబున తీవ్రంబగు మంటయును గలిగియుండెనేని నట్టివాడామంట నిలుచువరకు సజీవుడుగనుండి పిదప వైవస్వతుని సదనంబున నివసించు.

## అర్ధయామములోనిమృత్యునాడీ లక్షణము.

శ్లో॥ అంగుష్ఠమూలతోబాహ్యాద్వ్యంగులేయదినాడికా। ప్రహ
రార్ధాద్బహిర్మృత్యుంజానీయాచ్ఛవిచక్షణః॥ ౫౦

తా॥ అంగుష్ఠమూలమునందలి నాడులాస్థానంబులనువదలి రెండంగుళములక్రిందుగా మధ్యమానామికలయందు నడుచుచుండెనేని నట్టివాడర్ధయామములోపల మరణంబుజెందు.

శ్లో॥ సార్ధద్వయాంగుళాద్బాహ్యేయదితిష్ఠతినాడికా । ప్రహ
రైకాద్బహిర్మృత్యుంజానీయాచ్ఛవిచక్షణః॥ ౫౧

తా॥ అంగుష్ఠమూలమందలి నాడులాస్థానంబునువదలి రెండున్నర అంగుళవలకుక్రిందుగా అనామికయందలి నరంబున జేరి నడుచుచుండెనేని నట్టివాడర్ధయామములోపల కాలాంతకుని నిలయంబున ప్రవేశించి యతనిభటులతో యుల్లాసంబుగ సల్లపము సలుపుచుండునని మరికొందరు విచక్షణులగువారు వచించెదరు.

## సార్ధప్రహరమృత్యునాడీలక్షణము.

శ్లో॥ ద్వ్యంగుళాద్బాహ్యతోనాడీమధ్యేరేఖాబహిర్యదా । సా
ర్ధప్రహరకాన్మృత్యుర్జాయతేనాత్రసంశయ॥ ౫౨

తా॥ నాడితర్జనీ మధ్యమాంగుళులను వదలి అనామికయందు మాత్రము సం
చరింపుచు దానిక్రిందరేఖాకారంబుగ స్పృశింపుచుండెనేని నట్టివాడొకటిన్నర
యామములో యమపురికేగు.

ఆఱవయామమునమృత్యునాడీలక్షణము.

శ్లో॥ మధ్యేరేఖాసమానాడీయదితిష్ఠతినిశ్చరా। షడ్భిస్తుప్రహరై
స్తస్యమృత్యుర్జ్ఞేయోవిచక్షణైః॥ ౫౩॥

తా॥ అంగుష్ఠమూలమందలి నాడులన్నియు మధ్యమాంగుళి వరమునచేరి సూ
క్ష్మంబై నిశ్చలంబుగనుండెనేని నట్టివాడారుయామములలో యమమందిరంబునకునరుగుం
వంబడు.

పునస్తృతీయదివసంబునమృత్యునాడీలక్షణము.

శ్లో॥ పాదాంగుళిగతానాడీచంచలాయదిగచ్ఛతి। త్రిభిశ్చదివ
సైస్తస్యమృత్యురేవనసంశయః॥ ౫౪॥

తా॥ ఎవనికి పాదాంగుళిమందలి నాడులతిచంచలముగ నడుచుచుండునో
అటువంటివాడు మూడుదినములలోపల మృత్యువుపాలగు.

చతుర్థదివసమృత్యునాడీలక్షణము.

శ్లో॥ పాదాంగుళిగతానాడీకోష్ణావేచవతీభవేత్। చతుర్భిర్దివ
సైస్తస్యమృత్యురేవనసంశయః॥ ౫౫॥

తా॥ ఎవనికి నాడులు పాదాంగుళిగతంబై కించిదుష్ణంబుతోగూడి యతివేగం
బుగ నడుచుచుండెడినో అటువంటివానికి నాలుగుదినములలోపల మరణంబుగలుగు.

ఐదవదివసంబునమృత్యునాడీలక్షణము.

శ్లో॥ పాదాంగుళిగతానాడీమందమందాయదాభవేత్। పఞ్చభి
ర్దివసైస్తస్యమృత్యుర్భవతినాన్యథా॥ ౫౬॥

తా॥ ఎవనికి పాదాంగుళిగతంబగునాడి మందంబుగనడుచునో అటువంటివా
డైదుదినములలో మృత్యువునుగాంచు.

శ్లో॥ ఏవంసంఖ్యావిభేదేననాడీజ్ఞేయావిచక్షణైః। స్వగేహాపిదుర్ల
భావిద్యాగోపనీయాప్రయత్నతః॥ ౫౭॥

తా॥ ఇటుల నాడుల గతిజ్ఞానంబునెఱింగి విచక్షణులద్వారా సంఖ్యాభేదం
బులను దెలిసికొనవలయు. మరియు నీనాడీజ్ఞానము త్రిదశులకునగా నెఱుంగుట దుర్ల
భంబుగాన నిది గోపనీయంబుగ నుంచుకొనందగినయది.

అభిఘాతాదిరోగములయందు నాడీలక్షణము.

శ్లో॥ భారప్రవాహమూర్ఛాభయశోకప్రముఖకారణాన్నాడీ।
సమ్మూర్ఛితాపిగాఢం పునరపి సాజీవితం ధత్తే॥ ౫౮॥

తా॥ భారమును మోయుట, ప్రవాహంబున గొట్టుకొనిపోవుట మూర్ఛ నెందుట, భయము నెందుట, శోకించుట, ఈ మొదలగు కార్యంబులుగావించుటచే నాడి యతిగాఢంబుగను, స్తబ్ధంబుగను నుండు. ఐన నా నాడిగలవాడు సజీవుడుగనుండు.

శ్లో॥ పతితస్సంధితో భేదీ నష్టశుక్రశ్చ సోభవేత్। శావ్యాతే విస్మయస్తస్యనకించిన్మృత్యుకారణమ్॥ ౫౯॥

తా॥ వృక్షాద్యుచ్చస్థానంబులనుండి క్రిందపడినవాడు, అస్త్రాదులచే మర్మము భేదింపబడినవాడు, శుక్రనష్టముగలవాడు, వీరికినాడి "మృత్యువాసన్నంబైనవానికి నడిచెడు చందంబున" నడుచుచుండు. అయిన నానాడిగలవాడు మరణంబునెందక యుండు.

భూతాభిషంగజ్వరనాడీలక్షణము.

శ్లో॥ తథా భూతాభిషంగేపి త్రిదోషవదుపస్థితా। సమాంగా వహతే నాడీ తథా న చక్రమం గతా॥ ౬౦॥

తా॥ భూతాభిషంగము గలవానినాడి, త్రిదోషనాడివలె, వాత, పిత్తశ్లేష్మంబులు సంకలితమై సమాకారంముగ నడుచుచుండు.

రోగరహితాపమృత్యులక్షణము.

శ్లో॥ అపమృత్యుర్నరోగాశ్చ నాడీ తత్సన్నిపాతవత్॥ ౬౧॥

తా॥ రోగరహితమైయుండునపుడు అపమృత్యువును గాంచెడివానినాడి సన్నిపాత నాడివలె నడుచుచుండు.

శోకహిమములచే నిశ్చలముగనుండు

నా డీ ల క్ష ణ ము.

శ్లో॥ స్వస్థానహీనా శోకేచ హిమాక్రాంతే చ నిర్గతాః। భవంతి నిశ్చలా నాడ్యో నకించిత్తత్ర దూషణమ్॥ ౬౨॥

తా॥ శోకమును జెందినవాడు, మంచులో సంచరించినవాడు, వీరినాడి స్వస్థానంబునుండి చ్యుతంబై నిశ్చలంబుగనుండు. అట్లుండినను వానికిదోషముజనింపక యుండు.

### దుష్టపిత్తనాడీలక్షణము.

శ్లో॥ స్తోకంవాతకఫందుష్టంపిత్తంవహతిదారుణమ్ । పిత్తస్థానం విజానీయాద్భేషజంతస్యకారయేత్॥ ౬౩॥

తా॥ దుష్టపిత్తదోషంబున వాతశ్లేష్మనాడులు మిగుల అల్పంబుగను, పిత్తనాడి అతిదారుణంబుగను, నడుచుచుండుగాన వీటినెఱింగి వైద్యుడు చికిత్సంజేయవలయు.

### సాధ్యనాడిలక్షణము.

శ్లో॥ స్వస్థానచ్యవనంయావద్ధమన్యానోపజాయతే। తత్పచిహ్నాన్యసత్త్వేపినాసాధ్యత్వమితిస్థితిః॥ ౬౪॥

తా॥ స్వస్థానంబునుండి నాడి చ్యుతముగాకయుండెడివాని రోగముసాధ్యంబని యు, నాడికి స్వస్థానచ్యుతముగలిగెనేని అతనిరోగంబసాధ్యంబనియు నెఱుంగవలయు.

### ధాతుప్రాప్తనాడీలక్షణము.

శ్లో॥ యదాయంధాతుమాప్నోతితదానాడీతథాగతిః । తథాహిసుఖసాధ్యత్వంనాడీజ్ఞానేనబుధ్యతే॥ ౬౫॥

తా॥ వాతపిత్తశ్లేష్మ ధాతువులలో యేధాతువును నాడి యక్కాలంబున నాశ్రయించియుండునో నక్కాలగతియే వాటికిని గలిగియుండుగాన యీనాడీజ్ఞానముచే తత్తద్రోగానుసారంబులగు చికిత్సలంజేయువలయు.

### సదోషనిర్దోషనాడీలక్షణము.

శ్లో॥ నాడీయథాకాలగతిస్త్రయాణాంప్రకోపశాంత్యాదిభిరేవభూయః । వాతాదిదోషేచభవేత్ప్రకోపాస్థూలాల్పగాపాశనియంత్రితేస్యాత్॥ ౬౬॥

తా॥ నాడి సదా వాతపిత్తశ్లేష్మయుక్తంబుగనుండు. మరియు నాడి వాతాది రోగంబులయందు బ్రకోపంబుగను, నీరోగంబున శాంతత్వమునుబొంది యథారీతిగను, వాతాదిదోషంబున రోగయుక్తమై బ్రకోపంబుగను, పాశాదిబద్ధంబున స్థూలముగను అల్పముగను నడుచుచుండు.

### నూనె, బెల్లము, మినుములు, పాలు, తేనె, వీటిని సేవించియుండెడి వాని నాడీలక్షణము.

శ్లో॥ పుష్టిస్తైలేగుడాహారేమాషేచలగుడాకృతిః । క్షీరేచస్తిమితావేగామధురేభేకవద్గతిః॥ ౬౭॥

తా॥ నూనెసేవించియుండెడువానినాడి పుష్టిగను బెల్లము, మినుములు, వీటిని భుజించియుండెడువానినాడి దృఢకఠ్ఠివలె నిడుపుగను, నడుచుచుండును. పాలుత్రాగి యుండెడువానినాడి స్తిమితముగను, నిలిచినిలిచి మందముగను, నడుచుచుండును. తేనె త్రాగియుండెడువానినాడి కప్పవలె నడుచుచుండును.

మధురము, వగరు, పులుసు, ఉష్ణము, చేదు, ఇవిగల, పదార్థ
ములాహారంబొనర్చియుండువాని నాడీలక్షణము.

శ్లో॥ మధురేబర్హిగమనాత్తిక్తేస్యాత్థూలతాగతిః । అమ్లేకోష్ణా ప్లవగతిఃకటుకైర్భృంగసన్నిభా॥ ౬౮॥

తా॥ మధురపదార్థములు భుజించియుండెడువానినాడి మయూరంబువలెను చేదుపదార్థములు భుజించియుండెడివానినాడి స్తబ్ధముగను, పులుసు, కించిదుష్ణము, ఇవిగల పదార్థములు భుజించియుండెడివానినాడి ఏగిరెగిరియును, వగరుపదార్థములు భుజించియుండెడువానినాడి భ్రమరంబువలె గిట్టుచునియు నడుచుచుండును.

కారము, ఉప్పు, ఇవిగలపదార్థముల భుజించి
యుండెడువానినాడీలక్షణము.

శ్లో॥ కషాయేకఠినాగ్లానాలవణేసరళాద్రుతా। ఏవంద్విత్రిచతుర్యోగేనానాధర్మవతీధరా॥ ౬౯॥

తా॥ కారముగలపదార్థములను భుజించియుండెడువానినాడి కఠినంబుగను,వాడినట్లును, ఉప్పుగలపదార్థములను భుజించియుండెడువానినాడి ఋజువుగను, తేలికగను, వేగముగను, నడుచుచుండును. మఱియు రెండుపదార్థంబులనైనను, మూడుపదార్థంబులనైనను నేకంబుగ భుజించియుండెడువానినాడి పలువిధంబులుగ నడుచుచుండును.

ద్రవపదార్థములు, కఠినద్రవ్యములు, వీటిని భుజించి
యుండెడువాని నాడీలక్షణము.

శ్లో॥ ద్రవేతికనానాడీకోమలాకఠినాశనే । ద్రవద్రవ్యస్యకాఠిన్యేకోమలాకఠినాపిచ॥ ౭౦॥

తా॥ ద్రవద్రవ్యములను భుజించియుండెడువానినాడి కఠినంబుగను, మిగులకఠినంబులగు ద్రవ్యములను భుజించియుండెడువానినాడి కోమలంబుగను, ద్రవద్రవ్యములు కఠినద్రవ్యములు, వీటిని సేవించియుండెడు వానినాడి కోమలంబుగను, కఠినంబుగను, నడుచుచుండును.

పులుసు, మధురామ్లము, అటుకులు, భర్జితద్రవ్యములు,

వీటిని భుజించియుండెడు వాని నాడీలక్షణము.

శ్లో॥ అమ్లైశ్చమధురామ్లైశ్చనాడీశీతావిశేషతః । చిపిటైర్భర్జితై

ద్రవ్యైశ్చస్థిరామందతరాభవేత్॥ ౭౧॥

తా॥ పులుసునైనను, మధురము, పులుసు, ఇవిగలపదార్థములనైనను, భుజించియుండెడివానినాడి మిగుల శీతలంబుగను, అటుకులు మొదలగుద్రవ్యములు, వేయించిన ద్రవ్యంబులు, వీటిని సేవించియుండెడు వానినాడి స్థిరముగను, మందముగను, నడుచుచుండు.

గుమ్మడుకాయ, అరటికాయ, ఆకుకూరలు, ఈమొదలగు

వాటినిభుజించియుండెడువాని నాడీలక్షణము.

శ్లో॥ కూష్మాండైర్మూలకైశ్చైవమందమందాచనాడికా। శాకై

శ్చకదలైశ్చైవరక్తపూర్ణైచనాడికా॥ ౭౨॥

తా॥ గుమ్మడికాయ, ముల్లంగి మొదలగు గడ్డలు, వీటిని భుజించియుండెడు వానినాడి మందముగను, ఆకుకూరలు, అరటి, వీటిని భుజించియుండెడువానినాడి రక్తపుష్టిగలవానినాడి చందంబుగను, నడుచుచుండు.

మాంసము, దుగ్ధము, గుడము, క్షీరము, పిండి, ఈమొదలగు

వాటినిభుజించియుండెడు వాని నాడిలక్షణము.

శ్లో॥ మాంసాత్స్థిరవహానాడీదుగ్ధేశీతాబలీయసీ। గుడైఃక్షీరైశ్చ

పిష్టైశ్చస్థిరామందవహాభవేత్॥ ౭౩॥

తా॥ మాంసముభుజించియుండెడువానినాడి స్థిరంబుగను, పాలుత్రాగియుండెడువానినాడి మిగుల శీతలముగను, పాలు, బెల్లము వీటితోజేయంబడినరొట్టెలు, ఈమొదలగువాటినిభుజించినవానినాడి స్థిరముగను, మందమందముగను, నడుచుచుండు.

బెల్లము, అరటిపండ్లు, మాంసము, ఉష్ణపదార్థములు,

ఎండిన తీక్ష్ణపదార్థములు, ఈమొదలగువాటిని

భుజించియుండెడువాని నాడిలక్షణము.

శ్లో॥ గుడరంభామాంసరూక్షఉష్ణతీక్ష్ణాదిభోజనాత్ । వాతపి

త్తాతిరూపేణనాడీవహతినిశ్చితా॥ ౭౪॥

తా॥ బెల్లము, అరటిపండ్లు, మాంసము, రూక్షద్రవ్యములు, ఎండినపదార్థములు, ఈమొదలగు తీక్ష్ణద్రవ్యములనుభుజించి యుండెడివానినాడి వాతపిత్తరోగముగలవాని నాడి చందంబున నడుచుచుండును.

ప్రాతఃకాలము, మధ్యాహ్నకాలము, సాయంకాలము,

రాత్రికాలము, వీటియందల నాడీలక్షణము.

శ్లో॥ ప్రాతస్స్నిగ్ధమయీనాడిమధ్యాహ్నేప్యుష్ణతాన్వితా। సాయాహ్నేధావమానాచరాత్రౌవేగవివర్జితా॥ ౭౫॥

తా॥ నాడి ప్రాతఃకాలంబున కోమలంబుగను, మధ్యాహ్నంబున నుష్ణగతిగను సాయాహ్నంబున నతివేగంబుగను, రాత్రులయందు వేగరహితంబుగను, నడుచుచుండును.

బంధింపబడినసిరోగి నాడీలక్షణము.

శ్లో॥ ప్రకృతిస్థాతుసానాడీసదాజ్ఞేయాభిషగ్వరైః। అంగగ్రహణనాడీనాంభవంతిమంథరప్లవాః॥ ౭౬॥

తా॥ పైనజెప్పంబడిన మాత్రిక స్వభావముగ యుండెడివాడు పాశాదిబద్ధుండైనపుడు వానినాడి స్థూలగతి, అల్పగతి, మండూకగతి, వీటితోగూడియుండును.

జ్వరదాహసన్నిపాత నాడీలక్షణము.

శ్లో॥ ప్లవప్రబలతాంయాతిజ్వరదాహాభిభూతయే। సన్నిపాతికరూపేణభవంతిసర్వవేదనాః॥ ౭౭॥

తా॥ మిగుల తాపయుక్తమగు జ్వరముగల రోగికి నధికముగ చెమట వడియుచుండుటయగాక నాడియు సన్నిపాతంబువలె నడుచుచుండును. మరియు పైన నుడహరింపబడిన లక్షణంబులుగల జ్వరము, దాహము, ఇవి సన్నిపాతంబున గలిగెనేని యనేక వేదనలు జనించు.

జ్వరప్రకోప నాడీలక్షణము.

శ్లో॥ జ్వరప్రకోపేధమనీసోష్మావేగవతీభవేత్॥ ౭౮॥

తా॥ జ్వరప్రకోపంబున నాడి వేడిమిగను, అతి వేగముగను, నడుచుచుండును.

జ్వరవాతసంభోగరాత్ర్యుషఃకాల నాడీలక్షణము.

శ్లో॥ జ్వరేచవక్రంధావంతితథాచమరుతఃప్లవే। రమణాంతేనిశిప్రాతస్తృష్ణాదపిశిఖోపమా॥ ౭౯॥

తా॥ జ్వరము, వాతరోగము, వీటియందు నాడి సంకరగ నడుచు. మఱియు స్త్రీసంభోగాంతమందును, రాత్రులయందును, అరుణోదయకాలంబునను, నాడి ఉష్ణముతోగూడి రోమాకారంబుగ నడుచుచుండు.

పిత్తజ్వరము, కఠినాహారము, వీటియందలి నాడీలక్షణము.

శ్లో॥ ద్రుతాచసరళాదీర్ఘాశీఘ్రాపిత్తజ్వరేభవేత్ । శీఘ్రమాహననంనాడకాఠిన్యాచ్చలతేతథా॥ ౮౦॥

తా॥ పిత్తజ్వరంబున నాడి సరళంబై ద్రుతగతితోగూడి దీర్ఘంబుగను, శీఘ్రముగను, నడుచుచుండు. కఠినద్రవ్యములను సేవించినపుడు నాడి “ఒకని ప్రహరించుటకై పఱుగిడువాని చందంబున” శీఘ్రముగ నడుచుచుండు.

మలాజీర్ణము, శ్లేష్మదోషము, వీటియందలి
నా డీ ల క్ష ణ ము.

శ్లో॥ మలాజీర్ణేననితరాంస్పందనంపరికీర్తితమ్ । నాడీతంతుసమామందాశీతలాశ్లేష్మదోషజా॥ ౮౧॥

తా॥ మలాధిక్యమునందును, అజీర్ణమునందును, నాడి “తంతువుభంగి” చలింపుచుండు. శ్లేష్మాధిక్యంబున నాడి శీతలముగను, మందముగను, నడుచుచుండు.

వాతపిత్తము, శ్లేష్మవాతము, వీటియందలి
నా డీ ల క్ష ణ ము.

శ్లో॥ చంచలాతరళాస్థూలాకఠినావాతపిత్తజా। ఈషచ్చదృశ్యతేతూష్ణామందాస్యాచ్ఛ్లేష్మవాతజా॥ ౮౨॥

తా॥ వాతపిత్తదోషంబున నాడి చంచలముగను, ప్రకాశముగను, స్థూలముగను, కఠినముగను, నడుచుచుండు. మఱియు శ్లేష్మవాతరోగంబున నాడి కించిదుష్ణంబుగను, మందముగను, నడుచుచుండు.

అల్పశ్లేష్మము, ప్రబలవాతము, ఉష్ణవాతము,
వీటియందలి నాడీలక్షణము.

శ్లో॥ నిరంతరంఖరంరూక్షం మందశ్లేష్మాతివాతలా । ఝూక్షవాతభవేతస్యనాడీస్యాత్పిండసన్నిభా॥ ౮౩॥

తా॥ అల్పశ్లేష్మదోషమునందును, ప్రబల వాతదోషమునందును, నాడి సంతతము తీక్ష్ణంబుగను, ఉష్ణముగను, నడుచుచుండు. ఉష్ణవాతంబున నాడి పిండమువలె “బొద్ధాకారముగ” నడుచుచుండు.

## సహజవాతము, తీవ్రవాతము, వీటియందలి నాడీలక్షణము.

శ్లో॥ సౌమ్యాసూక్ష్మాస్థిరామందానాడీసహజవాతజా । స్థూలావకఠినాశీఘ్రాస్పందతేతీవ్రమారుతే॥ ౮౪॥

తా॥ సహజవాతంబున నాడి సౌమ్యంబుగను, సూక్ష్మముగను, స్థిరముగను, మందముగను, నడుచుచుండును. మఱియు తీవ్రవాతంబున నాడి స్థూలముగను, కఠినముగను, శీఘ్రముగను, నడుచుచుండును.

## జ్వరప్రకోపము, కామము, క్రోధము, వేగము, రోధము, చింత, ఇవిగలవాని నాడీలక్షణము.

శ్లో॥ జ్వరప్రకోపేధమనీసోష్మావేగయుతాభవేత్ । కామాత్క్రోధాద్వేగరోధాత్క్షీణాచింతాభరప్లుతాత్॥ ౮౫॥

తా॥ కామము, క్రోధము, మలమూత్రాది నిరోధము, చింత, అభిఘాతము, వీటిచే జ్వరము ప్రకోపించెనేని నట్టి కాలంబున నాడి ఉష్ణంబుగను, అతివేగముగను, నడుచుచుండును.

## దుష్టరక్తనాడీలక్షణము.

శ్లో॥ మధ్యేకరేవహేచ్చాన్నాడీయదిసంతర్పితాధ్రువమ్। తదానూనంమనుష్యాణాంరుధిరాపూరితామలాః॥ ౮౬॥

తా॥ దుష్టరక్తము దేహంబున వృద్ధిజెందెనేని యారక్తము పచ్యమానాశయమునందలి మలంబుతో జేరు. అప్పుడు నాడి సంతాపయుక్తమై మధ్యహస్తంబున చలింపుచుండును.

## భూతజ్వరము, ఏకాహికజ్వరము, విషమజ్వరము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ భూతజ్వరేనేకఇవాతివేగాధావంతినద్యోహియథాబ్ధిగామాః। ఏకాహికేనక్వచనప్రయాతేశ్రాంతగామావిషమజ్వరేణ॥ ౮౭॥

తా॥ భూతజ్వరంబున నాడి "సముద్రంబునబడబోయెడినదులు ప్రవహించుచందంబున" అతివేగంబుగనడుచుచుండును. మఱియు ఏకాహికము, విషమజ్వరము, వీటియందు నాడి కొంతకాలం బతివేగంబుగను, విశ్రాంతిజెందియు, నడుచుచుండును.

## ద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక, జ్వరములనాడీలక్షణము.

శ్లో॥ ద్వితీయకేవాథతృతీయతుర్యయోర్గచ్ఛంతితప్తాభ్రమరక్రమేణ॥

మలభేదము, గ్రహణీరోగము, అతిసారభేదము, విలంబికము,
ఆమాతిసారము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ భేదేనశాంతా గ్రహణీగదేననిర్వీర్యరూపాత్వతిసారభేదే।
విలంబికాయాంప్లవగాకదాచిదామాతిసారేపృథులాతథాచ॥ ౯౯॥

తా॥ నాడి మలభేదంబున శాంతముగను, గ్రహణీరోగము, అతిసారము, వీటి యందు తేజోహీనంబుగను, విలంబికయను రోగంబున పడవవలెను, ఆమాతిసారంబున బ్రేలుచుండెడు చందంబునను, నడుచుచుండు.

మూత్రమల నిరోధము, విడ్గ్రహము, విషూచిక,
వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ నిరోధేమూత్రశకృతో విడ్గ్రహేతితరాంశ్రితాః। విషూచి కాభిభూతేచభవంతిభేకవత్క్రమాః॥ ౧౦౦॥

తా॥ మలమూత్రములను నిరోధించినవానినాడి అతివేగంబుగ నడుచుచుండు. మఱియు విషూచికారోగంబున నాడి కప్పవలె నడుచుచుండు.

అనాహము, మూత్రకృచ్ఛ్రము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ అనాహేమూత్రకృచ్ఛ్రేచభవేన్నాడీగరిష్ఠతా॥ ౧౦౧॥

తా॥ అనాహకమనెడి కామిలారోగము, మూత్రకృచ్ఛ్రము, వీటియందు నాడి గరిష్ఠముగ నడుచుచుండు.

వాతరోగము, శూల, మరుత్ప్లవను, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ వాతేనశూలేనమరుత్ప్లవేనసదోపవక్రాహిసిరావహంతి॥

తా॥ వాతరోగము, శూలరోగము, మరుత్ప్లవము, వీటియందు నాడి వక్రముగ నడుచుచుండు.

పైత్యము, ఆమశూల, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ జ్వాలాముఖీపి త్తవిచేష్టితేనసామేనశూలేనచపుష్టిరూపా॥

తా॥ పైత్యరోగంబున నాడి "జ్వాలంబోలి" ధగధగయనియు, ఆమశూలంబున పుష్టిగను, నడుచుచుండు.

ప్రమేహము, ఆమదూషణము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ ప్రమేహేగ్రంధిరూపాచప్రసుప్తాచామదూషణే॥ ౧౦౪॥

తా॥ ప్రమేహంబున నాడి మిశ్రమంబై గ్రంథిరూపంబుగను, ఆమదోషంబున నిదురగాంచినటులను, నడుచుచుండు.

విషదోషము, విష్టంభవాతము, గుల్మము, అత్యర్థవాత అసన్న
మాప్తికాలము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ ఉత్సెచ్ఛరూపావిషరిష్టికాయాం విష్టంభగుల్మేనచవక్రరూపా। అత్యర్థవాతేనఅధస్ఫురంతీఉత్తానభేదిన్యసమాప్తికాలే॥ ౧౦౫॥

తా॥ నాడి విషదోషంబున యూర్ధ్వగతి గలిగయుండు, విష్టంభ గుల్మరోగంబుల మిగుల అధోభాగంబునను, వాయుసమాప్తికాలంబున ఊర్ధ్వభాగంబున నెగసిబడుచు నట్లును నడుచుచుండు.

గుల్మము, కంపము, పరాక్రమము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ గుల్మేనకంపేనపరాక్రమేణపారావతస్యేవగతింకరోతి॥

తా॥ గుల్మరోగము, కంపము, పరాక్రమము, వీటియందు నాడి పావురపిట్టవలె నడుచుచుండు.

వ్రణము, భగందరము, వీటియందు నాడీలక్షణము.

శ్లో॥ వ్రణార్థంకరిసేదేహేప్రయాతిపైత్తికంక్రమమ్। భగన్దరానురూపేణనాడీవ్రణనివేదనే॥ ౧౦౬॥

తా॥ వ్రణము,భగందరము, ఇవిగలవానినాడి పైత్యోల్బణంబుగనడుచుచుండు.

వాంతుడు, శల్యాభిహతుడు, వేగావరోధుడు,
వ్యాకులుడు, వీరినాడీలక్షణము.

శ్లో ॥ వాంతస్యశల్యాభిహతస్యజంతోర్వేగావరోధాకులతస్య భూయః। గతిర్ద్విధత్తేధమనీగజేంద్రమరాళమానేవకఫోల్బణేన॥ ౧౦౭॥

తా॥ వమనంబొనర్చికొనినవాడు, శల్యముచే నిజదేహంబున కభిఘాతము జెందినవాడు, వేగావరోధుడు, వీరలనాడి మదించిన గజము, హంస, వీటివలె నడుచుచుండుటయగాక శ్లేష్మంబును నధికముగ బ్రకోపించియుండు.

నాడీజ్ఞానరహితుడు శ్లాఘనకనర్హుడనుట.

శ్లో॥ నాడీజ్ఞానంవినాకశ్చిత్సత్సునశ్లాఘ్యతాంవ్రజేత్ । తస్మాద్విద్వాన్ప్రియత్నేనతజ్జ్ఞానంసముపాచరేత్॥ ౧౦౮॥

తా॥ నాడీజ్ఞానంబునెఱుంగని వైద్యుడు విద్వాంసులగు వైద్యులసభలలో శ్లాఘింపబడనేరడు. కావున నాడిజ్ఞానమును అవశ్యముగ వైద్యుడు నెఱుంగవలయు.

## గ్రంథానుసంధానదేశకాలప్రకరణ నాడీజ్ఞానము.

శ్లో॥ క్వచిద్గ్రంథానుసంధానాత్కాలదేశవిభాగవతః । క్వచి
త్ప్రకరణాచ్చాపినాడిజ్ఞానంభవేదిహ॥ ౧౧౦॥

తా॥ ఈనాడీశాస్త్రంబు నెఱుంగంగోరువారు కొన్నినాడులగతిని గ్రంథానుసంధానంబువలనను, కొన్నిటిని వసంతాది కాలభేదంబులవలనను, కొన్నినాడులను దేశభేదంబులవలనను, కొన్నిటిని తత్కాలప్రకరణమువలనను, నెఱుంగవలయు.

## నాడీజ్ఞానప్రాప్తిలక్షణము.

శ్లో॥ సద్గురోరుపదేశాచ్చ దేవతానాంప్రసాదతః । నాడీపరిచ
యోలోకేప్రాయఃపుణ్యేనజాయతే॥ ౧౧౧॥

తా॥ మఱియు పైనాడీజ్ఞానము పూర్వజన్మ తపఃఫలంబుచే లభించెడు సద్గురూపదేశముచేతను, దేవతా ప్రసాదముచేతను, గలుగు.

## శాస్త్రీయమతానుసార ప్రత్యక్షనాడీజ్ఞానము.

శ్లో॥ స్వస్థానాందేహినాందేహేవయోవస్థావిశేషతః । ప్రచ
లంతియథానాడ్యస్తత్సజ్ఞ్యానమిహోచ్యతే॥ ౧౧౨॥

తా॥ రోగరహితులగు మనుజుల బాల్య యౌవన వృద్ధత్వములయందలి నాడీగతి విశేషంబుల దెలియఁజేసెద.

శ్లో॥ సార్థద్వయపలఃకాలోయావద్గచ్ఛతిజన్మతః। తావత్ప్రకం
పతేనాడిచత్వారింశచ్ఛతాధికమ్॥ ౧౧౩॥

తా॥ మానవుడు జనించిన క్షణమునందు నతనినాడి యొకఘంటకాలములోపల (౧౪౦) మారులు చలింపుచుండు.

శ్లో॥ తదూర్ధ్వంవత్సరంయావత్సార్థద్వయపలేనసా। ముహుః
ప్రకంపమాధత్తేత్రింశద్వారంశతోత్తరమ్॥ ౧౧౪॥

తా॥ జనించిన కాలము మొదలుకొని యొకవత్సరమువరకు ఆతనినాడి యొకఘంటకాలములోపల (౧౩౦) పర్యాయములు చలింపుచుండు.

శ్లో॥ ఉపరిష్టాదాద్వితీయాద్వత్సరాత్తావత్కాలేశరీరిణః । తతఃప్ర
కంపతేనాడీదశాధికశతంముహుః॥ ౧౧౫॥

తా॥ ఆకాలము మొదలుకొని రెండువత్సరములు గతించువరకు (౧౧౦) మార్లు నాడి చలింపుచుండు.

శ్లో॥ తతస్త్రివత్సరంవ్యాప్యదేహినాంధమనీపునః। ముహుఃప్ర
కంపతేతద్వత్సార్థద్వయపలేశతమ్॥ ౧౧౬॥

తా॥ రెండువత్సరములు మొదలుకొని మూడువత్సరములవరకు (౧౧౦) మారులే నాడి చలింపుచుండు.

శ్లో॥ తతస్త్వాసప్తమాద్వర్షాన్నవతిస్స్యాత్ప్రవేపనమ్। ధమన్యాస్తస్మిన్తేకాలేప్రత్యక్షాదనుభూయతే॥ ౧౧౭॥

తా॥ నాలవవత్సరము మొదలుకొని, యేడవవత్సరమువరకు (౯౦) మార్లు నాడి చలింపుచుండు. (ఇది ప్రత్యక్షానుభవము.)

శ్లో॥ తతశ్చతుర్దశంతావత్పంచాశీతిప్రవేపనమ్।త్రింశద్వర్షాణ్యభివ్యాప్యతతో ఽ శీతిప్రకీర్తితమ్॥ ౧౧౮॥

తా॥ ఏడవవత్సరము మొదలుకొని పదునాలుగవ వత్సరమువరకు (౮౫) మార్లును, పదునాలుగవ వత్సరము మొదలుకొని ముప్పదివత్సరములవరకు (౮౦) మార్లును నాడి చలింపుచుండు.

శ్లో॥ శతార్ధవత్సరంవ్యాప్యకంపనంపంచసప్తతి । తతోఽశీతాప్రకథితంషష్టివారంప్రవేపనమ్॥ ౧౧౯॥

తా॥ ముప్పదివత్సరములు మొదలుకొని యేబదివత్సరములవరకు (౭౫) మార్లును, ఏబదివత్సరములు మొదలుకొని యెనుబదివత్సరములవరకు (౬౦) మార్లును, నాడి చలింపుచుండు.

శ్లో॥ వయోవస్థాక్రమేణైవంక్షీయంతేగతయోముహుః । సార్ధద్వయపలేకాలేనాడీనాముత్తరోత్తరమ్॥ ౧౨౦॥

తా॥ జన్మప్రభృతి వయోవస్థాక్రమంబుగా నాడుల కంపనమునుతగ్గుచుండు.

శ్లో॥ ఏవంబహువిధాదోషైర్గాత్రత్తల్లింగానుబోధినీ । నాడీనాంచగతిస్తద్వద్భవేత్కాలాత్పృథక్పృథక్॥ ౧౨౧॥

తా॥ ఇటుల జన్మప్రభృతి యెనుబది వత్సరములవరకు నాడుల కంపనముయొక్క సంఖ్యవ్యవస్థితముగానుండ మధ్యకాలంబున జ్వరాదిరోగములు ప్రసక్తియయ్యెనేని నపుడురోగజ్ఞానమునకు హేతుభూతంబగు నాడీగతసంఖ్యయు వ్యత్యస్తంబగు.

శ్లో॥ హృదయస్యబృహద్భాగస్సంకోచంప్రాప్యతేపది। ప్రసారయేత్తదానాడీంవాయునారక్తవాహినీమ్॥ ౧౨౨॥

తా॥ హృత్పిండమందలి ప్రదేశావకాశము వాయుగతివిశేషముచే సంకోచము జెందెనేని అపుడు రక్తవాహినులగు నాడులను బ్రసరించునటులంజేయు.

శ్లో॥ నాడీగతిరతిక్షీణాభవేన్మలవిభేదతః । జీర్ణజ్వరాదల్పరక్తాద్దుర్బలత్వాచ్చతాదృశీ ॥ తర్పయన్త్యసృజంచేహాన్యాధూరైగణతిబంధతః। చంచలాతేజఃపుంజాచదుర్బలాక్షీణదాధరా॥ ౧౨౩॥

తా॥ నాడులు వాయుసంచారముద్వారా శరీరమున రక్తము వ్యాపించుటుల జేయుచున్నయవి. ఆరక్తదోష విశేషమువలన యీనాడులకు ప్రతిబద్ధకము గలిగె నేని అప్పుడు నాడులు చంచలముగను, తేజఃపుంజగతికలవిగను, దుర్బలముగను, క్షీణ గతి కలవిగను, నడుచుచుండు.

చంచలాగతి నాడీలక్షణము.

శ్లో॥ రక్తోష్ణశీఘ్రగానాడీ జ్వరేచచంచలాభవేత్॥ ౧౨౪॥

తా॥ రక్తముచే నుష్ణము జనించెనేని అప్పుడు నాడి యతివేగముతోగూడి చంచలముగ నడుచుచుండు.

తేజఃపుంజగతిలక్షణము.

శ్లో॥ జ్వరారంభేతథావాతే తేజఃపుంజగతిస్సరా॥ ౧౨౫॥

తా॥ జ్వరారంభమునను, వాతరోగంబునను, నాడి తేజః పుంజగతికలదియై నడుచుచుండు.

దుర్బలుడు, క్షీణనాడిగలవాడు, వీరినాడీలక్షణము.

శ్లో॥ దుర్బలేజ్వరరోగేచఅతిసారేప్రవాహికే। దుర్బలాక్షీణదా నాడీ ప్రబలాప్రాణఘాతికా॥ ౧౨౬॥

తా॥ దుర్బలరోగము, జ్వరము, అతిసారము, గ్రహణీరోగము, వీనియందునాడి మిగులదుర్బలముతోగూడియుండు. అట్లుండక ప్రబలంబుగనుండెనేని ప్రాణఘాతినియగు.

ధీరాగతినాడిలక్షణము.

శ్లో॥ బహుకాలగతారోగాసానాడీధీరగామినీ॥ ౧౨౭॥

తా॥ బహుకాలంబుగ రోగపీడితుడుగ నుండెడువానినాడి ధీరనాడియనంబడు.

ఇతి నాడ్యుత్పత్తినాడీస్థానస్వరూప కూర్మాకృతిస్థూలనాడీసం
ఖ్యారోగాది పరిజ్ఞాన సాధ్యా సాధ్యలక్షణ మృత్యుదినాది
నిరూపణ యావద్ద్రవ్యాదిభక్షణ జన్యయదూర్ప్రగతి
తల్లక్షణడాక్టీరియ నాడిజ్ఞానం సమాప్తమ్.

ఇట్లు నాడ్యుత్పత్తి, నాడీస్థాన స్వరూపము, కూర్మాకృతి,
స్థూలనాడీసంఖ్య, రోగాదిపరిజ్ఞానము, సాధ్యాసాధ్య
లక్షణము, మృత్యుదినాది నిరూపణము, ద్రవ్యాది
భక్షణ నాడీజ్ఞానము, వాటిలక్షణము,
డాక్టీరియనాడీజ్ఞానము ముగిసెను.



శ్రీరస్తు.

అశ్వనీదేవలచే

రచియింపబడినదియు

శ్రీకృష్ణసూరికృత వ్యాఖ్యాసహితంబునునగు

# నాడీనక్షత్రమాల.

యామళాద్యనేకగ్రన్థసంగృహీతంబగు

నాడీనిర్ణయము

ఇవి,

లేట్, పిడుగు - సుబ్బరామయ్యగారిచే

ఆన్ధ్రతాత్పర్యయుక్తంబుగరచియింపబడి

పిడుగు * వేంకట్రావుపంతులుగారిచే

స్వకీయ,

హిందురత్నాకరముద్రాక్షరశాల

యందు (ఏడవతూరి)

ముద్రించి ప్రచురింపంబడియె.

MADRAS

౧౯౧౦ సం॥ జనవరి నెల.

శ్రీ ర స్తు.

## నాడీనక్షత్రమాల విషయసూచిక.



## నా డీ ని ర్ణ య వి ష య సూ చి క.

—(*)—

విషయసూచిక - ముగిసెను.





శ్రీ ర స్తు.

అశ్వనీదేవతాభ్యాంనమః.

# నాడీనక్షత్రమాల.

శ్లో॥ అంగుష్ఠమూలమాశ్రిత్య చాంగుళత్రయమాత్రకా । యవబీజ
ప్రమాణేననాడీసర్వాంగసఙ్గతిః ॥

వ్యా ॥ అంగుష్ఠేతి॥ సర్వాంగసఙ్గతిః సర్వస్మిన్నంగేసంగతిః - సంబంధః వ్యాపనరూపః - యస్యాంసాతథోక్తానాడీ - అంగుష్ఠమూలమాశ్రిత్య హస్తాంగుష్ఠ మూలభూతకూర్పరప్రదేశమవలంబ్యస్థితాసతీ అంగుళత్రయమాత్రకా - అనామికా మధ్యమాతర్జనీ రూపాంగుళత్రయపరిమిత ప్రదేశమనుసృత్య - అనామికాదిక్రమేణ ప్రసారిణీ యవబీజప్రమాణేన యవబీజసదృశప్రమాణేన శోధ్యతామిత్యర్థః ॥

తా ॥ శరీరమంతయువ్యాపించియుండునట్టియు, హస్తమునుయొక్క అంగుష్ఠ మూలభూతమగు, కూర్పరప్రదేశమును ఆశ్రయించియుండునట్టియు, అనామికా మధ్యమ, తర్జనీరూపమగు, అంగుళత్రయపరిమితప్రదేశము, నాశ్రయించియుండు నట్టియు, అనామికాదిక్రమముగ ప్రసరించుచుండునాడి, యవబీజతుల్యప్రమాణము గలదిగనుండు, అనగా (పైజెప్పంబడిననాడులు, వాత, శ్లేష్మ, పిత్త, క్రమముగ త్రివిధంబులుగ విలసిల్లు.)

## ఆశ్చర్యనాడీ లక్షణము.

శ్లో॥ వాతపిత్తద్వయస్యాద్యోర్మధ్యేకఫగతిర్భవేత్ । ఇయంనాడీ
తథాశ్చర్యావిజ్ఞేయావైద్యపారగైః ॥

వ్యా॥ తాదృశనాడ్యాః వాత-శ్లేష్మ-పిత్త- రూపేణ త్రిధాభేదమభిప్రేత్యక్ర మేణతాఃలక్షయతి ॥ వాతేతి ॥ అద్యోరనామికాతర్జన్యోర్వాతపిత్తద్వయస్యగతిర్యథా భవేత్ - కోర్థః - యథాఅనామికాయాంనాడీగతిః - తాదృశనాడీవాతనాడీయథా తర్జన్యాంనాడీగతిః- తాదృశనాడీ పైత్యనాడీత్యేవంనాడీద్వయస్యలక్షణేజ్ఞాతస్యేత్థం

చానామికావృత్తిత్వేసతి నాడీత్వంవాతనాడ్యాఃలక్షణమ్- తర్జనావృత్తిత్వేసతినాడీత్వం- పిత్తనాడ్యాశ్చలక్షణమ్ - పరస్పరవ్యావృత్త్యర్థం సత్యంతనివేశః- తర్జన్యాఃఆదిమత్వం చాంగుష్ఠమూలంస్పృష్ట్వావర్త్యతేచోత్తరశ్లోకే ॥ సూ. లేచవహతేపిత్తమితి ॥ మధ్యే మధ్యమాయాఃయథానాడీభవేత్ - సా - కఫగతిః - ఇత్థంచ-మధ్యమావృత్తిత్వేసతి నాడీత్వం కఫనాడ్యా - లక్షణమితి - వేదితవ్యం-ఇయంనాడీతథాతేన ప్రకారేణఆశ్చర్యాఆశ్చర్యసంజ్ఞికేతి వైద్యపారగైర్విజ్ఞేయా - నిర్ధారణ్యామధ్యమాయాంయానాడీ తస్యాః కఫసంజ్ఞావాశ్చర్యసంజ్ఞాప్యస్తీత్యర్థః ఆశ్చర్యత్వంచమధ్య స్థితకఫస్యోపరి వాతపిత్తద్వయస్యపరస్పరాభిసరణదశాయాం కఫనాడీమస్పృష్ట్వైవవర్తిష్యమాణత్వాదన్వర్థసంజ్ఞాచేయంధన్వన్తరికృతా ద్రష్టవ్యా ॥

తా ॥ మొదటిదియగు అనామిక, తర్జనీస్థానముల, నాశ్రయించియుండువాత పిత్తరూపమగు నాడీద్వయముయొక్క, మధ్యస్థానము, కఫస్థానమని యెరుంగవలయు. అనగా, మధ్యమాంగుళీస్థానము నాశ్రయించియుండునట్టినాడి, కఫనాడియనియు, ఆశ్చర్యనాడియనియు, నామధేయద్వయముచేపిలసిల్లు. ఆశ్చర్యనాడియనగా (మధ్యమమునందుండు శ్లేష్మనాడికి ఉపరిభాగమునందు, పరస్పరాభిసరణసమయమున వాత, పిత్త, ధాతువులను, తానుస్పృశించకయుండుటయే.) ఆశ్చర్యత్వము.

## నాడీత్రయస్థానములు.

శ్లో॥ తర్జన్యాంపిత్తనాడీచ కఫనాడీచమధ్యమే । అనామిక్యాంవాత
నాడీవర్తతేనరజన్మనామ్ ॥

వ్యా॥ పూర్వశ్లోకేనైనవాతాది నాడ్యాశ్రయజ్ఞానస్యసాధ్యత్వేపి శిష్యబుద్ధివైశద్యార్థం వివిచ్యవాతాదినాడీస్థానానిజ్ఞాపయతి ॥ తర్జన్యామితి ॥ సర్వత్రసప్తమ్యాః ఆశ్రయత్వం తర్జన్యాంపిత్తనాడీ పిత్తనాడ్యాశ్రయభూతాతర్జనీత్యర్థః ఏవమేవోత్తరత్రాపిజ్ఞాతవ్యం - మధ్యమే - మధ్యమాంగుళౌనిత్యర్థః - నరజన్మనాంమనుష్యాణామేవఏవంవిధానాడీనిర్ధార్యా నాతిరిక్తజంతూనామితిభావః ॥

తా ॥ ఇపుడు, గ్రంథకర్త వాతాదినాడీస్థానముల తెలియజేయుచున్నాడు. తర్జనీస్థానము నాశ్రయించియుండునట్టినాడి, పిత్తనాడియనియు, మధ్యమాంగుళినాశ్రయించి యుండునట్టినాడి, కఫనాడియనియు, అనామికను, ఆశ్రయించియుండునట్టినాడి వాతనాడియనియు నెఱుంగవలయు.

అన్యచ్చ.

శ్లో॥ మూలేచవహతేపిత్తంమధ్యేచవహతేకఫః । అంతేచవహతే
వాయుర్వైద్యశాస్త్రస్యనిశ్చయమ్ ॥

వ్యా ॥ పూర్వంవాతనాడ్యాః - ఆదిమత్వంపిత్తనాడ్యాః - అంతిమత్వంచనాడీప్రసర దృష్ట్యానిరూపితం - ఇదానీంత్వంగుష్ఠమూలందృష్ట్వా - పిత్తనాడ్యాఃఆదిమత్వం - వాతనాడ్యాశ్చరమత్వంచవ్యవస్థాపయతి ॥ మూలేతి వైద్యశాస్త్రస్య వైద్యశాస్త్రప్రతిపాద్యధాతుపరీక్షణస్యలక్షణ జ్ఞాతవ్యమిత్యర్థః ॥

తా ॥ వాతనాడి మొదటిదనియు, పిత్తనాడిఅంత్యమనియు, నాడీసంచారక్రమముచే యిదివరకు జెప్పంబడియె. ఇపుడు అంగుష్ఠమూలము నాశ్రయించిన మొదటిది, పిత్తనాడియనియు, అంతమునందుండునది వాతనాడియనియు దెలియజేయుచున్నాడు. మనుజునికి అంగుష్ఠమూలమునందు పిత్తనాడియనియు, మధ్యమునందు కఫనాడియనియు, అంతమందు వాతనాడియుండుననియు, వైద్యశాస్త్రజ్ఞుల నిశ్చయమిట్టిదని నెఱుంగవలయు.

అన్యచ్చ.

శ్లో॥ ఆదౌవాయుఃకఫోమధ్యేఅంతేపైత్యంచవర్తతే । సర్వనాడీ
క్రమాదూహ్యంవైద్యశాస్త్రస్యలక్షణమ్ ॥

వ్యా ॥ రోగపరీక్షార్థం ధాతునిర్ధారణదశాయాంతుఅనామికాదిక్రమేణైవ ప్రేక్షితవ్యమిత్యభిప్రేత్యాహ - ఆదావితి ॥ సర్వంసుగమం ॥

తా ॥ వాతనాడి మొదటయుండుననియు, కఫనాడి మధ్యమునందుండుననియు, పిత్తనాడి అంతమునందుండుననియు, ఇటులరోగపరీక్షా కాలమునందు, అనామికాదిక్రమముగ నిరీక్షించందగు.

వాతాదినాడులయొక్క విశేషస్వాభావికగతులు.

శ్లో॥ వర్తాభూస్ఫుకకాకలావుకగతంపైత్యంజవంవర్తతే। మాలయూరేభసుహంసకుక్కుటగతిఃశ్లేష్మాఃస్థిరోవర్తతే । కూర్మవ్యాళజలూకమీనగమనాందోళోమరుద్వర్తతే । ఇత్యేవంత్రివిధా
విశేషచలనానాడీబుధైర్గ్రాహ్యతామ్ ॥

వ్యా ॥ వాతాదినాడీనాం - విశేషస్వాభావికగతిమాహ . వర్త్షాభూరితి॥ వర్త్షాభూర్మండూకః - శుకః - ప్రసిద్ధః - కాకశ్చ - లావుకః - తిత్తిరిః - (ఆంధ్ర) భాషాయాంతీతువ) తేషాంగతంగమనంభావేక్తః - తద్గమన సదృశనిశ్చితం. అతఏవజవంవేగవత్ - విధేయప్రాధాన్యాన్నపుంసకలింగతా - జవోవేగనివేగ చేతివిశ్వః . ఏవంవిధంసత్పైత్యంవర్తతే - ప్రసరతి - మాయూరఏవ - మయూరః - ఇభః. గజః. హంసః. మరాళః - కుక్కుటస్తామ్రచూడః - తేషాంగతిరివగతిర్యస్యాస్సాతథావిధః - అతఏవస్థిరః - మన్దప్రకారః - శ్లేష్మః - కఫనాడీవర్తతే - కూర్మః - కమఠః - వ్యాళః - కృష్ణసర్పవిశేషః - జలూకః - రక్తపాః - (ఆంధ్ర) భాషాయాంజలగ) బహువచననియమస్తస్థానపక్షఏవ - నాకారాన్తపక్షే రక్తపాస్తుజలూకాయాం స్త్రియాంమ్ని జలౌకసః - ఇత్యమరకోశేదర్శనాత్ ॥ తతః స్త్రియాః పుంవదిత్యాదినా-పుంవద్భావవివక్షాయాంజలౌక ఇతిసమాసేపుంలింగతా - మీనః - మత్స్యః - తేషాంగమనమివగమనంయస్యతథోక్తః- అతఏవవక్రః - డోలాందోళనవత్ కుటిలగతిః. మరుద్వాతనాడీవర్తతే - ఇత్యేవంరూపేణ - త్రివిధావిశేషచలనాతిసోవిధాః- ప్రకారాస్తాసాంవిశేషైశ్చలతీతితథోక్తాః ఇతిశబ్దః - విశేషపదవిశేషణంవా ఏవంవిధా నాడీ - బుద్ధైర్ధాతు నిర్ధారణసమర్థైర్గ్రాహ్యతాం - జ్ఞానవిషయీక్రియతామిత్యర్థః॥

తా ॥ పైత్యనాడి, కప్ప, చిలుక, కాకము, తిత్తిరిపక్షి, వీటిగమనముతో తుల్యగమనముగలదిగనుండుగాన మిగులవేగముగలదిగనుండు. కఫనాడి, నెమలి, గజము, హంస, కోడి, వీటిగమనముతోతుల్యగమనముగలదిగనుండునని యెరుంగవలయు. గాన నది స్థిరముగనుండు. వాతనాడి, తాబేలు, సర్పము, జలగ, మీనము పోల వీటిగమనముతోతుల్యగమనము గలదిగనుండుగాన, కుటిలగతిగలదిగనుండు. ఇటులబుద్ధిమంతులు పిత్తాదినాడుల గతివిశేషములు మూడువిధంబులుగనుండునని యెఱుంగవలయు.

మరణకాలవాతాదినాడీలక్షణమ్.

శ్లో॥ వాతాధిక్యో భవేదంతే మధ్యేశ్లేష్మాధికోభవేత్ । వాతాధిక్యో భవేదాదావంతేపిత్తాదికోభవేత్ ॥

వ్యా ॥ వాతనాడ్యాః - మనుష్యాణాం - ప్రాణప్రయాణసమయే - స్వస్థానంవిహాయ ॥ అవ్యస్థానేస్థిత్వా - ప్రకుప్యతీత్యాహ - వాతఇతి - అంతేప్రాణప్రయాణసమయేవాతః - వాతనాడీఅధికః ప్రకోపితోభవేత్ ౹ శ్లేష్మరోగోన్నతికాలేమధ్యే స్వస్థానభూతమధ్యమాంగుళౌ శ్లేష్మః - కఫః - అధికోభవేత్ - ఆదౌస్వస్థానభూతానామికాయాంవాతః - వాతనాడీ అధికోభవేత్ - ఆధిక్యంచమాంద్యాతిశయః- వాతరోగోన్నతిసమయఇతిశేషః - అంతేస్వాశ్రయభూతతర్జన్యాం పిత్తాధికఃపైత్యనాడీ అధికః - స్వభావసిద్ధవేగాపేక్షయా - ద్విగుణ - వేగోభవేత్ ॥

తా ॥ మనుజులకు, ప్రాణోత్క్రమణకాలమునందు, వాతనాడి, స్వస్థానమును వదిలి, స్థానాంతరమునందు నిలిచి, అతిమాన్ద్యమును జెందు. కఫనాడి, శ్లేష్మరోగాతిశయకాలమున స్వస్థానభూతమధ్యమాఙ్గుళియందధికవేగముగలదిగనుండు. వాతరోగాతిశయకాలమున, వాతనాడిస్వస్థానభూత, అనామికయందధిక మాన్ద్యముగలదిగనుండు, పిత్తనాడి, పిత్తరోగాతిశయకాలమున, స్వాశ్రయ భూతతర్జనియందు, స్వభావసిద్ధవేగముకంటె ద్విగుణవేగము గలదిగనుండు.

రోగనీరోగ నాడీలక్షణమ్.

శ్లో॥ నాడీత్రయీవక్రగతిఃశాస్త్రేస్మిన్రోగఉచ్యతే। నాడీత్రయీ
సమాస్యాచ్చేదరోగశ్శాస్త్రనిశ్చయం ॥

వ్యా ॥ నాడీత్రయీతి ॥ యథానాడీత్రయీవక్రగతిః - కుటిలగమనంతదా అస్మిన్శాస్త్రే వైద్యకేరోగఇత్యుచ్యతే - నాడీత్రయీసమానామికాదిక్రమేణ సమాన ప్రసారాస్యాచ్చేత్ ఆరోగః - రోగస్వాభావఃశాస్త్రలక్షణం - శాస్త్రేజ్ఞాపితమ్ ॥

తా ॥ వాత, శ్లేష్మ, పిత్త, నాడులుమూడును, వక్రగతిగలవిగనుండిన,రోగమనియు, మూడునాడులు సమగతిగనుండిన నీరోగమనియు నెరుంగందగు.

అథ బ్రహ్మ విష్ణు మహేశ్వరనాడీవిచారః.

శ్లో॥ శ్లేష్మకోబ్రహ్మసంజ్ఞస్స్యాత్పైత్యకోవిష్ణుసంజ్ఞకః।వాతఈశ్వ
రసంజ్ఞస్స్యాదితిధన్వన్తరేర్మతమ్ ॥

వ్యా ॥ నాడీనాంబ్రహ్మాదిసంజ్ఞామాహ - శ్లేష్మఇతి - శ్లేష్మకః - కఫనాడీబ్రహ్మసంజ్ఞః - బ్రహ్మేతిపరిభాషితస్స్యాత్ - ఏవమేవోత్తరత్రాపిద్రష్టవ్యం॥

తా ॥ కఫనాడి బ్రహ్మసంజ్ఞ గలదిగను, పిత్తనాడి విష్ణుసంజ్ఞ గలదిగను, వాతనాడి, ఈశ్వరసంజ్ఞ గలదిగనుండును. ఇటుల, ధన్వంతరి కఫ, పిత్త, వాత, నాడులకు బ్రహ్మాదిసంజ్ఞలను గల్పించె.

అథద్వంద్వనాడీ లక్షణ, ద్వంద్వజ్వరలక్షణైక
నాడీజ్వరలక్షణాన్యత్రత్రోచ్యంతే-
వాతపిత్తనాడీలక్షణమ్.

శ్లో॥ బ్రహ్మనాడ్యాంహంసగతావీశ్వరో వైష్ణవంస్పృశేత్ । త్రినా
డ్యోవక్రగతయోవాతపిత్తస్యలక్షణమ్ ॥

తా ॥ బ్రహ్మనాడ్యామితి ॥ బ్రహ్మనాడ్యాంకఫనాడ్యాం - హంసగతౌ - మందగతౌసత్యామిత్యర్థః - ఈశ్వరః - వాతనాడీ - వైష్ణవం - పైత్యనాడీంస్పృశేచ్చ యది - త్రినాడ్యోవక్రగతయః - భవేచ్చేత్ - వాతపిత్తస్యలక్షణమ్ -ఇయమేవతీవ్రగతిశ్చేత్ - వాతపిత్తజ్వరస్యలక్షణం - సైవమందాచేత్ - అంతర్గతజ్వరస్యలక్షణమితి వేదితవ్యం ॥

తా ॥ బ్రహ్మసంజ్ఞగల, కఫనాడి, మందగతి గలిగియుండినను, ఈశ్వరసంజ్ఞ గల వాతనాడి, విష్ణుసంజ్ఞ గల పిత్తనాడినిస్పృశించినను, మూడునాడులును, వేరువేరుగ, వక్రగతులుగలదిగనుండినను వాతపిత్తలక్షణమని ఎరుంగవలయు. యీవాతనాడితీవ్రగమనముగలదిగనుండిన, వాతపిత్తజ్వరమనియు, యిదియే మందగమనముగలదిగనుండిన, అంతర్గతజ్వరమనియు నెరుంగవలయు.

పిత్తవాయునాడీలక్షణమ్.

శ్లో॥ బ్రహ్మనాడ్యాంహంసగతౌవిష్ణురీశ్వరకంస్పృశేత్ ।త్రినాడ్యో
వక్రగతయఃపిత్తవాయోశ్చలక్షణం ॥

వ్యా ॥ బ్రహ్మనాడ్యామితి ॥ బ్రహ్మనాడ్యాంశ్లేష్మనాడ్యాం - హంసగతౌ - సత్యాం - విష్ణుః పైత్యనాడీ - ఈశ్వరకం - వాతనాడీం - స్పృశేచ్చేత్ - త్రినాడ్యో వక్రగతయశ్చేత్ - పిత్తవాయోర్లక్షణంఇయమేనతీవ్రాచేత్ - పైత్యవాయుజ్వరస్య మందాచేత్ - తదంతర్గతజ్వరస్యాపి లక్షణమితి - జ్ఞాతవ్యం॥

తా ॥ కఫనాడికి, మందగమనముగలిగియుండినను, విష్ణుసంజ్ఞ గల పైత్యనాడి రుద్రసంజ్ఞ గల వాతనాడినిస్పృశించినను, కఫ,పిత్త, వాతనాడులుమూడును,వక్రగమనముగలిగియుండినను. పిత్తవాయువనియును. యీ[illegible]వాతనాడికి. తీవ్రగతిగలిగి

యుండిన, పిత్తవాయుజ్వరమనియు, మందగమనముగలిగియుండిన, అంతర్గతపైత్యవాతజ్వరమనియు నెఱుఁగవలయు.

### శ్లేష్మపిత్తనాడీలక్షణమ్.

శ్లో॥ తమోనాడ్యాంకూర్మగతౌసాత్త్వికంరాజసస్స్పృశేత్। త్రినా
డ్యోర్వక్రగతయోఃశ్లేష్మపిత్తస్యలక్షణం ॥

వ్యా ॥ తమోనాడ్యామితి ॥ తమోనాడ్యాం - ఈశ్వరస్యతమస్స్వరూపత్వాత్ - వాతనాడ్యామిత్యర్థః - కూర్మగతౌవక్రగతౌసత్యాం - రాజసఃరజోగుణస్వరూపకబ్రహ్మసంజ్ఞక కఫనాడీ - సాత్త్వికం - శుద్ధసత్త్వరూపవిష్ణుసాంజ్ఞిక పైత్యనాడీంస్పృశేచ్చేత్ - త్రినాడ్యోర్వక్రగతయశ్చేత్ శ్లేష్మపిత్తస్యలక్షణం - ఇయమేవతీవ్రాచేత్ - శ్లేష్మపిత్తజ్వరస్య - మందాచేత్ - తదంతర్గతస్యాపి లక్షణం - బోద్ధవ్యం॥

తా ॥ తమస్స్వరూపమగు వాతనాడి, మందగతిగలిగియుండినను, రజోగుణస్వరూపమగు కఫనాడి, శుద్ధసత్త్వరూపమగు విష్ణుసంజ్ఞగల పైత్యనాడినిస్పృశించినను మూడునాడులకు వక్రగతిగలిగియుండినను, పిత్తశ్లేష్మమని నెఱుంగందగు. మఱియు నీపైత్యనాడి, వేగముగనడిచెనేని, శ్లేష్మపిత్తజ్వరమనియు, ఇదియు, మందముగ నడిచెనేని, అంతర్గతశ్లేష్మపిత్తజ్వరమనియు నెఱుంగందగు.

### పిత్తశ్లేష్మనాడీలక్షణమ్.

శ్లో॥ మృతనాడ్యాంమందగతౌవర్ధకోజీవకంస్పృశేత్ । త్రినాడ్యో
వక్రగతయోఃపిత్తశ్లేష్మస్యలక్షణమ్ ॥

వ్యా ॥ మృతనాడ్యామితి ॥ మృతనాడ్యాంవాతనాడ్యాం - మందగతౌసత్యాం వర్ధకః - పైత్యనాడీ - జీవకం - కఫనాడీం - స్పృశేత్ - త్రినాడ్యోర్వక్రగతయశ్చేత్ - పిత్తశ్లేష్మస్యలక్షణం - తత్రతీవ్రమందగత్యోః పిత్తశ్లేష్మజ్వరస్యతదంతర్గతస్యాపి - లక్షణం - జ్ఞాతవ్యం - ఏవంచవాతశ్లేష్మపిత్తానాంయథాక్రమం - మృతజీవార్థకజీవకసంజ్ఞాఅపి - నివృత్తాఇతి ఫలితార్థః - తత్ర వాతపైత్యనాడ్యోః పార్శ్వభాగాదిచలనేసతివ్యాధేః - కించిద్దుస్సాధ్యత్వం - శ్లేష్మనాడ్యాస్తథాచలనే అమయస్యాసాధ్యత్వమేవేతిహార్దోభావః ॥

తా ॥ మృతసంజ్ఞగల వాతనాడి, మందగతిగలిగియుండినను, అర్థకమనుసంజ్ఞగలపైత్యనాడి, జీవకమనుసంజ్ఞగల కఫనాడిని స్పృశించినను, వాత, పిత్త, శ్లేష్మ

నాడులకు, వక్రగతిగలిగియుండినను, పిత్తశ్లేష్మమనియు, ఈఅర్థకసంజ్ఞగల పైత నాడి, వేగముగనడచిన పిత్తశ్లేష్మజ్వరమనియు, మందగమనముగలదిగనుండిన అంతర్గత పిత్తశ్లేష్మజ్వరమనియును నెరుంగందగు ఇటుల, వాత, శ్లేష్మ, పిత్తనాడులు, క్రమముగ, మృతమనియు, అర్థకమనియు, జీవకమనియు, సంజ్ఞలుగలవిగనుండు. మఱియు, నీమూడునాడులలో, వాత, పైత్యనాడులకు, పార్శ్వచలనముగలిగిన, వ్యాధి కొంచము దుస్సాధ్యమనియు, అటులశ్లేష్మనాడికిసగా పార్శ్వచలనముగలిగిన, వ్యాధి అసాధ్యమనియు నెరుంగందగు.

## శ్లేష్మవాయులక్షణమ్.

శ్లో॥ విష్ణునాడ్యాంమందగతౌపీశ్వరంబ్రహ్మసంస్పృశేత్ । త్రినాడ్యోవక్రగతయఃశ్లేష్మవాయోశ్చలక్షణమ్ ॥

వ్యా ॥ విష్ణునాడ్యామితి ॥ విష్ణునాడ్యాం పైత్యనాడ్యాంమందగతౌసత్యాం బ్రహ్మశ్లేష్మనాడీ ఈశ్వరంవాతనాడీంస్పృశేచ్చేత్ - త్రినాడ్యఃవక్రగతయశ్చేత్- శ్లేష్మవాయోర్లక్షణం శ్లేష్మనాడ్యాంవాతనాడీ స్పర్శగతి సాధారణాచేత్ - శ్లేష్మవాయుః తీవ్రాచేత్- తజ్జ్వరఃమందాచేత్- తదంతర్గతశ్చేతితాత్పర్యం॥

తా ॥ పైత్యనాడికి మందగతిగలిగియుండినను, కఫనాడి, వాతనాడిని స్పృశించినను, మూడునాడులకు వక్రగమనముగలిగినను, శ్లేష్మవాయువనియు, ఈశ్లేష్మనాడితీవ్రముగనడిచెనేని శ్లేష్మవాయుజ్వరమనియు, మందముగనడిచెనేని, అంతర్గత శ్లేష్మవాతజ్వరమనియు నెరుంగందగు.

## వాతశ్లేష్మనాడీలక్షణమ్.

శ్లో॥ అర్థనాడ్యాంమందగతౌమృతకోజీవకంస్పృశేత్ । త్రినాడ్యోవక్రగతయోవాతశ్లేష్మస్యలక్షణమ్ ॥

వ్యా ॥ అర్థనాడ్యామితి ॥ అర్థనాడ్యాం అర్థకసంజ్ఞకపిత్తనాడ్యామిత్యర్థః- తస్యాంమన్దగతౌసత్యాంమృతకః - వాతనాడీజీవకంశ్లేష్మనాడీం - స్పృశేచ్చేత్-త్రినాడ్యోవక్రగతయశ్చేత్ - వాతశ్లేష్మస్యలక్షణం - గతిశ్చేయంతీవ్రాచేత్ ; వాతశ్లేష్మజ్వరః - మందాచేత్-తదంతర్గతజ్వరః ప్రతిమన్తవ్యం ॥

తా ॥ అర్థకసంజ్ఞగల పిత్తనాడికి, మందగతిగలిగియుండినను, మృతసంజ్ఞగల వాతనాడి, జీవసంజ్ఞగల శ్లేష్మనాడిని స్పృశించినను, మూడునాడులు, వక్రముగ

నడిచెనేని, వాతశ్లేష్మమనియు, నీవాతనాడి, శీఘ్రముగనడిచెనేని, వాతశ్లేష్మ జ్వరమనియు, మందగతిగలిగియుండిన నది అంతర్గత వాతశ్లేష్మజ్వరమనియు, నెరుంగవలయు.

## వాతనాడీలక్షణమ్.

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వోర్మందగత్యోరుద్రనాడీగతిస్స్ఫుటా । త్రినాడ్యోర్వ
క్రగతయో విజ్ఞేయంవాతనాడికమ్॥ ❋

వ్యా॥ బ్రహ్మేతి॥ బ్రహ్మవిష్ణ్వోఃశ్లేష్మపైత్యనాడ్యోర్మందగత్యోస్సత్యోః-రుద్రనాడ్యాఃవాతనాడ్యాఃగతిఃస్ఫుటాచేత్ - త్రినాడ్యఃవక్రగతయశ్చేత్ - వాతనాడికం శుద్ధవాతనాడీతివిజ్ఞేయం గతిరస్యాస్తీవ్రాచేత్ కేవలవాతజ్వరః - మందాచేత్- తదంతర్గతశ్చేత్యభిజ్ఞేయమ్॥

తా॥ కఫపిత్తనాడులకు, మందగతిగలిగియుండగ, వాతనాడియొక్క గమనమస్ఫుటముగనుండి, మూడునాడులకు, వక్రగమనముగలిగెనేని శుద్ధవాతనాడియని నెరుంగవలయు. యీవాతగతి, తీవ్రముగనుండిన, కేవలవాతజ్వరమనియు, మందముగనుండిన, అంతర్గతవాతజ్వరమనియు నెరుంగవలయు.

## కఫరోగనాడీలక్షణమ్.

శ్లో॥ రుద్రవిష్ణ్వోర్మందగత్యోఃబ్రహ్మనాడీగతిస్స్ఫుటా। త్రినాడ్యో
వక్రగతయఃవిజ్ఞేయం శ్లేష్మలక్షణమ్॥ ❋

వ్యా॥ రుద్రేతి ॥ రుద్రవిష్ణోఃవాతపిత్తనాడ్యోర్మందగత్యోస్సత్యోఃబ్రహ్మనాడీగతిః శ్లేష్మనాడీసంచారఃస్ఫుటాచేత్ - త్రినాడ్యోవక్రగతయశ్చేత్ శ్లేష్మలక్షణమ్ ॥ శుద్ధశ్లేష్మవ్యాధిస్వరూపమితిజ్ఞేయం- గతేస్తీవ్రత్వేశుద్ధశ్లేష్మజ్వరఃమందత్వేతదంతర్గతశ్చేత్యభిప్రాయః॥

తా॥ వాత, పిత్త, నాడులకు, మందగతిగలిగియుండగ, కఫనాడీసంచారము స్ఫుటముగనుండి, మూడునాడులు, వక్రముగనడిచెనేని, శుద్ధశ్లేష్మమనియు, యీకఫనాడీగతి తీవ్రముగనుండిన, శ్లేష్మజ్వరమనియు, మంధముగనడిచిన, అంతర్గత శ్లేష్మజ్వరమనియును నెరుంగందగు.

## పిత్తనాడీలక్షణమ్.

శ్లో॥ బ్రహ్మరుద్రౌమందగతీవిష్ణునాడీగతిస్స్ఫుటా। త్రినాడ్యోవక్ర
గతయఃపిత్తనాడ్యాస్తులక్షణమ్॥ ❋

వ్యా॥ బ్రహ్మరుద్రావితి ॥ బ్రహ్మరుద్రౌ మందగతీ శ్లేష్మవాతనాడ్యౌ మందగతీ చేత్ విష్ణునాడీగతిః పైత్యనాడీప్రచారః స్ఫుటాచేత్ - త్రినాడ్యో వక్రగతయశ్చేత్ పిత్తనాడ్యాః పిత్తనాడీ మూలక కేవలపైత్యరోగస్యస్వరూపమితిబోద్ధవ్యం - గతి స్తస్యా స్తీక్ష్ణత్వే శుద్ధపైత్యజ్వరః - మందగతిశ్చేత్ తదంతర్గతశ్చేత్యభిప్రాయః॥

తా॥ శ్లేష్మ, వాత, నాడులకు, మందగమనము గలిగియుండగ, పైత్యనాడి ప్రచారము, స్ఫుటమయ్యెనేని, మూడునాడులకు, వక్రగతిగలిగిన, కేవల పైత్యమనియు, యీపైత్యనాడి, శీఘ్రముగనడిచెనేని పిత్తజ్వరమనియు, మందముగ చరించిన - అంతర్గత పిత్తజ్వరమనియును నెరుంగందగు.

అథ విషమసంకలిత నాడీవిచారః.

శ్లో॥ త్రినాడ్యోమందగతయస్త్రినాడీగతయస్సమాః । త్రినాడ్యో మందగతయః త్రినాడీగతయోజవాః॥ ❋

వ్యా॥ త్రినాడ్యఇతి ॥ ఏకస్మిన్ క్షణే త్రినాడ్యాః వాతశ్లేష్మపిత్తనాడ్యః వక్రగతయః కుటిలప్రచారాః - అపరస్మిన్ క్షణే త్రినాడీగతయః సమాః వాతశ్లేష్మపిత్తనాడ్యః సమాన ప్రచారాః - అన్యస్మిన్ క్షణే త్రినాడ్యో వాతశ్లేష్మపిత్తనాడ్యః మందగతయః గత్యామందప్రకారాః - తదుత్తరక్షణే త్రినాడీగతయః జవాశ్చభవేయుశ్చేత్ కోర్థః ఉక్తవక్రగత్యాది క్రమముల్లంఘ్యైవ పూర్వస్మిన్ క్షణే వక్రగతిః సమగతిమందగతి జవగతిర్వాభవతి - ఉత్తరక్షణే తృతీయే వక్రాజవగతిర్వాభవేత్ చతుర్థక్షణే సమమందా మందసమావాభవేత్ - ఏవంరూపేణ నాడీత్రయ్యాస్సంకలనే విషమ సంకలితనాడీత జ్జ్వరశ్చేతిమంతవ్యం॥

తా॥ వాత, శ్లేష్మ, పిత్తనాడులుమూడును, ఒకక్షణమందు కుటిలగతిగలవిగను, క్షణాన్తరమునందు, సమగతిగలవిగను, మరియొకక్షణమునందు, మందగతిగలవిగను, తదుత్తరక్షణమునందు, తీవ్రగతిగలవిగను, లేక యీమూడునాడులు పైజెప్పంబడిన వక్రగత్యాదులను అతిక్రమించి, పూర్వక్షణమునందు వక్రగతి, సమగతి, మందగతి, తీవ్రగతిగలవిగను, ఉత్తరక్షణమునందు, తృతీయక్షణమునందును, వక్రగతి, తీవ్రగతిగలవిగను, చతుర్థక్షణమునందు, సమగతి మందసమములుగనుండెనేని, విషమసంకలితనాడియనియును, విషమసంకలితజ్వరమనియును నెరుంగవలయు.

## అథ వాతాదినాడీషు ద్వాత్రింశద్దోషప్రాప్తి నాడీలక్షణమ్.

శ్లో॥ ముహుర్లావగతిః పిత్తో ముహుర్భేకగతిస్తథా। ద్వాత్రింశద్దో
షాస్సంప్రాప్తా ముహుశ్శుకగతిశ్శివః॥ ✻

వ్యా॥ ముహురితి॥ పిత్తః పైత్యనాడీలావుకగతిః - ముహురిత్యత్ర సర్వత్రవీప్సా గ్రాహ్యా - ముహుర్ముహుః - తిత్తిరిగతిసదృశగతిశ్చేత్ పిత్తః పైత్యనాడీవా ముహుర్ముహుః భేకగతిః మండూకప్లుతిః మణ్డూకకంఠనాడీ చలనసదృశగతిర్వాభవేయుశ్చేత్ - శివః వాతనాడీవా - ముహుర్ముహుశ్శుకగతిశ్చస్యాచ్చేత్ ద్వాత్రింశద్దోషాః జిహ్వాదోషాదిచిన్తామణిబాహటాదిగ్రంథ ప్రతిపాదితదోషాస్సంప్రాప్తా భవేయురితిభావః ద్వాత్రింశద్దోషలక్షణానితువిస్తరభయాన్నలిఖ్యన్తే - ద్వాత్రింశద్దోషశాస్త్రయోస్త్రయోదశసన్నిపాతజ్వరాశ్చోచ్చేత్సహ్యన్తే - ఏతత్సర్వంధాతునిర్ధారణసమర్థైశ్చికిత్సకైః పరిశోధ్యం॥

తా॥ పిత్తనాడి, మాటిమాటికి, తిత్తిరిసదృశగతిగలదిగను, లేక, పలుమారు కప్పయొక్క కంఠనాడీచలనముతో తుల్యమగు, గమనముగలదిగనుండినను, లేక, వాతనాడి, మాటిమాటికి చిలుకగమనమునకు సమమగుగతిగలిగియుండిన, జిహ్వాదోషాది ద్వాత్రింశద్దోషములు, సంప్రాప్తములగునని నెరుంగవలయు.

## సూతికావాయునాడీలక్షణమ్.

శ్లో॥ ముహుర్మందగతిర్బ్రహ్మా ముహుర్జవగతిశ్శివః। ముహుర్జవగతి
ర్విష్ణుః సూతికావాయులక్షణం. ✻

వ్యా॥ ముహురితి॥ అత్రాపి ముహుః పదేన వీప్సా గ్రాహ్యా - బ్రహ్మా శ్లేష్మనాడీ ముహుర్ముహుః మందగతిస్స్యాచ్చేత్ - శివః వాతనాడీచ - ముహుర్ముహుః జవగతి వక్రగతిశ్చయది - పిత్తనాడీ ముహుర్ముహుః - తీవ్రగతిర్వాస్యాత్ సూతికావాయోస్సూతికానిమిత్తకవాయోర్లక్షణం - స్వరూపమితినిర్ధార్యం పైత్యవాయోరేవ సూతికా వాయోరుత్పత్తిరితి రసరత్నాకరబాహటగ్రంథాదిషు ద్రష్టవ్యం॥

తా॥ శ్లేష్మనాడి, మాటిమాటికి మందగతిగలదిగను, వాతనాడి, మాటిమాటికి శీఘ్రగతిగలదిగను, ఇటుల పిత్తనాడికిసగా, శీఘ్రగతిగలిగిన, సూతికావాయు

వనియు నెఱుంగవలయు. యీమూతికావాయువు పిత్తవాయువువలన జనించునని నెఱుంగందగు.

## అథబాహ్యజ్వరాంతర్గతజ్వర అస్థిగతజ్వరనాడీలక్షణమ్.

శ్లో॥ జవవక్రాస్త్రినాడ్యశ్చమందవక్రాస్త్రినాడికాః । ఏకశ్లేష్మావ
క్రగతిఃజ్వరాంతర తిరస్థిగః॥ ❋

వ్యా॥ జవేతి ॥ త్రిన స్యుఃవాతశ్లేష్మపిత్తనాడ్యఃజవవక్రాః తీవ్రకుటిలాశ్చేత్ జ్వరఃశరీరబాహ్యసన్తాపకృత్ బాహ్యజ్వరఇత్యర్థః- త్రినాడికాఃపున్దవక్రాఃమందప్రకారేణకుటిలగతయశ్చేత్ అంతర్గతిః అంతర్గతజ్వరఇత్యర్థ- వాతపిత్తనాడ్యోఃస్వాభావికగత్యోరేవ- శ్లేష్మఃఏకఏనమందప్రకారేణవక్రగతిశ్చేత్- మధ్యమాంగుళిమధ్యస్థితశ్లేష్మనాడివేత స్తతః- తాడయేచ్చేత్ అస్థిగః - అస్థియానచ్ఛరీరాధారకపృష్ఠభాగావస్థితబృహచ్ఛల్యవిశేషః- తద్గచ్ఛతీత్యస్థిగః- అస్థిగతజ్వరఇత్యర్థః-అంతర్గతిరిత్యత్ర అంతశ్శరీరాన్తఃగచ్ఛతీతిసూక్ష్మకారేణాప్నోతీత్యర్థః- అంతర్గతిరిత్యుభయత్రాపిఅన్వర్థసంజ్ఞా॥

తా॥ వాత, శ్లేష్మ, పిత్తనాడులుమూడును, తీవ్రముగను, వక్రముగనునడిచెనేని, బాహ్యజ్వరమనియు, యీమూడునాడులు, మందముగను, వక్రములుగను, చరించెనేని, అంతర్గతజ్వరమనియు, వాతపిత్తనాడులకు స్వాభావికగతిగలిగియుండగ శ్లేష్మనాడియొకటిమాత్రము, మందముగను నడిచెనేని, అస్థిగతజ్వరమనియును నెఱుంగందగు. అస్థిగతజ్వరమనగా, వెన్నుయెముకను ఆశ్రయించినది.

## అసాధ్యనాడీలక్షణమ్.

శ్లో॥ అనిలోయాతిపిత్తస్యపిత్తోయాతికఫాలయమ్ । కఫస్యకంఠమా
లాయానభవేత్తస్యజీవనం॥ ❋

వ్యా॥ అనిలేతి ॥ అనిలఃవాతనాడీపిత్తస్యపైత్యనాడేఃస్థానమితిశేషః- యాతిగచ్ఛతియది-పిత్తఃపైత్యనాడీచకఫాలయంశ్లేష్మస్థానంయాతిప్రాప్నోతియతియస్యపుంసః యాంప్రాప్తిఃకఫాలయః పిత్తనాడీకఫస్యశ్లేష్మనాడ్యాః కంఠమాలాకంఠమాలావత్ శ్లేష్మమావృత్యతిష్ఠంతీభవేత్- తస్యజీవనమపి నభవేత్నస్థాస్యతి॥

తా॥ యేపురుషునియొక్క వాతనాడి స్థైర్యనాడిస్థానమునకేగినను, పిత్తనాడి కఫనాడీస్థానమునకుజనినను, యీపిత్తనాడి, కఫనాడిః, కంఠమాలిక తెరగున వ్యాపించియుండినను ఆపురుషుడు, యమమందిరమునకేగునని నెరుంగందగు.

## సన్నిపాతనాడీలక్షణమ్.

శ్లో॥ మందంమందంశిథిలశిథిలం వ్యాకులంవ్యాకులంవా । స్థిత్వాస్థిత్వాత్వరితగమనం పంచసూక్ష్మంగదానాం। ఏవంనాడీత్రివిధగతయోయస్యహస్తేపదేవా । దృశ్యన్తేపుజగతినభవేత్తస్యజీవాభిలాషః॥ ❋

వ్యా॥ మందమందమితి॥ మందంమందంమందప్రకారంసర్వత్రప్రకారేగుణవచనస్యేతిద్విర్భావః- శిథిలశిథిలంనివాతనిర్బోకవత్ - శిథిలప్రకారసంచారం - వ్యాకులం వ్యాకులంవాసంశయజనకత్వేనస్థిత్వాస్థిత్వాస్వవేగాభావాత్ - అదర్శనీయతయాక్షణం క్షణమతస్థానంత్వరితగమనం- ఉల్లంఘ్యోల్లంఘ్యభావవదశ్వగతివత్ శీఘ్రగమనం ఏవం రూపాపంచ- పంచావస్థాః- నాడీనాంసంభవేయుశ్చేత్ గదానాంరోగాణాం అవస్థానమితిశేషః తత్సూక్ష్మంసూక్ష్మతయావిభావ్యమిత్యర్థః ఏవంప్రకారేణ అమీపూర్వోక్తానాడీత్రివిధగతయః- త్రివిధనాడీ ప్రచారాఇత్యర్థః- తాఃయస్యపుంసః హస్తేపదేవాదృశ్యన్తేతస్య జగతిఅస్మిన్ లోకేజీవాభిలాషః అయంజీవిష్యతీత్యభిలాషః నభవేత్॥

తా॥ వాత, శ్లేష్మ, పిత్తనాడులగతులు, మందమందముగను, వాయురహితముగుస్థలమునందున్న పాముకుసుమ తెరగున, శిథిలశిథిలగతిగలవిగను, వ్యాకులవ్యాకులముగను, నిలిచినిలిచియు, నెగరెగరిన డుచుచు అశ్వగతిచందంబున, శీఘ్రగమనము గలవిగనుండిన రోగములస్థితిని, సూక్ష్మముగ నెరుంగందగు. ఈరీతిగ, యేపురుషుని యొక్క హస్తమునందుగాని, లేక పాదమునందుగాని గనుపడునో ఆపురుషునికి జీవాభిలాష లేదని నెరుంగవలయు.

## శుభనాడీలక్షణమ్.

శ్లో॥ సువ్యక్తతానిర్మలత్వం స్వస్థానస్థితిరేవచ । అచంచలసుమందత్వం సర్వేషాంశుభలక్షణమ్॥ ❋

స్వవ్యా॥ వ్యక్తేతి - సువ్యక్తతానుష్ఠుస్ఫుటత్వేనభాసమానతా- నిర్మలత్వందోషరాహిత్యం-స్వస్థానస్థితిః అన్యస్థానమప్రాప్యైవసర్వాసాం నాడినాంస్వస్థానేవృత్తిః అచంచలమిత్యత్రభావప్రధానని ర్దేశః చాంచల్యాభావః- అమందత్వంమాంద్యాతిశయాభావః ఏతత్సర్వంసర్వేషాంరోగాణాం శుభలక్షణంసాధ్యత్వరూపశోభనజ్ఞాపకం॥

తా॥ నాడులయొక్కగతి, స్ఫుటముగను, దోషరహితముగను, స్థానాన్తరము జెందకయుండుటయును, చాంచల్యరాహిత్యముగను, మాన్ద్యరహితముగనుండిన సర్వరోగంబులు సాధ్యంబులని తెలియంగవలయు.

గద్య॥ ఇతిసాతులూరివంశ పయఃపారావారరాకాసుధాకరాయమానస్య
శ్రీమద్గోపాలాచార్యసూరేస్సనూజేన శ్రీకృష్ణసూరిణావిరచితా
నాడీనిరూపణాఖ్యాశ్వనీదేవకృతసప్తవింశతిశ్లోకీ
వ్యాఖ్యా సమాప్తాభూత్.

ఇటుల అశ్వని దేవతలచేజేయంబడిన నాడీసత్రమాలయను నీగ్రంథ
ము, శ్రీకృష్ణసూరిచే జేయంబడిన, నాడీనిరూపణంబను
వ్యాఖ్యానసహితముగ ముగిసెను.





శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

# నాడీ నిర్ణయము.

## నాడ్యుత్పత్తిప్రకరణము.

శ్లో॥ యే వైద్యా యావద్వికారాః ప్రకృతివికృతియో యాశ్చ తేషాంజనిత్రీ।
యే దేవాశ్చాసురాద్యే రథసకలమిదం యత్సమూహైర్విసృష్టం ।
యత్సంక్షోభాత్త్రిమూర్తిః ప్రథితమిహ యతః పాలనాదిస్వసి
ద్ధా ।  సామూలాఖ్యాజనేభ్యో వితరతు సుఖం ముక్తయే నశ్చ
భూయాత్ ॥ *

కం॥ ఆద్యంతావన్నాడికా విజ్ఞానాదేవ వాత ప్రభృతిజనితానామామయానాం సాధ్యాసాధ్యసభేదకజ్ఞానం ప్రాప్యతే అత ఏవ తన్నిరూప్యత ఇతి॥

తా॥ వైద్యుడు ప్రథమంబున వాతపిత్తాదివైషమ్యములచే జనించెడివ్యాధుల సాధ్యాసాధ్యంబులను, తత్తద్వ్యాధిభేదంబులను, నెఱుంగుటకు నాడీజ్ఞానమే మూలకారణముగనుండు, అట్టి నాడీగతి విశేషజ్ఞానము కలిగెనేని రోగస్వరూపంబును దెలిసికొని తగిన చికిత్స జేయందగు, కావున ఆనాడులస్వరూపంబులను దెలియంజేసెద.

శ్లో॥ కందమధ్యే స్థితా నాడీ సుషుమ్నేతి ప్రకీర్తితా । తిష్ఠంతే పరితస్స
ర్వాశ్చక్రేస్మిన్నాడికాస్తతః॥ *

తా॥ శరీరమునందలి మూలాధారమధ్యంబున సుషుమ్నయనునొక నాడియున్నయది. మఱియు వచింపంబోయెడి ఇళాపింగళాది నాడులీసుషుమ్నానాడిని చుట్టుకొనియుండు.

శ్లో॥ సార్ధత్రికోట్యోనాడ్యోహిస్థూలాస్సూక్ష్మాశ్చదేహినామ్। నా
భికన్దనిబద్ధాస్తాస్తిర్యగూర్ధ్వమధస్థితాః॥ ❋

తా॥ మనుజుల దేహంబున స్థూలసూక్ష్మంబులగు మూడుకోట్ల యేబదిలక్షల నాడులున్నయవి. అన్నాడులు మూలాధారంబును నాశ్రయించి కొన్నియూర్ధ్వభాగంబునను, కొన్ని యధోభాగంబునను మఱికొన్ని తిర్యగ్భాగంబునను, వ్యాపించియున్నవి.

శ్లో॥ త్రిసార్ధకోట్యోర్ధకోటీచయానిలోమానిమానుషే । నాడీముఖాని
సర్వాణిఘర్మబిందుంక్షరంతిచ॥ ❋

తా॥ మఱియు పైనాడులను, నాశ్రయించి మూడుకోట్ల యేబదిలక్షల రోమంబులున్నయవి, ఆరోమంబులే నాడులకు ముఖంబులనంబడు. అందుడియే చెమట స్రవించు.

శ్లో॥ నానానాడీప్రసవగంసర్వభూతాన్తరాత్మని । ఊర్ధ్వమూల
మధశ్శాఖంవాయుమార్గేణసర్వగమ్॥ ❋

తా॥ మనుజుల దేహమందు పైజెప్పిననాడుల కాధారభూతంబై పరబ్రహ్మస్వరూపమగు నొకసూక్ష్మవాయువుగలదు. అది ప్రాణాదివాయువుల ద్వారా దేహమంతటను వ్యాపించుచుండు.

శ్లో॥ ద్విసప్తతిసహస్రాణినాడ్యస్స్యుర్వాయుగోచరాః। కర్మమా
ర్గేణసుషిరాతిర్యంచసుషిరాత్మికా॥ ❋

తా॥ ఈపైనాడులలో డెబ్బదిరెండువేల నాడులు వాయుసంచారయోగ్యంబులైయుండును. మఱియు ఆనాడులు వాయుమార్గద్వారా పునరావృత్తి ప్రాపక కర్మరూప ఛిద్ర విశిష్టంబులై తిర్యగంతరంధ్రప్రధానభూతంబులుగనుండు.

శ్లో॥ తర్పయంతిరసైర్దేహంనద్యస్తోయైరివార్ణవమ్ । ద్విసప్తతి
సహస్రంతుతాసాంస్థూలాఃప్రకీర్తితాః॥ ❋

తా॥ నదులునిజజలంబులచే, సాగరంబును, సమృద్ధిగావించుచందంబున పైనాడులు దేహిసేవించెడి యన్నపానాదుల రసంబుచే దేహంబును వృద్ధిజేయుచున్నయవి. అందు వెయ్యిన్ని డెబ్బదిరెండునాడులు స్థూలనాడులుగనున్నయవి.

శ్లో॥ దేహేధమన్యోధన్యాస్తాః పంచేంద్రియగుణావహాః । నాభికం దస్థితాస్తాస్తునాభౌచక్రే ప్రవేష్టితాః॥ *

తా॥ పైనాడులలో శబ్దస్పర్శరూప రసగంధాత్మక పంచేంద్రియగుణ గ్రాహకంబులగు నాడులే మిగుల శ్రేష్ఠంబులుగనుండు. అయ్యైదునాడులు మూలాధారంబు నాశ్రయించి నాభిచక్రంబునం బ్రవేశించియున్నయవి.

శ్లో॥ తాసాంచసూక్ష్మసుషిరాణి శతానిసప్తస్వచ్ఛానియైరసకృద న్నరసంవహద్భిః । ఆప్యాయతేవపురిదంహినృణామమీషామ మ్భఃస్రవద్భిరివసింధుశతైస్సముద్రమ్॥ *

తా॥ పైజెప్పబడిన స్థూలనాడులను నాశ్రయించి నిర్మలమైన యేడునూర్ల ప్రధాననాడులు సూక్ష్మఛిద్రములతో గూడియుండు ఇవిప్రతిదినము మనుజులు భుజిం చెడి యన్నపానాదుల రసమును వహింపుచు సముద్రము నానావిధనదులచే నాప్యా యనము బొందుచందంబున శరీరమును వృద్ధిజేయుచున్నవి.

శ్లో॥ ఆపాదతఃప్రభృతిగాత్రమశేషమాసామాను స్తకాదపిచనాభీ పురస్థితేన। ఏతన్మృదంగఇవచర్మచయేనబద్ధంకాయంనృణామి హాసిరాశతసప్తకేన॥ *

తా॥ మూలాధారంబును నాశ్రయించి పాదము మొదలు శిరముపర్యంతము వ్యా పించియుండెడి యేడునూర్ల నాడులచే మనుష్య దేహము మృదంగము చర్మముచేగట్ట బడియుండు తెఱంగున బంధింపబడియున్నయది.

శ్లో॥ ఇళాచపింగళాచైవసుషుమ్నాచసరస్వతీ । వారుణీచైవపూ షాచహస్తిజిహ్వాయశస్వినీ॥ విశ్వోదరీకుహూశ్చైవశంఖినీచప యస్వినీ। అలంబుసాచగాంధారీముఖ్యాశ్చైతాశ్చతుర్దశ॥ *

తా॥ పైనాడులలో ఇళా, పింగళా, సుషుమ్నా, సరస్వతీ, వారుణీ, పూ షా, హస్తిజిహ్వా, యశస్విని, విశ్వోదరీ, కుహూః, శంఖినీ, పయస్వినీ, అలంబుసా గాంధారీ, అనునీ, పదునాలుగునాడులు ముఖ్యంబులుగనుండు.

శ్లో॥ ఇళాచపింగళాచైవసుషుమ్నాచసరస్వతీ । గాంధారీహస్తిజిహ్వాచకుహూఃపూషాయశస్వినీ॥ వారణాలంబుసావిశ్వాశంఖినీచపయస్వినీ । ఏతాః ప్రాణవహానాడ్యోజీవకోశే ప్రతిష్ఠితాః॥

తా॥ నామాంతరములుగల పైపదునాలుగు నాడులు ప్రాణవాహినులై జీవకోశంబునం బ్రతిష్ఠింపంబడియున్న యవి.

శ్లో॥ తత్రప్రధానానాడ్యస్తుదశవాయుప్రవాహికాః॥ ❋

తా॥ పైపదునాలుగు నాడులలో పది ప్రాణాది వాయువాహినులై యుండుట వలన నవి మిగుల ప్రధానంబులుగనుండు.

శ్లో॥ ఇళాపింగళయోశ్చైవసుషుమ్నాచోర్ధ్వగామినీ । గాంధారీహస్తిజిహ్వాచప్రసారగమనేస్థితా॥ అలంబుసాయశస్విన్యాదక్షిణాంగేసమన్వితే।కుహూకశంఖినీచైవవామాంగేచావలంబితా॥ ఏతాసుదశనాడీషునానాకార్యప్రసూతికా॥ ❋

తా॥ ఇళా, పింగళా, సుషుమ్నాయను నీమూడు, నాడులు శరీరమునందూర్ధ్వగామినులై యుండు. గాంధారీ, హస్తి, జిహ్వా, యనునాడులు చేతులు మొదలగునవి జాచుటకును, ముడుచుటకును, నుపయుక్తంబులై యుండు, అలంబుసా, యశస్వినీ, యను రెండునాడులు దక్షిణాంగంబునను, కుహూ, శంఖినీ, యనునాడులు వామాంగంబునను, వ్యాపించియుండు. అప్పదినాడులలో మధ్యమంబుననుండెడి పూషయను ప్రసూతికానాడి సమస్తకార్యంబులను జేయుచుండు.

శ్లో॥ ఇళాచవామనాసాయాందక్షిణేపింగళామతా । సుషుమ్నాబ్రహ్మరంధ్రేచగాన్ధారీవామచక్షుషి ॥ దక్షిణేహస్తిజిహ్వాచపూషాకర్ణేఽథదక్షిణే । వామేయశస్వినీజ్ఞేయాముఖేచాలంబుసామతా॥ కుహూశ్చలింగమూలేస్యాచ్ఛంఖినీశిరసోపరి। ఏవంద్వారంసమాశ్రిత్యతిష్ఠంతిదశనాడికాః॥ ❋

తా॥ వామనాసికయందు ఇళయు, దక్షిణనాసికయందు పింగళయు, బ్రహ్మరంధ్రంబున సుషుమ్నయు, వామనేత్రంబున గాంధారియు, దక్షిణనేత్రంబున హస్తిజిహ్వయు, దక్షిణకర్ణంబున పూషయు, వామకర్ణంబున యశస్వినియు, జిహ్వయందలంబుసయు, శిశ్నంబున కుహువు, శిరంబున శంఖినియు, వ్యాపించియుండు.

పదినాడులను ఆశ్రయించియుండెడి

పదివాయువులు.

శ్లో॥ ప్రాణోపానస్సమానశ్చఉదానోవ్యానఏవచ । నాగఃకూర్మో
థకృకరోదేవదత్తోధనంజయః॥ ఏతేనాడీషుసర్వాసుచరంతిదశ
వాయవః । ఏతేషువాయవఃపంచముఖ్యాఃప్రాణాదయస్మృ
తాః॥ తేషుముఖ్యతమావేతౌప్రాణాపానౌనరోత్తమే। ప్రాణ
ఏవైతయోర్ముఖ్యస్సర్వప్రాణభృతాంసదా॥ *

తా॥ ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము, అను నీపదివాయువులు సర్వనాడులయందును సంచరింపుచుండు అయిన నిప్పది వాయువులలో ప్రాణాది పంచవాయువులు ముఖ్యంబులుగను, అందు ప్రాణాపానంబులు మిగుల ముఖ్యంబులుగను, వానిలో ప్రాణమత్యంత ముఖ్యంబుగనుండు.

శ్లో॥ శబ్దగ్రహాశ్రుతేనాడీరూపగ్రహాచలోచనే। గంధగహానాసికా
యాంరసనాయాంరసావహా ॥ ఏవంత్వక్షుస్పర్శవహాశబ్దకృ
ద్ధృదయాన్ముఖే । మనోబుద్ధ్యాదికంసర్వంహృదయేషుప్రతిష్ఠిత
మ్ ॥ పురీతత్యాంమనస్థిత్యానిద్రాసమభిజాయతే॥ *

తా॥ కర్ణంబులయందు వ్యాపించియుండు నాడులు శబ్దగ్రాహకంబులుగను నయనంబులయందుండునవి రూపగ్రాహకంబుగను నాసికయందుండు నవి గంధగ్రాహకములుగను, జిహ్వయందుండునది రసగ్రాహకముగను, చర్మమునందుండునవి స్పర్శ

గ్రాహకముగను, హృదయము, ముఖము, వీటియందుండునవి శబ్దోచ్చారణమునకును, నుపయుక్తముగనుండు. మనస్సు, బుద్ధి, ఇవి హృదయంబున ప్రతిష్ఠింపంబడియుండు. పురీతతియను నాడియందు మనస్సు లీనంబయ్యెనేని నప్పుడు నరునికి నిదురంబట్టు.

వాక్యం॥ అన్యాసాంనామాన్యపిశారదాయాం॥

తా॥ పైజెప్పంబడిన పదునాలుగు నాడీనామములుగాక నితరనాడుల నామంబులు శారదయను గ్రంథమునందు జెప్పంబడియున్నది.

శ్లో॥ గాంధారీహస్తిజిహ్వాఖ్యాసపూషాలంబుసామతా । యశస్వినీశంఖినీచకుహూస్స్యుస్సప్తనాడయః॥ వాక్యం॥ తాసాంస్థితిస్వరూపంయోగార్ణవే॥ *

తా॥ గాంధారీ, హస్తిజిహ్వా, పూషా, అలంబుసా, యశస్వినీ, శంఖినీ, కుహూయను నామంబులుగల యేడునాడుల స్వరూపంబును, స్థితియు, యోగార్ణవమను గ్రంథంబున జెప్పంబడియున్నది.

శ్లో॥ ఇళాపృష్ఠేతుగాంధారీమయూరగళసన్నిభా । సవ్యపాదాదినేత్రాంతాగాంధారీపరికీర్తితా॥ *

తా॥ గాంధారియనునాడి మయూరకంఠవర్ణముగలదియై ఇళయనునాడికి పృష్ఠము నాశ్రయించి సవ్యపాదము మొదలు నేత్రాంతమువరకు వ్యాపించియుండు,

శ్లో॥ హస్తిజిహ్వోత్పలశ్రేష్ఠా నాడీకస్యాఃపురస్థితా । సవ్యభాగస్యమూర్ధాదిపాదాంగుష్ఠాంకమాశ్రితా॥ *

తా॥ హస్తిజిహ్వయనునాడి నల్లకలువ వర్ణము గలదియై ఇళ యనునాడికి ముందుభాగము నాశ్రయించి సవ్యభాగమున శిరస్సు మొదలు పాదాంగుష్ఠమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ పూషాతుపింగళాపృష్ఠేనీలజీమూతసన్నిభా । యామ్యభాగస్యనేత్రాంతాయావత్పాదతలంగతా॥ *

తా॥ పూషయనునాడి నల్లనిమేఘచ్ఛాయ గలదియై పింగళయనునాడికి పృష్ఠ భాగమునుండి దక్షిణభాగమున పాదాంగుష్ఠము మొదలుకొని నేత్రాంతమువరకు వ్యాపించియుండును.

శ్లో॥ అలంబుసారక్తవర్ణానాడీతస్యాఃపురస్థితా। పాదాంగుష్ఠాంత
మారభ్యనేత్రాంతందక్షిణేశ్రితా॥ ※

తా॥ అలంబుసయను నాడి రక్తవర్ణముగలదియై పింగళయనునాడికి ముందు భాగము నాశ్రయించుకొని కుడిపాదాంగుష్ఠము మొదలు నేత్రాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ యశస్వినీశంఖవర్ణాపింగళాపూర్వదేశగా। పాదాంగుష్ఠాంత
మారభ్యదక్షమూర్ధాంతమాశ్రితా॥ ※

తా॥ యశస్విని యనునాడి శంఖవర్ణము గలదియై పింగళయనునాడికి పూర్వ భాగము నాశ్రయించుకొని దక్షిణ భాగమునందు పాదాంగుష్ఠాంతము మొదలు శిరంబువరకు వ్యాపించియుండు.

శ్లో॥ గాంధార్యాశ్చసరస్వత్యామధ్యస్థాశంఖినీమతా । సువర్ణవ
ర్ణాపాదాదికర్ణాంతాసవ్యభాగకే॥ ※

తా॥ శంఖినియనునాడి స్వర్ణవర్ణముగలదియై గాంధారి సరస్వతీ, యను నాడులకు మధ్యము నాశ్రయించి సవ్యపాదము మొదలు కర్ణాంతమువరకు వ్యాపించియుండు.

శ్లో॥ కుహూరిప్రోక్తాశ్వేతవర్ణావారుణీపూషమధ్యగా। పాదాంగు
ష్ఠాదిమూర్ధాంతాయామ్యభాగేకుహూర్స్మృతా॥ ※

తా॥ కుహూయనునాడి శ్వేతవర్ణముగలదై వారుణి, పూషా, యనునాడుల మధ్యము, నాశ్రయించుకొని యామ్య పాదాంగుష్ఠము మొదలు శిరస్సువరకు వ్యాపించియుండు.

వాక్యం॥ రావనాసరస్వతీవిశ్వోదరీశంఖినీపితాఅపిప్రధాన
తేషోక్తాఃఉక్తంచ॥ ※

తా॥ రావనా, సరస్వతి, విశ్వోదరీ, శంఖినీ, యనునాడులును ప్రధానంబులుగ జెప్పబడియున్నవి.

శ్లో॥ ముక్తిమార్గేసుషుమ్నాసాబ్రహ్మరంధ్రేతికీర్తితా। అవ్యక్తాసా
చవిజ్ఞేయాసుషుమ్నా వైష్ణవీస్థితా॥ ✻

తా॥ సషుమ్నయనునాడి ముక్తిమార్గమునందుండుటచే బ్రహ్మరంధ్రంబని జెప్పంబడు అన్నాడి విష్ణుదేవతాకమై అది వ్యక్తముగనుండు.

శ్లో॥ తాసాంతిస్రఃప్రధానాస్తుతిస్రష్వేకోత్తమామతా। ఇళాచ
పింగళాచైవసుషుమ్నాచతృతీయకా॥ ✻

తా॥ పైజెప్పంబడిన పదినాడులలో ఇళా, పింగళా, సుషుమ్నాయను మూడునాడులును ప్రధానంబులుగ నున్నయవి. వాటిలో సుషుమ్నయనునాడి సుత్తమోత్తమముగనుండు.

శ్లో॥ తత్రైకానాభితోయాతిర్గ్మయాదక్షిణేతథా। మధ్యేనాయు
పథంవిద్యాత్త్రిభిస్తుల్యంగతాగతమ్॥ ✻

తా॥ ఇళయనునాడి యెడమపార్శ్వమునందు పింగళయనునాడి కుడిపార్శ్వమునందు, సుషుమ్నయనునాడి యానాడులకు మధ్యంబునను, నుండుటయగాక నిమ్మూడు నాడులయందును తుల్యముగ సంచరించెడి వాయుమార్గము గలిగియుండు.

ఇళాపింగళానాడీస్వరూపము.

శ్లో॥ ఇళాచశంఖచంద్రాభాదస్యావామేవ్యవస్థితిః। పింగళాసితర
క్తాభాదక్షిణంపార్శ్వమాశ్రితా॥ ✻

తా॥ పింగళయనునాడి శంఖమువలెను, చంద్రునివలెను, ప్రకాశించుచు సుషుమ్నయనునాడికి వామభాగమునందుండు, పింగళయనునాడి నలుపు యెరుపుగల మిశ్రవర్ణముగలదియై ప్రకాశించుచు సుషుమ్నానాడికి దక్షిణభాగము నాశ్రయించియుండు.

శ్లో॥ చంద్రసూర్యాగ్నయోమరుచ్చైవత్రయస్త్రిస్రష్వవస్థితాః। తథారజ
స్తమస్సత్వంరాత్ర్యహఃకాలఏవచ॥ ✻

తా॥ ఇళయనునాడి చంద్రదేవతాకమై రజోగుణ ప్రధానమైయుండుటయే గాక రాత్రిరూపఖండ కాలయుక్తముగనుండు. పింగళయనునాడి సూర్యదేవతాకమై, తమోగుణ ప్రధానమైయుండుటయేగాక అహః కాలస్వరూపఖండ కాలయుక్తముగ నుండు. సుషుమ్నయనునాడి వాయుదేవతాకమై సత్వగుణప్రధానమై యుండుటయే గాక అఖండకాలయుక్తమైయుండు.

శ్లో॥ ఇళాదోషమయీప్రోక్తాపింగళావహ్నిరూపిణీ। వాయ్వగ్ని
యీసుషుమ్నాచ బ్రహ్మద్వారప్రధానగా॥ *

తా॥ దోషరూపమగు ఇళయను నాడియు, తేజరూపమగు పింగళయను నాడియు, వాయ్వగ్నిరూపమగు సుషుమ్నయనునాడియు, బ్రహ్మద్వారమునాశ్రయించుకొనియుండు.

శ్లో॥ పద్మకోశప్రతీకాశంసుషిరైశ్చవిభూషితమ్ । హృదయంతద్వి
జానీయాద్విశ్వస్యాయతనంమహత్॥ *

తా॥ తామరమొగ్గవలె అగ్రమునందు రంధ్రములుగలిగి (అధోముఖంబై నాభికూర్ధ్వంబుగనుండెడి) హృత్పుండరీకము బ్రహ్మకు నివాసస్థానంబుగనున్నయది.

శ్లో॥ దక్షిణాపింగళానాడీవహ్నిమండలగోచరా। దేవయానమితిజ్ఞే
యాపుణ్యకర్మానుసారిణీ॥ *

తా॥ యజ్ఞాదిపుణ్యకర్మములు జేసినవారిని, పింగళయనునాడి మూలాధారమునుండివెడలి హృత్పుండరీక దక్షిణభాగముగ శిరంబుననుండెడి సహస్రారమను చక్రము నాధారపఱచుకొని వహ్నిమండలమువరకు వ్యాపించి అర్చిరాది మార్గముగ దేవలోకము జేరునటులం జేయు.

శ్లో॥ ఇళాచవామనిశ్వాసాసోమమండలగోచరా। పితృయానమితి
జ్ఞేయావామమాశ్రిత్యతిష్ఠతి॥ *

తా॥ పితృలోకప్రాప్తిహేతుభూతమగు సత్కర్మములు జేసినవారికి ఇళయను నాడి మూలాధారమునుండి వెడలి హృత్పుండరీక వామభాగముగ శిరంబుననుం

డెడి సహస్రారచక్రము నాధారపరచుకొని చంద్రమండలమువరకు వ్యాపించి ధూమాదిమార్గముగ పితృలోకమును జెందునటులంజేయు. ఈ ఇళాపింగళయనునాడులే ఉచ్ఛ్వాస నిశ్వాసముల కాధారభూతంబులై యున్నయవి.

శ్లో॥ గుదస్యపృష్ఠభాగేస్మిన్ వీణాదండస్య దేహభృత్ ।దీర్ఘాస్థిమూర్థపర్యంతం బ్రహ్మదణ్డేతికథ్యతే॥ ❋

తా॥ గుదస్థానము మొదలు శిరస్సువరకు వ్యాపించి వీణాదండాకారంబుగనుండెడి యస్థి బ్రహ్మలోకప్రాప్తికి హేతుభూతమగు సుషుమ్నానాడి కాధారమగుటచే బ్రహ్మదండమనంబడు.

శ్లో॥ తస్యాంతేసుషిరంసూక్ష్మంబ్రహ్మనాడీతిసూరిభిః। ఇళాపింగళయోర్మధ్యేసుషుమ్నాసూక్ష్మరూపిణీ। ❋

తా॥ బ్రహ్మలోక ప్రాప్తిహేతుభూతమగు దహరాద్యుపాసన జేసినవారికి, సూక్ష్మరూపియగు సుషుమ్నానాడి మూలాధారమునుండి ఇళా, పింగళ, మధ్యమునందు వెడలి సూక్ష్మరూపమై, వీణాదండాకారంబుగనుండెడి, వీపు యెముకద్వారమునందు జొచ్చి సహస్రారచక్రమను బ్రహ్మరంధ్రమూలముగ సూర్యమండలమువరకువ్యాపించి బ్రహ్మలోకమును గలుగంజేయు.

శ్లో॥ సర్వంప్రతిష్ఠితంయస్మిన్ సర్వగంసర్వతోముఖమ్। తస్యామధ్యగతాస్సూర్యసోమాగ్నిపరమేశ్వరాః॥ భూతాలోకాదిశఃక్షేత్రంసముద్రాఃపర్వతాశ్శిలాః। ద్వీపాశ్చనిమ్నగావేదాశ్శాస్త్రవిద్యాకలాక్షరాః॥ స్వరమంత్రపురాణానిగుణాశ్చైతాని సర్వగః । బీజజీవాత్మకస్తేషాంక్షేత్రజ్ఞాఃప్రాణవాయవః ॥ సుషుమ్నాంతర్గతంవిశ్వంతస్మిన్ సర్వంప్రతిష్ఠితమ్॥ ❋

తా॥ సర్వప్రపంచాత్మక పరంజ్యోతి స్వరూపియగు బ్రహ్మ యీసుషుమ్నానాడియందే నివసించుచుండు, మఱియు సీనాడి నానామార్గములుగలిగి బహుముఖంబులతో వ్యాపించు, ఈనాడియే శబ్దబ్రహ్మమునకు రూపాంతరములుగనుండెడి

సూర్యచంద్రాగ్ని పరమేశ్వరులకును, పృథివ్యాది పంచభూతంబులకును, చతుర్దశ భువనంబులకును, ప్రాగాదిదశదిక్కులకును, కాశ్యాదిధర్మక్షేత్రములకును, లవణాది సప్తసముద్రములకును, మేర్వాదిపర్వతములకును, రత్నాదిశిలలకును, సప్తద్వీపముల కును గంగాదినదులకును, వేదములకును, మీమాంసాది సకలశాస్త్రములకును చతుష్ష ష్టివిద్యలకును, బ్రాహ్మణాదిజాతులకును, అకారాదివర్ణములకును, ఉదాత్తాదిస్వరము లకును, సప్తకోటిమహామంత్రములకును, బ్రాహ్మాదిపురాణములకును, సత్వరజస్తమో గుణములకును, మహదాదిచతుర్వింశతితత్వములకును, జీవునికిని, క్షేత్రజ్ఞునికి, ప్రా ణాది పంచవాయువులకును, నాగాద్యుపవాయువులకును, సమస్తప్రపంచమునకును, నాధారంబుగనున్నయది.

నాడ్యుత్పత్తిప్రకరణము ముగిసెను.

---

## అష్టధాతువుల స్థాననిర్ణయము.

శ్లో॥ (ఆయుర్వేదే) అథాన్యత్సంప్రవక్ష్యామి సంక్షిప్తంసూక్తము
త్తమం। ఆయుర్వేదోపదేశేస్మిన్ అష్టధాతునిగద్యతే॥ నాడ్యో
స్థాపాణిపాతకంఠనాసోపాతంసమాశ్రితాః॥ కరయోఃపా
దయోఃఘ్రాణమూలయోఃకంఠమూలయోః॥ *

తా॥ ఆయుర్వేదమునందు సంక్షేపముగ వచియింపబడిన అష్టధాతుస్థానంబు విశదముగ వక్కాణించెద. అవియెవ్వియనిన, హస్తద్వయమునందుండునాడులు (౨) పాదద్వయమునందుండునాడులు (౨) కంఠమునకుభయపార్శ్వములయందుండునాడ లు (౨) నాసికకిరుప్రక్కలయందుండునాడులు (౨) ఇటుల పైజెప్పంబడిన స్థానంబ లందుండు నాడు లెనిమిదివిధంబులని తెలుపంగవలయు.

## నాడీస్థానములు.

శ్లో॥ పాదయోర్నాడికాస్థానం గుల్ఫస్యాంగుళికాత్రయం। హస్త
యోస్తుప్రకోష్ఠాన్తే మణిబన్ధేఙ్గుళిత్రయమ్ ॥ కంఠమాలేఙ్గుళి

ద్వాంద్వంనాసామూలేద్వంశాధికం । స్థానాన్యేతానినాడీనాం
తేషుప్రాణోవ్యవస్థితః॥ ✻

తా॥ పాదగతనాడులు, గుల్ఫప్రదేశము (అనగా) చీలమండలకు క్రిందుగ మూడు అంగుళములపరిమితస్థానమునందును, హస్తగతనాడులు ప్రకోష్ఠాన్తరమునందలి మణికట్టుకు క్రిందుగ మూడు అంగుళములప్రదేశమునందును నాసామూలమునందాశ్రయించియుండునాడులు ఏకాంగుళపరిమితస్థానమందును కంఠమూలమునందుండునాడులు రెండుఅంగుళములనిడుపుగల స్థానమునందునునుండుగాన నిటుల నాడీస్థానంబుల నెరుంగవలయు. ఈయెనిమిదిస్థానంబుల, ప్రాణవాయువు ఆశ్రయించియుండు.

## సిరాదిస్వరూపము.

శ్లో॥ పత్రరేఖానిభాభిన్నాస్సూక్ష్మావపుస్సిరాశ్రితాః। మృణాళనాడీ
కారూపాశ్శ్రితాంసిసర్వదేహగాః॥ ✻

తా॥ సన్ననరములు, ఆకులయందలి రేఖలచందంబున మిగుల సూక్ష్మమగుచు శరీరమంతయు వ్యాపించియుండు. బోలునరములు తామరనాళముల తెరంగున శరీరంబంతయు వ్యాపించియుండు.

## నాడీనిదానము.

శ్లో॥ నాడీమంగుష్ఠమూలాధస్స్పృశేద్దక్షిణకేకరే । జ్ఞానార్థంరోగి
ణోవైద్యోనిజదక్షిణపాణినా॥ ✻

తా॥ వైద్యుడు రోగసంబంధమగు దక్షిణహస్తముయొక్క అంగుష్ఠమూలమును, అనగా, (కూర్పరప్రదేశమునకు వెనకనుండు అంగుళస్థానమును) తనకుడిచేతితో నిదానమునుచూడవలయు.

## గ్రంథాన్తరే.

శ్లో॥ సవ్యేనరోగధృతికూర్పరభాగమధ్యం పీడ్యాథదక్షిణకరాంగుళి
కాత్రయేణ। అంగుష్ఠమూలమధిపశ్చిమభాగమధ్యే నాడీంప్రభం
జనగతిం సతతంపరీక్షేత్॥ ✻

తా॥ వైద్యుడు రోగియొక్క దక్షిణహస్తమును మోచెయ్యి మొదలుకొని తనవామహస్తముచే జక్కగపిసికి ఆ హస్తముయొక్క అంగుష్ఠ మూలమునందలి లోభాగమధ్యమును, తన దక్షిణాంగుళిత్రయముచే సదావాతగతిని పరీక్షించి రోగనిదానంబు నెరుంగవలయు.

మతాన్తరే.

శ్లో॥ ఈషద్వినామితకరంవితతాంగుళీయం బాహుంప్రసార్యరహితంపరిపీడనేన॥ ❋

తా॥ హస్తనిదానమును తెలిసికొనునపుడు, రోగియొక్క హస్తమునుపిసికి మెటికలువిరిచి చెయ్యిచాపించిఅంగుళములపట్టువదలించి నిదానము నెరింగి రోగమును తెలిసికొనవలయు.

వైద్యునికర్తవ్యము.

శ్లో॥ స్థిరచిత్తఃప్రశాన్తాత్మామనసాచవిశారదః।స్పృశేదంగుళిర్నాడీంజానీయాద్దక్షిణేకరే॥ ❋

తా॥ నేర్పరియగువైద్యుడు, నాడినిచూచేయడల, స్వస్థచిత్తుడై, ఆత్మనుమనస్సును, శాన్తిపరచికొని, రోగియొక్క దక్షిణహస్తమును, తన మూడువేళ్లతోపట్టి దోషమును తెలిసికొనవలయు.

గ్రంథాన్తరే.

శ్లో॥ ప్రాతఃకృతసమాచారఃకృతాచారపరిగ్రహమ్। సుఖాసీనస్సుఖాసీనంపరీక్షార్థముపాచరేత్॥ ❋

తా॥ వైద్యుడు ప్రాతఃకాలమునందు, స్నానసంధ్యావందనాది, కృత్యములనొనర్చుకొని, పరిశుద్ధుడై, సుఖాసీనుండగు రోగికడకేగి, తానును సుఖముగకూర్చున్నవాడై, రోగనిదానంబు నెరుంగవలయు.

నాడీపరీక్షాకాలము.

శ్లో॥ ఈషద్వినమ్రకృతకూర్పరవామభాగహస్తేప్రసారితసదంగుళిసంధికేచ । అంగుష్ఠమూలపరిపశ్చిమభాగమధ్యేనాడీంప్రభాతసమయేప్రథమంపరీక్షేత్॥ ❋

తా॥ వైద్యుడుదయకాలమునందు, రోగియొక్క చాచినట్టి హస్తమందుండు మణికట్టుకు వెనుకతట్టున నుండునట్టినాడిని, పరీక్షించవలయు.

## స్త్రీపురుషనాడీలక్షణము.

శ్లో॥ స్త్రీణాంమూర్ధ్వముఖఃకూర్మఃపుంసాంపునరథోముఖః । అతః కూర్మవ్యతిక్రాంతాత్సర్వత్రైవవ్యతిక్రమః ॥ లక్ష్యతేదక్షిణే పుంసాంయాచనాడీవిచక్షణైః। కూర్మభేదేనవామానాంవామే చైవావలోక్యతే॥

*

తా॥ స్త్రీలకు నాభికూర్మము, ఊర్ధ్వముఖంబుగను, పురుషులకు, అధోముఖంబుగనుండుటచే, స్త్రీపురుషులకు నాడులు వ్యత్యాసముగ నుండుగాన, స్త్రీలకు యెడమహస్తమునందును, పురుషులకు కుడిహస్తమునందును, నాడీపరీక్షింపవలయు.

## మతాన్తరే.

శ్లో॥ కరమూలేపాదమూలేనాడీవహతిదృశ్యతాం । నారీణాంవామభాగేచపుంసాందక్షేతుశోధయేత్॥

*

తా॥ హస్తమూలమునందును, పాదమూలమునందును, నాడి సంచరించుచుండుగాన, స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును పరీక్షింపవలయు.

## గ్రంథాన్తరే.

శ్లో॥ ప్రాయస్స్ఫుటాభవతివామకరేవధూనాం పుంసాంచదక్షిణకరే తదియంపరీక్షా॥

*

తా॥ స్త్రీలకు వామహస్తమునందును, పురుషులకు దక్షిణహస్తమునందును, నాడిస్పష్టమాగనుండు.

## మతాన్తరే.

శ్లో॥ వామభాగేస్త్రియాయోజ్యానాడీపుంసస్తుదక్షిణేఇతిప్రోక్తంమయాదేవిసర్వదేహేషుదేహినామ్॥

*

తా॥ స్త్రీలకు యెడమహస్తమునందును, పురుషులకు కుడిహస్తమునందును, నాడిని పరీక్షింపవలయునని పార్వతితో పరమేశ్వరుండువచించె.

## కేవలస్త్రీనాడీలక్షణము.

శ్లో॥ స్త్రీణాంభిషగ్వామహస్తేవామపాదేచయత్నతః । శాస్త్రేణ సంప్రదాయేనతథాస్వానుభవేనవై। పరీక్షేద్రత్నవచ్చాసావభ్యాసాదేవజాయతే॥ ❋

తా॥ వైద్యుడు, స్త్రీలయొక్క యెడమహస్తమునందును, యెడమపాదమునందును, శాస్త్రసంప్రదాయ స్వానుభవములచే పరీక్షింపవలయు. రత్నపరీక్షాజ్ఞానము, అభ్యాసమువలన గలిగినటుల, నాడీపరీక్షాజ్ఞానము సగా, అభ్యాసమువలనే గలుగును.

## నాడీపరీక్షాక్రమము.

శ్లో॥ వారత్రయంపరీక్షేతధృత్వాధృత్వావిముంచయేత్ । విమృశ్య బహుధాబుధ్యారోగవ్యక్తింవినిర్దిశేత్॥ ❋

తా॥ రోగియొక్కనాడిని పలుమారుబట్టివిడుచుచు, బుద్ధిచే బాగుగ మూడుమార్లు పరీక్షించి, రోగమిట్టిదని నిర్దేశింపవలయు.

## గ్రంధాన్తరే.

శ్లో॥ అంగుళిత్రితయేనస్పృష్ట్వాక్రమాద్దోషత్రయోద్భవైః।మందాం మధ్యగతాంతీక్ష్ణాంత్రిభిర్దోషైస్తులక్షయేత్॥ ❋

తా॥ రోగియొక్కనాడిని, వైద్యుడు తనయొక్కమూడువ్రేళ్లచే స్పృశించి, వాతము, పిత్తము, కఫము, వీటియొక్కగతులను క్రమముగ, మంద, మధ్యమ, తీక్ష్ణములుగ తెలిసికొనవలయు. వాతపిత్తకఫములే, త్రిదోషములు, వీటిని వైద్యుడు సూక్ష్మదృష్టిచే నెరుంగవలయు.

## పాదగతనాడీలక్షణము.

శ్లో॥ జీవితంలాఘవంస్వస్థ్యంజ్వరస్యచవిమోచనమ్ । యస్తుస్థానాన్నముచ్యేతపాదనాడీంనిదర్శయేత్॥ ❋

తా॥ ఆయువు, శరీరలఘుత్వము, శరీరస్వస్థత, జ్వరవిమోచనము, వీటినెరుంగుటకై, పాదమునందుండునాడిని పరీక్షింపవలయు.

హస్తగతనాడీలక్షణము.

శ్లో॥ తిర్యగ్యవప్రమాణేనజహాతిచనిజంపదం । సూచితంజీవనిర్యాణంహస్తనాడీగళేచయా॥ ❋

తా॥ యేమనుజునినాడి హస్తమందుగాని, లేక, కంఠమందుగాని, తిర్యగ్యవప్రమాణమయినను. స్వస్థానమునువదిలెనేని, నామనుజుడు శరీరమును త్యజించునని యెరుంగవలయు.

హస్తనాడీపరీక్ష.

శ్లో॥ అజీర్ణమామదోషంచ జ్వరస్యాగమనంక్షుధా । వాతపిత్తకఫాన్దుష్టాన్హస్తనాడీంనిదర్శయేత్॥ ❋

తా॥ అజీర్ణము, ఆమదోషము, జ్వరాగమనము, ఆకలి, దుష్టవాతము, పిత్తము, శ్లేష్మము, అనువానిని, హస్తనాడివలన తెలిసికొనవలయు.

కంఠనాడీపరీక్ష.

శ్లో॥ ఆగంతుకజ్వరంతృష్ణామాయాసంమైథునంక్లమం । భయంశోకంచకోపంచ కంఠనాడీంనిదర్శయేత్॥ ❋

తా॥ ఆగంతుకజ్వరము, దప్పి, ఆయాసము, మైథునము, బడలిక, భయము, శోకము, కోపము, అనునివి, కంఠమునందుండు నాడివలన నెరుంగవలయు.

నాసానాడీపరీక్ష.

శ్లో॥ మరణంజీవితంకామం నేత్రరోగంశిరోవ్యథాం । శ్రావణాన్ముఖజాన్రోగాన్ నాసానాడీంనిదర్శయేత్॥ ❋

తా॥ నాసికయందలి నాడివలన, మరణము, జీవితము, కామము, నేత్రరోగము, శ్రవణరోగము, తలనొప్పి, ముఖరోగము, వీటిని నెరుంగవలయు.

కాలభేదముచే - నాడీసంచారక్రమము.

శ్లో॥ ప్రాతఃశ్లేష్మయుతానాడీ మధ్యాహ్నేచాపిపైత్తికీ । అపరాహ్నేవాతకీచపునఃపిత్తంనిశార్ధకే॥ ❋

తా॥ ప్రాతఃకాలమునందు, నాడిశ్లేష్మయుక్తముగను, మధ్యాహ్నకాలమునందు, పిత్తయుక్తంబుగను, అపరాహ్ణంబున వాతయుక్తముగను, అర్ధరాత్రియందు మరల పిత్తయుక్తంబుగను నడుచుచుండు.

అజ్ఞాతృనాడీలక్షణము.

శ్లో॥ సద్యస్స్నాతస్యభుక్తస్యతథాస్నేహావగాహినః । క్షుత్తృడార్తస్యసుప్తస్యనాడీసమ్యఙ్నబుధ్యతే॥ *

తా॥ స్నానము జేసినవానికి, భోజనము జేసినవానికి, తైలమునుబూసుకొనినవానికి, ఆకలి దప్పి, ఇవిగలవానికి, నిదురబోవువానికి, నాడిస్పష్టముగ గనుబడదు.

గ్రంథాన్తరే.

శ్లో॥ తైలాభ్యంగేచసుప్తేచతథావైభోజనాన్తరే । తథానజ్ఞాయతేనాడీ యథాదుర్గతరానదీ॥ *

తా॥ తైలాభ్యంగ మొనర్చుకొనినవానికిని, నిద్రించి మేలుకొనినవానికిని, భోజనము జేసినవానికిని, నాడి, అతిగంభీరమగు చందంబున దెలియంబడదు.

ధమనీనాడీలక్షణము.

శ్లో॥ అంగుష్ఠమూలభాగేయాధమనీజీవసాక్షిణీ । తచ్చేష్టయాసుఖందుఃఖంజ్ఞేయంకాయస్యపణ్డితైః॥ *

తా॥ మనుష్యులయొక్క అంగుష్ఠమూలమునందు అనగా (మణికట్టుకువెనుక మూడంగుళముల ప్రదేశమునందు) జీవసాక్షియను పేర్కొనంబడు ధమనియను నాడి గలదు. దానియొక్క నడకచే శరీరమునందుగల సుఖదుఃఖములను నాడీజ్ఞానులు దెలిసికొనియెదరు.

జీవసాక్షిణీ - నాడీలక్షణము.

శ్లో॥ అంగుష్ఠస్యతుమూలేయాసానాడీజీవసాక్షిణీ। తస్యాఃగతివశాద్విద్యాత్సుఖందుఃఖఞ్చరోగిణాం॥ *

తా॥ అంగుష్ఠమూలమునందుండునట్టినాడి, జీవసాక్షిణియని పేర్కొనంబడు. దాని గమనాతిశయముచే రోగియొక్క సుఖదుఃఖంబులం దెలిసికొనవలయు.

నాడీపర్యాయశబ్దములు.

శ్లో॥ స్నాయుర్నాడీవసాహింస్రాధమనీధామనీధరా। తంతుకీజీవితజ్ఞాచసిరాపర్యాయవాచకాః॥ *

తా॥ స్నాయువు, వసా, హింస్రా, ధమనీ, ధామనీ, ధరా, తంతుకీ, జీవితజ్ఞా, సిరా ఇటుల నాడులు తొమ్మిదివిధంబులుగ విలసిల్లు.

## నాడీదేవతలు.

శ్లో॥ వాతనాడీభవేద్బ్రహ్మాపిత్తనాడీచశంకరః। శ్లేష్మనాడీభవేద్వి
ష్ణుః(స్త్రీ)దేవానాడిదేవతాః॥ *

తా॥ వాతపిత్తకఫనాడులకు క్రమముగ, బ్రహ్మ, శివ, విష్ణువులు దేవతలు
గా నుందురు.

## వాతాదినాడీస్థానములు, వాటిగుణములు.

శ్లో॥ అగ్రేవాతవహానాడీమధ్యేవహతిపిత్తలా। అంతేశ్లేష్మవికారేణ
నాడీజ్ఞేయాబుధైస్సదా। వాతాద్వక్రగతిర్నాడీపిత్తాదుత్ప్లుత్య
గామినీ। కఫాన్మందగతిర్జ్ఞేయాసన్నిపాతాదతిద్రుతం॥ *

తా॥ అగ్రమునందు వాతనాడి వాతము ప్రకోపముగనుండునపుడు వంకర
గానడుచును. పిత్తనాడి మధ్యమమందుండి పిత్తప్రకోపమునందు కప్పవలె సెగిరెగిరి
నడుచును. కఫనాడి, కడపటనుండి కఫప్రకోపమగునపుడు మందముగనడుచును.
సన్నిపాతమునందు పైజెప్పిన మూడునాడులు అతిత్వరగా నడుచును.

## గ్రంథాన్తరే.

శ్లో॥ ఆదౌచవహతేవాతోమధ్యేపిత్తంతథైవచ। అన్తేచవహతేశ్లేష్మ
నాడికాత్రయలక్షణం॥ *

తా॥ రోగిమణికట్టుయందు తనతర్జనికి స్పృశించెడినాడి వాతమనియు, మధ్య
మాంగుళికిస్పృశించెడినాడి పిత్తమనియు, అనామికాంగుళమునకు స్పృశించెడినాడి
శ్లేష్మమనియును, నాడీజ్ఞానులు వచించెదరు.

## వాతాదినాడీగమనక్రమము.

శ్లో॥ వాతేవక్రాతదనుచపలాశ్లేష్మరోగేస్థిరాస్స్యాత్సర్పాకారాప్ర
భవతితదావాతపిత్తప్రభావే। నాడీహంసీకఫపవనయోర్ద్వరా
శ్లేష్మపిత్తే। ఛిన్నాసూక్ష్మాపిచవిషమగతేసన్నిపాతేత్వలక్ష్యా॥

తా॥ వాతరోగమునందు నాడి వక్రముగను, పిత్తరోగంబునందు చపలము
గను, కఫరోగంబునందు స్థిరముగనునుండు. మరియు, నాడి వాతపిత్త రోగంబున
సర్పము తెరంగునను, శ్లేష్మవాతరోగంబున రాజహంసవలెను, శ్లేష్మపిత్తరోగము

నందు మండూకమువలెను విషమజ్వరమునందు, తునకలుగను, సూక్ష్మముగను, సన్నిపాతమునందు అదృశ్యమై యనేకరీతులుగ నడుచును.

మతాన్తరే.

శ్లో॥ తృణంపురస్సరంకృత్వాయథావాతోవహేద్బలీ। శేషస్తంతృణమాదాయపృథివ్యాంవక్రగాయథా। తథామధ్యగతోవాయుః కృత్వాపిత్తంపురస్సరం। శేషస్థంకఫమాదాయనాడ్యాంవహతిసర్వదా ॥ వాక్యం ॥ అతఏవపిత్తస్యచంచలాగతిర్వాయోరగ్రత్వాత్। కఫస్యమందాగతిర్వాయుపృష్ఠత్వాత్॥ *

తా॥ గాలివీచునపుడు దానికెదురుగనుండు తృణముత్వరితంబుగను వెనుకనుండు తృణము హీనంబుగ నడుచునట్లైవడి మధ్యమాంగుళియందు స్పృశించువాతము, తర్జనీయందుస్పృశించుపిత్తమును విశేషముగ చలింపజేయుటయేగాక అనామికయందుండెడి శ్లేష్మమునుసగా మందముగచలింపంజేయు.

గ్రంథాన్తరే.

శ్లో॥ పిత్తశ్లేష్మగతిర్నాస్తివాతస్యగమనేగతిః । తస్మాత్పూర్వేగవహేద్వాయుర్జలూకావక్రగాయథా॥ *

తా॥ పిత్తశ్లేష్మనాడులు, స్వతంత్రరాహిత్యంబులుగనుండుటచే, వాతనాడి, గతిననుసరించే పిత్తశ్లేష్మములకు, గతిగలిగియుండు, గాన, వక్రముగనడుచు జలగచందంబున నాడులకు, అగ్రమునందుండెడి, వాతనాడి చలించెనేని, పిత్తశ్లేష్మములుసగా చలించు.

ఆరోగ్యనాడీలక్షణము.

శ్లో॥ హంసగాచైవయానాడీతథైవగజగామినీ। ముఖంప్రసన్నంచభవేత్తస్యారోగ్యంభవేత్సదా॥ *

తా॥ నాడిహంసయొక్కయు, ఏనుగయొక్కయు నడకగలిగి ముఖము ప్రసన్నముగనుండిన, అట్టిరోగికి ఆరోగ్యము గలుగు.

గ్రంథాన్తరే.

శ్లో॥ భూలతాభుజగప్రాయాస్వచ్ఛాస్వాస్థ్యమయీసిరా। సుఖిత
స్యస్థితాజ్ఞేయాతథాబలవతీమతా॥ *

తా॥ నీరోగియొక్కనాడి, భూతలయనంబడు నది సర్పమువలె, స్థిరంబుగను బలిష్ఠముగను నడుచు.

మతాన్తరే.

శ్లో॥ యేరోగిణఃకరంస్పృష్ట్వాస్వకరంక్షాళయేద్యది। రోగాస్తస్య
వినశ్యంతి పంకప్రక్షాళనాద్యథా॥ *

తా॥ రోగియొక్కనాడిని వైద్యుడుచూచి తనహస్తమును కడుగుకొన్నయెడల ఆరోగియొక్క వ్యాధులు నశించు.

వాతనాడీలక్షణము.

శ్లో॥ సర్పజలూకాదిగతింవిదన్తివిబుధాఃప్రభంజనేనాడీం॥ *

తా॥ వాతరోగమునందునాడి, సర్పము, జలగ, వీటిగతిచందంబున నడుచు.

పిత్తనాడీలక్షణము.

శ్లో॥ పిత్తేచకాకలావుకమండూకాదేస్తథాచపలామ్॥ *

తా॥ పిత్తరోగమునందునాడి, కాకి, లావుకము, కప్ప, వీట్లయొక్క గతివంటిగతి, గలదిగనుండు.

కఫరోగనాడీలక్షణము.

శ్లో॥ రాజహంసమయూరాణాంపారావతకపోతయోః। కుక్కుట
స్యగతింధత్తేధమనీకఫసంగినీ । పిత్తేవ్యక్తామధ్యమాయాంతృతీ
యాంగుళికాకఫే। వాతేధికేభవేన్నాడీప్రవ్యక్తాతర్జనీతలే॥ *

తా॥ శ్లేష్మరోగమునందునాడి, రాజహంసము, నెమలి, పావురము, గువ్వ, కోడి, వీటియొక్క గమనముగలిగియుండు. మరియు, పిత్తనాడి నడిమివ్రేలిక్రిందను, శ్లేష్మనాడి, అనామికక్రిందను, వాతనాడి, తర్జనీవ్రేలిక్రిందను నడుచును.

## వాతపిత్తనాడీలక్షణము.

శ్లో॥ ముహుస్సర్పగతింనాడీ ముహుర్భేకగతింతథా । తర్జనీమధ్యమామధ్యే వాతపిత్తేధికేస్ఫుటా । వక్రముత్ల్పుత్యచలతిధమనీవాతపిత్తతః॥ ❊

తా॥ వాతపిత్తప్రకోపమునందు, నాడితర్జనీమధ్యమాంగుళముల, మధ్యమునందు మాటిమాటికి, సర్పము, కప్ప, వీటియొక్క నడకతో తుల్యమై, వక్రముగ ఎగిరెగిరి నడుచుచుండు.

## వాతశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ సర్పహంసగతింతద్వ ద్వాతశ్లేష్మవతీంవదేత్ । అనామికాయాంతర్జన్యాంవ్యక్తావాతకఫేభవేత్। వహేంవ్వక్రంచమందంచవాతశ్లేష్మాధికత్వతః॥ ❊

తా॥ అనామికయందును, తర్జనియందును, స్ఫుటముగాకనుబడుచు, సర్పహంసగతులుగలిగి, మందముగను, వక్రముగను నడుచునట్టినాడి, వాతశ్లేష్మనాడియని జెప్పవలయు.

## గ్రంథాన్తరే.

శ్లో॥ భుజగాదిగతిస్తస్యా రాజహంసగతిస్తథా। వాతశ్లేష్మద్వయోద్భూతాంభావన్తేతద్విదోజనాః॥ ❊

తా॥ వాతశ్లేష్మనాడి, సర్పము, హంస, వీటిగతితో తుల్యగతిగలదిగనుండు.

## పిత్తశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ హరిహంసగతింధత్తేపిత్తశ్లేష్మాన్వితాధరా । మధ్యమానామికామధ్యేస్ఫుటాపిత్తకఫేధికే । ఉత్ల్పుత్యమందంచలతినాడీపిత్తకఫేధికే॥ ❊

తా॥ నాడి, కప్ప, హంస, వీటిగతితో తుల్యగతిగలిగి మధ్యమానామికయొక్క మధ్యమందు సంచరించుచు, యెగిరెగిరి మందముగా నడిచిన, పిత్తశ్లేష్మనాడియని తెలియవలయు.

గ్రంథాన్తరే.

శ్లో॥ మండూకాదిగతింనాడీంమయూరాదిగతింధరాం। పిత్తశ్లేష్మసముద్భూతాంప్రవదన్తిమనీషిణః॥ సూక్ష్మాశీతాస్థితానాడపిత్తశ్లేష్మసముద్భవా॥ ※

తా॥ నాడి, మండూకము, నెమలి, యివి మొదలగువాటిగతితెరంగున సంచరించుటయేగాక, సూక్ష్మంబుగను, శీతలంబుగను నుండునది పిత్తశ్లేష్మనాడియని యెరుంగవలయు.

సన్నిపాతనాడీలక్షణము.

శ్లో॥ కాష్ఠకుట్టోయథాకాష్ఠంకుట్టతేచాతివేగతః । స్థిత్వాస్థిత్వాతథానాడీ సన్నిపాతేభవేద్ధ్రువం । అంగుళత్రితయేపిస్యాత్ప్రవ్యక్తాసన్నిపాతతః॥ ※

తా॥ వృక్షమునుతొలుచునట్టిపిట్ట, అనగా (లకుముకిపిట్ట) వృక్షమును అతివేగముగానిలిచినిలిచి యెటులకొట్టునో అదేరీతిగ నిలిచినిలిచి మూడువేళ్లక్రింద నడుచుచు స్ఫుటముగనుండునది సన్నిపాతనాడియని యెరుంగవలయు.

గ్రంథాన్తరే.

శ్లో॥ లావతిత్తిరివర్తకగమనంసన్నిపాతతః । కదాచిన్మందగానాడీ కదాచిచ్ఛీఘ్రగాభవేత్ । త్రిదోషప్రభవేరోగేవిజ్ఞేయాచభిషగ్వరైః॥ ※

తా॥ త్రిదోషమిళితంబగునాడి, లావుకపిట్ట, తిత్తిరిపక్షి, మీనవల్లంకిపిట్ట వీటిరీతినడచుటయేగాక, నొకసమయంబున మందగతిగను మఱియొకసమయంబున శీఘ్రగతిగను నడుచునది సన్నిపాతమని యెరుంగవలయు.

అసాధ్యనాడీలక్షణము.

శ్లో॥ మందంమందంశిథిలశిథిలంవ్యాకులంవ్యాకులంవా। స్థిత్వాస్థిత్వావహతి ధమనీయాతిసూక్ష్మాచసూక్ష్మా । నిత్యంస్పందే

త్స్వరతిపునరప్యంగుళీసంస్పృశేద్వా । భావైరేవంబహువిధ
తరైసన్నిపాతాదసాధ్యా॥ *

తా॥ నాడి మందముగను, మిక్కిలి శిథిలముగను, అతిచంచలముగను, నిలిచి నిలిచియును, దృశ్యాదృశ్యముగను నుండినయెడల, నది సన్నిపాతరోగమనియు, అసాధ్యమనియును యెరుంగవలయు.

## గ్రంధాన్తరే.

శ్లో॥ యాత్యుచ్చకాస్థిరాత్యన్తాయాచేయంమాంసవాహినీ। యాచ
సూక్ష్మాచవక్రాచతామసాధ్యాంవిదుర్బుధాః॥ *

తా॥ నాడి, అతివేగంబుగ నెగురుచును, మిగులస్థిరంబుగను, మాంససంచారిగను, అతిసూక్ష్మంబుగను, అతివంకరగను నుండెనేని, అదియసాధ్యంబని యెరుంగవలయు.

## మతాన్తరే.

శ్లో॥ స్పందతేచైకమానేన త్రింశద్వారంయదాధరా । స్వస్థానేనత
దానూనం రోగీజీవతినాన్యదా । స్థిత్వాస్థిత్వాచహతియాసా
జ్ఞేయాప్రాణఘాతినీ॥ *

తా॥ ఏరోగియొక్క నాడి ఏకగతిగను ముప్పదిఘటికాకాలము నడిచిన ఆరోగి జీవించును. లేక నాడి నిలిచి నిలిచి ఆచేరీతిగనడచినయెడల అట్టిరోగి మరణంబుజెందు.

## గ్రంధాన్తరే.

శ్లో॥ మహాదాహేపిశీతత్వంశీతత్వేతాపితాసిరా । నానావిధాగతి
ర్యస్యతస్యమృత్యుర్నసంశయః॥ *

తా॥ ఏమనుజునికి అత్యుష్ణంబుగనుండు కాలంబున, అతిశీతంబుగను, అతిశీతంబుగనుండు కాలంబున అతితాపంబుగను, నానావిధ గతులుగలదిగ నాడి సంచరించెనేని అట్టివాడు మృతుడగు.

మతాన్తరే.

శ్లో॥ పూర్వంపిత్తగతింప్రభంజనగతింశ్లేష్మాణమాబిభ్రతీం । స్వస్థానాద్భ్రమణంముహుర్విదధతీంచక్రాధిరూఢేవయా । భీమత్వందధతీకదాచిదపివాసూక్ష్మత్వమాతన్వతీ। నోసాధ్యాంధమనీంవదంతిమునయోనాడీగతిజ్ఞానినః॥ ※

తా॥ ఏరోగియొక్కనాడి మందగతినిపొందినదగుచు, మధ్యమాంగుళియందు వాతశ్లేష్మములయొక్క గతులనుపొంది మాటిమాటికి అనేకవిధములుగ చక్రముమీద గూర్చున్నవాడెట్లుతిరుగునో అటుల స్వస్థానమునువిడిచి, అంతలోనే భయంకరమును పొంది వొకప్పుడు సూక్ష్మత్వమునుపొందిన అట్టిరోగి బ్రతుకడని, నాడీజ్ఞానులగు మునులు వచించిరి.

గ్రంథాన్తరే.

శ్లో॥ త్రిదోషేస్పందతేనాడీ మృత్యుకాలేచనిశ్చలా । జ్ఞేయాసర్వవికారేషువైద్యైఃకుశలకర్మభిః॥ ※

తా॥ త్రిదోషనాడి సర్వదాసంచరించుచు, మృత్యుకాలమాసన్నంబైన కాలంబున నిశ్చలంబుగనుండు. ఇట్టిభేదంబులను సర్వసన్నిపాతంబులయందును నెరుంగవలయు.

మతాన్తరే.

శ్లో॥ తస్యమృత్యుంవిజానీయాద్యస్యేదంనాడిలక్షణం॥ ※

తా॥ ఈపైజెప్పంబడిననాడి ఏమనుజునికి గలిగియుండునో నామనుజుడు యమపురంబునకేగు.

గ్రంథాన్తరే.

శ్లో॥ కంపతేస్పందతేత్యంతంపునస్స్పృశతిచాంగుళీ । తామసాధ్యాంవిజానీయాన్నాడీందూరేణవర్జయేత్॥ ※

తా॥ నాడివొకప్పుడు మిక్కిలి బలహీనము చూపుచును, వొకప్పుడు కొద్దిగాకదలుచును, అంతలోనే కనపడకను మరల కనుపడుచును, వుండినయెడల వైద్యుడు అట్టి రోగ మసాధ్యమనియెంచి దూరముగ వదలుకొనవలయు.

మతాన్తరే.

శ్లో॥ అతిసూక్ష్మాతివేగాచశీతలాచభవేద్యది । తదావైద్యోవిజానీయాత్సరోగిత్వాయుషఃక్షయీ॥ ❋

తా॥ ఏరోగియొక్క నాడి, అతిసూక్ష్మముగను అతివేగముగను శీతలముగను నడచిన, అట్టిరోగి క్షీణాయుష్యముగలవాడని తెలుసుకొనవలయు.

గ్రంథాన్తరే.

శ్లో॥ విద్యుద్వద్రోగిణోనాడీదృశ్యతేనచదృశ్యతే। అకాలవిద్యుత్వాతేవసగచ్ఛేద్యమసాదనం॥ ❋

తా॥ ఏరోగియొక్క నాడి, మెరుపువలె గనుపడినను పడకయుండినను, అకాలమునందలి మెరుపువలెనుండునో అట్టిరోగి యమునిసదనంబునకేగు.

మతాన్తరే.

శ్లో॥ తిర్యగుష్ణాచయానాడీసర్పగావేగవత్తరా। కఫపూరితకంఠస్య జీవితంతస్యదుర్లభం॥ ❋

తా॥ ఏరోగియొక్క నాడి వెచ్చనై వంకరగానడుచుచు సర్పగతిగలిగి మిక్కిలి వేగముగ నడుచుచు కంఠము పూరించియుండినయెడల, అట్టిరోగి యమమందిరంబునకేగు.

గ్రంథాన్తరే.

శ్లో॥ దృశ్యతేచరణేనాడీకరేనైవాభిదృశ్యతే । ముఖంవికాసితంయస్యతందూరంపరివర్జయేత్॥ ❋

తా॥ ఏరోగియొక్క నాడి పాదమునందు, కనుపడుచున్న, హస్తమునందు కనుబడక ముఖము విలాసముగనుండినయడల అట్టిరోగి యమపురంబున కేగునని తెలిసి వైద్యుడు వానిని విడువవలయు.

## మతాన్తరే.

శ్లో॥ వాతపిత్తకఫాశ్చాపిత్రయోయస్యాంసమాశ్రితాః । కృచ్ఛ్ర
సాధ్యామసాధ్యాంవాప్రాహుర్వైద్యవిశారదాః॥ ❋

తా॥ ఏరోగియొక్కనాడిని, వాత, పిత్త, కఫమును ఆశ్రయించియుండిన ఆరోగియొక్క రోగమసాధ్యమనియు, లేక, కష్టసాధ్యమనియును వైద్యవేత్తలు వచించిరి.

## మాసాంతమృత్యునాడీలక్షణము.

శ్లో॥ భూలతాభుజగాకారానాడీదేహస్యసంక్రమాత్ । విశీర్ణక్షీణ
తాంయాతిమాసాంతేమరణంధ్రువమ్॥ ❋

తా॥ నాడి, సర్పాకారముగ దేహమంతయువ్యాపించి, శిథిలముగను జీర్ణముగనుండిన నట్టివాడు మాసాంత్యమునందు మృతుడగు.

## అర్ధమాసమృత్యునాడీలక్షణము.

శ్లో॥ దేహేశైత్యంముఖేశ్వాసోనాడీతీవ్రావిదాహినీ। మాసార్థంజీ
వితంతస్యనాడీవిజ్ఞాతృభాషితం॥ ❋

తా॥ ఏరోగియొక్క దేహమందు శైత్యము, ముఖమునందలి విశేషముగశ్వాస యివిగలిగి, నాడితీవ్రముగను మిగుల దాహయుక్తముగ నడిచెనేని అట్టిరోగి, మాసార్థము జీవించునని నాడీజ్ఞానులు వచించిరి.

## సప్తదినమృత్యునాడీలక్షణము.

శ్లో॥ ముఖేనాడీవహేత్తీవ్రాకదాచిచ్ఛీతలావహేత్। ఆయాతిపిచ్ఛి
లస్వేదస్సప్తరాత్రంనజీవతి॥ ❋

తా॥ వాతనాడి మిక్కిలి తీవ్రగతిగలిగియుండినను, వకప్పుడు శీతలముగనుండినను శరీరమునకు జంకగా చమటబట్టినను నట్టిరోగి యేడుదినంబులలో మృతినొందు.

గ్రంథాన్తరే.

శ్లో॥ క్షణాద్గచ్ఛతివేగేనశాంతతాంలభతేక్షణాత్ । సప్తాహాన్మరణంతస్యయద్యఙ్గేశోఫవర్జితః॥ *

తా॥ ఏమనుజునియొక్క నాడి స్వస్థానమునువదలి క్షణకాలము తీవ్రంబుగను క్షణకాలము శాంతంబుగనడుచుచు శరీరము శోఫవర్జితముగనుండినను నట్టిమనుజు డేడుదినంబులకు మృతిజెందు.

ఐదవదినమృత్యునాడీలక్షణము.

శ్లో॥ పాదాఙ్గుళిగతానాడీమన్దమన్దాయదాభవేత్ । పంచభిర్దివసైస్తస్యమృత్యుర్భవతినాన్యథా॥ *

తా॥ ఏమనుజునియొక్క పాదాఙ్గుష్ఠమును జెందియుండు నాడి, మన్దమన్దముగ నడుచునో ఆట్టిమనుజుడైదుదినంబులలో వైవస్వతపురంబున కేగు.

చతుర్థదివసమృత్యునాడీలక్షణము.

శ్లో॥ పాదాంగుళగతానాడీకోష్ణావేగవతీభవేత్ । చతుర్భిర్దివసైస్తస్యమృత్యురేవనసంశయః॥ *

తా॥ ఏమనుజునియొక్క నాడి పాదాఙ్గుళిగతంబై కెంచిదుష్ణముతోగూడి యతి వేగంబుగనడుచుచుండెడినో అట్టిమనుజుడ న్తకాతిథ్యమును జెందు.

మతాన్తరే.

శ్లో॥ నిరీక్ష్యదక్షిణేపాదేనాడీమేకాంవిశేషతః। ముఖంనాడీంవహేన్నిత్యంతదాదినచతుష్టయం॥ *

తా॥ ఏమనుజునికి కుడిపాదంబున యొకనాడి యతితీవ్రంబుగనడుచుచుండుటయేగాక, ముఖంబునసగా యొకనాడినడుచుచుండెనేని, నట్టిమనుజుడు నాలవదివసంబున మృతుండగు.

## త్రిరాత్రమృత్యునాడీలక్షణము.

శ్లో॥ ముఖేనాడీయదానాస్తిమధ్యేశైత్యంబహిక్లమః। యదామందా
వహేన్నాడీత్రిరాత్రంనైవజీవతీ॥ ❋

తా॥ వాతనాడి, కదలక లోపల చల్లగనుండి, పైన నాడి, మందమందముగ నడచిన నట్టిరోగి మూడుదినంబులలో మృతినిజెందు.

## గ్రంథాన్తరే.

శ్లో॥ హిమవద్విషదానాడీజ్వరదాహేనతాపినాం। త్రిదోషస్పర్శం
భజతాంతదామృత్యుర్దినత్రయాత్॥ ❋

తా॥ ఏమనుజునికి అత్యంతక్రూరంబగు జ్వరముగలిగియుండినపుడు, నాడిమంచువలె శీతలముగనుండుటయేగాక, త్రిదోషస్పర్శసంబంధము గలిగియుండెనేని అట్టిమనుజుడు- (3) దివసంబులలో మృత్యువుపాలగు.

## మతాన్తరే.

శ్లో॥ పాదాంగుళగతానాడీచంచలాయదిగచ్ఛతి । త్రిభిశ్చదివసైస్త
స్యమృత్యురేవనసంశయః॥ ❋

తా॥ ఏమనుజునికి పాదాంగుష్ఠగతంబగునాడి మిగుల చలనంబుగ జనుచునుండునో నట్టినరుడు మూడుదినంబులలో సూర్యనందనుని పురంబునకేగు.

## ద్వితీయదివసమృత్యునాడీలక్షణము.

శ్లో॥ శీఘ్రానాడీమలోపేతాశీతలావాథదృశ్యతే। ద్వితీయేదివసేమృ
త్యూర్నాడీవిజ్ఞాతృభాషితం॥ ❋

తా॥ ఏరోగియొక్కనాడి మలోపేతముగను, శీఘ్రగతిగలిగియును, శీతలముగనుపడినయడల అట్టిరోగి రెండవదినంబున యమునాగ్రజుని సదనంబునకేగు.

## గ్రంథాంతరే.

శ్లో॥ స్థిరానాడీభవేద్యస్యవిద్యుద్యుతిరివేక్షతే । దినైకంజీవితంతస్య ద్వితీయేమృత్యురేవచ॥ *

తా॥ ఏరోగియొక్క నాడి, చాలాకాలము స్థిరముగనుండి మెరుపువలె తళుక్కుమని కనుబడి కనుబడకయుండునో అట్టిమనుజు డొకదినము జీవించి రెండవదినంబున దండధరుని చెంతజేరు.

## అన్యచ్చ.

శ్లో॥ శీఘ్రానాడీమలోపేతామధ్యాహ్నేగ్నిసమోజ్వరః। దినైకంజీ వితంతస్యద్వితీయేహ్నిమ్రియేతసః॥ *

తా॥ ఏరోగియొక్క త్రిదోషనాడి మలయుక్తమై శీఘ్రముగ నడుచుచు, మధ్యాహ్నకాలమందు, అగ్నితుల్యమగు జ్వరమువచ్చినయెడల అట్టిరోగి మరుదినమున మార్తాండనందనుని గృహంబునకేగు.

## గ్రంథాంతరే.

శ్లో॥ స్థిత్వానాడీముఖేయస్యవిద్యుజ్జ్యోతిరివేక్షతే । దినైకంజీవితంత స్యద్వితీయేమరణంధ్రువం॥ *

తా॥ ఏమనుజునియొక్క నాడి, ముఖంబుననిలిచినిలిచి వర్షఋతువునందు మెరుపు మెరయుచెరంగున మిక్కిలితీవ్రగతిగలిగియుండెనేని, నట్టివాడొకదినంబు జీవించి మరుదినంబున వైవస్వతాలయంబునకేగు.

## ద్వాదశయామమృత్యునాడీలక్షణము.

శ్లో॥ గతింభ్రమరకస్యేవావచ్ఛేదకదినేనతు । సకంధేచస్పందతేని త్యంపునర్గచ్ఛతిచాంగుళౌ ॥ మధ్యేద్వాదశయామానాంమృ త్యుకేవనసంశయః॥ *

తా॥ ఏమనుజునియొక్క నాడి తుమ్మెదవలె ఝుమ్ఝుమ్మనిబరుగిడుచును, భుజములయందు చలింపుచును, అంగుళములయందు చలింపకనుండునో నట్టిమనుజుడు పండ్రెండుయామములలోపల, శ్యామలాపతిపురంబునకేగు.

## దినాన్తమృత్యునాడీలక్షణము.

శ్లో॥ మరణేడమరుకాకారాభ వేదేకదినేనచ॥ *

తా॥ దినాంతమునందు మరణము గలిగెడు మనుజునికి నాడి డమరుకమువలె నుండు.

## ఆరవయామమృత్యునాడీలక్షణము.

శ్లో॥ మధ్యే రేఖాసమానాడీయదితిష్ఠతినిశ్చలా । షడ్భిస్తుప్రహరైస్త
స్యమృత్యుర్జ్ఞేయావిచక్షణైః॥ *

తా॥ ఏమనుజునియొక్క అంగుష్ఠమూలమందుండు నాడులన్నియు మధ్యమాంగుళియందు, రేఖాసమంబుగనుండుటయేగాక, నిశ్చలంబుగనుండునో యట్టిమనుజుడారుయామంబులలో మృతుడగు.

## సార్ధయామమృత్యునాడీలక్షణము.

శ్లో॥ ద్వ్యంగుళాబాహ్యతోనాడీమధ్యే రేఖాబహిర్యదా । సార్ధప్ర
హరకాన్మృత్యుర్జాయతేనాత్రసంశయః॥ *

తా॥ ఏపురుషునియొక్క నాడి, తర్జనీమధ్యమాంగుళములనువదిలి, అనామికమందుమాత్రము సంచరించుచు, దానిక్రింద రేఖాకారంబుగ స్పృశింపుచుండెనేని యట్టివాడొకటిన్నరయామములో మృత్యువుపాలగు.

## అర్ధయామమృత్యునాడీలక్షణము.

శ్లో॥ చలాచలతవేగాచనాసికాధారసంయుతా । శీతలాదృశ్యతే
యాచయామమధ్యేచమృత్యుదా॥ *

తా॥ ఏరోగియొక్క నాడి, ముక్కులయొక్క శ్వాసోఛ్వాసముల ఆధారము గూడినదై వణకుచును, చంచలముగను శీతలముగనుండెనేని, అట్టిరోగి, ఒకయామములోపల మరణమునొందు.

## గ్రంథాన్తరే.

శ్లో॥ అంగుష్ఠమూలతో బాహ్యేద్వ్యంగుళేయదినాడికా। ప్రహరార్ధాత్పరేహస్తమృత్యుం జానీయాచ్చవిచక్షణః॥ ❋

తా॥ అంగుష్ఠమూలమునందుండు నాడులాస్థానంబును వదిలి, రెండంగుళములకు క్రిందుగా, మధ్యమానామికలయందు, నడుచుచుండెనేని, నట్టివాడర్ధయామము లోపల, యమరాట్సదనంబున కేగు.

## భూతజ్వరనాడీలక్షణము.

శ్లో॥ తథాభూతాభిషంగేహి త్రిదోషవదుపస్థితా। సమాంగావహతేనాడీ తథానచక్రమంగతా॥ ❋

తా॥ భూతాభిషంగముగలవానినాడి, త్రిదోషనాడివలె, వాతపిత్తశ్లేష్మంబులు సంకలితమై, సమాకారంబుగ నడుచుచుండు.

## రోగరహితాపమృత్యునాడీలక్షణము.

శ్లో॥ అపమృత్యుర్నరోగాచ్చనాడీతత్సన్నిపాతవత్॥ ❋

తా॥ రోగరహితుడై అపమృత్యువును గాంచెడు వానినాడి, సన్నిపాత నాడి వలెనుండును.

## దుష్టపిత్తనాడీలక్షణము.

శ్లో॥ స్తోకంవాతకఫందుష్టం పిత్తంవహతిదారుణం। పిత్తస్థానంవిజానీయాద్భేషజంతస్యకారయేత్॥ ❋

తా॥ ఏమనుజునికి వాతశ్లేష్మనాడులుక్షీణిగుల అల్పంబుగను, పిత్తనాడి, అతి దారుణంబుగను నడుచుచుండెనేని నది దుష్టపిత్తమనియెఱింగి వైద్యుడు, చికిత్స జేయవలయు.

## సదోష-నిర్దోషనాడీలక్షణము.

శ్లో॥ నాడీయథాకాలగతిస్త్రయాణాం ప్రకోపశాన్త్యాదిభిరేవభూయః। వాతాదిదోషేచభవేత్ప్రకోపాస్థూలోల్పగాపాశనియన్త్రితేస్యాత్॥ ❋

తా॥ నాడి, సదా వాతపిత్తశ్లేష్మ, యుక్తంబుగనుండు. మఱియు నది వాతాదిరోగంబులయందు ప్రకోపంబుగను, నీరోగంబున శాంతత్వమునుబొంది, యథారీతి

గను, వాతాదిదోషంబున రోగయుక్తమై, ప్రకోపంబుగను, పాశాదిబద్ధంబున స్థూలంబుగను, అల్పంబుగను నడుచుచుండు.

జ్వర దాహ - సన్నిపాత నాడీలక్షణము.

శ్లో॥ ప్లవప్రబలతాంయాతిజ్వరదాహాభిభూతయే। సన్నిపాతికరూపేఽభవన్తిస్సర్వవేదనాః॥ *

తా॥ నాడి, సన్నిపాతతుల్యముగ, మిగుల తాపయుక్తజ్వరముగల రోగికి, మిక్కిలి చమటవడియుచు, నడుచుచుండుటయేగాక పైనుదహరింపబడు, చిహ్నములుగలజ్వరము, దాహము,ఇవి సన్నిపాతంబుకజనించెనేని,యనేకవేదనలంగల్గుగంజేయు.

జ్వరప్రకోపనాడీలక్షణము.

శ్లో॥ జ్వరప్రకోపేధమనీసోష్మా వేగవతీభవేత్॥ *

తా॥ నాడి, జ్వరప్రకోపమునందు ఉష్ణముగను, అతివేగముగ నడుచుచుండు.

మలాజీర్ణ- శ్లేష్మదోష- వీటినాడీలక్షణము.

శ్లో॥ మలాజీర్ణేనసితరాంస్పన్దనంపరికీర్తితమ్। నాడీతన్తుసమామన్దా శీతలాశ్లేష్మదోషజా॥ *

తా॥ నాడి, మలాధిక్యము, అజీర్ణము, వీట్లయందు, మందముగ చలించుచుండు. మఱియు, నాడి, శ్లేష్మాధిక్యంబున శీతలముగను, తంతుసదృశంబుగను, మందముగనునుండు.

వాతపిత్తము-శ్లేష్మవాతము-వీటినాడీలక్షణము.

శ్లో॥ చంచలాతరళాస్థూలాకఠినావాతపిత్తజా। ఈషచ్చదృశ్యతేతూష్మామన్దాస్యాచ్ఛ్లేష్మవాతజా॥ *

తా॥ వాతపిత్తరోగంబున చంచలముగను, ప్రకాశముగను, స్థూలముగను, కఠినముగనడుచుచుండు. మఱియు, శ్లేష్మవాతరోగంబుననాడి, కించిదుష్ణముగను, మందముగను నడుచుచుండు.

అల్పశ్లేష్మము- ప్రబలవాతము - ఉష్ణవాతము,
వీటినాడీలక్షణము.

శ్లో॥ నిరంతరంఖరంయాతుంమన్దశ్లేష్మాతివాతలా। రూక్షవాతభవేత్తస్యనాడీస్యాత్పిణ్డసన్నిభా॥ *

తా॥ నాడి, అల్పశ్లేష్మరోగమునందును, ప్రబలవాతరోగమునందును, నిరంతరముతీక్ష్ణంబుగను, ఉష్ణముగనునడుచుచుండును. మఱియు, నాడి, ఉష్ణవాతమునందు, పిండమువలె నడుచుచుండును.

## సహజవాతము-తీవ్రవాతము-వీటియొక్క లక్షణము.

శ్లో॥ సౌమ్యాసూక్ష్మాస్థిరామన్దానాడీసహజవాతజా। స్థూలాచకఠినాశీఘ్రాస్పందతేతీవ్రమారుతే॥ *

తా॥ ఏమనుజునికినాడి, సౌమ్యంబుగను, సూక్ష్మముగను, స్థిరముగను, మందముగను, స్థూలముగను, శీఘ్రముగను, నాడినడిచెనేని నది తీవ్రవాతంబని యెఱుంగవలయు.

## దుష్టరక్తనాడీలక్షణము.

శ్లో॥ మధ్యేకరేణహేనాడీయదిసన్తాపితాధృవం । తదానూనంమనుష్యాణాంరుధిరాపూరితామలాః॥ *

తా॥ దుష్టరక్తము, శరీరమందు వృద్ధిపొందెనేని యారక్తము పచ్యమానాశయమునందలి మలంబుతోజేరి సంతాపయుక్తమై మధ్యహస్తంబున చెల్లించుచుండు.

## భూతజ్వర-ఏకాహికజ్వర- విషమజ్వర నాడీలక్షణము.

శ్లో॥ భూతజ్వరేసేకఇవాదివేగాధావన్తినద్యోహియథాబ్ధిగామాః। ఏకాహికేనక్వచనప్రదూరేక్షణాంతగామీవిషమజ్వరేణ॥ *

తా॥ భూతజ్వరమునందలినాడి, సముద్రగామినులగు నదులచందంబున నతివేగంబుగను, మఱియు, ఏకాహికజ్వరము, విషమజ్వరము, వీట్లయందు నాడి, కొంతకాలం బతివేగంబుగను, నిలిచియు జనుచునుండు.

## ద్వ్యాహిక- త్ర్యాహిక- చాతుర్థికజ్వర, నాడీలక్షణము.

శ్లో॥ ద్వితీయకేనాథతృతీయ్యాతుర్యయోర్గచ్ఛన్తితప్తాభ్రమివక్రమేణ॥

తా॥ నాడి, ద్వ్యాహికము, త్ర్యాహికము, చాతుర్థికము, వీట్లయందు మిగుల నుష్ణంబుతోగూడి తుమ్మెదవలె నడుచుచుండు.

## అజీర్ణనాడీలక్షణము.

శ్లో॥ అజీర్ణేతుభవేన్నాడీకఠినాపరితోజడా । ప్రసన్నాతుద్రుతాశు
ద్ధాత్వరితాచప్రవర్తతే॥ *

తా॥ నాడి, అజీర్ణంబున కఠినంబుగను, సర్వత్రజడముగను, త్వరితముగను, అశుద్ధముగను, వేగముగను నడుచుచుండు.

## మన్దాగ్నినాడీలక్షణము.

శ్లో॥ మన్దాగ్నౌక్షీణతాంయాతినాడీహంసాకృతిస్తథా॥ *

తా॥ మన్దాగ్నిగలవాని నాడి క్షీణంబై హంసవలె నడుచుచుండు.

## దీప్తాగ్నినాడీలక్షణము.

శ్లో॥ లఘ్వీవహతిదీప్తాగ్నేస్తథావేగవతీస్మృతా॥ *

తా॥ దీప్తాగ్నియందునాడి, లఘువుగను, వేగముగ నడుచుచుండు.

## అగ్నిమాన్ద్యము - గ్రహణీ - వీటియొక్క నాడీలక్షణము.

శ్లో॥ పాదేచహంసగమనాకరేమణ్డూకసంప్లవా । తస్యాగ్నేర్మంద
తాదేహేత్వథవాగ్రహణీగదః॥ *

తా॥ అగ్నిమాన్ద్యము, గ్రహణీరోగము, వీటియందునాడి, పాదంబున హంసవలెను హస్తంబున కప్పవలెను నడుచుచుండు.

(నాడీనిర్ణయము-సమాప్తము.)



శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

శ్రీమద్దాధీచవంశభూషణుండును శ్రీబలదేవసూనుండును
సకలాయుర్వేదసంప్రదాయసార్వభౌముండునునగు
జ్ఞారసరామకవివర్యునిచే సుశ్రుతాది వివిధాయుర్వేద
గ్రంథప్రమాణోక్తముగ రచియింపఁబడిన

# అనుపానరత్నాకరము.

అను

## (వైద్యశాస్త్రము)

ఇది

పిడుగు - సుబ్బరామయ్యగారిచే
నూతనముగ వ్రాయబడిన తెనుగుతాత్పర్యసహితముగ
వైయ్యాకరణపండితశిరోమణియగు
సింగరాజు - కామాశాస్త్రులవారిచే
లేఖకప్రమాదాదిదోషరహితంబుగ పరిష్కరింపఁబడి

పిడుగు * సుబ్బరామయ్య అండ్ సన్
గార్లచే స్వకీయ
హిందూరత్నాకరముద్రాక్షర
శాలయందు
మొదటితూరిముద్రింపించి ప్రచురింపఁబడియె.

MADRAS.
1896

శ్రీ రస్తు.

# అనుపానరత్నాకరము.

## విషయసూచిక.

—※—

విషయసూచిక ముగిసెను.

శ్రీ ర స్తు.

—*—

ప్రకృతము విక్రయమునకు దొరికెడు ఆంధ్రతాత్పర్యసహిత

గ్రంథముల జాబితా.

| | | | |
|---|---|---|---|
| అనుపానరత్నాకరము (నూతనగ్రంథము.) వైద్యము ... | ౦ | ౧౩ | ౦ |
| గుణపాఠము ( ద్రవ్యగుణముల దెలుపునది ) వైద్యము... | ౩ | ౮ | ౦ |
| చికిత్సారత్నము (స్త్రీరోగబాలరోగములుగలది.) వైద్యము | ౧ | ౦ | ౦ |
| చింతామణి ఆంధ్రతాత్పర్యసహితము వైద్యము ... | ౮ | ౦ | ౦ |
| ధన్వంతరినిఘంటువు (వైద్యము) | ౩ | ౮ | ౦ |
| నాడీనక్షత్రమాల (వైద్యము) | ౦ | ౪ | ౦ |
| కాలజ్ఞానము (వైద్యము) ... ... | ౦ | ౪ | ౧ |
| వైద్యనైఘంటిక పదపారిజాతము ... ... | ౪ | ౮ | ౦ |
| వైద్యామృతము (వైద్యము) | ౧ | ౦ | ౦ |
| భామినీసుగుణమంజరి (స్త్రీనీతిశాస్త్రము) ... ... | ౦ | ౩ | ౦ |
| జాతకాలంకారము (జ్యోతిషము) ... ... | ౦ | ౬ | ౦ |
| బల్లిపతనము - బల్లిపలుకు (డిటో) నూతనగ్రంథము ... | ౦ | ౧ | ౨ |
| ఆంధ్రపదపారిజాతము - శుద్ధాంధ్రనిఘంటువు ... | ౩ | ౮ | ౦ |
| కృష్ణజన్మఖండము (పురాణము) ౧౦ ఫారములుగలసంచిక | | | |
| ౧కి ౦ ౮ ౦ చొప్పున సంచికలు ౩కై ... | ౧ | ౮ | ౦ |

ఇందుదహరింపబడియుండు పుస్తకములను కోరువారు యీక్రిందకనుపరచియుండు అడ్రస్సుప్రకారము నాపేర వ్రాసితెప్పించుకొనవలయును.

ఇట్లు

 పిడుగు - వేంకటరావు.

హిందూరత్నాకరముద్రాక్షరశాల

మద్రాసు.

శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః-

ఆంధ్ర తాత్పర్యసహిత

# అనుపానరత్నాకరము.

## ప్రథమస్తరంగము

శ్లో॥ ప్రణమ్యశ్రీగణేశ్వరంహరంవిష్ణుందివాకరం ।
శివాంరత్నాకరంకుర్వేఽనుపానస్యయథామతి॥

తా॥ విఘ్నేశ్వరుడు - శివుడు - విష్ణువు - సూర్యుడు - పార్వతీదేవి-వీరలను నమస్కరించి నాబుద్ధికి గోచరమైనంతవరకు “అనుపానరత్నాకరము” అను గ్రంథమును రచించుచున్నాడను.

### అనుపానపరిభాష.

శ్లో॥ అమ్లేనకేచిద్విహితామనుష్యామాధుర్యయోగేప్రణయోభవంతి।
తథామ్లయోగేమధురేణతృప్తాస్తేషాంయథేష్టంప్రవదంతిపథ్యం॥

తా॥ కొందరుపులుసుయందు ప్రీతిగలవారును కొందరుతీపుయందు ప్రీతిగలవారుగను మఱికొందరు తీపుగను పుల్లగనునుండు వాటియందు ఆసక్తిగలవారుగనునుందురు. అట్టివారికి హితముగనుండుపథ్యములను వైద్యవేత్తలు చెప్పుచున్నారు. అవి యెవ్వియనిన.

శ్లో॥ శీతోష్ణతోయాసవమద్యయూషఫలామ్లధాన్యామ్లపయోరసా
నాం।యస్యానుపానంతుహితంభవేద్యత్తస్మైప్రదేయంత్విహ
మాత్రయాతత్॥ ౧॥

తా॥ శీతోదకము ఉష్ణోదకము చెరుకుకల్లు కల్లు కట్టు అనగా (పెసలు మొదలగువానిని ఉడకపెట్టిననీరు) పండ్లపులుసు ధాన్యములపులుపు పాలు ఫల

రసములు వీటియందు ఎవరెవరికి ఏయేఅనుపానము హితముగనుండునో అట్టివారికి ఆయా అనుపానమును ఆయాప్రమాణప్రకారముగ ఔషధ సహితముగ ఇయ్యవలయును.

శ్లో॥ వ్యాధించకాలంచవిభావ్యధీరైర్ద్రవ్యాణియోజ్యానిచతానితాని।
సర్వానుపానేషువరంవదంతిమేధ్యంయదంభశ్శుచిభాజనస్థం॥

తా॥ విద్వాంసులగువారు వైద్యశ్రేష్ఠులు వ్యాధినిన్ని కాలమునున్ను అనుసరించి ఆయా అనుపానములను చేర్చవలయును. మఱియు శుద్ధపాత్రలయందుం(మట్టిపాత్ర)చబడిన శుద్ధోదకము సమస్త అనుపానములయందును శ్రేష్ఠమైనదిగనుండును.

శ్లో॥ లోకస్యజన్మప్రభృతిప్రశస్తాస్తోయాత్మకాస్సర్వరసాశ్చదృ
ష్టాః।సంక్షేపఏషోఽభిహితోఽనుపానేష్వతఃపరంవిస్తర ౩॥
తోఽభిధాస్యే॥

తా॥ సమస్తరసములునువుదకాంతర్భూతముగనుండుటవలన జనులకుజన్మప్రభృతి మరణపర్యంతము వుదకము ప్రశస్తమైన అనుపానమని యెఱుంగవలయు. ఇట్టివుదకము సమస్త అనుపానములయందు సంక్షేపముగ జెప్పబడినది. ఇకను విశేషముగ అనుపానములను జెప్పబోవుచున్నాను.

శ్లో॥ ఉష్ణోదకానుపానంతుస్నేహానామథశస్యతే। ఋతేభల్లాతక
స్నేహాత్స్నేహాత్తౌవరకాత్తథా॥ ౪॥

తా॥ జీడిగింజలు వగరుపదార్థములు వీటియొక్క తైలములకుతప్ప యితరములయిన తైలములకు ఉష్ణోదకము అనుపానమగుచున్నది.

శ్లో॥ అనుపానంవదంత్యేకేతైలేయూషామ్లకాంజికే। శీతోదకం
మాక్షికస్యపిష్టాన్నస్యచసర్వశః॥ ౫॥

తా॥ కొందఱు తైలమునకు పులికట్టు పులికడుగు ఇవి అనుపానములని చెప్పుచున్నారు. మఱియు తేనె పేలపిండి మొదలయిన పిండిపదార్థములు వీటికి సర్వసమ్మతముగ శీతోదకము అనుపానమగుచున్నది.

శ్లో॥ దధిపయసిమద్యార్తేవిషజుష్టేతథైవచ। కేచిదిచ్ఛంతి పయస్యాహురనుపానంసుఖోదకం॥ ౬॥

తా॥ మద్యము విషము వీటివలనగలిగిన వికారములకు పెరుగు పాలు యివి అనుపానములగుచున్నవి పైజెప్పబడిన పేలపిండి మొదలయినవాటివలన గలిగిన వికారములకు సుఖోష్ణోదకము అనుపానమని కొందరువచించెదరు.

శ్లో॥ పయోమాంసరసోవాపిశాలిముద్గాదిభోజినాం । యుద్ధాధ్వాతపసంతాపవిషమద్యరుజాసుచ॥ ౮॥

తా॥ సంబాబియ్యము పులగము వీటిని భుజించుట యుద్ధముచేయుట దారి నడుచుట ఎండవేడిమిచే కొట్టబడుట నిప్పుసెగచే గాసినొందుట విషపానము మద్యపానము వీటివలన గలిగినరోగములకు పాలుగాని మాంసరసముగాని అనుపానమగుచున్నది.

శ్లో॥ మాషాదేరనుపానంతుధాన్యామ్లందధిమస్తువా। మద్యంమద్యోచితానాంతుసర్వమాంసేషుపూజితం॥ ౯॥

తా॥ మినుములుమొదలయినవాటికి ధాన్యపులుసుగాని పెరుగుగాని పెరుగుమీదితేటగాని అనుపానమగుచున్నది. మఱియు మద్యపానాభ్యాసముగలవారికి సర్వమాంసములయందును మద్యానుపానమే శ్రేష్ఠమగుచున్నది.

శ్లో॥ అమద్యపానాముదకంఫలామ్లంవాప్రశస్యతే । క్షీరంఘర్మాధ్వభాష్యస్త్రీక్లాంతానామమృతోపమం॥ ౧౦॥

తా॥ మద్యపానాభ్యాసములేనివారికి (సర్వమాంసములయందును) ఉదకముగాని పులుసుగల పండ్లరసముగాని ప్రశస్తమైన అనుపానముగనుండు. ఎండమొదలయినవానివలన గలిగినతాపము మిగులమాటలాడుట స్త్రీసంభోగమువలన గలిగిన శ్రమ వీటికి క్షీరము అమృతతుల్యానుపానముగనుండు.

శ్లో॥ సురాకృశానాంస్థూలానామనుపానంమధూదకం । నిరామయానాంచిత్రంతుభుక్తమధ్యేప్రకీర్తితం॥ ౧౧॥

తా॥ చిక్కినవారికి మద్యము అనుపానము. బలిసినవారికి ఉదకసహితమగు తేనె అనుపానము రోగరహితులకు భోజనమధ్యమునందు నానావిధపదార్థములు అనుపానములని చెప్పబడుచున్నవి.

శ్లో॥ స్నిగ్ధోష్ణంమారుతేపథ్యంకఫేరూక్షోష్ణమిష్యతే । అనుపానంహితంచాపిపిత్తేమధురశీతలం॥ ౧౨॥

తా॥ వాతరోగమునకు కొంచెము ఉష్ణముగనుండు పదార్థమున్ను కఫరోగమునకు మిక్కిలి ఉష్ణపదార్థమున్ను పిత్తరోగమునకు తీపుగను చల్లగనుండుపదార్థమున్ను హితమైన అనుపానముగనుండు.

శ్లో॥ హితంశోణితపిత్తిభ్యఃక్షీరమిక్షురసస్తథా । అర్కశేలుశిరీ
షాణామాసవాస్తువిషార్తిషు॥ ౧౩॥

తా॥ రక్తపిత్తరోగముగల వారలకు పాలుగాని చెరుకురసముగాని అనుపానముగనుండు. విషజనితరోగముగలవారలకు జిల్లేడు విరిగి దిరిశన వీటియొక్క మద్యములు అనుపానములుగనుండు.

శ్లో॥ అతఃపరంతువర్గాణామనుపానంపృథక్పృథక్ ।ప్రవక్ష్యామాను
పూర్వేణసర్వేషామేవమేశ్రుణు॥ ౧౪॥

తా॥ ఇకమీదట వర్గములన్నిటికి అనుపానములను వెవ్వేఱుగ చెప్పబోవుచున్నాను.

శ్లో॥ భవంతిచాత్రసర్వేషాంమాహేంద్రంతోయముత్తమం । సా
త్మ్యంయస్యతుయత్తోయంతత్తస్మైహితముచ్యతే॥ ౧౫॥

తా॥ మాహేంద్రోదకముసమస్త అనుపానములయందును ఉత్తమమైనది. ఎవనికి ఏ యుదకము వికారమును కలుగజేయకుండునో ఆయుదకము వానికిహితముగనుండునని జెప్పబడును.

శ్లో॥ ఉష్ణంవాతేకఫేతోయంపిత్తేరక్తేచశీతలం । దోషవద్గురువా
భుక్తమతిమాత్రమథాపివా । యథోక్తేనానుపానేనసుఖమ
న్నంప్రజీర్యతే॥ ౧౬॥

తా॥ వాతరోగము కఫరోగము వీటియందు ఉష్ణోదకమును. పిత్తరోగము రక్తజనితరోగము వీటియందు శీతోదకమును అనుపానములుగనుండు. భుజింపబడిన పదార్థము వాతపిత్తశ్లేష్మములలో నేదియైన కలుగజేయునదిగనుండినను గురుత్వమును గలుగజేయునదిగనుండినను అధికమైనను పైజెప్పబడిన ఉచితానుపానములచేత జీర్ణింపబడును.

శ్లో॥ రోచనంబృంహణంవృష్యందోషసంఘాతభేదనం।తర్పణంమా
ర్దవకరం।శ్రమక్లమహరంసుఖం ॥ దీపనందోషశమనంపిపాసా
చ్ఛేదనంపరం।బల్యంవర్ణకరంసమ్యగనుపానంసదోచ్యతే॥౧౭॥

తా॥ ఏయేపదార్థమునకు ఏయేఅనుపానము ఉచితముగ జెప్పబడియున్నదో ఆయాఅనుపానము రుచికరముగను వృద్ధికరముగను వీర్యవృద్ధికరముగను సమస్తదోషములను పోగొట్టునదిగను తృప్తికరముగను మృదుత్వమును కలుగజేయునదిగను శ్రమము గ్లాని వీటినిపోగొట్టునదిగను బలకరముగను కాంతినికలుగజేయునదిగనునుండును.

శ్లో॥ తదాదౌకర్ష యేత్పీతంస్థాపయేన్మధ్యసేవితం । పశ్చాత్పీతం
బృంహయతితస్మాద్వీక్ష్యప్రయోజయేత్ ॥ స్థిరతాంగతమక్లి
న్నమన్నమద్రవపాయినాం । భవత్యాబాధజననమనుపాన
మతఃపిబేత్॥ ౧౮॥

తా॥ అట్టి అనుపానము భోజనాదియందు సేవింపబడెనేని శరీరమునకు దౌర్బల్యము మధ్యమునందు సేవింపబడెనేని భుజింపబడిన పదార్థమును శరీరమునందు యిమిడికయు భుజింపబడినపిదప సేవింపబడెనేని శరీరపుష్టి వీటినిగలుగంజేయుగాన చక్కగ ఆలోచించి అనుపానములను పైజెప్పబడిన ప్రకారముగసేవింపవలయు ద్రవపదార్థమును సేవించనివారికి భుజింపబడిన అన్నము మృదుత్వమును జెందక స్థిరత్వమును పొందినదై శరీరమునకు బాధనుగలుగజేయుగాన అనుపానమును తప్పక సేవింపవలయు.

శ్లో॥ నపిబేచ్ఛ్వాసకాసార్తోరోగేచాప్యూర్ధ్వజత్రుగే। క్షతోరస్కః
ప్రసేకీచయస్యచోపహతస్స్వరః॥ ౧౯॥

తా॥ శ్వాస కాసరోగములుగలవాడును ఊర్ధ్వజత్రురోగముగలవాడును రొమ్మునొప్పిగలవాడును ప్రసేకరోగముగలవాడును హీనస్వరముగలవాడును ఇట్టి రోగములు ప్రకోపించియున్నపుడు ఉదకమును పానముజేయకూడదు.

శ్లో॥ పీత్వాఽధ్వభాష్యాధ్యయనగేయస్వప్నాన్నశీలయేత్ । ప్రదూ
ష్యామాశయంతద్ధితస్యకంఠోరసిస్థితం ॥ స్యందాగ్నిసాదచ్ఛ
ర్ద్యాదీనామయాఞ్జనయేద్బహూన్॥ ౨౦॥

తా॥ అనుపానమును సేవించినతోడనే దారినడచుట పెగుల సంభాషించుట అధ్యయనముచేయుట గానముచేయుట నిద్రించుట వీటిని వర్జింపవలయు. అటుల వర్జింపనియడల పానముజేయఁబడిన అనుపానము ఆమాశయమును చేరిచి కంఠమూ రొమ్ము వీటియందునిలచి ఓకరించి కఫమ్ముపడుట అగ్నిమాంద్యము వమనము ఇవి మొదలైన అనేకరోగములను గలుగింజేయు.

శ్లో॥ గురులాఘవచింతేయంస్వభావంనాతివర్తతే। తథాసంస్కార
మాత్రాంతకాలాంశ్చాప్యుత్తరోత్తరం॥ ౨౧॥

తా॥ మనుష్యునియొక్క స్వభావము సంస్కారము ప్రమాణము రోగాంత కాలము వీట్లయొక్క న్యూనాధికభావముల ననుసరించి అధికముగగాని లఘువుగ గాని అనుపానమును సేవించవలయు.

శ్లో॥ మందకర్మానలారోగ్యాఃసుకుమారాస్సుఖోచితాః । జన్తవో
యేతుతేషాంహిచింతేయంపరికీర్తితా॥ ౨౨॥

తా॥ మందముగ పనిజేయువారు మందాగ్నిగలవారు పెగుల ఆరోగ్యము నపేక్షించువారు సుకుమారులుగనుండు వారెవరో అట్టివారికి పైచెప్పబడిన అనుపానములు విధింపబడియున్నవి.

శ్లో॥ బలినఃకరభక్షాశ్చయేచదీప్తాగ్నయోనరాః । కర్మనిత్యాశ్చ
యేతేషాంనావస్యంపరికీర్తయేత్॥ ౨౩॥

తా॥ యెట్టివారు బలవంతులుగను కఠినభక్షణముచేయువారుగను అగ్నిదీపముగలవారుగను యెల్లప్రొద్దు పనిచేయువారుగను నుందురో అట్టివారికి పైజెప్పబడిన అనుపానములు అవస్యకముగావు.

## ❊ కొన్నిరోగములకు - క్షీరానుపానము. ❊

శ్లో॥ క్షీరోచితస్యప్రక్షీణశ్లేష్మణోదాహతృడ్వతః । క్షీరంపిత్తానిలా
ర్తస్యపథ్యమప్యతిసారిణః॥ ౨౪॥

తా॥ క్షీణశ్లేష్మము తాపము దప్పి పిత్తము వాతము కీటిచేపీడ అతిసారము ఇవిగలవానికి పాలు అనుపానముగనుండు.

శ్లో॥ తద్వప్రుర్లంఘనోత్తప్తం ప్లుష్టంవనమివాగ్నినా। దివ్యాంబుజీవ
యేత్తస్యజ్వరంచాశునియచ్ఛతి॥ ౨౫॥

తా॥ కార్చిచ్చుచేదహింపబడిన వనము వర్షోదకముచే మరలచిగిరించుచం
దంబున లంఘనముచేత గాశిజెందినవాడు యెండచేత తపింపబడినవాడు క్షీరాను
పానముచే జీవించు అట్టివానికి జ్వరము శీఘ్రముగనశించు.

శ్లో॥ సంస్కృతంశీతముష్ణంవాతస్మాద్ధారోష్ణమేవవా। విభజ్యకాలే
యుంజీతజ్వరిణంహన్త్యతోన్యథా॥ ౨౬॥

తా॥ కాగిచల్లారియు లేక కొంచము ఉష్ణముగను లేక ధారోష్ణముగనుండు
పాలును కాలమునునెఱిగి జ్వరపీడితుడు సేవింపవలయు కాచబడనదియును ధా
రోష్ణముగనుండనిదియునునైన పాలనుజ్వరపీడితుడుసేవించెనేని మృత్యువశుడగును.

శ్లో॥ పయస్సశుంఠీఖర్జూరమృద్వీకాశర్కరాఘృతం। శృతశీతంమధు
యుతంతృడ్దాహజ్వరనాశనం ॥ తద్వద్ద్రాక్షాబలాయష్టీసారి
వాకణచందనైః। చతుర్గుణేనాంభసావాపిప్పల్యావాశ్రితం
పిబేత్॥ ౨౭॥

తా॥ పాలయందు శొంఠి ఖర్జూరపుకాయ ద్రాక్ష వీటిలో నేదినైననువైచి
కాచి అందుశర్కరగాని నెయ్యిగాని తేనెగానివైచి చల్లార్చి అనుపానముగసేవిం
చిన యెడల దప్పి తాపము వీటిని నివర్తింపజేయు. మఱియు ద్రాక్ష చిట్టాముదపు
వేరు యష్టిమధుకము సుగంధపాలవేళ్లు పిప్పలి చందనము వీటినివైచి కాచబడిన
పాలుసేవింపబడినను లేక పాలకు నాలుగితలు వుదకముపోసి పిప్పలివైచి నీరం
తయు యిగురునటులకాచి సుఖోష్ణముగ పానముచేసినను జ్వరమునునశింపజేయు.

శ్లో॥ కాసాచ్ఛ్వాసాచ్ఛిరశ్శూలాత్పార్శ్వశూలాచ్చిరజ్వరాత్। ము
చ్యతేజ్వరితఃపీత్వాపఞ్చమూలీశ్రితంపయః॥ ౨౮॥

తా॥ జ్వరముగలవాడు పంచమూలములను పాలలోవైచి కాచి అనుపాన
ముగసేవించినయెడల చిరకాలజ్వరము నశించుటయేగాక కాస శ్వాస తలనొప్పి
పార్శ్వశూల యివిగూడనశించు.

శ్లో॥ శ్రితమేరండమూలేనబాలబిల్వేనవాజ్వరాత్। ధారోష్ణంవా
పయఃపీత్వావిబద్ధానిలవర్చసః॥ ౨౯॥

# అనుపానరత్నాకరము.

తా॥ పాలయందు ఆముదపువేరునుగాని లేత బిల్వపత్రములనుగాని వైచి కాచి అనుపానముగ సేవించినను లేక పాలను ధారోష్ణముగ సేవించినను జ్వరము మలబద్ధము యినశించు.

శ్లో॥ సరక్తపిత్తాతిసృతేస్సతృట్ శూలప్రవాహికాత్ । సిద్ధంశుంఠీ
బలావ్యాఘ్రీగోక్షురకగుడైః పయః॥ ౩౦॥

తా॥ పాలయందు శొంఠి చిట్టాముదపువేళ్లు నాకుడు పల్లేరు బెల్లము వీటిని వైచికాచి అనుపానముగ సేవించిన రక్తపిత్తము అతిసారము దప్పితోగూడిన శూలభేదములు యినివర్తించు.

శ్లో॥ శోఫమూత్రశకృద్వాతవిబంధజ్వరకాసజిత్। వృశ్చీకబిల్వవర్షా
భూసాధితంజ్వరశోఫనుత్ ॥ శంశుపాసారసిద్ధంవాక్షీరమా
శుజ్వరాపహం॥ ౩౧॥

తా॥ తెల్లగలిజేరు బిల్వము గలిజేరు వీట్లను పాలయందువైచి కాచి అనుపానముగ సేవించినను లేక ఇరుగుడురసమునువైచి కాచి త్రాగినను శోఫ మూత్రరోగము భేదులు వాతము మలమూత్రములనుబంధించు రోగము జ్వరకాస జ్వరశోఫ కేవలజ్వరము యినివర్తించు.

శ్లో॥ సౌభాగ్యపుష్టిబలశుక్రవివర్ధనానికింసన్తినోభువిబహూనిరసా
యనాని । కందర్పవర్ధినీపరంతుసితాజ్యయుక్తాదుగ్ధాధృతేన
మమకోపిమతః ప్రయోగః॥ ౩౨॥

తా॥ శరీరకాంతి శరీరపుష్టి బలము వీర్యవృద్ధి కామవృద్ధి వీటినిగలుగఁ జేయుటకు అనేకరసాయనములుండినప్పటికిన్ని పాలనుకాచి అందు తెల్లశర్కర నెయ్యి వీటినివైచి సేవించిన పైజెప్పబడిన గుణములను గలుగజేయుటకు యితర రసాయనములు యీప్రయోగముతో సమానములుగావు.

## యోగరాజగుగ్గుల్వనుపానములు.

శ్లో॥ రాస్నాదిక్వాథసంయుక్తోవివిధంహంతిమారుతం । కాంకో
ల్యాదిశ్రితాప్పిత్తంకఫమారగ్వధాదినా॥ దార్వీశ్రితేనమేహాం
శ్చగోమూత్రేణైవపాండుతాం । మేదోవృద్ధించమధునా

కృష్ణేనింబశ్రితేనవా। ఛ్ఛిన్నాక్వాథేనవాతా స్రంశోథంశూలం కణాశ్రితా॥ పాటలాక్వాథసహితో విషమూషకజంజయేత్। త్రిఫలాక్వాథసహితో నేత్రార్తింహంతిదారుణాం ॥ పునర్న వాదేకిక్వాథేనహాన్యాత్సర్వోదరాణ్యపి॥ ౩౩॥

తా॥ యోగరాజగుగ్గులు అనేఔషధమును రాస్నాదికషాయముతో సేవించిన నానావిధములయిన వాతములునశించు. కాకోల్యాదికషాయముతో సేవించిన పిత్తరోగమునశించు. ఆరగ్వధాది (రేల) కషాయముతో సేవించిన కఫరోగమునివ ర్తించు. మానిపసపు కషాయముతో సేవించిన మేహరోగములునివర్తించు. గో మూత్రముతో సేవించిన పాండురోగమునశించు. తేనెతో సేవించిన మేదోవృద్ధి (అధిక బలుపు) నశించు. వేపకషాయముతో సేవించిన కుష్ఠురోగముతాలుగు తిప్పతీగ కషాయముతో సేవించిన వాతరక్తరోగమునివర్తించు. పిప్పలికషాయముతో సేవించిన శోఫశూలములునివర్తించు. ముక్కుపుచెట్టువేరు కషాయముతో సేవించిన యెలుక విషమునశించు. త్రిఫలకషాయముతో సేవించిన దారుణమైన నేత్రరోగమునివర్తించు పునర్నవాది (గలిజేరు) కషాయముతో సేవించిన సమస్త వుదరరోగములునశించు.

## ❋ నారాయణచూర్ణానుపానములు. ❋

శ్లో॥ దద్యాద్యుక్తానుపానేనతథాధ్మానేసురాదిభిః । గుల్మేబదరనీరేణవిట్సంగేదధిమస్తునా ॥ ఉష్ణాంబుభిశ్చాజీర్ణేచవృక్షామ్లైః పరికర్తృషు । ఉష్ట్రీదుగ్ధేనోదరేషుతథాతక్రేణవాగవాం । ప్రసన్నయావాతరోగే దాడిమాంభోభిరర్శసి। ద్విషిద్దేచవిషే దద్యాత్ఘృతేనవిషనాశనం॥ చూర్ణంనారాయణంనామదుష్ట రోగగణాపహం॥ ౩౪॥

తా॥ నారాయణచూర్ణమును ఆయారోగములకు తగిన అనుపానములతో నివ్వవలయు. ఎట్లన్నను. మద్యము మొదలయినవాటితో నారాయణచూర్ణమును సేవించిన కడుపుబ్బరమునివర్తించు. రేగుకషాయముతో సేవించిన గుల్మరోగము తాలగు. పెరుగుతేటతో సేవించిన మలబద్ధమునశించు. ఉష్ణోదకముతో సేవించిన అజీర్ణరోగమునివర్తించు. వృక్షామ్లములతో సేవించిన గుదరోగమునశించు. ఒంటె పాలతో సేవించిన ఉదరరోగములునివర్తించు. కల్లుతో సేవించిన వాతరోగము

నశించు. దాడిమరసములో సేవించిన అర్శోరోగము(మూలవ్యాధి)నశించు. తేనెతో సేవించిన ద్వివిధవిషములు నశించు. ఇట్టిగుణములుగల నారాయణచూర్ణమును సేవించిన అనేకరోగములను బోగొట్టునని తాత్పర్యము.

*నిర్గుండ్యానుపానములు.*

శ్లో॥ ప్రస్థనిర్గుండిచూర్ణస్యగోమూత్రేణసమంపిబేత్ । దశరాత్రప్రయోగేనకుష్ఠనాశోద్భవేద్ధ్రువం॥ ౩౫॥

తా॥ పదహారుపలముల వావిలిచూర్ణమును గోమూత్రములో వైచి దానిని-౧౦-భాగములుచేసి -౧౦- దినములు సేవించిన కుష్ఠరోగము నివర్తించు.

శ్లో॥ నిర్గుండీచూర్ణమాదాయఘృతేనసహభక్షయేత్। కృశస్తుదుర్బలోవాపీబలవీర్యయుతోభవేత్॥ ౩౬॥

తా॥ చిక్కిపోయినవాడుగాని దుర్బలుడుగాని నిర్గుండీచూర్ణమును నేతితో సేవించిన బలము వీర్యవృద్ధి వీట్లతో గూడుకొన్నవాడగును.

శ్లో॥ నిర్గుండీచూర్ణమాదాయపిబేదుష్ణేనవారిణా । సప్తరాత్రప్రయోగేనరోగముక్తోభవేన్నరః॥ ౩౭॥

తా॥ ఉష్ణోదకములో ౭ దినములు నిర్గుండీచూర్ణమును సేవించిన సర్వరోగములు నివర్తించు.

శ్లో॥ నిర్గుండీమూలముద్ధృత్యగృహేచధారయేద్బుధః । నశ్యంతి సర్వవిఘ్నానిగృహేనాగాశ్చసర్వశః॥ ౩౮॥

తా॥ ఎవనియింట్లో వావిలివేరువుంచబడియున్నదో వానిగృహమునందు విఘ్నములు లేకుండుటయేగాక సర్పములు సగాతొలగిపోవును.

*భృంగరాజానుపానములు.*

శ్లో॥ భృంగరాజపత్రరసంకృష్ణజీరసమంపిబేత్ । తైలేనసహసంధద్యాద్వలీపలితవర్జితః॥ ౩౯॥

తా॥ గుంటగలగరాకురసమును నల్లజీలకర్రలోగాని లేక మంచినూనెతోగాని చేర్చి అనుపానముగ సేవించిన వార్థకమువలనగలిగిన శరీరశైథిల్యము వెంట్రుకలు నరిసిపోవుట ఇవితొలగి యవ్వనమును జెందు.

శ్లో॥ భృంగరాజరసంచైవగుడూచీరససంయుతం। మాసమాత్ర
ప్రయోగేనసర్వవ్యాధిర్వినశ్యతి॥ ౪౦॥

తా॥ గుంటగలగరాకురసమును తిప్పతీగెరసములోచేర్చి మాసమాత్రము సేవించిన సర్వరోగములు నివర్తించు.

❋ సకలరోగములకుహరీతక్యాదిపానములు. ❋

శ్లో॥ సితాయుక్తాచశరదీహేమంతేనాగరేణచ। శిశిరేపిప్పలీయు
క్తావసంతేమధునాసహ। గ్రీష్మేచగుడసంయుక్తావర్షాసుల
వణేనచ। అనేనైవవిధానేనభక్షయేద్యోహరీతకీం। తస్య
వృద్ధిర్బలంవీర్యంపుష్టిరారోగ్యంస్థిరయవ్వనం। అగ్నిర్హరతికా
ష్ఠానితనురోగాన్హరీతకీ। కదాచిత్కుప్యతేమాతానోద
రస్థాహరీతకీ। మాతేవసర్వదాజ్ఞేయాహితధాత్రీహరీతకీ॥

తా॥ కరకచూర్ణమును శరద్రుతువునందు తెల్లశక్కరతోను హేమంతఋతువునందు శొంఠిచూర్ణముతోను శిశిరుతువునందు పిప్పలిచూర్ణముతోను వసంతఋతువునందు తేనెతోను గ్రీష్మరుతువునందు బెల్లముతోను వర్షర్తువునందు లవణముతోను ఈప్రకారముగ యెవడుసేవించుచున్నాడో అట్టిమనుజునికి వృద్ధి బలము వీర్యము పుష్టి ఆరోగ్యము స్థిరయావనము యివిగలుగుటయేగాక అగ్నికట్టెలనుదహింపజేయుచందంబున సమస్తరోగములను సగానివర్తింపజేయు. తల్లి పుత్రుని కాపాడురీతి పూర్వోక్తప్రకారముగ సేవింపబడిన కరకచూర్ణము తన్నుసేవించిన వానిని కాపాడును.

అన్యచ్చ.

శ్లో॥ గ్రీష్మేతుల్యగుడాంసుసైంధవయుతాంమేఘావనద్ధ్యాంబరే।
తుల్యాంశర్కరయాశరద్యమలయాశుంఠ్యాతుషారాగమే।
పిప్పల్యాశిశిరేవసంతసమయేక్షౌద్రేణసంయోజితాం। రాజన్
ప్రాప్యహరీతకీమివరుజోనశ్యంతితేశత్రవః॥ ౪౧॥

తా॥ గ్రీష్మర్తువునందు కరకచూర్ణమును బెల్లముతో సమముగచేర్చి సేవించినను వర్షర్తువునందు సైంధవలవణముతో సమముగచేర్చి సేవించినను శరదృతువునందు తెల్లచక్కెరతో సమముగచేర్చి సేవించినను హేమంతరుతువునందు శొంఠి

చూర్ణముతో సమముగచేర్చి సేవించినను శిశిరఋతువునందు పిప్పలిచూర్ణముతో సమముగచేర్చి సేవించినను వసంతఋతువునందు తేనెతోచేర్చి సేవించినను శూరత్వము జెందిన రాజెదట శత్రువులు నశించుచందంబున సమస్తరోగములునశించు.

## గుడూచ్యానుపానములు.

శ్లో॥ ఘృతేనవాతంసగుడావిబంధంపిత్తంసితాఢ్యామధునాకఫంచ।
వాతాస్త్రముగ్రంరుబుతైలమిశ్రాశుంఠ్యామవాతంశమయేద్గుడూచీ॥ ౪౩॥

తా॥ తిప్పసత్తును నేతితోసేవించిన వాతరోగమునివర్తించు. బెల్లముతో సేవించిన మలమూత్ర కష్టరోగమునశించు. తెల్లచక్కెరతోసేవించిన పిత్తరోగము నివర్తించు. తేనెతోసేవించిన కఫరోగమునశించు. ఆముదముతోసేవించిన వాతరక్తరోగము నివర్తించు శొంఠిచూర్ణముతోసేవించిన ఆమవాతరోగమునశించు.

శ్లో॥ అమృతాస్వరసోహన్తిక్షౌద్రయుక్తోహికామలాం। శార్ఙ్గధరేణచోక్తత్వాచ్ఛ్లోకోయంరచితోమయా॥ సమధుచ్ఛిన్నాస్వరసోనానామేహనివారణం। వదంతిభిషజస్సర్వేశరదిందునిభాననే॥ ౪౪॥

తా॥ తిప్పతీగరసమును తేనెతోసేవించిన కామిలారోగము సమస్తప్రమేహరోగములు యువినివర్తించు.

శ్లో॥ జీర్ణజ్వరంకఫకృతంకణయాసమేతశ్ఛిన్నోద్భవోహ్యథకషాయకపేషహంతి॥ ౪౫॥

తా॥ తిప్పతీగకషాయమునందు పిప్పలిచూర్ణమునువైచి సేవించిన కఫజన్య జీర్ణజ్వరమునివర్తించు.

శ్లో॥ అమృతాక్వాథకల్కాభ్యాంసక్షీరంవిపచేద్ఘృతం। వాతరక్తంజయత్యాశుకుష్ఠంజయతిదుస్తరం॥ ౪౬॥

తా॥ తిప్పతీగకషాయము తిప్పతీగకల్కము పాలు వీట్లను నేతిలోవైచి పక్వముగవండి ఘృతముచే దానినిసేవించిన వాతరక్తము కుష్ఠము యువినివర్తించు.

శ్లో॥ గుడూచీస్వరసఃకర్షం క్షౌద్రం స్యాన్మాషకోన్మితం । సైంధవం క్షౌద్రతుల్యం స్యాత్సర్వమేకత్ర మర్దయేత్ ॥ అంజయేన్నయనం తేన పిల్లార్మ తిమిరం జయేత్। కాచకండూలింగనాశం శుక్లాకృష్ణాగతాన్గదాన్॥ ౪౭॥

తా॥ కర్షమాత్రము తిప్పతీగరసము మాషప్రమాణము తేనె మాషప్రమాణము సైంధవలవణము వీటినన్నిటిని నేకముగ జేసి మర్దించి నేత్రములకు అంజనము వేసికొనిన పిల్లార్మయనే నేత్రరోగము తిమిరరోగము కాచరోగము కండ్లయందు దురద లింగనాశనము (అనగా గురుతు తెలియకపోవుట) నల్లతెల్ల గుడ్లయందలి రోగము వీటిని నివర్తింపం జేయు.

❋నేత్రరోగమునకుపునర్నవానుపానము.❋

శ్లో॥ దుగ్ధేన కండూం క్షౌద్రేణ నేత్రస్రావం చ సర్పిషా । పుష్పం తైలేన తిమిరం కాంజికేన నిశాంధతా ॥ పునర్నవా జయత్యాశు భాస్కరస్తిమిరం యథా॥ ౪౮॥

తా॥ గలిజేరురసమును పాలతో రంగరించి నేత్రములకు అంజనమిడిన కండ్ల దురద తేనెతో రంగరించి అంజనమిడిన నేత్రస్రావము నేతితో రంగరించి అంజనమిడిన కండ్లయందలి పూలు మంచినూనెతో రంగరించి అంజనమిడిన తిమిరరోగము కడుగు నీటితో రంగరించి అంజనమిడిన రేచీకటి వీటిని సూర్యుడు అంధకారమును తొలగించుచందంబున యీయంజనము తొలగించు.

❋త్రిఫలానుపానములు.❋

శ్లో॥ ఏకా హరీతకీ యోజ్యా ద్వౌ చ యోజ్యౌ విభీతకౌ । చత్వార్యామలకాన్యేవ త్రిఫలైషా ప్రకీర్తితా ॥ త్రిఫలా శోథమేహఘ్నీ నాశయేద్విషమజ్వరాన్। దీపనీ శ్లేష్మపిత్తఘ్నీ కుష్ఠహంత్రీ రసాయనీ। సర్పిర్మధుభ్యాం సంయుక్తా సైవ నేత్రామయాన్ జయేత్॥

తా॥ కరక్కాయ ౧ భాగము తానికాయ ౨ భాగములు ఉసిరికవలుపు ౪ భాగములు వీటినన్నిటిని నేకముగ జేర్చి చూర్ణముచేసినట్టి చూర్ణము త్రిఫలయనబడును. ఈత్రిఫలచూర్ణమును సేవించిన శోఫ మేహము విషమజ్వరములు శ్లేష్మము పిత్తము కుష్ఠరోగము వీటిని నివర్తింపంజేయుటయేగాక అగ్ని దీపనమును సగాంగలు

గంజేయు. మఱియు యీచూర్ణమును నెయ్యి తేనె పిప్పళ్లతో రంగరించి నేత్రముల కంజనమిడిన నేత్రరోగములనన్నిటిని నివర్తింపజేయు.

శ్లో॥ ఫలత్రికోద్భవంక్వాథంగోమూత్రేణైవపాయయేత్ । వాత
శ్లేష్మకృతంహంతిశోథవృషణసంభవం॥ ౫౦॥

తా॥ త్రిఫలకషాయమును గోమూత్రముతోవండి సేవించిన వాతశ్లేష్మజనిత రోగము బీజమువాచుట వీటిని నశింపంజేయు.

శ్లో॥ క్షౌద్రేణత్రిఫలాక్వాథఃపీతోమేదహరఃస్మృతః । శీతీభూతం
తథోష్ణాంబుమేదోహృత్క్షౌద్రసంయుతః॥ ౫౧॥

తా॥ త్రిఫలకషాయమునందు తేనెవైచి చేర్చిగాని లేక చల్లారిన వేడినీళ్లు తేనె యీరెంటిని చేర్చిగాని పుచ్చుకొనిన మేదోరోగము నివర్తించు.

శ్లో॥ త్రిఫలారగ్వధక్వాథశ్శర్కరాక్షౌద్రసంయుతః । రక్తపిత్త
హరోదాహపిత్తశూలనివారణః॥ ౫౨॥

తా॥ త్రిఫలములు రేలవిత్తులు వీటినికషాయముకాచి అందుశర్కర తేనె వీటిని వైచి సేవించిన రక్తపిత్తము తాపము పిత్తము శూల వీటిని నివర్తింపంజేయు.

శ్లో॥ త్రిఫలాయారసక్షౌద్రయుక్తోజయతికామిలాం । శార్ఙ్గధరేణ
చోక్తత్వాచ్ఛ్లోకోయంరచితోమయా ॥ మృతాయస్త్రిఫలా
యష్టీచూర్ణంమధుఘృతాన్వితం । దినాంతేలేఢినిత్యంసరతా
చటకవద్భవేత్॥ ౫౩॥

తా॥ త్రిఫలకషాయమునందు తేనెవైచి పుచ్చుకొనిన కామిలారోగము నివర్తించు. మఱియు అయోభస్మము త్రిఫలచూర్ణము యెష్టిమధుకచూర్ణము వీటిని నేకముగ జేర్చి అందునెయ్యిగాని తేనెగాని వైచి రంగరించి ప్రతిదినము రాత్రులయందు సేవించిన మగపిచ్చుకవలె స్త్రీసంభోగమునందు పటుత్వముగలవాడగును.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే
అనుపానరత్నాకరే.
అన్నౌషధ్యనుపానవివేకకథనంనామ ప్రథమస్తరంగః.

శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః-

ఆంధ్ర తాత్పర్య సహిత

# అనుపాన రత్నాకరము.

## ద్వితీయ స్తరంగము

### మృత్యుంజయాదిరసములకు అనుపానములు.

శ్లో॥ మృత్యుర్వినిర్జితోయస్మాత్తేనమృత్యుంజయోరసః । మధునా లేహనంప్రోక్తంసర్వజ్వరనివృత్తయే ॥ దధ్యూదకానుపానేన వాతజ్వరనిబర్హణః । ఆర్ద్రికస్వరసైఃపానందారుణేసన్నిపాతతే ॥ జమ్బీరద్రవయోగేనహ్యాజీర్ణజ్వరనాశనః ॥ అజాజీగుడసంయుక్తోవిషమజ్వరనాశనః॥ ౧౮॥

తా॥ ఈరసము మృత్యువునుజయించునది కాబట్టిమృత్యుంజయరసమనంబడు దీనిని తేనెతో సేవించిన జ్వరము, పెరుగుమీదితేటతో సేవించిన వాతజ్వరము, అల్లపురసముతో సేవించిన దారుణమగు సన్నిపాతము, నిమ్మపండ్లరసముతో సేవించిన ఆజీర్ణజ్వరము, బెల్లముతో గూడిన జీలకర్రకషాయముతో సేవించిన విషజ్వరము వీటిని నివర్తింపంజేయు.

### ❋వసంతకుసుమాకరరసానుపానములు.❋

శ్లో॥ శిలాజితుమధూషణైః క్షయగదేషుసర్వేష్వపిప్రమేహరుజిరాత్రిభిస్సమధుశర్కరాభిస్సహ । సితామలయజద్రవైర్మహతి రక్తపిత్తేథవాసితామధుసమన్వితైర్వృషభపల్లవానాంద్రవైః। త్రిజాతగజచందనైరపిచతుష్టిపుష్టిప్రదోమనోభవకరఃపరోవమిషుశంఖపుష్పీరసైః । అభీరురసశర్కరామధుభిరమ్లపిత్తామయేపరేషుతుయథోచితననుగదేషుసంయోజయేత్॥ ౧౯॥

తా॥ వసంతకుసుమాకరరసమును, తేనెలోచాది అందు శిలాజతుభస్మము, త్ర్యూషణములు వీటినిచేర్చి సేవించిన ఘన స్తనగుత్తులు, మానిపసపుచూర్ణము శర్కర, వీటిని తేనెలో వైచి యీ అనుపానములో సేవించిన ప్రమేహములు, చందనకషాయములో తెల్లచక్కెర వైచి దానితో సేవించినను లేక వృషభకమనుచెట్టు చిగుళ్లరసమునందు తెల్లచక్కెర తేనెవైచి దానితో సేవించినను మిగుల ప్రకోపముగనుండు రక్తపిత్తము వీటినినివర్తింపజేయు. త్రిజాతకము, గజపిప్పలి, చందనము వీటినిచేర్చి కషాయము కాచి దానితో సేవించిన సంతోషము శరీరపుష్టి, కామవృద్ధి, వీటినిగలుగంజేయు. శంఖపుష్పీరసముతో సేవించిన వమనము, పిల్లపీచరరసమునందు శర్కర తేనె వీటినిచేర్చి దానితో సేవించిన అమ్లపిత్తము యినశించు మఱియు యితరరోగములయందు తగునైన అనుపానములతో సేవించిన ఆయారోగములు నివర్తించు.

### *లోకనాథరసానుపానములు.*

శ్లో॥ అరుచౌనిస్తుషంధాన్యంఘృతభృష్టంసశర్కరం । దద్యాత్త
థాజ్వరేధాన్యంగుడూచీక్వాథమాహరేత్ ॥ ఉశీరవాసక
క్వాథందద్యాత్సమధుశర్కరం । రక్తపిత్తేకఫేశ్వాసేకాసే
చస్వరసంక్షయే ॥ అగ్నిభృష్టజయాచూర్ణంమధునానిశిదీయ
తే । నిద్రానాశేఽతిసారేచగ్రహణ్యాంమందపావకే ॥ సౌ
వర్చలాభయాకృష్ణాచూర్ణముష్ణజలైఃపిబేత్ । శూలేజీర్ణే
తథాకృష్ణామధుయుక్తాజ్వరేహితా । ప్లీహోదరేవాత
రక్తేఛర్ద్యాంచైవగుడాంకురే ॥ నాసికాదిషురక్తేషురసందా
డిమపుష్పజం । దూర్వాయాస్స్వరసంనస్యందద్యాచ్ఛర్కర
యాయుతం ॥ కోలమజ్జాకణాబర్హిపత్రభస్మసశర్కరం ॥
మధునాలేహయేచ్ఛర్దిహిక్కాకాసోపశాంతయే । విధిరేష
ప్రయోజ్యస్తుసర్వస్మిన్నోపటలీరసే। మృగాంకేహేమగర్భేచ
మౌక్తికాఖ్యేరసేతథా। ఇత్యయంలోకనాథాఖ్యోరసస్సర్వ
రుజోజయేత్ ॥ ౫౬॥

తా॥ లోకనాథరసమును, ధనియాలను చక్కగదంచి పొట్టుదీసి దానిని వేయించి చూర్ణముచేసి అందులో శర్కరకలిపి యీ అనుపానముతో సేవించిన, అరుచిరోగము నివర్తించు. ధనియాలు తిప్పతీగ వీటిని కషాయముకాచి దానితో సేవించిన జ్వరము మానును. వట్టివేళ్లు అడ్డసరము వీటిని కషాయముపెట్టి అందుశర్కర తేనెవైచి యీ అనుపానముతో సేవించిన రక్తపిత్తము కఫము శ్వాసము, కాశము స్వరహీనము, యివినశించు. పసపును వేయించి చూర్ణముచేసి తేనెకలిపి యీ అనుపానముతో రాత్రులయందు సేవించిన నిద్రానాశము అతిసారము గ్రహణీ మందవాతము యివినశించు. సౌవర్చలవణము కరక్కాయ పిప్పళ్లు వీటిని చూర్ణము చేసి వేడినీళ్లయందువైచి యీ అనుపానముతో సేవించిన శూల అజీర్ణము యివి నివర్తించు. పిప్పలిచూర్ణమునందు తేనెకలిపి దీనితో సేవించిన జ్వరమునివర్తించు. దాడిమపుష్పరసముతో సేవించిన ప్లీహము ఉదరరోగము వాతరక్తము, వాంతి మొలక మూలము ముక్కునుంచి రక్తముకారుట యివినివర్తించు. మఱియు గరిక వేళ్లరసమునందు శర్కరవైచి యీ అనుపానముతో చేర్చి నస్యముచేసిన నాసికా రక్తస్రావరోగము నివర్తించు. శొంఠిగిజరు పిప్పలిచూర్ణము నెమలిరెక్కభస్మము శర్కర వీటిని నేకముగజేసి తేనెవైచి రంగిలించి యీ అనుపానముతో సేవించిన ప్రకోపించిన వమనము ఎక్కిళ్లు యివిశమించు. మఱియు పోటలీరసము మృగాంక రసము హేమగర్భరసము మూర్తికరసము యీరసములు పైజెప్పంబడిన అనుపానములతో సేవించిన ఆయా అనుపానములయందు జెప్పంబడిన రోగములునివర్తించు. యీప్రకారముగ లోకనాథరసము సమస్తరోగములను నివర్తింపంజేయుననితా

## ❋ స్వర్ణమాలినీవసంతరసానుపానములు. ❋

శ్లో॥ జీర్ణజ్వరేధాతుగతేఽతిసారేరక్తాన్వితేరక్తజదృష్టిరోగే। ఘోరేవ్యథేపిత్తకృతేథరోగేబలప్రదోదుగ్ధయుతంచపథ్యం ॥ వసన్తోమాలినీపూర్వస్సర్వరోగహరశ్శివః । గర్భిణ్యాదేయమేతంచజయన్తీపుష్పకైర్యుతం । సర్వజ్వరహరంశ్రేష్ఠంగర్భపాలనముత్తమం ॥ ౫౭॥

తా॥ స్వర్ణమాలినీవసంతరసమును పాలు అనుపానముతో సేవించిన. ధాతుగతమైన జీర్ణజ్వరము రక్తాతిసారము రక్తజనిత నేత్రరోగము మిగుల పిత్తరోగము ఇవినివర్తించుటయేగాక బలమును సగాగలుగంజేయు. మఱియు యీవసంతమాలినీరసము శిశువులకు పైజెప్పంబడిన అనుపానముతో సేవింపజేసిన సర్వరోగహరముగనుండు. గర్భిణీ స్త్రీలకు సోమిండ పుష్పరసముతో సేవింపజేసిన సర్వజ్వరములను పోగొట్టుటయేగాక గర్భమును స్థిరముగజేయు.

* బృహన్మాలినీవసంతరసానుపానములు. *

శ్లో॥ వల్లప్రమాణంమధుపిప్పలీభ్యాంజీర్ణజ్వరేధాతుగతేప్రదేయః।
ఛిన్నోద్భవాసత్వసితాయుతశ్చ సర్వప్రమేహేషుచయోజనీ
యః ॥ కృచ్ఛ్రాశ్మరీంనిహంత్యాశుమాతులుంగార్ద్రికర్ద్రవైః।
రసోవసంతనామాయంమాలినీపదపూర్వకః॥ ౫౭॥

తా॥ పిప్పలీచూర్ణమునందు తేనెచేర్చి అందు బృహన్మాలినీవసంతరసమును వల్లప్రమాణముచేర్చి సేవించిన జీర్ణజ్వరము ధాతుగతజ్వరము ఇవినివర్తించు, తిప్పసత్తులో శర్కరచేర్చి దానిలో వల్లప్రమాణము సేవించిన సర్వప్రమేహములు నివర్తించు. మాదీఫలరసము అల్లపురసము వీటితో వల్లమాత్రము సేవించిన మూత్రకృఛ్రరోగము నివర్తించు.

* పాశుపతరసానుపానములు. *

శ్లో॥ తాలమూలీరసేనైవహ్యుదరామయనాశనః । మోచారసే
నాతిసారంగ్రహణీతక్రసైంధవైః ॥ సౌవర్చలవణాశుంఠీయు
తశ్శూలంవినాశయేత్ । అర్శాంసిహంతితక్రేణపిప్పల్యారా
జయక్ష్మకం॥వాతరోగంనిహంత్యాశుశుంఠీసౌవర్చలాన్వితః ।
శర్కరాధాన్యయోగేనశ్లేష్మరోగంచతత్క్షణాత్। అతఃపరత
రోనాస్తిధన్వంతరిమతోరసః॥ ౫౮॥

తా॥ పాశుపతరసమును నేలతాడిరసముతో సేవించిన ఉదరవ్యాధి అరటిరసముతో సేవించిన అతిసారము, మజ్జిగలో సైంధవలవణమువైచి దానితో సేవించిన గ్రహణి, సౌవర్చలవణము శొంఠి పిప్పలి వీటిచూర్ణములనేకముగజేసి దానితో సేవించిన శూలము, మజ్జిగతో సేవించిన అర్శస్సు, పిప్పలిచూర్ణముతో సేవించిన క్షయరోగ

ము శొంఠి సౌవర్చలవణము వీటిచూర్ణముల నేకముగ జేర్చి దానితో సేవించిన వాత రోగము, వేయించిన ధనియాలచూర్ణములో శర్కర జేర్చి దానితో సేవించిన శ్లేష్మ రోగము యివినివర్తించు. ఇది ధన్వంతరిచే జెప్పంబడిన మిగులశ్రేష్ఠమైన రసమని తెలియవలయు.

## ❋ పర్పటీరసానుపానములు. ❋

శ్లో॥ సహింగుజీరకవ్యోషైశ్చూర్ణమేద్గ్రహిణీంరసః। దశమూలాంభసావాతజ్వరంత్రికటునాకఫం॥ జ్వరంమధుకసారేణపంచకోలేనసర్వజం। యక్ష్మాణంమధుపిప్పల్యాగోమూత్రేణగుదాంకురాన్।శూలేచైరండతైలేనపాండుంశోథంసగుగ్గులుః।కుష్ఠానిభంగభల్లాతవాకుచీపంచనింబకైః। ధుత్తూరబీజసంయోగాన్మహోన్మాదవినాశినీ॥ అపస్మారంనిహంత్యాశువ్యోషనింబదళైస్సహ। స్తనంధయశిశూనాంతుసితరాంపర్పటీహితా। పథ్యాయాశ్చూర్ణసంయుక్తావ్యాధీంశ్చాన్యాంత్సుదుస్తరాన్॥

తా॥ పర్పటీరసమును, ఇంగువ, జీలకర్ర, శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిని నేకముగచూర్ణించి దానితో సేవించిన గ్రహణి, దశమూలకషాయముతో సేవించిన వాతజ్వరము, త్రికటుకముతో సేవించిన కఫము, అతిమధురపుకషాయములో సేవించిన జ్వరము, పంచకోలకషాయముతో సేవించిన సమస్తజ్వరములు, పిప్పలి చూర్ణములో తేనెవైచి దానిలో సేవించిన క్షయరోగము, గోమూత్రముతో సేవించిన గుదాంకురము, ఆముదములో సేవించిన శూలరోగము, గుగ్గిలములో సేవించిన పాండురోగము శోఫ, జనపవిత్తులు, జీడిగింజలు, కారుగత్సవేలు, పంచనింబకములు వీటినికషాయముబెట్టి దానితో సేవించిన కుష్ఠరోగములు, ఉమ్మెత్తవిత్తుల చూర్ణముతో సేవించిన మహోన్మాదము, శొంఠి పిప్పలి మిరియాలు వేపాకు వీటిని కషాయముపెట్టి దానితో సేవించిన అపస్మారరోగములు, కరకచూర్ణముతో సేవించిన సర్వరోగములు వీటినినివర్తింపంజేయు. మఱియు స్తన్యపానముజేయు శిశువులకు పర్పటీరసము మిగులహితకరముగనుండు.

## ❋ జయాజయన్త్యనుపానములు. ❋

శ్లో॥ జయన్తీనాజయావాథత్రిశైఃపిత్తజ్వరాపహా। ముద్గామలకయూషేణపథ్యందేయంఘృతంవినా॥ జయన్తీనాజయావాథ

సక్షౌద్రమరిచాన్వితా । సన్నిపాతజ్వరంహంతిరసశ్చానంద
భైరవః । జయన్తీవాజయావాథవిషమజ్వరనుత్ఘృతైః । సర్వ
జ్వరంమధువ్యోషైర్గవాంమూత్రేణశీతకం । చందనస్యకషా
యేణరక్తపిత్తజ్వరాపహా । జయంతీవాజయావాథమాక్షికే
ణచకాసజిత్ । జయంతీవాజయావాథతండులోదకపానతః ।
అశ్మరీంహంతినోచిత్రంమూత్రకృచ్ఛ్రంతుదారుణం । జయం
తీంవాజయాంవాథగోమూత్రేణయుతాంపిబేత్ ॥ హంత్యాశు
కాకణంకుష్ఠంసుతేఫేనవతద్ఘృతం । ద్వినిష్కం కేతకీమూలం
పిష్ట్వాతోయేనపాయయేత్ । జయంతీవాజయావాథ మేహం
హంతిసురాహ్వయం ॥ జయన్తీవాజయావాథమధునామేహ
జిద్భవేత్ । లోధ్రముస్తాఽభయాతుల్యంకట్ఫలంచజలైస్సహ ।
క్వాథయిత్వాపిబేచ్చానుమధునాసర్వమేహజిత్ । జయంతీ
వాజయావాథగుడైఃకోష్ణజలైఃపిబేత్ ॥ త్రిదోషోత్థంహరేద్భ
ల్యంరసశ్చానందభైరవః । జయంతీవాజయాహంతిశుంత్యాస
ర్వంభగందరం। జయంతీవాజయావాథతక్రేణగ్రహణీప్రణుత్ ।
జయంతీవాజయావాథరసశ్చానందభైరవః। రక్తపిత్తేత్రిదోషో
త్థేశీతతోయేనపాయయేత్ । జయంతీవాజయావాథభృంగ
ద్రావైర్నిశాంధ్యనుత్ । జయంతీవాజయావాథఘృష్ణా స్తన్యేన
చాంజయేత్ । స్రావణంసర్వదోషోత్థంమాంసవృద్ధించనాశ
యేత్ ॥ ౬౧॥

తా॥ జయంతీ జయాంవటుకములలో దేనినైనను, పాలతో సేవించి నేతిని వర్జించి పెసరకట్టు, నెల్లికట్టు వీటినిపథ్యమిడిన పిత్తజ్వరమునివర్తించు. మఱియు మిరియాలచూర్ణములో తేనెవైచి ఆనందభైరవరసమునుచేర్చి దానితో సేవించిన సన్నిపాతజ్వరమునశించు. నేతితో సేవించిన విషమజ్వరము, త్రికటుకచూర్ణము లో తేనెవైచి దానితో సేవించిన సమస్తజ్వరములు, గోమూత్రములో సేవించిన శీతజ్వరము, చందనకషాయముతో సేవించిన రక్తపిత్తజ్వరము, తేనెతో సేవించిన కాసము, కడుగునీళ్లతో సేవించిన మూత్రరోగము, దారుణమైన మూత్రకృచ్ఛ్రము, యివి

నివ ర్తించు. మఱియు కాకణకుష్ఠరోగముగలవాఁడు యీజయంతి జయాంవటుకము లలో దేనినైనను గోమూత్రముతో సేవించి పైవటుకములను ఘృతమునందు వైచి కాచి దానిని శరీరమునకు లేపనము జేసుకొనిన నా కాకణ కుష్ఠరోగమునివర్తించు. రెండు వరహాలయెత్తు మొగిలిగడ్డనునూరి నీళ్లలోకలిపి కషాయముకాచి దానితో సేవించిన సురామేహమునివర్తించు. తేనెతో సేవించిన క్షేమేహరోగము నశించు. మఱియు దీనిని తేనెతో సేవించి, లొద్దుగ, తుంగముస్తెలు, కరక్కాయ, కట్ఫలము, వీటిని సమభాగముల నీళ్లయందునిచి కషాయముకాచి అందు తేనెవైచి పుచ్చుకొనిన సర్వమేహములు నివర్తియగు. సుఖోష్ణముగనుండు నీళ్లయందు బెల్లమువైచి కలిపి, ఆనంద భైరవి మాత్రనుచాది అందుతో కలిపి దానితో సేవించిన త్రిదోషజనిత గుల్మరోగమును బోగొట్టు. మఱియు పైవటుకమును శొంఠితో సేవించిన సమస్తమైన భగంద రోగములను నశింపంజేయు. మజ్జిగతో సేవించిన గ్రహణీరోగమునివర్తించు. చల్లని నీళ్లయందు ఆనందభైరవినికలిపి దానితో సేవించిన త్రిదోషజనిత రక్తపిత్తరోగమును నశింపంజేయు. గుంటుగలగరరసముతో పైవటుకమునుచాది కండ్లకు అంజనమిడిన రేజీకటినివర్తించు. పైవటుకమును చనుబాలతోచాది కండ్లకు అంజనమిడిన త్రిదోషజనిత స్రావణము కండ్లయందు మాంసవృద్ధి వీటిని నశింపంజేయు. [స్రావణమనగా కండ్లయందునీరుగారుట.]

గద్య॥ ఇతి శ్రీ ఆంధ్రభాషానువాదభూషితే
అనుపానరత్నాకరే మృత్యుంజయాది
రసానుపాన వివేకకథనన్నామ
ద్వితీయ స్తరంగః.



శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః-

ఆం ధ్ర తా త్ప ర్య స హి త

# అ ను పా న ర త్నా క ర ము.

## తృతీయస్తరంగము.

### సువర్ణాదిసప్తధాతువులకు అనుపానములు.

### ❋సువర్ణభస్మానుపానములు.❋

శ్లో॥ మత్స్యపిత్తస్యయోగేనస్వర్ణంతత్కాలదాహజిత్ । భృంగయోగాచ్చతద్వృష్యందుగ్ధయోగాద్బలప్రదం॥ పునర్నవాయుతంనేత్ర్యంఘృతయోగేరసాయనం । స్మృత్యాదికృద్వచాయోగాత్ కాంతికృత్కుంకుమేనచ । రాజయక్ష్మే చపయసానిర్విషాచవిషంహరేత్ । శుంఠీలవంగమరిచైస్త్రిదోషోన్మాదహారకం । మధ్వామలకచూర్ణంతుసువర్ణంచేతితత్రయం । ప్రాణ్యాదిష్టగృహీతోపిముచ్యతేప్రాణసంకటాత్ । శంఖపుష్ప్యావయోర్థంచవిదార్యాచప్రజార్థకః॥ ౧౨॥

తా॥ స్వర్ణభస్మమును చాపకాప్పుతో సేవించిన తత్కాలతాపమునివర్తించు. గుంటగలగరరసముతో సేవించిన వీర్యవృద్ధి, పాలతో సేవించిన బలము, గలిజేరురసముతో సేవించిన నేత్రములకుహితము, నేతితో సేవించిన వయస్థాపనము, వసతో సేవించిన చిత్తస్ఫురణము, కుంకుమపువ్వుతో సేవించిన శరీరకాంతి వీటిని గలుగంజేయు. పాలతో సేవించిన క్షయరోగము, నిర్విషాయనుగ్రంథ్యముతో సేవించిన విషరోగము, శొంఠి, లవంగములు, మిరియాలు వీటికషాయముతో సేవించిన త్రిదోషజనిత ఉన్మాదరోగము, ఉసిరికచూర్ణములో తేనెకలిపి దానితో సేవించిన ప్రాణహారకమగు ప్రబలవ్యాధులు వీటినినివర్తింపంజేయు. శంఖపుష్పిరసముతో సేవించిన వయోవృద్ధి, నేలగుమ్ముడుగడ్డరసముతో సేవించిన పుత్రోత్పత్తి వీటిని గలుగంజేయు.

## * గ్రంథాంతరే. *

శ్లో॥ వాజీకరంభృంగరసేనతూర్ణందుగ్ధేనశక్తింప్రదదాతినిత్యం।పున
ర్నవాయుక్ఛ్నయనామయఘ్నం జరాహంచాజ్యయుతంనరా
ణాం । బుద్ధిపంతువచాయుక్తంతాపహంకటుకాయుతం ।
కాంతిదంకుంకుమేసేవంకాంతిజిన్నవనీరజే ॥ సద్యోదుగ్ధయు
తంహంతియక్ష్మాణమతిదారుణం । లవంగశుంఠీమరిచైరున్మా
దంచత్రిదోషకం । మధ్వామలకసంయుక్తంగ్రహణీంప్రబలాం
హరేత్ । మధునావరఖంహైమంవిషదోషనివారణం । శంఖ
పుష్పీరసైరాయుఃప్రదంచందనచర్చితే । విదారీకందసంయు
క్తంపుత్రదంపుత్రవత్సలే॥ ౬౩॥

తా॥ సువర్ణభస్మమును గుంటగలిజేరాకుసమూతో పుచ్చుకొనిన వాజీకరణము (అనగా స్త్రీసంభోగమునందు మిగులపటుత్వము,) పాలతో సేవించిన పటుత్వము ఎువిగలుగు. గలిజేరాకురసముతో సేవించిన నేత్రరోగము, నెయ్యితో సేవించిన ముదిమి ఇవినశించు వసతో సేవించిన బుద్ధివృద్ధియగును. కటుకరోహిణితో సేవించిన తాపమును తొలుగంజేయు. కుంకుమపువ్వుతో సేవించిన శరీరమునకు కాంతిని గలుగంజేయు. అవుపాలు నురుగుతో సేవించిన మిగులదారుణమగు క్షయరోగము, లవంగములు శొంఠి మిరియాలు వీనిచూర్ణములను నేకముగజేసి దానితో సేవించిన ఉన్మాదము, త్రిదోషములు ఇవినశించు. ఉసిరికెచూర్ణము తేనెలో కలిపి దీనితో సేవించిన దారుణమగు గ్రహణిరోగము తొలగు. తేనెతో సేవించిన విషోపద్రవములు నివర్తియగు. శంఖపుష్పిరసముతో సేవించిన ఆయుర్వృద్ధి, నేలగుమ్ముడుగడ్డ చూర్ణముతో సేవించిన పుత్రోత్పత్తియుని గలుగు.

## * రౌప్యభస్మానుపానములు. *

శ్లో॥ భస్మీభూతంరజతమమలంతత్సమంవ్యోమభానుః । సర్వైస్తు
ల్యంత్రికటురసవరంసారమాజ్యేనయుక్తం । లీఢంప్రాతఃక్ష
పయతినృణాంయక్ష్మపాండూదరార్శ । శ్వాసాన్కాసాన్న
యనతిమిరంపిత్తరోగానశేషాన్॥ ౬౪॥

తా॥ శుద్ధిజేసిన రజతభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము వీటిని సమముగ చేర్చి, యీమూటితో సమముగ త్రికటుకరసముగాని లేక చూర్ణముగాని చేర్చి ప్రాతఃకాలమునందు నేతితో సేవించిన క్షయరోగము, పాండువు, మహోదరము, అర్శస్సు, శ్వాస, కాస, తిమిరరోగము పిత్తరోగము వీటిని నశింపంజేయు.

* గ్రంథాంతరే. *

శ్లో॥ దాహేశర్కరయాయుక్తంవాతేపిత్రైవరాయుతం। త్రిసుగంధ
యుతంమేహేగుల్మే క్షారసమన్వితం ॥ కాసేకఫేటరూషస్వర
సేత్రికటుకాన్వితే । భార్గీవిశ్వయుతంశ్వాసేక్షయాజిత్సశిలా
జతు । క్షీణేమాంసరసేదేయందుగ్ధేవాలలనోత్తమే । యకృ
త్ప్లీహహరంకాంతేవరాపిప్పలిసంయుతం । పునర్నవాయు
తంశోఫేపాండౌమండూరసంయుతం । వలీపలితహంకాంతి
క్షుత్కరంఘృతసంయుతం॥ ౬౫॥

తా॥ తాపమునందు రజతభస్మమును పంచదారతోను, వాతము, పిత్తము వీనియందు త్రిఫలాచూర్ణముతోను, మేహమునందు త్రిసుగంధచూర్ణముతోను, గుల్మమునందు సర్జక్షారముతోను, కాసము కఫము వీటియందు త్రికటుకచూర్ణము, అడ్డసరవురసము వీటితోను, శ్వాసమునందు గంటుభారంగి శొంఠి వీటితోడను, క్షయమునందు శిలాజతుతోడను, క్షీణతయందు మాంసరసముతోడను లేక ఆవుపాలతోను, యకృత్తు, ప్లీహము వీటియందు త్రిఫలములు పిప్పళ్లు వీటిచూర్ణముతోను, శోఫయందుగలిజేరు రసముతోను, పాండురోగమునందు, మండూరముతోను, పుచ్చుకొనిన నైనుదహించిన వ్యాధులన్నియు నశించు. ఓలలనోత్తమా ! యీరజితభస్మమును నేతితో పుచ్చుకొనిన, వళులు పలితము వీటిని బోగొట్టుటయేగాక, ఆకలి కాంతి వీటిని సగా గలుగంజేయు.

* తామ్రభస్మానుపానములు. *

శ్లో॥దుగ్ధంఖండంచానుపానంప్రదద్యాత్సాజ్యంభోజ్యంత్యాజ్యమమ్లైన
యుక్తం । వీర్యంపుష్టిందీపనందేహదార్ఢ్యందివ్యాదృష్టిర్జాయతే
కామరూపం ॥ పూర్వేషాంమతమాలోక్యవైద్యైశ్చాధునికైర్బు
ధైః। స్వబుధ్యాదాపయేత్తామ్రంరోగనాశనవస్తుభిః॥ ౬౬॥

తా॥ తామ్రభస్మమును, పాలతోగాని లేక నేతిలోకలకండచూర్ణముచేసి దానితోగాని సేవింపజేసి పులుసునువర్జించి పథ్యంబిడిన వీర్యవృద్ధి, శరీరపుష్టి, అగ్నిదీపనము, శరీరదార్ఢ్యము, నిర్మలదృష్టి, కామరూపము, కలిగలుగు. మఱియు వైద్యవేత్తలు ప్రాచీనవైద్యమతములను పర్యాలోచించి స్వబుద్ధిచేత విచారించి ఆ యారోగములకుతగిన అనుపానములతో ఈతామ్రభస్మమును సేవింపజేసిన ఆయారోగములు (అనగా సర్వరోగములు) నివర్తించు.

## ＊ గ్రంధాంతరే. ＊

శ్లో॥ పిప్పలీమధుసంయుక్తం సర్వరోగేషుయోజయేత్। స్వబుద్ధ్యాపి
ప్రయుంజీతరోగనాశనవస్తుభిః॥　　౭౭॥

తా॥ తామ్రభస్మమును, పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో సేవించిన సర్వరోగములుహరించు. మఱియు బుద్ధిమంతుడగు వైద్యుడు ఆయారోగాను గుణ్యముగ బుద్ధిచేయోచించి రోగహరద్రవ్యములను అనుపానముగా గ్రహించి దానితో తామ్రభస్మము నిప్పించవలయు.

## ＊ వంగభస్మానుపానములు. ＊

శ్లో॥ జాతీఫలేనేతికరోతిపుష్టింవక్త్రేసుగంధింస్ఫటికేనచోక్తం। ప్రా
చీనవైద్యైర్భృతరంగకోఽథ శ్లోకోమయాఽయంరచితోఽత్ర
నూనం॥ తులసీపత్రసంయుక్తఃప్రమేహంనాశయేద్ధ్రువం। ఘృ
తేనపాండురోగంచటంకణైర్గుల్మనాశనం॥ నిశయార్కపిత్తం
చమధునాబలబుద్ధికృత్। ఖండేనసహాపి త్రిఘ్నంనాగవల్ల్యా
చబంధనం॥ పిప్పల్యాచాగ్నిమంద్యత్వంనిశయాచోర్ధ్వశ్వాస
హృత్॥ చంపకస్వరసేనైవదుర్గంధింనాశయేద్ధ్రువం। నింబ
కస్వరసేనాఢ్యందేహదహనశాంతయే। కస్తూరీసంయుక్త
వంగభస్మణాద్వీర్యరోధకృత్। ఖదిరక్వాథయోగేనచర్మపత్రి
మల్లైస్సహా। పూగీఫలేనసార్ధంవాఽజీర్ణంనాశయతేక్షణాత్॥
నవనీతసమాయుక్తమస్త్రిజీర్ణంనవంభవేత్। దుగ్ధసార్ధంభవే
త్తుష్టిర్జయయా స్తంభనంభవేత్। లశునైర్వాతజాంపిండాం
నాశయేన్నాత్రసంశయః। సముద్రఫలసంయోగాన్నిర్గుండ్యాస

హాభక్షణాత్॥కుష్ఠంనాశయతేక్షిప్రంసింహానాదేమృగాయివ।
ఆఘాతజటికాయోగాత్షండత్వంనాశయేద్ధ్రువం । దేవపుష్ప
స్యసంయోగాత్సముద్రఫలయోగతః। నాగపత్రరసైశ్లేషాల్లింగ
వృద్ధిఃప్రజాయతే।గోరోచనలవంగేనతిలకాన్మోహనంభవేత్।
ఏరండజటికాయోగేఘృష్ఠ యిత్వాచవంగకం । లేపయేచ్ఛలలా
టేవైతదాశీఘ్రగదంజయేత్ । కౌజ్జేఽపామార్గమూలేనక్షి
ప్తేటంకణసంయుతం। రసేనతైలయుక్తస్యమపస్మారనిషూ
దనం । పుత్రాస్త్రైరాసభీక్షీరైస్తక్రాఢ్యంవాతగుల్మనుత్।య
వానికాయుతంవాతేవాజిగంధాయుతంతువా । జలోదరేశ్వ
జాక్షీరసంయుతంగుణకృద్భవేత్ । జాతీఫలాశ్వగంధాభ్యాం
కటిపీడానివారణం॥ ౬౮॥

తా॥ వంగభస్మమును, జాజికాయతో సేవించిన పుష్టి, పచ్చకర్పూరముతో సేవించిన ముఖమునందు సువాసన యినిగలుగునని ప్రాచీనవైద్యులు చెప్పియున్నందున యిచ్చట వ్రాయడమైనది. మఱియు తులసీరసముతో సేవించిన ప్రమేహము, నేతితో సేవించిన పాండువు, వెలిగారముతో సేవించిన గుల్మరోగము, మానిపసపుచూర్ణముతో సేవించిన రక్తపిత్తము, యినినివర్తించు. తేనెతో సేవించిన మిగుల బలమును గలుగంజేయు. కలకండతో సేవించిన పిత్తరోగము, తమలపాకుతో సేవించిన మలబద్ధము, పిప్పలీచూర్ణముతో సేవించిన అగ్నిమాంద్యము, పసుపుతో సేవించిన ఊర్ధ్వశ్వాస, సంపెంగరసముతో సేవించిన శరీరదౌర్గంధ్యము, వేపాకురసముతో సేవించిన శరీరతాపము వీటినినశింపజేయు. వంగభస్మమును కస్తూరితో సేవించిన వీర్యస్తంభనమును గలుగంజేయు. చంద్రకషాయముతో పులుగుమలము చేర్చి వంగభస్మమునకు అనుపానముగ సేవించిన చర్మరోగము నివర్తించు; మఱియు పోకచూర్ణమును చంద్రకషాయముతో చేర్చి సేవించిన అజీర్ణరోగము నశించు. వెన్నతో సేవించిన అస్థిగత రోగములు వైలువెడలు. పాలతో సేవించిన సంతోషము, కరకచూర్ణముతో సేవించిన వీర్యస్తంభనము, వీటినిగలుగంజేయు. ఉల్లిపాయలరసముతో సేవించిన వాతరోగము, సముద్రఫలము, నాకలిరసము వీటితో సేవించిన "సింహానాదమునువిని యితరమృగములు బరుగిడు చందంబున" కుష్ఠరోగము శీఘ్రముగనశించు. కోరిందవేళ్ల

కషాయముతో సేవించిన షండత్వమునివర్తించు. శ్వేతంఖణపుష్పం, సముద్రఫలము, తమలపాకురసము వీటినిచేర్చి సేవించి లింగమునకు లేపనముజేసిన పుంస్త్వవృద్ధి గలుగు. గోరోచనము, లవంగము, తిలకచూర్ణము వీటినికలిపి దానితో సేవించిన మోహనముగలుగు, చిట్టాముదపువేరురసములో వంగభస్మమునుకలిపి చక్కగనూర్చించి లలాటమునకు లేపనముజేసిన శిరోరోగము నివర్తించు. ఉత్తరేణివేరుపట్టు చూర్ణముతో సేవించిన కుబ్జత్వము, వెలిగారముతో సేవించిన స్త్రీహారోగము, వెల్లుల్లి రసముతో నస్యముజేసిన అపస్మారరోగము యివినివర్తించు. గాడిదపాలతో సేవించిన పుత్రోత్పత్తిగలుగు. మజ్జిగతో సేవించిన వాతగుల్మమునివర్తించు. ఓమకషాయముతోగాని తెల పెన్నేరుగడ్డచూర్ణముతోగాని సేవించిన వాతరోగమునశించు. మేకపాలతో సేవించిన జలోదరమునివర్తించు. జాజికాయ, పెన్నేరుగడ్డ వీటిచూర్ణముతో సేవించిన కటిపీడ(అనగా మొలనొప్పి)తొలగు.

## * జసదభస్మానుపానములు. *

శ్లో॥ శ్రుణుసఖేజసదస్యవదామ్యహంసుఖకరంహ్యనుపానమరంవరం।
వివిధతంత్రమతంసువిచార్యవైనిధనగస్యగదాపహరంన్నృణాం ।
జసదభస్మజయేత్రిసుగంధినానసుసఖేత్రిమలోద్భవమామయం ।
హరతిశాలిహిమేనతథాజ్వరంసహవృమచ్ఛదయాలఘుమామయ
జం । శిఖరదీప్యయుతంశమయేజ్జ్వరంజసదభస్మసఖేశ్రుణుశీత
జం । రుధిరజంత్వతిసారగదంవమింకఫజిదాయుతమాశునిహం
తివై । మథరసేనధనంజయమందతాంనయనరోగమథోషసిచాం
జితం । సృణికయాధ్రువమాశుసఖేఫవాహరతిగోహవిషాప్రత
నేనవై । సుభసితంహ్యాశితంజసదంయదాలఘునిహంతిచమేహ
గదంతదా । అహిలతాదలయుక్తమిదంసదాసహసఖేమహాక్షీ
హావిషాథవా । శిఖరదీప్యకశైశ్చసశర్కరైర్గ్రహణిశూలగదంహి
భయానకం । సహకవోష్ణయవానికయాసఖేజయతిచాశువిబం
ధగదంధ్రువం॥ ౬౯॥

తా॥ ఓస్నేహితుడా ! నేను అనేకవైద్యశాస్త్రములను పరిశోధించి, మనుష్యులలోపల మరణసందేహముగలవారికి రోగనివర్తకముగనుండు సత్తుభస్మమున కుపయోగనుండు అనుపానములను సంగ్రహముగ చెప్పుచున్నాను వినుము. సత్తు

భస్మమును *త్రిజాతకముతో సేవించిన త్రిదోషజనితరోగములు నివర్తించు. వియ్యపు కడుగు నీళ్లతో గాని లేక ఖర్జూరపుకాయల కషాయముతో గాని సేవించిన పిత్తజ్వరము నివర్తించు. లవంగము, ఓమము వీటికి కషాయము బెట్టి దానితో సేవించిన శీతజ్వరము నివర్తించు. జీలకర్ర చక్కెర వీటితో సేవించిన రక్తాతిసారము, వాంతి యివి శీఘ్రముగ శాంతించు. కూరనెల్లి రసముతో సేవించిన అగ్నిమాంద్యము, జ్వాలయందుగాని పాత ఆవునేతియందుగాని యీసత్త్వభస్మమును రంగరించి ప్రాతఃకాలమునందు నేత్రములకంజనము వేసిన నేత్రరోగము యివి హరించు. తమలపాకురసముతో గాని, ఎనప నేటితో గాని సేవించిన ప్రమేహము శీఘ్రముగ నివర్తించు. లవంగము, ఓమము, జీలకర్ర వీటిని సమ్మిటిని కషాయము బెట్టి తెల్లచక్కెర చేర్చి దానితో సేవించిన భయంకరమగు శూలరోగము హరించు. సుఖోష్ణముగనుండు కొరిందకషాయముతో సేవించిన మలబద్ధరోగము నివర్తించు.

### * నాగానుపానములు. *

శ్లో॥ మృతంనాగంవాయుంహరతిసహమాయుఃచ్ఛసితయాశిరోరోగం దాహంహ్యరుచిమథనేత్రామయమరం। ప్రలాపంసంతాపంవివిధగదతాపంజయతివైసఖేదేయంవైద్యైర్నుగదగణే
స్యైస్వమతినా॥ ౭౦॥

తా॥ నాగభస్మము శర్కరతో సేవించిన వాతము, పిత్తము, శిరోరోగము, తాపము, అరుచి, నేత్రరోగము, ప్రలాపము, సంతాపము, అనేకరోగజనిత పీడ యివి నివర్తించుగాన వైద్యులు తమస్వబుద్ధిచే ఆలోచించి సమస్తరోగములయందును తగుమైన అనుపానములతో నివ్వవలయు.

### * లోహానుపానములు. *

శ్లో॥ లోహంమృతంసర్వగదేషుదేయంసదాసువైద్యైశ్చపలేనసాకం। భార్గీమధువ్యోషయుతంజయేద్వైకృత్స్నం తథాధాతువికారమాశు॥ పునర్నవాక్వాథయుతశ్చపాండుమేహంనిశాత్రైఫలయుతంజయేద్వై। కణామధుభ్యామథవానరాణాంశైలేయయుక్తం ననుమూత్రకృచ్ఛ్రం॥ ౭౧॥ నూనంకఫంగంధరసేంద్రమాక్షికైస్సార్ధం

*త్రిజాతకమనగా:—ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రి వీటిపేరటము.

చతుర్జాతిసితాన్వితంజయేత్। వైరక్తపిత్తంమృతలోహమాసుతం
హన్యాత్పునర్భావయసాతథాబలం ॥ ద్రాక్షాకణాసింహిక
మాక్షికైఃకృతాశ్వాసంజయేద్వైగుటికాముఖేధృతా । పారా
వతస్యాథమృతస్యసేవనాన్నరోభవేచ్ఛామయహీనవిగ్రహః॥

తా॥ లోహభస్మమును శుద్ధిజేసిన పారదభస్మముతో గూడ సేవించిన సమస్త రోగములు నివర్తించు. మఱియు గంటుభారంగి, తేనె, త్రికటుకములు వీటితో సేవించిన ధాతుజన్యవికారములు శీఘ్రముగ నివర్తించు. గలిజేరుకషాయముతో సేవించిన పాండువు, మానిపసవు తేనె వీటితోగాని పిప్పలి, తేనె వీటితోగాని సేవించిన ప్రమేహము, శిలాజతుభస్మములో సేవించిన మూత్రకృచ్ఛ్రము వీటిని నివర్తింపజేయు. శుద్ధగంధకభస్మము, శుద్ధపారదభస్మము, తేనె వీటితో సేవించిన కఫము, *చాతుర్జాతకములు తెల్లచక్కెర వీటితో సేవించిన రక్తపిత్తము వీటిని నశింపజేయు తెల్లగలిజేరు వేళ్లచూర్ణమును పాలలో వైచి దానితో సేవించిన బలమును గలుగజేయు, ద్రాక్ష పిప్పలి, అడ్డసరము వీటిచూర్ణములు తేనె వీటితో చేర్చి గుటికలుచేసి నోటియందుంచుకొని దానిరసమును మ్రింగుచుండిన శ్వాసనివర్తియగు. మఱియు నీలోహభస్మమును రోగరహితుడు తాంబూలముతో సేవించిన రోగరహితశరీరముగలవాడగు.

### * స్వర్ణమాక్షికానుపానములు. *

శ్లో॥ మధుపిప్పలిసంయుక్తం క్షయశ్వాసభ్రమాదికాన్। హన్తిరోగ
చయంవిష్ణుర్యథాచక్రధరోసురాన్॥ ౭౨॥

తా॥ స్వర్ణమాక్షికభస్మమును తేనె, పిప్పలిచూర్ణము వీటితో సేవించిన చక్రధారియగు మహావిష్ణువు రాక్షసులను నశింపజేయుచందంబున క్షయ, కాస, భ్రమ వీటిని నివర్తింపజేయు.

### * రౌప్యమాక్షికానుపానములు. *

శ్లో॥ లీఢోవ్యోమవరాన్వితోవిమలకోయుక్తోఘృతైస్సేవితోహన్యా
ద్దుర్భగకృజ్జ్వరాన్ శ్వయథుకంపాండుప్రమేహారుచిం। మూ

---

* చాతుర్జాతకములనగా : లవంగములు, ఆకుపత్రి, ఏలకులు నాగకేసరములు వీటికూటము.

లార్తింగ్రహణీశ్చశూలమతులం యక్ష్మామయంకామలాంస
ర్వాన్పిత్తమరుద్గదానిహమపరైర్యోగైరశేషామయాన్ ॥ విష
వ్యోషవరాజ్యేనవిమలస్సేవితోయది । భగంధరాదికారోగా
న్నశ్యంతిదుస్తరాః॥ ౭౩॥

తా॥ రౌప్యమాక్షికమును, అభ్రకభస్మము, త్రిఫలాచూర్ణము వీటిని నేతిలో వైచి దానితో సేవించిన కురూపమునుగలుగంజేయు జ్వరములు, శోథ, పాండువు, ప్రమేహము, అరుచి, మూలవ్యాధి, గ్రహణి, మిగుల శూల, క్షయరోగము కామిల సమస్త పైత్యరోగములు, వాతరోగము, వీటినినివర్తింపంజేయు. మఱియు సర్వరోగనాశనమునకు పై అనుపానములకంటె యితరానుపానముల సహాయము దీనికి అనావశ్యకము. అతివస, త్రికటుకములు, త్రిఫలములు వీటిని చూర్ణించి నేతిలో కలిపి దానితో సేవించిన దుస్తరమునైన భగంధరాదిరోగములు నివర్తించు.

## * తుత్థానుపానములు. *

శ్లో॥ ఘృతేనకండూవిషకుష్టరోగాన్ తాంబూలయోగేనకఫంతథో
గ్రం। కృమింకృమిఘ్నేనచతుత్థభస్మ క్షౌద్రాంజితంనేత్రగతం
జయేద్వై॥ ౭౪॥

తా॥ తుత్థభస్మమును నేతితో సేవించిన దురద, విషము, కుష్ఠరోగము, తాంబూలముతో సేవించిన ఉగ్రమైన కఫము, వాయువిడంగములతో సేవించిన కృమిరోగము, తేనెతోకలిపి అంజనమిడిన నేత్రరోగము యివి హరించు.

## * శిలాజితుభస్మానుపానములు. *

శ్లో॥ ఏలాపిప్పలిసంయుక్తంమాసమాత్రంతుభక్షయేత్। మూత్రకృ
చ్ఛ్రింమూత్రరోధంహంతిమేహంతథాక్షయం । సర్వానుపా
నైస్సర్వత్రరోగేషువినియోజితే । జయత్యభ్యాసతోనూనంస్తాన్
స్తాన్రోగాన్నసంశయః॥ ౭౫॥

తా॥ శిలాజితుభస్మమును ఏలకులు, పిప్పలి కీటిచూర్ణముతో మాసమాత్రము సేవించిన మూత్రకృచ్ఛ్రము, మూత్రనిరోధము, ప్రమేహము, క్షయను యివి నివర్తించు. మఱియు నీభస్మమును ఆయారోగములకు తగుమైన అనుపానములతో దీర్ఘకాలము సేవించిన ఆయారోగములు నిస్సంశయముగ తొలగు.

## ❋ పారదభస్మానుపానములు. ❋

శ్లో॥ పిప్పలీమరిచైశ్శుంఠీభార్ఙీమధునాసహ । కాసశ్వాసప్రశమనశ్శూలస్యచవినాశనః । హరిద్రాశర్కరాసార్ధంరుధిరస్య వికారనుత్ । త్ర్యూషణంత్రిఫలావాసాకామలాపాండురోగ జిత్ । శిలాజతుతథైలాచశితోపలసమన్వితః । మూత్రకృచ్ఛ్రే ప్రశస్తోయంసత్యంనాగార్జునోదితం । లవంగకుసుమంపత్రం హింగులంచాకలంకరా । పిప్పలీవిజయాచైవసమాన్యేతాని కారయేత్। కర్పూరమహిఫేనానినాగాద్భాగార్ధకంక్షిపేత్। సర్వమేకత్రసంమర్ద్యధాతువృద్ధౌప్రదాపయేత్ । సౌవర్చలం లవంగంచభూనింబంచహరీతకీ । అస్యానుపానయోగేనసర్వ జ్వరవినాశనః॥తథారేచకరఃప్రోక్తఃసౌవర్చలఫలత్రికం।లవంగ కుసుమంచైవదరదేనచసంయుతం ॥ తాంబూలేనసమంభక్ష్యం ధాతువృద్ధింకరంపరం। విదారీచూర్ణయోగేనధాతువృద్ధికరో మతః ॥ విజయాదీప్యసంయుక్తోవమనస్యవికారనుత్। సౌవర్చ లంహరిద్రాచవిజయాదీప్యకంతథా । అనేనోదరపీడాంచస ద్యోత్పన్నాంవినాశయేత్ । చతుర్వల్లీపలాశస్యబీజంచద్విగు ణంగుడః । అస్యానుపానయోగేనకృమిదోషవినాశనః। అహి ఫేనలవంగంచదరదంవిజయాతథా । అస్యానుపానతస్సద్య స్స్యాతీసారనాశనః। సౌవర్చలేనదీప్యేనఅగ్నిమాంద్యహరః పరః । క్షుదుద్భవజనకశ్చైవసిద్ధనాగేశ్వరోదితం । గుడూచీ సత్వయోగేనసర్వపుష్టికరస్మృతః॥ ౩౬॥

తా॥ రసభస్మమును పిప్పలి, మిరియాలు, శొంఠి, గంటుభారంగి వీటిచూర్ణములో తేనెకలిపి దానితోసేవించిన కాస, శ్వాస, శూలరోగము, ప్రాణిపసపు చూర్ణములోశర్కరకలిపి దానితోసేవించిన రక్తవికారము, త్ర్యూషణము,త్రిఫలములు, అడ్డసరము వీటికషాయముతోసేవించిన కామిల, పాండువుశిలాజతుభస్మము ఏలకలచూర్ణము,ఖండశర్కర వీటితోసేవించిన మూత్రకృచ్ఛము యివినివర్తించును. లవంగములు,తాళిసపత్రి, ఇంగువ, అక్కలకర్ర, పిప్పలి, కరక్కాయ వీటిచూర్ణమును సమముగ జేర్చి, నాగేశ్వరభస్మము (౧) భాగము కర్పూరము, నల్లమందు

యివి ౪ భాగము వీటినన్నియు ఖల్వమునందునిచి మర్దించి దానితో సేవించిన ధాతు వృద్ధిగలుగు. సౌవర్చలవణము, లవంగములు, నేలవేము, కరక్కాయ, వీటిచూర్ణముతో సేవించిన సర్వజ్వరములునివర్తించు. సౌవర్చలవణము, త్రిఫలములు వీటికషాయముతో సేవించిన విరేచనముగలుగు. లవంగము రసభస్మము వీటిని తమలపాకుయందునిచి సేవించినను నేలగుమ్ముడుపేరు చూర్ణముతో సేవించినను వీర్యవృద్ధిని గలుగంజేయు. కరక్కాయ, ఓమము వీటిచూర్ణముతో సేవించిన వమనము సౌవర్చలవణము, మానిపసుపు, కరక్కాయ, ఓమము వీటిచూర్ణముతో సేవించిన తత్కాల ఉదరపీడ, చతుర్వల్లీ, మోదుగవిత్తులు వీటిచూర్ణమునకు రెండింతలు బెల్లముచేర్చి దానితో సేవించిన క్రిమిరోగము, నల్లమందు, లవంగము, కరక్కాయి వీటికషాయముతో సేవించిన సమస్త అతిసారరోగములు, సౌవర్చలవణము, ఓమము వీటితో సేవించిన అగ్నిమాంద్యము యివినివర్తించు. తెప్పసత్తుతో సేవించిన ఆకలిని గలుగంజేయుటయేగాక శరీరపుష్టిని సగాగలుగంజేయు.

శ్లో॥ పిత్తేశర్కరయామలేనసహసావాతేచకృష్ణాసమం । దద్యాచ్ఛ్లేష్మణిశృంగబేరసహితంజంబీరనీరంజ్వరే ॥ రక్తోద్గమధునాప్రవాహరుధిరేస్యాన్మేఘనాదోదకే । దద్యాచ్చాథకృతాతిసారవికృతౌరోగారిసంజ్ఞోరసః॥ ౭౭॥

తా॥ రసభస్మమును శర్కర, ఉసిరికెచూర్ణము వీటితో సేవించిన పిత్తరోగము, పిప్పలిచూర్ణముతో సేవించిన వాతరోగము, అల్లపురసముతో సేవించిన శ్లేష్మరోగము, నిమ్మపండ్లరసముతో సేవించిన జ్వరము, తేనెతో సేవించిన రక్తజనితరోగము, చిట్టిరూర రసముతో సేవించిన రక్తస్రావము (రక్తభేది) అతిసారము యివి నివర్తించు గాన యీరసభస్మము రోగారి యనబడును.

✻ రససిందూరానుపానములు. ✻

శ్లో॥ వాతేసక్షౌద్రపిప్పల్యపిచకఫరుజిత్ర్యూషణంసాగ్నిచూర్ణం।పిత్తే తైలాసితేందూవ్రణవతిచవరాగుగ్గులుశ్చారుబద్ధే । ధాతుర్జాతేనపుష్టౌహరనయనఫలాశాల్మలీపుష్పవృత్తం । కింపాకాంతాలలాటాభరణరసపతేస్స్యాదనూపానమేతత్॥ ౭౮॥

తా॥ రససిందూరమును తేనెతోఁగూడిన పిప్పలీచూర్ణముతోఁ సేవించిన వాత రోగము, త్ర్యూషణములు చిత్రమూలపుచూర్ణము వీటిని నేకముగ జేసి దానితోఁ సేవించిన కఫరోగము, శిలాజతుభస్మములో పచ్చకర్పూరముచేర్చి దానితోఁ సేవించిన పిత్త రోగము, త్రిఫలముతోఁ సేవించిన వ్రణరోగము, గుగ్గిలచూర్ణముతోఁ సేవించిన మల బద్ధము నుపహరించు. చాతుర్జాతకముతోఁ గాని త్రిఫలములతోఁ గాని బూరుగ పుష్ప రసముతోఁ గాని సేవించిన శరీరపుష్టి గలుగు. ఇట్టి రససిందూరమహిమకు పైజెప్పఁ బడిన అనుపానములు కళాంశము గూడ సమముగాదు; అనగా రససిందూరము మిగుల శ్రేష్ఠమైనదని తాత్పర్యము.

* గ్రంథాంతరే. *

శ్లో॥ పిప్పలీమధుసంయుక్తం వాతమేహనివారణం । సితోపలావరా
యుక్తం పిత్తమేహం వరాంగనే ॥ భార్గీత్ర్యూషణమాత్రేకః
కసనశ్వాసశూలనుత్ । సితారాత్రిసమాయుక్తం రక్తదోషం
వినాశయేత్ ॥ కామలాపాండుమందాగ్నిజ్వరాత్ర్యూషణయు
గ్జయేత్ । యథావిష్ణుశ్రియాయుక్తో హృదిస్థో భక్తపాతకాన్ ॥
హృద్రోగంబద్ధకోష్ఠంచ వహ్నిమాంద్యాదికాన్ గదాన్ । జయే
చ్చిత్రకపాంచాలీశివాసౌవర్చలాన్వితం ॥ శిలాజతుసితైలాభిః
మూత్రకృచ్ఛ్రాతినుద్భవేత్ । సౌవర్చలవరాయుక్తం రేచయే
న్నవయౌవనే ॥ జాతీపత్రీలవంగాభూభంగాపిప్పలికుంకుమైః
కర్పూరేణచసంయుక్తం ధాతువృద్ధికరంపరమ్ ॥ లవంగరుచ్య
కశివాయుక్తం సర్వజ్వరాపహమ్ । ప్రియే భంగాజమోదా
భ్యాం ఛర్దిరోగప్రణాశనమ్ ॥ లవంగకుంకుమయుతే నాగవల్లీ
దళోద్భవే । వీటకేవాపికూశ్మాండచూర్ణే స్యాద్ధాతువర్ధనమ్ ॥
గుడపర్పటసంయుక్తం క్రిమీన్ కోష్ఠగతాన్ జయేత్ । లవంగ
భంగాఫూగైశ్చ సర్వాతీసారనుత్ప్రియే ॥ దీప్యసౌవర్చలోపే
తం వహ్నిమాంద్యాపహం పరమ్ । పౌష్టికే స్యామృతాసత్వసం
యుతం పుష్టికారకమ్॥ వాతంమాక్షికపాంచాలీచూర్ణయుక్తం
వినిర్జయేత్ । సితోపలాయుతం పిత్తం జయేదంబుజలోచనే॥ త్రి

కట్వగ్నియుతంహన్యాత్కఫరోగంసుదారుణం। అన్యాన్రో
గాన్ జయేద్యుక్త్యాయథాయోగ్యానుపానకైః॥ పథ్యంపారద
వత్సర్వంసేవయేద్వైహరింస్మరన్ । నవకంజపలాశాక్షిప్రి
యేపీనపయోధరే॥ ౭౯॥

తా॥ రససింధూరమును పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో సేవించిన
వాతమేహము, తెల్లచక్కెర త్రిఫలాచూర్ణము వీటితో సేవించిన పిత్తమేహము,గం
టుభారంగి - త్రికటుకచూర్ణము - తేనె వీటితో సేవించిన కాస,శ్వాస,శూల,పసు
పుచూర్ణము శర్కర వీటితో సేవించిన రక్తదోషము త్రిఫలములు త్రికటుకములు
వీటిచూర్ణములను నేకముగజేసి దానితో సేవించిన కామిల, పాండువు, అగ్నిమాం
ద్యము, చిత్రమూలము పిప్పలి కరక సౌవర్చలవణము వీటిని నేకముగజేర్చి చూ
ర్ణించి దానితో సేవించిన హృద్రోగము, బద్ధకోష్ఠము, అగ్నిమాంద్యము, శిలాజిత్తు
శర్కర ఏలకులు వీటచూర్ణముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము వీటిని హరింపం
జేయు. సౌవర్చలవణము త్రిఫలాచూర్ణము వీటితో సేవించిన విరేచనము, జాపత్రి
లవంగములు, అఫిని, గంజాయి, పిప్పళ్లు, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, వీటి
తో సేవించిన, విశేషముగ ధాతువృద్ధి వీటిని గలుగంజేయు. లవంగములు,సౌవర్చ
లవణము కరక్కాయ వీటిచూర్ణముతో సేవించిన వాతాది సర్వజ్వరములు, గం
జాయి అజామోదము వీటితో సేవించిన ఛర్దిరోగము యివినివర్తించు. లవంగము
కుంకుమపువ్వు వీటిని పైరససింధూరముతోచేర్చి తమలపాకుయందునిచి సేవించినను
లేక కూష్మాండచూర్ణముతో సేవించినను విశేషముగ వీర్యవృద్ధిని గలుగంజేయు. ప
ర్పాటకచూర్ణమును బెల్లములోకలిపి దానితో సేవించిన క్రిమిరోగము,లవంగములు
గంజాయి, అఫిని వీటితో సేవించిన సర్వాతిసారములు, అజామోదము సౌవర్చ
లవణము వీటితో సేవించిన అగ్నిమాంద్యము, యివినివర్తించు. శిప్పసత్తుతో సేవించిన
శరీరపుష్టినిగలుగంజేయు. పిప్పలిచూర్ణములో తేనెకలిపి దానితో సేవించిన వాత
రోగము, కలకండతో సేవించిన పిత్తరోగము, త్రికటుకములు చిత్రమూలము వీటి
చూర్ణములనుకలిపి దానితో సేవించిన దారుణమగు కఫరోగము యివి నశించు ఈ
రససింధూరమును యుక్తానుపానములతో సేవించిన "శ్రీమహాలక్ష్మీసమేత విష్ణువు
భక్తజనులయొక్క పాపములను నశింపజేయుచందంబున" సమస్తరోగములను బోకడ
చు. వికసించిన తామరపుష్పములవంటికండ్లును, గొప్పకుచములునుగల ఓప్రియనాయకీ!

రసభస్మమును సేవించునప్పుడు అందుకు ఏ ప్రకారము పథ్యాదిక్రమంబుల నుదహరిం పఁబడియున్నవో అదే ప్రకారముగ రససిందూర సేవనయందును గూడ నాచరింప వలయు.

## ❋ రసకర్పూరానుపానములు. ❋

శ్లో॥ వల్లంవల్లార్ధమానేనజీర్ణగుడసమం దేయం । యథోచితాను
పానేనసర్వకర్మసుయోజయేత్ ॥ దుగ్ధోదనంతుపథ్యం దేయం
చాస్మింశ్చ తాంబూలం । హరతిసమస్తాన్ రోగాన్ కర్పూరా
ఖ్యోరసోన్నృణాం॥ ౮౦॥

తా॥ శుద్ధిచేయఁబడిన రసకర్పూరమును వల్ల ప్రమాణముగాని లేక అందులో సగముగాని పాతబెల్లముతో సేవింపవలయు. మఱియు తగునైన అనుపానములతో సేవించి పాలన్నము భుజించి తాంబూలము విడముజేసిన సమస్తరోగములు నివర్తించు.

## ❋ గంధకానుపానములు. ❋

శ్లో॥ ఇత్థంవిశుద్ధస్త్రిఫలాజ్యభృంగమధ్వాన్వితశ్శాణమితోవలీఢః ।
గృధ్రాక్షితుల్యంకురుతేక్షియుగ్మంకరోతిరోగోజ్ఝితదీర్ఘమా
యుః । శుద్ధంగంధంనిష్కమాత్రంసదుగ్ధం సేవ్యంమాసంశౌ
ర్యవీర్యప్రవృద్ధ్యై। షణ్మాసాత్స్యాత్సర్వరోగప్రణాశోదివ్యాం
దృష్టిందీర్ఘమాయుస్స్వరూపం । మోచాఫలేనత్వగ్దోషంచిత్ర
కేణమహాబలం। ఆఢరూషకషాయేణక్షయకాసాన్జయేద్ధ్రుశం।
మందానలత్వంజయతిత్రిఫలాక్వాథసంయుతః । ఊర్ధ్వగాన్స
కలాన్రోగాన్హంతిశీఘ్రంసుగంధకః॥ ౮౧॥

తా॥ శుద్ధగంధకభస్మమును త్రిఫలాచూర్ణము నెయ్యి గుంటగలగరరసము తేనె వీటిని నేకముగజేర్చి దానితో శాణప్రమాణము సేవించిన నేత్రములకు స్వచ్ఛతదూరదృష్టి యివిగలుగుటయేగాక శరీరారోగ్యము, దీర్ఘాయుస్సు వీటినిసగాగలుగంజే యు. శుద్ధిజేసిన గంధకభస్మమును నిష్క ప్రమాణము పాలతో నొకమాసము సేవించిన శౌర్యము బలము యివిగలుగు. ఆఱుమాసములు సేవించిన సమస్తరోగములు బోవుటయేగాక దివ్యదృష్టి దీర్ఘాయుస్సు సౌందర్యము యివిసగాగలుగు. అరటి

పండుతో సేవించిన త్వగ్దోషము, చిత్రమూలముతో సేవించిన మహాబలము అడ్డసరపు కషాయముతో సేవించిన క్షయ, కాస, త్రిఫలాకషాయముతో సేవించిన అగ్నిమాంద్యము, శరీరమునకు ఊర్ధ్వభాగమునందు గలుగు సమస్తరోగములు యివి శీఘ్రముగ నివర్తించు.

## ❋ హింగులానుపానములు. ❋

శ్లో॥ వామావశ్యకర స్తథామయహరస్సంమారితో హింగులః । కందర్పంప్రసుగంధినాశుతను తేవహ్నింబలంసన్మతిం । తాంబూలేనసఖేసహంతికసనంశ్వాసంసమస్తాన్ జ్వరాన్ । దేయోఽన్యేషువిచార్యసద్గుణయుతైరోగేషువైద్యైర్ధ్రియా॥ ౮౨॥

తా॥ హింగుళ (ఇంగిలీకము) భస్మము ఏలకలు, లవంగములు, ఆకుపత్రి వీటిని నేకముగ జేసిన చూర్ణములో సేవించిన సమస్తరోగములను నివర్తింపజేయుట యేగాక స్త్రీవశ్యకరత్వము, కామవృద్ధి, అగ్నిపుష్టి, బలము, సద్బుద్ధి వీటినిసగా గలుగంజేయు. తమలపాకుతో సేవించిన కాస, శ్వాస, సమస్తజ్వరములు, యివి నివర్తించు. మఱియు, యితరవ్యాధులయందును చక్కగ నాలోచించి యుక్తానుపానములతో సేవింపజేసిన అవ్యాధులు నివర్తించు.

## ❋ అభ్రికానుపానములు. ❋

శ్లో॥ శుద్ధాభ్రింసనువల్లకద్వయమితంకృష్ణామధుభ్యాంయుతం । మేహంశ్వాసవిషంచకుష్ఠమతులంవాతంచపిత్తంకఫం ॥ కాసక్షీణతతక్షయంగ్రహణికాంపాండుంభ్రమంకామిలాం । గుల్మాద్యంచతథానుపానవిధినామృత్యుంచజేజీయతే॥ ౮౩॥

తా॥ రెండువల్లములప్రమాణము అభ్రికభస్మమును తేనెతో చేర్చబడిన పిప్పలీచూర్ణముతో సేవించిన మేహరోగము, శ్వాస, విషము, కుష్ఠము, వాతము, పిత్తము, కఫము, కాస, క్షీణత్వము, గాయము, క్షయము, సంగ్రహణి, పాండువు, భ్రమ, కామిల, గుల్మము, యివి మొదలగు రోగములనుహరింపంజేయు. మఱియు దీనిని తగుమైన అనుపానములతో సేవించిన అపమృత్యుజయము సగాగలుగు.

## ❋ అన్యచ్చ. ❋

శ్లో॥ అభ్రికంచనిశాత్యక్తే పిప్పలీమధునాసహ । వింశతించప్రమేహాణాంనాశయేన్నాత్రసంశయః । అభ్రికంహేమసంయుక్తం

క్షయరోగవినాశనం । రౌప్య హేమాభ్రకంచైవ ధాతువృద్ధి కరంపరం ॥ గోక్షీరశర్కరాయుక్తంపిత్తరోగవినాశనం। శైలజంపిప్పలీచూర్ణమాక్షికైస్సర్వమేహహృత్ । అభయాగుడసంయుక్తంవాతరక్తంనియచ్ఛతి। స్వర్ణయుక్తంక్షయంహంతిధాతువృద్ధింకరోతిచ । రక్తపిత్తంనిహంత్యాశుచైలాశర్కరయాసహ॥ ౨౪॥

తా॥ అభ్రకభస్మమును పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో ప్రాతఃకాలమునందు సేవించిన వింశతిప్రమేహములు, ఉమెత్తవిత్తులచూర్ణముతో సేవించిన క్షయరోగము యివి నివర్తించు. రౌప్యస్వర్ణభస్మములతో సేవించిన ధాతువృద్ధినిగలుగంజేయు. ఆవుపాలలో శర్కరవైచి దానితోసేవించిన పిత్తరోగము, శిలాజితు భస్మము, పిప్పలీచూర్ణము, తేనె వీటితో సేవించిన సర్వమేహములు, కరకచూర్ణము బెల్లము వీటితో సేవించిన వాతరక్తము యివిహరించు. స్వర్ణభస్మముతో సేవించిన క్షయరోగము తొలగుటయేగాక ధాతువృద్ధి సగాగలుగు. ఏలకచూర్ణము శర్కర వీటితో సేవించిన రక్తపిత్తము నివర్తించు.

* అన్యచ్చ. *

శ్లో॥ సితామృతాసత్వయుతంమేహంనాశయతేధృవం । వరామధుఘృతైస్సాకంవీర్యకృన్నేత్రరోగహృత్ ॥ ఏలాగోక్షురభూధాత్రీశర్కరాసహితంతథా । గోదుగ్ధేనయుతంహంతిమూత్రకృఛ్రంప్రమేహకం । త్రిసుగంధవరావ్యోషశర్కరానాగకేసరం।మాక్షికేణనిహంత్యాశుపాండురోగంక్షయంజ్వరం॥౨౫॥

తా॥ అభ్రకభస్మమును తిప్పసత్తు చక్కెరవీటితోచేర్చిసేవించిన మేహరోగము నివర్తించు. త్రిఫలములు, తేనె నెయ్యి వీటిలోచేర్చిసేవించిన నేత్రరోగమును పోగొట్టుటయేగాక వీర్యవృద్ధి కరముగనుండు. ఏలకులచూర్ణము, పల్లేరురసము, నేలఉసిరిక, శర్కర, పాలు,వీటినిఏకముగజేర్చి దానితోసేవించిన మూత్రకృఛ్రము, ప్రమేహము వీటినినశింపంజేయు. త్రిజాతకములు,త్రిఫలములు, త్రికటుకములు నాగకేసరములు వీటిచూర్ణములో శర్కర, తేనెకలిపి దానితో సేవించిన పాండువు, క్షయరోగము, జ్వరము యివి నివర్తించు.

* అన్యచ్చ. *

శ్లో॥ వల్లంవ్యోషసమన్వితంఘృతయుతంవల్లోన్మితంసేవితం। దివ్యాభ్రంక్షయపాండుసంగ్రహణికాశూలంచకుష్ఠామయం। సర్వంశ్వాసగదంప్రమేహమరుచింకాసామయందుర్ధరం।మందాగ్నింజఠరవ్యథాంపరిహరేచ్ఛోఫామయానిశ్చితం॥ ౮౬॥

తా॥ వాయువిడంగములు, త్రికటుకములు, నెయ్యి, వీటితో వల్లప్రమాణము అభ్రికభస్మమునుచేర్చి సేవించిన క్షయము, పాండురోగము, సంగ్రహణి, శూల, కుష్ఠువు, సమస్తశ్వాసలు, ప్రమేహము, అరుచి, కాస, మిగులకాస, అగ్నిమాంద్యము, కడుపునొప్పి, శోథ. వీటినినిశ్చయముగ నివర్తింపంజేయు.

* హరితాళానుపానములు. *

శ్లో॥ అనుపానాన్యనేకానియథాయోగంప్రయోజయేత్ । గుడూచ్యాదికషాయేణగదానేతాన్వ్యపోహతి ॥ సోపద్రవంవాతరక్తంకుష్ఠాన్యష్టాదశాపివా । సర్వరక్తవికారేషుదేయమామ్రహరిద్రయా । సుహాలాహలజీరాభ్యామపస్మారహరంపరం। సముద్రఫలయోగేనజలోదరవినాశనః ॥ దేవదాలీరసైర్యుక్తంభగంధరహరంపరం। ఫిరంగదోషజంరోగంజాతంహంతిసుదుస్తరం॥మంజిష్ఠాదికషాయేణకుష్ఠమష్టాదశంహరేత్ । త్రిఫలాశర్కరాయుక్తపాండురోగంజయిత్యసౌ। శుంఠీచూర్ణయుతంహన్యాదామవాతంసుదుర్జయం । సౌవర్ణభస్మయోగేనరక్తపిత్తవికారనుత్॥తండులీయరసైస్సాకంజ్వరమష్టవిధంజయేత్। ఏవంసర్వేషురోగేషుస్వబుద్ధ్యాకల్పయేద్భిషక్॥ ౮౭॥

తా॥ హరితాళభస్మమును ఆయారోగములకు తగుమైన అనుపానములతో సేవించవలయును. గుడూచ్యాదికషాయముతో సేవించిన వాతరక్తము, అష్టాదశ కుష్ఠువులు యివినివర్తించు. మామిడిపట్టచూర్ణము, మానిపసపుచూర్ణము వీటితో సేవించిన సర్వరక్తదోషములు నివర్తించు. అతివస, జీలకర్ర వీటిచూర్ణముతో సేవించిన అపస్మారము, సముద్రఫలముతో సేవించిన జలోదరము, దేవదాలిరసముతో సేవించిన భగందరరోగము, ఫిరంగరోగము యివినశించు. మంజిష్ఠాదికషాయముతో సేవించిన అష్టాదశకుష్ఠువులు, త్రిఫలచూర్ణము శర్కర వీటితో సేవించిన పాండు

రోగము, శొంఠిచూర్ణముతో సేవించిన ఆమవాతరోగము, స్వర్ణభస్మముతో సేవించిన రక్తపిత్తము, చిత్రకమూలరసముతో సేవించిన అష్టవిధజ్వరములు యివి హరించును. ఈప్రకారముగ బుద్ధిమంతుడగు వైద్యుడు అనుపానములను ఆలోచించి ప్రయోగింపవలయును.

## ❋ మనశ్శిలానుపానములు. ❋

శ్లో॥ మనశ్శిలాసుమాక్షి కేశుక్రమాశుపిచ్చిటంనిహన్తివాసరాంధి
మామయంసఖేనసంశయః। కణామరీచచూర్ణసంయుతాశిలాం
బునాంజితాత్రిదోషజంజ్వరంవ్యథాశ్చభూతసంనివేశజాం ॥
దధ్యంబునాహన్తితథార్బుదం శిలాశ్వాసంచభార్ంగీకటుభద్ర
సంయుతా । వాసారసవ్యోషయుతాజయేచ్ఛిలాకాసం
బలాసంకనకేనవైవిషం॥ ౮౮॥

తా॥ శుద్ధిజేయబడిన మనశ్శిలను తేనెతో చాది నేత్రమునకంజనమిడిన కంటిపూలు, పిచ్చిటమను నేత్రరోగము, తిమిరరోగము యివి నిస్సందేహముగనివర్తించును. మనశ్శిలను నీళ్లయందుచాది అందు పిప్పలి మిరియాలు వీటిచూర్ణమును చేర్చి అంజనమిడిన త్రిదోషజనిత జ్వరము (సన్నిపాతము) భూతబాధ యివినివర్తించును. మనశ్శిలను పెరుగుమీది తేటతో సేవించిన అర్బుదరోగము, భారంగి అల్లము వీటి కషాయముతో సేవించిన శ్వాస, అడ్డసరపురసము త్రికటుకములు వీటితో సేవించిన కాసబలాసరోగము, ఉమ్మెత్తవిత్తుల చూర్ణముతో సేవించిన విషము వీటిని హరింపజేయును.

## ❋ గ్రంథాంతరే. ❋

శ్లో॥ పిప్పలీనింబఫలాభ్యాంశిలావిమర్ద్యాసు కేరివాల్లరసైః । గుటికా
జ్వరామయఘ్నీత్రిదోషభూతజ్వరంనిహంత్యేవ ॥ శిలాయా
ద్విగుణాంశంఖమర్ధంమారీచకంరజః । సైంధవంస్యాచ్చతుర్థాం
శఃచూర్ణంనేత్రగదాపహం ॥ శుక్రంతిమిరకంహంతిమాక్షికేన
చపిచ్చటం।అర్బుదందధితోయేనకంజాక్షిప్రమదోత్తమే॥ కణా
మరిచసంయుక్తాశిలాపిష్టాంబునాంజితా। భూతావేశహరా
నేత్రేసన్నిపాతజ్వరాపహా ॥ భార్గీవిశ్వాన్వితంశ్వాసంవిషం

స్వర్ణసమన్వితం।వాసకస్వరసప్యోష్ణైఃకఫంకాసంజయేచ్ఛిలా॥
శిలైలార్జునకాసీసగృహధూమాబ్దసర్జకైః। సరోధరోచనైర్లే
పః సర్షపస్నేహసంయుతః॥ కిలాసంకిటభందద్రుంకుష్ఠంపా
మాంభగందరం। ఇంద్రలుప్తముథార్శాంసిహన్యాద్దేవన్నృణా
మిదమ్॥ ౮౯॥

తా॥ పిప్పళ్లు నిమ్మసంస్కారసము వీనిచేశుద్ధిజేయబడిన మనశ్శిలను సుకేరివాల
రసములో మర్దించి శనగగింజంత గుటికలుచేసి దానినిసేవించిన జ్వరములు, సన్ని
పాతజ్వరములు, భూతజ్వరము, శుద్ధమనశ్శిల (౧) భాగము, శంఖభస్మము (౨)
భాగములు, మనశ్శిల కర్ధభాగము మిరియాలచూర్ణము, మిరియాల చూర్ణమున
కర్ధభాగము సైంధవలవణము,వీటినన్నిటిని మెత్తగచూర్ణించి నేకముగజేర్చి దానిని
తేనెలో కలిపి కండ్లకంజనమిడిన శుక్రరోగము, తిమిరరోగము, పిచ్చటము అను
నేత్రరోగములు, మఱియు పెరుగుమీదితేటలో పైచూర ముసుకలిపి అంజనమిడిన
అర్బుదరోగము, పిప్పళ్లు మిరియాలు శుద్ధిజేసిన మనశ్శిల వీటిని సమముగజేర్చి దా
నిని ఫుదకముతో నూరి కండ్లకంజనమిడిన భూతపీడ, సన్నిపాతజ్వరము, గంటుభా
రంగి శొంఠి వీటిచూర్ణముల నేకముగజేర్చి దానితో సేవించిన శ్వాసరోగము,
స్వర్ణభస్మముతో సేవించిన విషపీడ, అడ్డసరపురసములో త్రికటుకచూర్ణముచేర్చి
దానితో సేవించిన కఫము, కాసరోగము, వీటినినశింపంజేయు. మఱియు మణిశిల,
ఏలకులు, మద్దిచెక్క, కాసీసము, కరుధూపము, తుంగముస్తెలు, వేగిసపట్ట, లొ
ద్దుగచెక్క, గోరోచనము వీటినన్నిటిని చూర్ణించి ఆవనూనెలో కలిపి లేపనజేసిన
కిలాసరోగము, కిటిభము, దద్రుకుష్ఠము, దురద, భగందరము, ఇంద్రలుప్తము,అ
ర్శస్సు వీటినివారింపంజేయు.

❋ సౌవీరానుపానములు. ❋

శ్లో॥ నీలాంజనంశుంఠ్యాభయాగుడైఃకఫంపిత్తంనిహంతి త్యాజ్యసితా
యుతంధృవం। వాయుంకణావిశ్వమరీచమాక్షికైర్దేయంధి
యాన్యేషుగదేషుపండితైః॥ ౯౦॥

తా॥ సౌవీరమును,శొంఠి, కరక్కాయ, బెల్లము వీటితో సేవించిన కఫము,
నెయ్యి, శర్కర వీటితో సేవించిన పిత్తము, పిప్పలి శొంఠి మిరియాలు తేనె వీటి
తో సేవించిన వాతము వీటినినశింపంజేయు.మఱియు పండితుడు యితరరోగముల
యందు తగునట్టి అనుపానములతో దీనిని సేవింపజేసిన ఆయారోగములునివర్తించు.

## ❋ ఖర్పరానుపానములు. ❋

శ్లో॥ తద్భస్మమృతకాంతేనసమేనసహయోజయేత్ । అష్టగుంజాని
తంచూర్ణంత్రిఫలాక్వాథసంయుతం । కాంతపాత్రస్థితంరా
త్రౌత్రిలజప్రతివాపకం । నిషేవితంనిహన్యాశుమధుమేహమపి
ధ్రువం। పిత్తక్షయంచపాండుంచశ్వయథుంగుల్మమేవచ।రక్త
గుల్మంచనారీణాంప్రదరంసోమరోగకం । యోనిరోగానుశే
షాంశ్చవిషమాంశ్చజ్వరానపి । రజశ్శూలంచశ్వాసంచహిధ్మి
నాంచవిశేషతః॥ ౯౧॥

తా॥ ఖర్పరభస్మము, కాంతభస్మము వీటిని సమముగచేర్చి (౮) గురిగింజలప్రమాణము త్రిఫలాకషాయమునందువైచి దానిని లోహపాత్రయందొకరాత్రియునిచి మరుదినము ప్రాతఃకాలమునందు సేవించిన మధుమేహము, పిత్తక్షయరోగము పాండురోగము, శోఫ, గుల్మరోగము, స్త్రీలకుజనించెడు రక్తగుల్మము, ప్రదరరోగము, సోమరోగము, సమస్తయోనిరోగములు, విషమజ్వరములు రజశ్శూల, శ్వాస, ఎక్కిళ్లు వీటినిబోకడచు.

## ❋ వజ్రభస్మానుపానములు. ❋

శ్లో॥ కుష్ఠేఖాదిరత్వక్వ్యథాపవనజాసృక్శృంగబేరంమధుదేయంకా
సబలాసశ్వాసవికృతౌవాసోషణాత్వకటిణా ॥ పిత్తేదాహాసి
తాసమంజ్వరగణేచ్ఛిన్నాజలేతిక్తకేవజ్రంమారితశుక్తభస్మ
గదహృద్యోజ్యంభిషక్యుక్తిభిః॥ ౯౨॥

తా॥ వజ్రభస్మమును చంద్రపట్టికషాయములో సేవించిన కుష్ఠరోగము, చర్మరోగము, అల్లపురసములో తేనెవైచి దానితో సేవించిన వాతరక్తము, త్రికటుకములు, లవంగములు, ఓమము, అడ్డసరము వీటికషాయముతో సేవించిన కాస, శ్వాస బలాసి, శర్కరతో సేవించిన పిత్తము, తాపము, తిప్పతీగ, నేలవేము వీటికషాయముతో సేవించిన సమస్తజ్వరములు యివినివర్తించు. మఱియు బుద్ధిమంతుడగు వైద్యుడు తనబుద్ధిచాతుర్యముచేత యోచించి తగుపాటి అనుపానములతో నిప్పించిన సర్వరోగములు నివర్తించు.

## * వైక్రాంతానుపానములు. *

శ్లో॥ భస్మత్వంసముపాగతో వికృతకో హేమ్నామృతేనాన్వితః పాదాంశేనకలాజ్యవల్లసహితో గుంజోన్మితస్సేవితః। యక్ష్మాణం జ్వరణంచపాండుగుదజంశ్వాసంచ। కాసామయందృష్ట్వాంవైగ్రహణీమురఃక్షతముఖాన్ రోగాన్ జయేద్దేహకృత్॥ ౯౩॥

తా॥ వైక్రాంతభస్మము (౧) గురిగింజ ప్రమాణము, కాలుగురిగింజయెత్తు స్వర్ణభస్మము వీటిని (౩) గురిగింజలయెత్తు పాత నేతిలో కలిపి సేవించిన క్షయరోగము, జ్వరము, పాండురోగము, గుదరోగము, శ్వాస, కాస, క్రూరమగు సంగ్రహణి ఉరక్షతము వీటిని నివర్తింపం జేయుటయేగాక శరీరపుష్టిని సగాగలుగం జేయు.

## * నీలవైక్రాంతభస్మానుపానములు. *

శ్లో॥ సూతభస్మార్ధసంయుక్తంనీలవైక్రాంతభస్మకం। మృతాభ్రికంతదుభయోస్తులితంపరిమర్దితం॥ క్షౌద్రాజ్యసంయుతంప్రాతర్గుంజామాత్రంనిషేవితం। నిహంతిసకలాన్ రోగాన్ దుర్జయానన్యభేషజైః। త్రిసప్తదివసైన్నౄణాంగంగాంభఇవపాతకం॥

తా॥ రసభస్మము (౧) భాగము, నీలవైక్రాంతభస్మము ౪ భాగము, యీ రెంటికి సమము అభ్రకభస్మము వీటిని నేకముగజేర్చి చక్కగమర్దించి అందు తేనె నెయ్యి వీటినివైచి కలిపి ఒకగురిగింజయెత్తు (౨౧) దినములపర్యంతము, ప్రతిదినము ప్రాతఃకాలమునందుసేవించిన గంగోదకము పాపములనశింపంజేయు చందంబున అసాధ్యములగు సర్వరోగములను నివర్తింపంజేయు.

## * ప్రవాళభస్మానుపానములు. *

శ్లో॥ ప్రవాళభస్మమాక్షికేణమాగధీయుతేనవైనిహంతిమారుతంకోష్ఠగంజ్వరంపురాతనం। జయేత్సుపక్వవారుణీఫలేనశుక్రసంక్షయందదాతిపుష్టిమాశుశర్కరాజ్యసంయుతంన్నృణాం॥ సితాపయోయుతంనిహంతిపిత్తమాశుదారుణం సఖేసుశాలిజైగ్రహైశ్చమూత్రకృచ్ఛ్రిమామయం। చికిత్సకైర్విచార్యదేయమామయేషువైధియాఖిలేష్వనేకతంత్రసమ్మతేనమత్కృతిస్థ్విరం॥

తా॥ ప్రవాళ (పవడము) భస్మమును, పిప్పలిచూర్ణమును, తేనె వీటినికలిపి దానితో సేవించిన కోష్ఠగతవాతము, పురాణజ్వరము, పాపర (వెర్రిపుచ్చ) పండు రసముతో సేవించిన ధాతు క్షయము వీటిని నశింపంజేయును. శర్కర, నెయ్యి వీటితో సేవించిన శరీరపుష్టినిగలుగంజేయు. పాలు శర్కర వీటితో సేవించిన దారుణమగు పిత్తరోగము, చల్లని కడుగునీళ్లతో సేవించిన మూత్రరోగము వీటినిబోకడచు. మఱియు వైద్యుడు ఆయారోగములయందు అనుపానములను బుద్ధిచేతనూహించి సేవింపజేసిన యవి నివర్తించు.

రసోపరసాద్యౌషధములకన్నిటికిని కొన్నిరోగముల
యందనుపానములు.

శ్లో॥ శూలేహింగుఘృతాన్వితంమధుయుతాకృష్ణాపురాణజ్వరే। వా
తేసాజ్యరసోనకఃశ్వసనకేక్షౌద్రాన్వితంత్ర్యూషణం। శీతేవ్యాల
లతాదళంసమరిచంమేహేవరాసోపలా। దోషాణాంత్రితయేఽ
నుపానముచితంసక్షౌద్రమార్ద్రోదకం॥ ౯౬॥

తా॥ సమస్తరసోపరసములు మొదలైన ఔషధములకు సామాన్యముగ కొన్నిరోగములయందు అనుపానములను చెప్పుచున్నాను. రసోపరసాద్యౌషధములకు, శూలరోగమునందు నేతితో చేర్చబడిన యింగువ, పురాణజ్వరమునందు పిప్పలీచూర్ణముతో చేర్చబడిన తేనె వాతరోగమునందు నేతితో చేర్చబడినఉల్లి, కాసరోగమునందు తేనతో గూడిన త్ర్యూషణచూర్ణము శీతరోగమునందు తమలపాకునందుంచబడిన మిరియాలు, మేహరోగమునందు త్రిఫలములతో చేర్చబడిన ఇరుగుడురసము త్రిదోషములందు తేనెతో చేర్చబడిన అల్లపురసము యివి అనుపానములని యెఱుంగవలయు.

శ్లో॥ ఘనపర్పటకంజ్వరేగ్రహణ్యాంమథితం హేముగరేవమీషులా
జాః । కుటజోఽతిసృతేవృషోఽస్రపిత్తేగుదకీలేష్వనలఃకృ
మౌకృమిఘ్నః॥ ౯౭॥

తా॥ జ్వరమునందు తుంగముస్తెలు, పర్పాటకము, గ్రహణిరోగమునందు మజ్జిగ విషరోగమునందు ఉమ్మెత్తవిత్తులు, వాంతిరోగమునందు పేలాలు, అతిసారమునందు కొడిసెవిత్తులు, రక్తపిత్తమునందు అడ్డసరము, మూలవ్యాధియందు చిత్రమూలము, క్రిమిరోగమునందు వాయువిడంగములు యీరసోపరసాదులకు పైజెప్పంబడిన రోగములయందనుపానములని తెలియవలయు.

## * విషానుపానములు. *

శ్లో॥ శిఖికటిరసోపేతంవిషముజ్వరజిద్విషం। విషయష్ట్యాహ్వయం రాస్నాసేవ్యముత్పలకందకం। తండులోదకపీతానిరక్తపిత్త స్యభేషజం। రాస్నావిడంగత్రిఫలాదేవదారుకటుత్రయం।పద్మ కంక్షౌద్రమమృతావిషంచశ్వాసకాసజిత్। సితారసవిషక్షీర ప్రవాళమధుభిఃకృతా। వాంతింనిహంతిగుటికామనుజానాంన సంశయః। మధుమద్యానిశారేణుసైంధవైఃకటుత్వగ్యుతం।చ్యా వనప్రాశనోపేతంవిషంతుపయాతిక్షయం॥ ౯౦॥

తా॥ విషమును, శుద్ధమైలుతుత్థభస్మము పారదభస్మము వీటితోసేవించిన విషమజ్వరము, విషయష్టి సన్నరాస్నము, కలువగడ్డ, బియ్యపుకడుగునీళ్ల వీటితో సేవించిన రక్తపిత్తము, సన్నరాస్నము, వాయువిడంగములు, త్రిఫలములు, దేవదారు, త్రికటుకములు, తామరగడ్డ, తేనె, తిప్పసత్తు వీటితోసేవించిన శ్వాసకాసలు, శర్కర, శుద్ధపారదభస్మము అతివస, పాలు, పగడభస్మము, తేనె వీటిని ఏకముగజేసి గుటికలుజేసి సేవించిన వాంతి రోగము, మ్రానిపసపు, పర్పాటకము సైంధవలవణము, దుందిలపుచెట్టుపట్ట, వీటిచూర్ణములను తేనె, మద్యము వీటితోచేర్చి దానితోసేవించిన క్షయరోగము నివర్తించు.

శ్లో॥ విజయాపిప్పలీమూలంపిప్పలీద్వయచిత్రకైః। పుష్కరాహ్వసఠీ ద్రాక్షాయవానీక్షారదీప్యకైః ॥ సితాయష్టిద్విబృహతీసైన్ధవైః పాలికైఃపచేత్। సవిషార్ధపలైఃప్రస్థంఘృతాత్తంజీర్ణభుక్పిబే త్॥దుర్నామమేహగుల్మార్శతిమిరకృమిపాండుకాః। గలగ్ర హగ్రహోన్మాదకుష్ఠానిచనియచ్ఛతి ॥ ముస్తావత్సకపాఠా గ్నివ్యోషప్రతివిషావిషం। ధాతకీమోచనిర్యాసంచూతాస్థి గ్రహణీహరం। కృష్ణఘ్నావిషపథ్యాగ్నిదంతీద్రాక్షావిషా వృషాః॥ శిలాజితువిషంత్ర్యూషముదావర్తాశ్రీహరం॥ ౯౧॥

తా॥ విషమును, కరక్కాయ, మోడి, పిప్పలి, గజపిప్పలి, చిత్రమూలము, పుష్కరమూలము కచోరములు, ద్రాక్ష, యవక్షారము, ఓమము, శర్కర, యష్టిమధుకము, ములక, వాకుడు, సైంధవలవణము, చెంగల్వకోష్టు ౪ పలము వస నాభి వీటినిచేర్చివండి నీడనుమెండించి పిదప చూర్ణించి నేతిలోవైచి నాలుగుమూస

ములుంచి పిదప దానిని ప్రతినిత్యముసేవించిన, దుర్నామరోగము, మేహము, గుల్మము,అర్శస్సు, అతిసారము, క్రిమి, పాండువు, గళగ్రహము, ఉన్మాదము, కుష్టువు వీటిని నివర్తింపంజేయు. తుంగముస్తెలు, కొడిశవిత్తులు, విషబొద్ది, చిత్రమూలము, త్రికటుకములు, అతివస, వసనాభి, అరె, బూరుగబంక, మామిడిపప్పు వీటికషాయముతో సేవించిన గ్రహణిరోగము, వసనాభి, కరక్కాయ, చిత్రమూలము, దంతివిత్తులు, ద్రాక్ష, అతివస,అడ్డరసము, వీటికషాయముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, శిలాజతుభస్మము, వసనాభి, త్రికటుకములు వీటికషాయముతోసేవించిన ఉపావర్తము, అర్శస్సు వీటినిహరింపంజేయు.

శ్లో॥ గోమూత్రక్షారసింధూత్థవిషపాషాణభేదకం । వజ్రవద్దారయత్యేత దేకతఃపీతమశ్మరీం । త్రిఫలాసర్జికాక్షారైర్విషంగుల్మప్రభేదనం । పిప్పలీపిప్పలీమూలంవిషంశూలహరంపరం। విషంద్రవంతిమధుకద్రాక్షారాస్నాసరీకణాః ॥ విషవేల్లమిశిక్షీరం గుల్మప్లీహానిబర్హణం। ప్లీహోదరఘ్నంపయసాశతాహ్వాకృమిజిద్విషం । వాయసీమూలక్వాథేనపీతంకుష్టహరంవిషం॥ పయసారాజవృక్షత్వక్త్రాయంతీవాకుచీబలాత్ । ప్లీహఘ్నంవాకుచాయాంచవిషంక్వాథేనకష్ఠజిత్ । అవల్గుజైలాకజయావిడక్షారద్వయంవిషం । లేపస్సైంధవఃపిష్టోవారిణాకుష్టనాశనః॥

తా॥ విషమును గోమూత్రము, యవక్షారము, సైంధవలవణము, క్రొమ్మనగ్రోవి వీటికషాయముతో సేవించిన వజ్రాయుధము పర్వతముభేదించుచందంబున అశ్మరీరోగమును త్రిఫలచూర్ణము, సర్జక్షారము వీటితో సేవించిన గుల్మరోగమును, పిప్పలి, మోడి వీటికషాయముతో సేవించిన శూలరోగమును, ఎలికచెవియాకు, యష్టిమధుకము, ద్రాక్ష, సన్నరాస్న, కచోరములు, వసనాభి, వాయువిడంగములు, సదాప, వీటికషాయములో పాలుబోసి దానితో సేవించిన గుల్మ, ప్లీహరోగములు నునశించు. పాలతో సేవించిన ప్లీహము, ఉదరరోగము, వీటిని నివర్తింపంజేయు. సదాపవిత్తులకషాయముతో సేవించిన కృమిరోగము, కాచాకురసముతో సేవించిన కుష్ఠరోగము, రేలపట్ట, కలుగ్రానుగ, కారుగత్స, వీటిచూర్ణమును పాలలో నైచి దానితో సేవించిన ప్లీహరోగము, కారుగత్సకషాయముతో సేవించిన కుష్ఠరోగము,

క్రాలుపట్ట, విలకులు, కరక్కాయ, వాయువిడంగములు, సర్జక్షారము, యవక్షారము సైంధవలవణము వీటినిఉదకముతో నూరి శరీరమునకు లేపనము జేసిన కుష్ఠరోగము వీటినిబోకడచు.

శ్లో॥ ఏరండతైలత్రిఫలాగోమూత్రంచిత్రకంవిషం । సర్పిషాసహితంపీతంవాతా ర్తత్వమపోహతి ॥ స్వరసంబీజపూరస్యవచాబ్రాహ్మీరసంఘృతం ॥ వంధ్యాపిబతిసవిషంసుపుత్రైపరివార్యతే । వీరాలాంగలికీదంతీవిషపాషాణభేదకైః । ప్రయోజ్యమూఢగర్భాణాంప్రలేపోగర్భమోచనః । దేవదారువిషంసర్పిర్గోమూత్రంకంటకారికా । వచావాస్థలనంహన్తిబుద్ధేశ్చాపరివర్ధనం। విషంసర్పిస్సితాక్షౌద్రంతిమిరాపహమంజనం । విషంచైకమజాక్షీరకల్పితంఘృతధూపితం । విషంధాత్రీఫలరసైరసకృత్పరివాసితం। అంజనంశంఖసహితంప్రగాఢంతిమిరంజయేత్ ।విషమింద్రాయుధం స్తన్యేఘృష్టంకాచభిదంజనం । బీజపూరరసైర్ఘృష్టంవిషంతద్వత్సితాన్వితం। విషంమాగధికాద్వేచసిషాకాచఘ్నమంజనం । శుక్లార్కంచవిషంకృష్ణాయుక్తంగోమూత్రభావితం।భల్లాతకాగ్నిశమ్యాకవిషైర్వామూత్రపేషితైః। లేపోవిచర్చికాదద్రురసికాకిటిభాపహః॥ ఖర్జికాక్షారసింధూత్థశుక్తశుక్తవరంవిషం। కర్ణయోఃపూరణంతీవ్రకర్ణశూలనిబర్హణం। ప్రపౌండరీకమంజిష్ఠావిషతిందుసముద్భవైః । నిహంతిసాధితంతైలంగండూషేణసుఖామయాన్। శాలాఖదిరకంకోలజాతీకర్పూరచందనైః। ఏలాబ్దవాలైర్ద్విగుణవిషైస్సారాంబుపేషితైః। సమూత్రవటికాక్లుప్తాఘృతైర్ఘ్నంతిముఖామయాన్। కటుతైలంవిషంనస్యంపలికారుంషికాపహం ॥ గుంజాటంకణశిగ్రుమూలరజనీసంపాకభల్లాతక। స్నుహ్యర్కాగ్నికరంజసైంధవవచాకుష్ఠాభయాలాంగలీ। వర్షాభూషడభూశిరీషవరణవ్యోషాశ్వమారోవిషం। గోమూత్రంశమయేద్విలుప్తమపచీంగ్రంథ్యర్బుదేశ్లీపదాన్॥౧౧౧॥

తా॥ విషమును చిత్రామూదము గోమూత్రము నెయ్యి వీటిని నేకముగ జేర్చి అందు త్రిఫలములు చిత్రమూలము వీటిచూర్ణములనువైచి దానితో సేవించిన వాత రోగమునివర్తించు. బ్రాహ్మీరసము, నెయ్యి వీటియందు వసచూర్ణమును వైచి దానితో సేవించిన వంధ్యత్వమునివర్తించు. గజనిమ్మ తరిగొట్టు దంతి వసనాభి బ్రాహ్మనద్రోవి వీటినన్నిటిని నేకముగ వుదకములోనూరి గర్భమునకు లేపనము జేసిన మూఢగర్భవిమోచనముగలుగు. దేవదారు వసనాభి వస వీటిచూర్ణమును నెయ్యి, గోమూత్రము వీటినిచేర్చి దానియందువైచి దానితో సేవించిన నత్తిరోగము నివర్తించుటయేగాక బుద్ధి వృద్ధి సగాగలుగు. నెయ్యి తేనె శర్కర వీటితో చేర్చి అంజనమిడినగాని లేక నెయ్యి మేకపాలు వీటితో అంజనమిడినగాని తిమిర రోగము నివర్తించు. శంఖభస్మము, విషము వీటిని ఉసిరికరసముతో అనేకమార్లు భావనచేసి నేత్రముల కంజనమిడిన గాఢమైన తిమిరరోగమునశించు. వజ్రభస్మము చనుబాలు, నెయ్యి వీటిని నేకముగకలిపి అంజనమిడిన గాని లేక మాదీఫలరసము, శర్కర, విషము, వీటిని నేకముగజేర్చి రంగరించి అంజనమిడిన గాని కాచమనే నేత్రరోగము నివర్తించు, పిప్పలి, గజపిప్పలి, వీటిచూర్ణమును తెల్లతామరపుష్ప రసముతోకలిపి అందువిషమునుచేర్చి నేత్రముల కంజనమిడిన కాచరోగము నివర్తించు. పిప్పలీ, విషము వీటిని గోమూత్రములో భావనచేసి అంజనమిడిన శుక్లార్మమనే నేత్రరోగము నివర్తించు. జీడి, చిత్రమూలము, రేల, విషము వీటిని గోమూత్రములోనూరి శరీరమునకు లేపనముజేసికొనిన గజ్జి, దద్రువు రసికా, కిటిభ అనుకుష్ఠరోగములు యివి నివర్తించు. సర్జక్షారము, సైంధవలవణము, త్రిఫలములు, విషము,వీటిని ఫులికల్లులోవైచి చెవులయందుపోసిన కర్ణశూల నివర్తియగు. ప్రపౌండరీకమనే గ్రంథ్యము, మంజిష్ఠ,విషము, తుమికి, వీటినినూనెయందువైచి తైలపక్వముగకాచి దానిని పుక్కిలించిన ముఖరోగము నివర్తించు. ఏపి, చంద్ర, తక్కోలాలు, జాజికాయ, పచ్చకర్పూరము, శ్రీగంధము, బోళము, అబ్దవాలము యివి ప్రత్యేకముగ (౧) భాగము. (౨) భాగములు విషము. వీటిని సంబరేణురసము, గోమూత్రము వీటితోనూరి వటుకములుచేసి నేతితోసేవించిన ముఖరోగములన్నియు నివర్తించు. కటుకరోహిణి, విషము వీటిని మంచినూనెలోవైచి కాచి నస్యము

జేసిన పలికా, ఆరుంషికా అను నీరోగనూఖునశించు. గురుగింజ, వెలిగారము, మునగవేరు కోరిందపట్టి రేలపట్టు జీడి ఆకుజెముడు జిల్లేడు చిత్రమూలము వ్యాఘ్రినఖమనే గ్రంథద్రవ్యము సైంధవలవణము వస చంగల్వకోష్టు కరక్కాయ నీరు పిప్పలి గలిజేరు ఉత్తరేణి దిరిశెనము త్రికటుకములు గన్నేరు విషముష్టిచూర్ణము నుగోమూత్రముతో నూరి లేపము జేసిన అపచీరోగము గ్రంథిరోగము అర్బుదరోగము శ్లీపదరోగము యివిశాలగు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రిభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
సప్తధాతూపధాతు పారదాది రసోపరసానాం
విషస్య చానుపాన వివేకకథనన్నామ
తృతీయస్తరంగః.





శ్రీ ర స్తు.

శ్రీ మద్ధన్వంతరయేనమః-

ఆంధ్ర తాత్పర్య సహిత

# అనుపానరత్నాకరము.

## చతుర్థస్తరంగము.

### * సప్తధాతు శోధన. *

శ్లో॥ స్వర్ణతారారతామ్రాణాంపత్రాణ్యగ్నౌప్రతాపయేత్ । నిషి
క్తేత్తప్తతప్తానితైలేతక్రేచకాంజికే । గోమూత్రేచకులుత్థా
నాంకషాయేచత్రిధాత్రిధా । ఏవంస్వర్ణాదిలోహానాంవిశుద్ధి
స్సంప్రజాయతే। ౧౦౨॥

తా॥ బంగారు వెండి ఇత్తడి రాగి వీటిని పలచనగ రేకులుజేసి అనేక మార్లు నిప్పునయందుకాచి నూనె మజ్జిగ కాంజికము గోమూత్రము ఉలవకషాయము వీటిలో ప్రతిదానియందును మూడేసిమార్లుముంచిన నవిశుద్ధియగు. ఇదేప్రకారము స్వర్ణాది సప్తధాతువులను శుద్ధిజేయవలయు.

### * ఉపధాతు(అనగా)సువర్ణమాక్షికశోధన. *

శ్లో॥ మాక్షికస్యత్రయోభాగాభాగైకంసైంధవస్యచ । మాతులుంగ
ద్రవైర్వాథజమ్బీరస్యద్రవైఃపచేత్ । చాలయేల్లోహజేపాత్రే
యావత్పాత్రంసులోహితం॥ భవేత్తతస్తుసంశుద్ధింస్వర్ణమా
క్షికమృచ్ఛతి॥ ౧౦౩॥

తా॥ స్వర్ణమాక్షికము (౩) భాగములు, సైంధవలవణము (౧) భాగము వీటినిచూర్ణించి యినపబాణలిలోవైచి అగ్నిపైనునిచి యందు మాదీఫలరసమును గాని లేక నిమ్మపండ్లరసమునుగాని బోసి బాణలియెఱ్ఱగ యగువరకు యినపగరిటతో కలియబెట్టుచుండిన స్వర్ణమాక్షికము శుద్ధియగు.

## ❋ రౌప్యమాక్షిక శోధన. ❋

శ్లో॥ కర్కోటీమేషశృంగ్యుత్థైర్ద్రవైర్జంబీరజైర్దినం । భావయేదాతపేతప్తేవిమలాశుధ్యతిధ్రువం॥ ౧౦౪॥

తా॥ రౌప్యమాక్షికమును బొంతరజంగి తీగెరసములో నొకదినంబును, వద్దికూరరసముతో నొకదినంబును, నిమ్మపండ్లరసముతో నొకదినంబును, మర్దించి ప్రతిదినంబును తీక్ష్ణమగు నెండ నెండించిన నది శుద్ధియగు.

## ❋ తుత్థశోధన. ❋

శ్లో॥ విష్టయామర్దయేత్తుత్థంమార్జారకకపోతయోః । దశాంశంటంకణందత్వాపచేన్మృదుపుటే త్తతః ॥ పుటందధ్నాపుటంక్షౌద్రైర్దేయంతుత్థవిశుద్ధయే॥ ౧౦౫॥

తా॥ పిల్లివిష్ఠము పావురపిట్టమలము వీటిని మైలుతుత్థమునకు సమభాగంబుగను, వెలిగారము మైలుతుత్థమునకు సమభాగంబుగను గ్రహించి ఖల్వమున జక్కగ మర్దించి యెండనెండించి ప్రమిదలయందునిచి చీలయిచ్చి అడవి యెరుపిడకలతో లఘుపుటంబిడి, పిదప దానిని పెరుగుతో మర్దించి పైజెప్పినప్రకారము మరల లఘుపుటంబిడవలయు. ఇటులనే తేనెతో నూరి పుటంబిడిన మైలుతుత్థము శుద్ధియగు.

## ❋ కాంస్యరీతి శోధన. ❋

శ్లో॥ శోధనంకాంస్యరీత్యోశ్చ ధాతుశ్శుద్ధిసమంభవేత్॥ ౧౦౬॥

తా॥ స్వర్ణాదిధాతువుల శోధనమువలెనే కంచు యిత్తడి వీటికికూడ శోధన జేయవలయు.

## ❋ సిందూర శోధన. ❋

శ్లో॥ దుగ్ధామ్లయోగత స్తస్యవిశుద్ధిర్గదితాబుధైః॥ ౧౦౭॥

తా॥ పాలు పులుసు వీటితో సిందూరమును శుద్ధిచేయవలయు.

## ❋ శిలాజతు శోధన. ❋

శ్లో॥ హేమాద్యాస్సూర్యసంతాపాద్రవంతిగిరిధాతవః । తచ్ఛాంభోమృదుమృత్సాభంతద్భవేచ్ఛశిలాజతు ॥ శిలాజతుసమా

నీయగ్రీష్మతప్తశిలాచ్యుతం । గోదుగ్ధైస్త్రిఫలాక్వాథైర్భృంగ ద్రావైశ్చమర్దయేత్ ॥ ఆతపేదినమేకైకంతచ్ఛుష్కంశుద్ధతాం వ్రజేత్॥ ౧౦౮॥

తా॥ గ్రీష్మర్తువునందు సూర్యసంతాపముచే పర్వతాదులయందలి హేమాది ధాతువులు తపించి యందుండి రసముద్రవించి ఘనీభవించుటయ శిలాజత్తు అనం బడు. అట్టిశిలాజత్తును ఆవుపాలు త్రిఫలకషాయము గుంటగలగరరసము, వీటిలో ప్రతిదానిచేతను నొక్కొక్కదినముచొప్పున ఖల్వమునమర్దించి నొకదినము ఎండ నెండించిన నది శుద్ధియగు.

* రససంస్కారము. *

శ్లో॥ అష్టాదశైవసంస్కారాఊనవింశతికాఃక్వచిత్ । సంప్రోక్తా రసరాజస్యవసుసంఖ్యాఃక్వచిన్మతాః॥ ౧౦౯॥

తా॥ రసమునకు ౧౮ సంస్కారములు గలవనియు ౧౯ సంస్కారములు గలవనియు ౮ సంస్కారములు గలవనియును జెప్పబడియున్నది.

* రసాష్టాదశసంస్కారవివరణము. *

శ్లో॥ స్వేదనంమర్దనంమూర్ఛోత్థాపనంపాతనంత్రిధా । బోధనం నియమంచైవదీపనంచానువాసనమ్ మారణంజారణంచైవసారణంప్రతిసారణమ్। క్రామణంవేధనంచైవదేహయోగేచశస్యతే॥

తా॥ స్వేదనము మర్దనము మూర్ఛనము ఉత్థాపనము అధఃపాతనము తిర్యక్పాతనము ఊర్ధ్వపాతనము బోధనము నియమము దీపనము అనువాసనము మారణము జారణము సారణము ప్రతిసారణము క్రామణము వేధనము శరీరయోగము అనునవి రసాష్టాదశసంస్కారంబులనంబడు.

* స్వేదనవిధి. *

శ్లో॥ త్ర్యూషణంలవణంరాజీరజనీత్రిఫలార్ద్రకమ్।మహాబలానాగబలామేఘనాదఃపునర్నవా। మేషశృంగిచిత్రకంచనవసారంసమంసమమ్। రసస్యషోడశాంశేనసర్వంయుంజ్యాత్పృథక్పృథక్।ఏతత్సమస్తంవ్యస్తంవాపూర్వాహ్నైశైవపేషయేత్ । లింపేదనేన

కలేనవస్త్రేణాంగుళిమాత్రకమ్ । తన్మధ్యేనిక్షిపేత్సూతం బధ్వాత్రిదినంపచేత్ । డోలాయంత్రేణుసంయుక్తేజాయతే స్వేదితోరసః॥ ౧౧౧॥

తా॥ త్రికటుకములు ఉప్పు ఆవాలు పసపు త్రిఫలములు అల్లము పెద్దము త్తవపులగము నాగము త్తవపులగము చిత్తికూర తెల్లగలిజేరు వద్ది చిత్రమూలము సహాసాగరము అనువానిలో ప్రతిద్రవ్యమునుగాని అందు దొరికినవానినిగాని రసమునకు పదియారవభాగము గ్రహించి ప్రత్యేకముగగాని సముదాయముగగాని కలితో నూరి వస్త్రముపై అంగుళప్రమాణము లేపనముజేసి దానిమధ్యమున పాదరసమునుబోసి వస్త్రములో మూటగట్టి దానిని డోలాయంత్రమునదగిలించి కలితో నొకదినము వండుటయు స్వేదనమనంబడు.

## ❋ మర్దనవిధి. ❋

శ్లో॥ భిషగ్భిర్మర్దయేచ్చూర్ణైరిమిళిత్వాషోడశాంశతః । సూతస్యాగాలితేవస్త్రేవక్ష్యమాణద్రవాదిభిః । గృహధూమేష్టికాచూర్ణం తథాదధిగుడాన్వితమ్ । లవణాసురిసంయుక్తంక్షిప్త్వాసూతం విమర్దయేత్ । జీర్ణాభ్రకంతథాజీర్ణబీజసూతంతథైవచ । గృహ్ణాతినిర్మలోరోగాన్ గ్రాసేగ్రాసేవిమర్దితః॥ ౧౧౨॥

తా॥ కరుధూపము ఇటికెరాయిపొడి పెరుగు బెల్లము ఉప్పు ఆవాలు జీర్ణాభ్రకము వీటిలో ప్రతిదానిచూర్ణమును రసమునకు పదియారవభాగము జేర్చిమర్దించి రసమును వస్త్రములో బోసిపిడిచిన నిర్మలమై శీఘ్రముగరోగముల హరింపంజేయు.

## ❋ మూర్ఛనవిధి. ❋

శ్లో॥ సహాకన్యామలంహంతిత్రిఫలావహ్నినాశినీ । చిత్రమూలం విషంహంతితస్మాత్తంచప్రయత్నతః । మిశ్రితంమర్దయేత్సూతంసప్తవారేణమూర్ఛయేత్ । ఇత్థంసంమూర్ఛితస్సూతోదోషశూన్యఃప్రజాయతే॥ ౧౧౩॥

తా॥ కలుబంద పాదరసమునందలి మలదోషమును, త్రిఫలములు వహ్నిదోషమును, చిత్రమూలము విషదోషమును హరింపంజేయు. కావున మిశ్రితపాదరసమును కలుబంద త్రిఫలములు చిత్రమూలము అనువానిరసములతో ప్రతిదానిచే ఏడేసి మార్లుమర్దించిన రసముమూర్ఛంజెందు. ఇటులమూర్ఛంజెందినరసము దోషరహితంబు

### * ఉత్థాపనవిధి.

శ్లో॥ జలైస్సోష్ణైరనాళైర్వాక్షాళనాదుత్థితోభవేత్ । అథవాపాత
నాయంత్రేపాతనాదుత్థితోభవేత్ । ఉత్థితఃకాంజికక్వాథైః
క్షాళనీయమతఃపరమ్॥ ౧౧౪॥

తా॥ పాదరసమును ఉష్ణోదకముతోగాని ఉష్ణముగనుండు కలితోగాని కడిగి దీసికొనిన ఉత్థితంబగు; లేక ఊర్ధ్వపాతనాయంత్రమునందును ఉత్థితంబగు; ఉత్థాపనానంతరము రసమునుష్ణముగనుండు కలితో గడుగవలయు.

### * ఊర్ధ్వపాతనవిధి. *

శ్లో॥ భాగాస్త్రయోరసస్యార్కచూర్ణమంశాంశనింబుకమ్ । తత
స్సంమర్దయేద్యావత్తావదాయాతిపిండతామ్ । తత్పిండంతల
భాండస్థమూర్ధ్వభాండేజలంక్షిపేత్ । కృత్వాలంబాలకేయం
త్రేదత్త్వావార్ధ్రింపిహామోదకమ్ । సంరోప్యచాగ్నింమధ్యస్థంచ
తుర్యామంపిహబోధయేత్ । యుక్త్యోర్ధ్వభాండసంలగ్నంగృ
హ్ణీయాత్పారదంతతః। ఊర్ధ్వపాతనమిత్యుక్తంభిషగ్భిస్సూత
శోధనే । ససూతభాండవివరమన్యద్గలతిభాండకే । తథాసం
ధిర్ద్వయోఃకార్యాపాతనాయంత్రయంత్రకే । యంత్రప్రమా
ణంవదనాద్గురోర్జ్ఞేయంవిచక్షణైః॥ ౧౧౫॥

తా॥ పాదరసము మూడుభాగములు, జిల్లేడుపట్టచూర్ణము ఒకభాగము, ఇటుల వీనిని గ్రహించి అందొకింత నిమ్మపండ్లరసముబోసి యుంటగనగువరకు మర్దించి, దాని నధస్థ్సిత భాండమునందునిచి పైభాండమునందుదకముబోయుటచే డమరుకాయంత్రమని బఱంగెడు దానిని పొయిమీదనునిచి పైభాండమునందు శీతోదకముబోయుచు నాలుగుఝాములు మధ్యమాగ్నితో వండి పైకుండనంటియుండు రసమును యుక్తితో గ్రహింపవలయు రసశోధనవిషయమున జేయంబడు నీక్రియనే ఊర్ధ్వపాతనమనియెదరు. ఊర్ధ్వపాతనాధస్థ్సితభాండముఖములో పైభాండము యొక్క ముఖమును జేర్చి బాగుగసంధిలేపనము జేయవలయు. యంత్రప్రమాణము గురుముఖమువలన దెలిసికొనవలయు.

## ❋ అధఃపాతనవిధి.

శ్లో॥ త్రిఫలాశిగ్రుశిఖిభిర్లవణాసురిసంయుతైః । నష్టపిష్టరసంకృత్వా లేపయేదూర్ధ్వభాండకే । ఊర్ధ్వభాండోదరంలిప్త్వాచాధో భాండేజలంక్షిపేత్ । సంధిలేపంద్వయోఃకృత్వాతద్యంత్రంభు విపూరయేత్ । ఉపరిష్టాత్పుటేదత్తేజలేపతతిపాదరః । అధః పాతనమిత్యుక్తంసిద్ధాద్యైస్సూతకర్మణి॥ ౧౧౮॥

తా॥ త్రిఫలములు మునగ చిత్రమూలము ఉప్పు ఆవాలు వీనితోడ రసమును జేర్చి రసముగలియువరకు ఖల్వమునమర్దించి డమరుకయంత్రముయొక్క పైపాత్రలోభాగమున దానినిబూసి క్రిందిపాత్రయందుదకముబోసి ఆరెండుపాత్రలజేర్చి సంధులకు బాగుగచీలమన్ను లేపనముజేసి యెండించి యీపాత్రనుభూమిలోపూడ్చి దానిపై పుటంబిడవలయు. ఇటులజేసిన రసము జలముండు క్రిందిపాత్రయందు బడు. దీనిని సిద్ధాదులు రసకర్మయందు అధఃపాతనమని వచించెదరు.

## ❋ తిర్యక్పాతనము. ❋

శ్లో॥ ఘటేరసోవినిక్షేప్యోసజలంఘటమన్యకమ్। తిర్యఙ్ముఖంద్వయోః కృత్వాసమ్ముఖంరోధయేత్సుధీః । తత్రైవచుల్ల్యాంసంస్థాప్య యత్నతస్తంతతోభిషక్ । రసస్యోజ్వాలయేద్వహ్నింయావ త్సూతోజలంవిశేత్ । తిర్యక్పాతనమిత్యుక్తంసిద్ధైశ్చైవార్జు నాదిభిః । మిశ్రితౌనాగవంగౌచరసేవిక్రయహేతుతః ॥ తౌ భ్యాంస్యాత్కృమిదోషస్తుతన్ముక్తిఃపాతనత్రయాత్ । ఏవంసు సంస్కృతస్సూతఃపాతనావిధియత్నతః । సర్వదోషవినిర్ముక్తో జాయతేనాత్రసంశయః॥ ౧౧౭॥

తా॥ యంత్రమునకుతగినటుల ఒకింతనిడుపుగనుండుకుండలగ్రహించి అందొకదానిలో పాదరసమును, మటియొకదానిలో యుదకమునుబోసి, అడ్డముగనునిచి వాటినిజేర్చి సందులకు చీలమన్ను లేపనముజేసి, రసముబోసినకుండను పొయిమీదనడ్డముగ యుక్తితోనునిచి పాకముజేసిన రసము నీళ్లలోప్రవేశించు. దీనినే నాగార్జునుడు మొదలగు సిద్ధులు తిర్యక్పాతనమని వచించెదరు. ఇటులయుక్తిచే

మూడుమార్లు తిర్యక్పాతనము జేయుటవలన రసమునందలి నాగ, వంగ, క్రిమిదోషములు నివర్తించు. ఈతిర్యక్పాతనవిధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించు.

## ❋ బోధనము. ❋

శ్లో॥ ఏవంకదర్థితస్సూతఃషండత్వమధిగచ్ఛతి । తన్ముక్త్యేస్యక్రియా తేబోధనంకథ్యతేహితత్॥ ౧౧౮॥

తా॥ పైప్రకారము శోధింపబడిన పాదరసమునందు షండత్వదోషంబుండు. అది నివర్తించుటకై బోధనక్రియనువచించెద.

## ❋ బోధనము. ❋

శ్లో॥ కదర్థ్యనేనైవనపుంసకత్వమేవంభవేదస్యతస్యపశ్చాత్। వీర్యప్రకర్షాయచభూర్జపత్రేస్వేద్యోజలేసైంధవచూర్ణగర్భే॥ ౧౧౯॥

తా॥ రసమునకు పైజెప్పంబడిన సంస్కారమువలన షండత్వదోషముగలుగు. తన్నివారణార్థంబును, రససామర్థ్యము వృద్ధిజెందుటకును, రసమును భూర్జపత్రము, ఉదకము, సైంధవలవణము, అనువానితో పాకముజేయవలయు.

## ❋ నియమనము. ❋

శ్లో॥ సర్పాక్షీచించకావంధ్యాభృంగాబ్దకనకాంబుభిః । దినంసంస్వేదిజస్సూతోనియమాత్స్థిరతాంవ్రజేత్॥ ౧౨౦॥

తా॥ పాదరసమును సర్పాక్షి, చింత, గొడ్డుకాకర, గుంటగలగర, తుంగముస్తెలు, ఉమ్మెత్త, అనువానిరసములతోగాని, లేక కషాయములతోగాని, ఒకదినముపండిన నియమనమనంబడు.

## ❋ సందీపనము. ❋

శ్లో॥ కాసీసంపంచలవణంతదూర్ధ్వంనింబుకంరసమ్। క్షిప్త్వాక్షిప్త్వాథదాతవ్యంతాదృక్సైంధవఖేటకమ్ । గర్తేకృత్వాధరాగర్భే దత్వాసైంధవసంయుతమ్ । ధూలిమష్టాంగుళిందత్వారాజికామరిచానిచ । ద్విశిగ్రుబీజమేకత్రటంకణేనసమన్వితమ్। ఆలోడ్యకాంజికేడోలాయంత్రేపాచ్యంటినైస్త్రిభిః । దీపనంజాయతేసమ్యక్సూతరాజస్యజారణే॥ ౧౨౧॥

తా॥ అన్నభేది - పంచలవణములు- వీటినిగ్రహించి దానిపైపలుమారు నిమ్మపండ్లరసముబోసి సైంధవలవణగడ్డనుపగలగొట్టి అందు సైంధవలవణముతోడ పాదరసమునుజేర్చి దానిపైపూర్వోక్తసైంధవలవణమును, నిమ్మపండ్లనంటించి దానిపై నెనిమిదంగుళముల ధూళినంటించి,మునగవిత్తులు, చేదుమునగవిత్తులు, వెలిగారము అనునీమూటినినూరి కుండకులేపనముజేసి అందుకలిబోసి దానిమధ్యమున డోలాయంత్రముతో మూడుదినములువండిన రసము జారణసంస్కారమునందుదీపనమగు.

[రసమునకష్టాదశ సంస్కారములు జెప్పంబడియుండినను "స్వేదోమర్దిత మూర్ఛనాస్థితిరతః పాతోపిభేదాస్త్విహ । బోధస్సంయమనంప్రదీపనమితిస్పష్టాష్టధాసంస్కృతిః ! అస్యాస్సర్వరసోపయోగికతయాత్వన్యానవిన్యస్యతే । గ్రంథేస్మిన్ ప్రకృతోపయోగ విరహాద్విస్తారభీత్యాథవా॥" అనుగ్రంథాంతరవచనప్రకారము స్వేదన, మర్దన, మూర్ఛన, ఉత్థాపన, పాతన, బోధన, సంయమన,ప్రదీపనములననెనిమిది సంస్కారములు సర్వోపయోగంబులగుటచే జెప్పంబడియె. తక్కినపదిసంస్కారములు ఔషధోపయోగంబులుగాకుండుటంజేసియు, గ్రంథవిస్తరభీతింజేసియు, జెప్పంబడవయ్యె.]

※ రసశోధన.

శ్లో॥ అథవాహింగులాత్సూతంగ్రాహయేత్తన్నిగద్యతే । జంబీరనింబునీరేణమర్దితోహింగులోదినం । ఊర్ధ్వపాతనయంత్రేణగ్రాహ్యస్స్యాన్నిర్మలోరసః । కంచుకైర్నాగవంగాద్యైర్నిర్ముక్తోరసకర్మణి। వినాకర్మాష్టకేనైవసూతోఽయంసర్వకర్మకృత్॥

తా॥ రసమునకు పైజెప్పబడిన సంస్కారములు లేకపోయినను ఇంగిలీకములో తీయబడినరసము శుద్ధముగనుండు. గాన దానినిగ్రహించువిధమును వివరించెద. నిమ్మపండ్లరసము, వేపపట్టరసము వీటితో నొకదినము యింగిలీకమునుమర్దించి,ఊర్ధ్వపాతనమనే యంత్రమునందునిచి వండిన నాగవంగాదులతోగూడియుండు రసము వాటిచే విడువబడి శుద్ధరసమునిలుచు. ఇట్టిరసము యెనిమిదిసంస్కారములు లేకపోయినను, సమస్త రసకర్మలయందుపయోగించు.

※ అన్యచ్చ. ※

శ్లో॥ నింబూరసైర్నింబపత్రరసైర్వాయామమాత్రకం। పిష్ట్వాదరదమూర్ధ్వంచపాతయేత్సూతయుక్తివిత్ । తతశ్శుద్ధరసంతస్మాన్నీత్వాకార్యేషుయోజయేత్॥ ౧౨౩॥

## చతుర్థ స్తరంగము.

తా॥ రసమును వేపపట్టరసముతోగాని వేపాకురసముతోగాని యామ మాత్రమునూరి ఊర్ధ్వపాతయంత్రమునందువండిన నదిశుద్ధమగు. దానిని సమస్త రసకర్మలయందుపయోగించవలయు.

### ❊ అన్యచ్చ. ❊

శ్లో॥కుమారికాచిత్రకరక్తసర్షపైఃకృతైః కషాయైర్బృహతీవిమిశ్రితైః। ఫలత్రికేణాపివిమర్దితోరసో దినత్రయంసర్వమలైర్విముచ్యతే॥ ౧౨౮॥

తా॥ రసమును కలబంద చిత్రమూలము ఎఱ్ఱావాలు ములకవేరు త్రిఫలములు వీటికషాయముతో మూడుదినములు మర్దించిన సమస్తమలములచే విడువంబడి శుద్ధమగు.

### ❊ ఉపరసశోధనములు. ❊

### ❊ గంధకశోధన. ❊

శ్లో॥ లోహపాత్రేవినిక్షిప్యఘృతమగ్నౌప్రతాపయేత్। తప్తేఘృతే తత్సమానంక్షిపేద్గంధకజంరజః। విద్రుతంగంధకందృష్ట్వాతనువస్త్రేవినిక్షిపేత్। యథావస్త్రాద్వినిస్సృత్యదుగ్ధమధ్యేఽఖిలంపతేత్। ఏవంసగంధకశ్శుద్ధస్సర్వకర్మోచితోభవేత్॥ ౧౨౯॥

తా॥ లోహపాత్రయందు నెయ్యిబోసి కాచి అందు నేతికిసమముగ గంధకచూర్ణమునైచి అది కరుగునటులకాచి సూక్ష్మవస్త్రమునందుపోసి పాలయందుపడునటుల వడియగట్టిన ఆగంధకము శుద్ధమగు. దీనిని సర్వకార్యములయందుపయోగింపందగు.

### ❊ హింగుళశోధన. ❊

శ్లో॥ మేషీక్షీరేణదరదమమ్లవర్గైశ్చభావితం। సప్తవారాన్ప్రలేపేన శుద్ధిమాయాతినిశ్చితం॥ ౧౩౦॥

తా॥ ఇంగిలీకమును మేకపాలతో నేడుమార్లును నిమ్మపండ్లుమొదలగు పుల్లనిద్రవ్యములతో నేడుమార్లును కల్వమునమర్దించి యెండించిన నది నిశ్చయముగ శుద్ధియగు.

### ❊ అభ్రకశోధన. ❊

శ్లో॥ కృష్ణాభ్రకంధమేద్వహ్నౌతతఃక్షీరేవినిఃక్షిపేత్। భిన్నపత్రంతుతత్కృత్వాతండులీయామ్లయోర్ద్రవైః। భావయేదష్టయామంతుదేవంశుద్ధ్యతిచాభ్రకమ్॥ ౧౩౧॥

తా॥ * కృష్ణాభ్రకమును కఱ్ఱలలో వేసి యది యెఱ్ఱగ నగువఱకు తోలు తిత్తితో నూది పిదప దానిని ఆవుపాలలో వేసి రేకులు రేకులుగ వాలిచి చిఱ్ఱికూర రసమును, నిమ్మపండ్లరసమును నేకముగ చేసి యందా యభ్రకపు రేకులను వైచి యొనిమిది యామంబులునిచిన అభ్రకము శుద్ధియగు.

## * హరితాళశోధన. *

శ్లో॥ తాళకంకణశఃకృత్వాతచ్చూర్ణంకాంజికేక్షిపేత్ । డోలాయం
త్రేణయామైకంతతఃకూష్మాండజైర్ద్రవైః । తిలతైలేపచేద్యా
మంయామంచత్రిఫలాజలైః । ఏవంతంత్రేచతుర్యామంపాచ్యం
శుధ్యతితాళకం॥ ౧౨౮॥

తా॥ తాళకమును రేకులుగ వాలిచి చూర్ణముజేసి జనుబిట్టలో మూటగట్టి డోలాయంత్రమున కాంజికముచే నొకయామంబును బూడిదెగుమ్మడురసముచే నొకయామంబును నువ్వులనూనెచే నొకయామంబును త్రిఫలకషాయముచే నొక యామంబును వండిన నది శుద్ధియగు.

## * మనశ్శిలశోధన. *

శ్లో॥ పచేత్త్ర్యహమజామూత్రైర్డోలాయంత్రేమనశ్శిలాం । భావయే
త్సప్తధాపి త్తైరజాయాశ్శుద్ధిమృచ్ఛతి॥ ౧౨౯॥

తా॥ మణిశిలను డోలాయంత్రమునసునిచి మేకపంచితముచే మూడుదినంబులువండి పిదప నామణిశిలను మేకపిత్తముతో నేడుమార్లు భావనజేసిన నది శుద్ధియగు.

## * అన్యచ్చ. *

శ్లో॥ అగస్తిపత్రతోయేనభావితంసప్తవారకం।శృంగబేరరసైర్వాపి
విశుధ్యతిమనశ్శిలా॥ ౧౩౦॥

తా॥ అగిసిఆకురసములోగాని లేక అల్లపురసములోగాని యేడుమార్లు భావనజేసిన మనుశిల శుద్ధమగు.

---

* శుద్ధిజేసిన కృష్ణాభ్రకమునుగ్రహించి దానికి నాలవభాగము వడ్లుకలిపి కంబళిలో మూటగట్టి యామూటను తట్టయందునిచి చేతితో జక్కగ బిసికిన నందలి అభ్రకము బైలువెడలు. ఇటుల వెడలినపిదప ఆతట్టయందలి అభ్రకపునీళ్లను నొక పాత్రలో బోసి యొకయామంబునిచి పైతేట నీటినివంచి అడుగుననుండెడి అభ్రకమును జేకొని యెండించిన నది ధాన్యాభ్రకమనంబడు.

## ✻ ఖర్పరశోధన. ✻

శ్లో॥ నరమూత్రేచగోమూత్రేసప్తాహంరసకంపచేత్ । డోలాయంత్రేణశుద్ధస్స్యాత్తతఃకార్యేషుయోజయేత్॥ ౧౩౧॥

తా॥ ఖర్పరను (కల్కఫరి) డోలాయంత్రంబుననునిచి యందు నరమూత్రముబోసి నేడుదినంబులును, ఆవుపంచితముబోసి యేడుదినంబులును, వండిన నది శుద్ధియగు. ఇటుల శుద్ధిజేసినతర్వాత దీనినౌషధములయందు జేర్చుకొనందగు.

## ✻ కంకుష్ఠాదిశోధన. ✻

శ్లో॥ కంకుష్ఠంగైరికంశంఖఃకాసీసంటంకణంతథా। నీలాంజనంశుక్తిభేదాఃక్షుల్లకాస్సవరాటకాః । జంబీరవారిణాస్విన్నాఃక్షాలితాఃకోష్ణవారిణా । శుద్ధిమాయాన్త్యమీయోజ్యాభిషగ్భిర్యోగసిద్ధయే॥ ౧౩౨॥

తా॥ ముదారశంగు గైరికము శంఖము కాసీసము వెలిగారము నీలాంజనము ముత్యపుచిప్ప మొదలగునవి చిన్నగవ్వలు వీటిని నిమ్మరసముయొక్క ఆవిరిలో నునిచి, పిదప ఉష్ణోదకముతో కడిగిన నవి శుద్ధియగు. గానవీటిని వైద్యక్రియలయం దుపయోగించందగు.

## ✻ సర్వోపరసశోధన. ✻

శ్లో॥ త్రిక్షారేలవణేదేయమమ్లవర్గేత్రిధాపచేత్ । తదాచోపరసాశ్శుద్ధాజాయన్తేదోషవర్జితాః॥ ౧౩౩॥

తా॥ త్రిక్షారములు లవణము ఆమ్లవర్గము వీటితోకూడ మూడుమార్లువండిన ఉపరసములు నిర్దోషములై శుద్ధమగు.

## ✻ రత్నశోధన ✻

## ✻ వజ్రశోధన. ✻

శ్లో॥ కులిత్థకోద్రవక్వాథైర్డోలాయంత్రేవిపాచయేత్ । వ్యాఘ్రీకందగతంవజ్రంత్రిదినంశుద్ధిమృచ్ఛతి॥ ౧౩౪॥

తా॥ వాకుడుగడ్డనునూరి యందువజ్రమునునిచి జమరిబట్టలో మూటగట్టి డోలాయంత్రముననునిచి అందు ఉలవకట్టుబోసి మూడుదినంబులును, ఆరిక ధాన్యకషాయముబోసి మూడుదినంబులునువండిన వజ్రము శుద్ధియగు.

## * సర్వరత్నశోధన. *

శ్లో॥ స్వేదయేద్దోలికాయంత్రేజయంత్యాస్వరసేనచ । మణిముక్తా
ప్రవాళానాంయామైకంశోధనంభవేత్ ॥ ౧౩౫॥

తా॥ సూర్యకాంతము మొదలగు సమస్తమణులు ముత్తియము పగడము వీటిని డోలాయంత్రమునసునిచి తక్కలీరసముచే నొకయామమువండిన నవి శుద్ధియగు.

## * విషశోధన. *

శ్లో॥ కృత్వాచణకసంఖ్యానంగోమూత్రైర్భావయేత్త్ర్యహం । సమటం
కణసంపిష్టంమృతమిత్యుచ్చ తేవిషం॥ ౧౩౬॥

తా॥ విషమును వెలిగారముతోనూరి సెనగగింజంతమాత్రలుచేసి గోమూత్రముచే డోలాయంత్రమునందు మూడుదినములువండిన విషము శుద్ధియగు.

## * ఉపవిషశోధన. *

శ్లో॥ పంచగవ్యేషుశుద్ధానిదేయాన్యుపవిషాణిచ॥ ౧౩౭॥

తా॥ ఉపవిషములను, పంచగవ్యములో భావనజేసిన శుద్ధియగు.

## * నేపాళశోధన. *

శ్లో॥ నిస్త్వచంచైవనేపాళంకుమారీరసజేనచ । గుడోదకేనగోక్షీ
రైర్గోఘృతేనపృథక్పృథక్ । పాచితంశుద్ధిమాప్నోతివైద్యశా
స్త్రవినిశ్చితం॥ ౧౩౮॥

తా॥ నేపాళముల పైపొట్టునొలిచి యండలి యగరులందీసి, కలబందరసము పానకము ఆవుపాలు ఆవునెయ్యి అనువానితో ప్రత్యేక ప్రత్యేకముగనుడికించిన నేపాళము శుద్ధియగు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
ధాతూపధాతు రసోపరస రత్నోపరత్న విషోప
విషాణాం శోధన వివేకకథనన్నామ
చతుర్థస్తరంగః.

శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః-

ఆంధ్ర తాత్పర్య సహిత

# అనుపానరత్నాకరము.

## పంచమస్తరంగము.

### ❋ స్వర్ణమారణము. ❋

శ్లో॥ స్వర్ణస్యద్విగుణంసూతమమ్లేనసహమర్దయేత్। తద్గోలకంసమం
గంధంనిదధ్యాదధరోత్తరం ॥ గోలకంచతతోరుద్ధ్వాశ్చరావే
దృఢసంపుటే । త్రింశద్వనోపలైర్దద్యాత్పుటాన్యేపంచతుర్దశ॥
నిరుత్థంజాయతేభస్మగంధోదేయఃపునఃపునః॥ ౧౩౯॥

తా॥ శుద్ధిజేసినబంగారును సన్నముగచూర్ణముగావించి దానికిరెండింతలు శుద్ధిజేసిన పాదరసమునుగలిపి నిమ్మపండ్లసరముచేమర్దించి ఉంటజేసి ఎండనెండించి దానికిసమముగ శుద్ధిజేసిన గంధకచూర్ణమును నొకమూకుడులో సగము బోసి దానిపై ఆబంగారు వుంటనువుంచి దానిపై మరల గంధకపుపొడిబోసి మఱియొక మూకుడుమూసి చీలమన్ను లేపముజేసి పిదప నొకపల్లముత్రవ్వి అందు(౧౫) అడవిపిడకలనుపేల్చి పుటంబిడి స్వాంగశీతలమున గ్రహింపవలయు. ఇటుల గంధకయుక్తముగ (౧౪) పుటములువేసిన బంగారు నిర్జీవితముగ భస్మమగు.

### ❋ రౌప్యమారణము. ❋

శ్లో॥ భాగైకంతాలకంమర్ద్యంయామమమ్లేనకేనచిత్ । తేనభాగత్ర
యంతారపత్రాణిపరిలేపయేత్॥ ధృత్వామూషాపుటేరుద్ధ్వా
పుటేత్రింశద్వనోపలైః । సముద్ధృత్యపునస్తాలందత్వారుద్ధ్వా
పుటేపచేత్। ఏవంచతుర్దశపుటైస్తారంభస్మప్రజాయతే॥౧౪౦॥

టీ॥ శుద్ధిజేసిన తాళకమును (౧) భాగము గ్రహించి నిమ్మపండ్లరసముచే నొకయామము మర్దించి తాళకమునకు మూడుభాగము లధికముగ శుద్ధిజేసిన వెండిరేకులను గ్రహించి దానికిపై మర్దించియునిచిన తాళకమును లేపముజేసి మూకుళ్లయందునిచి మొండ నెండించి చీలమన్ను లేపముజేసి పల్లమాత్రవ్వి యందు (౧౫) అడవి యేరుపిడకలు పేల్చి దానిపై చీలయిచ్చియుంచిన సంపుటమును వునిచి దానిపై మరల (౧౫) అడవియేరుపిడకలు పేల్చి పుటంబిడవలయు. ఇటుల (౧౪) పుటంబులిడిన రజితము నిర్జీవితముగ భస్మంబగు.

## ❊ తామ్రమారణము. ❊

శ్లో॥ సూక్ష్మాణితామ్రపత్రాణికృత్వాసంస్వేదయేద్బుధః। వాసర
త్రయమమ్లేనతతఃఖల్వే వినిక్షిపేత్॥ పాదాంశంసూతకందత్వా
యామమమ్లేనమర్దయేత్ । తతఉద్ధృత్యపత్రాణిలేపయేద్విగుణే
నచ ॥ గంధకేనామ్లఘృష్టేనతచ్చకుర్యాచ్చగోలకం । తతః
పిష్ట్వాచమీనాక్షీంచాంగేరీంవాపునర్నవాం ॥ తతస్తేనబ
హిర్గోళంలేపయేదంగులోన్మితం । ధృత్వాతద్గోలకంభాండే
శరావేణచరోధయేత్ ॥ వాలుకాభిఃప్రపూర్యాథవిభూతిలవ
ణాంబుభిః । దత్వాభాండముఖేముద్రాంతతఃచ్చుల్యాంవిపాచ
యేత్॥ క్రమవృద్ధాగ్నినాసమ్యగ్యావద్యామచతుష్టయం॥ స్వాం
గశీతంసముద్ధృత్యమర్దయేచ్చూరణద్రవైః ॥ దినైకంగోలకంకు
ర్యాదర్ధగంధేనలేపయేత్ । సఘృతేనతతోమూషాపుటేగజ
పుటేపచేత్ । స్వాంగశీతంసముద్ధృత్యమృతంతామ్రంశుభంభ
వేత్। వాంతిభ్రాంతిక్లమంమూర్ఛాంనకరోతికదాచన॥ ౧౪౧॥

టీ॥ శుద్ధిజేసిన తామ్రమును పలచనగ రేకులుజేసి సన్నగ కత్తిరించి నిమ్మపండ్లరసంబున వైచి మందాగ్నిచే మూడుదినములుయుడికించి యందుండి యారేకులను బైటికిదీసి వానికి నాలవభాగము పాదరసము వైచి ఖల్వమున నిమ్మపండ్లరసముచే నొకయామము రాగిరేకులనుమర్దించి పిదప నారేకులను బైటికిదీసి దీనికి రెండింతల గంధకమును నిమ్మపండ్లరసముచేనూరి యారాగిరేకులకు లేపముజేసి యుంటగ జేయవలయు. పిదప పొన్నగంటిఆకు పులిచింతాకు తెల్లగలిజేరు వీటిలో దేనినైన నునూరి నాయుంటకుపైన నొకయంగుళప్రమాణముపూసి మొండనెండించి కుండ

లోనునిచి ఉంటకుపైన మూకుడునుబోర్లించి దానిపై కుండమూతివరకు నిసుకబోసి దానిపై మూకుడును బోర్లించి బూడిదె ఉప్పు వీటిని నుదకముతోనూరి జక్కగ చీల యిచ్చి క్రమముగ లఘు మధ్య గాఢాగ్నులచే నాలుగుయామములువండి స్వాంగ శీతలమున నాఉంటనుగ్రహించి అడవికందరసముతోడను దుంపరసముతోడను నొక దినముమర్దించి ముద్దజేసి దీనికిసగము గంధకమునుగ్రహించి దానిని నేతితోమర్దించి నాయుంటకుపైన లేపము జేసి మంటిమూకుళ్లలోనునిచి జక్కగ చీలమన్నుజేసి ఆ డవిఏరుపిడకలలో గజపుటంబిడి స్వాంగశీతలమున గ్రహింపవలయు. ఇటులఁ జేయఁబడిన తామ్రభస్మము వాంతులు భేదులు ఆయాసము మూర్ఛ వీటిరబాతంబై చాలాగుణమును గలుగంజేయు.

※ వంగమారణము. ※

శ్లో॥ మృత్పాత్రేద్రావితేవంగేచించాశ్వత్థత్వచోరజః । క్షిప్త్వావం
గంచతుర్థాంశమయోదర్వ్యాప్రచాలయేత్ ॥ తతోద్వియామ
మాత్రేణవంగభస్మ ప్రజాయతే । అథభస్మసమంతాలంక్షి
ప్త్వాఽమ్లేనవిమర్దయేత్ ॥ తతోగజపుటేపక్త్వాపునరమ్లేనమర్ద
యేత్ । తాలేనదశమాంశేనయామమేకంతతఃపుటేత్ । ఏవం
దశపుటైఃపక్వోవంగస్మ్రియతేధృవం॥ ౧౪౨॥

తా॥ శుద్ధిజేసిన తెల్లసీసమును మృత్పాత్రంబునవైచి కరిగించి దానికి చతుర్థాంశముగ చింతపట్టచూర్ణము రావిపట్టచూర్ణము వీటినిగ్రహించి,యందుకొంచము కొంచముగచల్లుచు యినపగరిటెచే రెండుయామములుమర్దింపుచుండిన తెల్లసీసము భస్మంబగు. ఈభస్మమునకు సమముగ శుద్ధిజేసిన తాళకమును ఆతగరభస్మమును జేర్చి నిమ్మపండ్లరసముతోమర్దించి,ప్రమిదెలయందునిచి యెండనెండించి చీలయిచ్చి అడవియేరుపిడకలతో గజపుటంబిడి,స్వాంగశీతలమునగ్రహించి, యాభస్మమునకు పదియవభాగము శుద్ధిజేసిన తాళకమునుజేర్చి, మరల నిమ్మపండ్లరసముతో నొక యామము ఖల్వమునమర్దించి ప్రమిదెల యందునిచి యెండనెండించి చీలయిచ్చి గజపుటంబిడవలయు. ఇటుల (౧౦) గజపుటములిడిన తెల్లసీసము భస్మంబగు. (వంగ మనగా తెల్లసీసము.)

### ❋ జసదమారణము. ❋

శ్లో॥ జసదస్యచతుర్థాంశంపారదంగంధకంప్రియే । మర్దయేత్ ఖల్వ
కేసమ్యక్కన్యానిమ్బురసైఃపృథక్ ॥ లేపయేత్తేనపత్రాణిగజా
హ్వే పాచయేత్పుటే। ఏవమేకపుటేనైవభస్మ సాజ్జసదంభవేత్॥

తా॥ ఓ పియురాలా ! శుద్ధిజేసిన సత్తును సన్ననిరేకులుగావించి దానికి నాలవభాగము శుద్ధపారదము శుద్ధగంధకము వీటిని ఖల్వమునందునిచి కలబందరసముచేబాగుగమర్దనజేసి దానిని మరల నిమ్మపండ్లరసముచేమర్దించి పైరేకులకు లేపముజేసి ఎండనెండించి శరావసంపుటమునందునిచి చీలయిచ్చి వొక్కగజపుటమిడిన సత్తుభస్మంబగు.

### ❋ నాగమారణము. ❋

శ్లో॥ తాంబూలరససంపిష్టశిలాలేపాత్పునఃపునః । ద్వాత్రింశద్భిః
పుటైర్నాగోనిరుద్ధంభస్మజాయతే॥ ౧౪౪॥

తా॥ మణిశిలను తమలపాకురసముతోనూరి దానిని నాగమునకు లేపముజేసి మూకిటియందునిచి చీలయిచ్చి (3౨) పుటములువేసిన నాగము శుద్ధభస్మమగు.

### ❋ లోహమారణము. ❋

శ్లో॥ క్షిపేద్ద్వాదశంశేనదరదంతీక్ష్ణచూర్ణతః । మర్దయేత్కన్యకా
ద్రావైర్యామయుగ్మంతతఃపుటేత్। ఏవంసప్తపుటైర్మృత్యుం
లోహచూర్ణమవాప్నుయాత్ ॥ రసైఃకఠారఛిన్నాయాఃపా
తాళగరుడీరసైః। స్తన్యేనచారకదుగ్ధేనతీక్ష్ణస్యైవమృతిర్భవేత్॥

తా॥ శుద్ధిజేసిన లోహచూర్ణమునకు పన్నెండవభాగము శుద్ధిజేసిన ఇంగిలీకమునుజేర్చి కలబందరసముతో రెండుయామములుమర్దించి ప్రమదెలయందునిచి యెండనెండించి చీలయిచ్చి అడవి యేరుపిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల (౭) గజపుటంబిడిన లోహము నిర్జీవితముగ భస్మంబగు. లేక లోహచూర్ణమును అడవితులసిరసముచే (౩) గజపుటంబులును, దూసరితీగెరసముచే (౭) గజపుటంబులును, చనుబాలచే (౭) గజపుటంబులును, జిల్లేడుపాలచే (౭) గజపుటంబులును వేసిన నిర్జీవితముగ భస్మంబగు.

### * స్వర్ణమాక్షికమారణము. *

శ్లో॥ కులిత్థస్యకషాయేణఘృష్ట్వాతైలేనవాపుటేత్ । తక్రేణవాఽథ
గోమూత్రైర్మ్రియతేస్వర్ణమాక్షికం॥ ౧౪౭॥

తా॥ స్వర్ణమాక్షికమును ఉలవకషాయముతోనైనను లేక నువ్వులనూనెతోనైనను లేక మజ్జిగతోనైనను లేక గోమూత్రముతోనైనను నూరి ఎండనెండించి మూకుళ్లయందునిచి చీలయిచ్చి యెరుపిడకలతో గజపుటంబిడిన స్వర్ణమాక్షికము బాగుగ భస్మంబగు.

### * రౌప్యమాక్షికమారణము. *

వాక్యం॥స్వర్ణమాక్షికమారణప్రకారేణరౌప్యమాక్షికస్యాపిమారణం॥

తా॥ స్వర్ణమాక్షిక మారణప్రకారముగనే రౌప్యమాక్షికమునకును గూడ మారణమును జేయందగు.

### * తుత్థమారణము. *

శ్లో॥ లకుచద్రావగంధాశ్మటంకణేనసమన్వితం । వజ్రమూషాగతం
ద్విత్రికుక్కుటైర్మృతిమాప్నుయాత్॥ ౧౪౮॥

తా॥ తుత్థమును గంధకము మణిశిల వెలిగారము వీటితో చేర్చి నిమ్మపండ్ల రసముతో నూరి వజ్రమూసయందునిచి రెండు లేక మూడు కుక్కుట పుటములిడిన తుత్థము భస్మమగు.

### * కాంస్యము - ఇత్తడి - వీటిమారణము. *

వాక్యం॥కాంస్యరీత్యోర్మారణమనుపానంచాపితామ్రవద్జ్ఞేయం॥ ౧౪౯॥

తా॥ కంచు ఇత్తడి వీటికి తామ్రమువలెనే మారణము అనుపానము వీటిని కల్పించవలయు.

### * సిందూరమారణనిషేధను. *

శ్లో॥ సిందూరస్యప్రయోగోహినదృష్టఃకుత్రచిత్పృథక్ । తస్మాద్వ్యక్తస్థలేయోజ్యముపదేశోగురోరితి॥ ౧౫౦॥

తా॥ సిందూరమారణ విధి వైద్యశాస్త్రమునందెక్కడయును వేఱుగ జెప్పఁబడలేదు గాన గురూపదేశముచేతనే దానిని జేసికొనందగు.

### * శిలాజతుమారణవిధి. *

శ్లో॥ శిలాయాంగంధతాలాభ్యాంమాతులుంగరసేనచ । పుటితం
హిశిలాధాతుర్మ్రియతేష్టోపలేనచ॥ ౧౫౧॥

తా॥ గంధకము తాళకము వీటిని మాదీఫలరసముతో నూరి శిలాజతుకు కవచమిచ్చి చీలజేసి (౮) పిడకలలో పుటమిడిన శిలాజతు భస్మమగు.

### * మండూరవిధి. *

శ్లో॥ అక్షాంగారైర్ధమేత్కిట్టంలోహజంతద్గవాంజలైః । సేచయే
త్తప్తతప్తంతత్సప్తవారంపునఃపునః ॥ చూర్ణయిత్వాతతఃక్వా
థైర్ద్విగుణైస్త్రిఫలాభవైః । ఆలోడ్యభర్జయేద్వహ్నౌమండూరం
జాయతేవరం॥ ౧౫౨॥

తా॥ తాండ్రబొగ్గులలో యినపచిట్టెమునునిచి నెర్రగనగువరకు తిత్తితో నూది గోమూత్రముతో చల్లార్చవలయు. ఇటుల ఇనపచిట్టెమును ఏడుమార్లుకాచి చల్లార్చి చూర్ణముచేసి దానికి రెండింతల త్రిఫలములనువైచి కషాయముకాచి యందాచిట్టెచూర్ణమును వైచి గట్టియగునటుల మరలకాచి పిదప నాకుండకు చీలజేసి అడవిపిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున నందలి మండూరమును గ్రహింపవలయు. ఇటుల జేయబడిన మండూరము శుద్ధమండూరమగుటచే దానిని రోగములయం దుపయోగింపందగు.

### * రసమారణము. *

శ్లో॥ కాకోదుంబరికాదుగ్ధైరసంకించిద్విమర్దయేత్ । తద్దుగ్ధఘృష్ట
హింగోశ్చమూషాయుగ్మంప్రకల్పయేత్ ॥ క్షిప్త్వాతత్సంపు
టేతస్మిన్తత్రముద్రాంప్రదాపయేత్ । ధృత్వాతంగోలకం
ప్రాజ్ఞోమృన్మూషాసంపుటేధికే ॥ పచేల్లఘుపుటేనైవసూత
కోయాతిభస్మతాం॥ ౧౫౩॥

తా॥ బ్రహ్మమేడిపాలతో పాదరసమును ఖల్వమునజక్కగమర్దించి పిదప యింగువను బ్రహ్మమేడిపాలతోనూరి దానిచే రెండుమూసలుజేసి యందొకమూసలో బ్రహ్మమేడిపాలలో మర్దించిన రసమునునిచి దానిపై మఱియొకమూసమూసి

సందులేకుండునటుల జక్కగ చేర్చి బంధించి దీనిని తగుమైన మంటిమూసలోనునిచి దానిపై మఱియొక మూసనుమూసి జక్కగ చీలయిచ్చి యేరుపిడకలతో లఘుపుటం బిడిన పాదరసము బాగుగ భస్మంబగు.

* అన్యచ్చ. *

శ్లో॥ నాగవల్లీరసైర్ఘృష్టః కర్కోటీకందగర్భితః । మృన్మూషాసం
పుటే పక్త్వాసూతోయాత్యేవభస్మతాం॥ ౧౫౪॥

తా॥ పాదరసమును తమలపాకురసముతో నూరి కర్కోటీ (అనగా ఏరా వడ) వేళ్లనునూరి వుంటజేసి దానిమధ్యనునిచి ఆవుంటను మట్టిమూసలోపెట్టి చీల యిచ్చి గజపుటంబిడిన రసము భస్మమగు.

* రససిందూరవిధి. *

శ్లో॥ సూతంపంచపలంస్వదోషరహితంతత్తుల్యభాగోబలి । ర్ద్వాభ్యాం
కౌనవసాగరస్యతువరీకర్షశ్చసమ్మర్దితః । కుప్యాంకాచభువి
స్థితశ్చసికతాయంత్రేత్రిభిర్వాసరైః । పక్వోవహ్నిభిరుద్భవత్య
రుణభః సిందూరనామారసః॥ ౧౫౫॥

తా॥ శుద్ధిజేసినరసము (౫) పలములు, గంధకము (౫) పలములు, వెలిగారము పటికారము యివిప్రత్యేకముగ (౨) పలములు, నవాసాగరము (౨) పలములు కందులు కర్షప్రమాణము వీటిని ఖల్వమానందుమర్దించి కాచకుప్పియందునిచి దానిని వాలుకాయంత్రమునందు మూడుదినములువండిన రసము సిందూరమగు.

* రసకర్పూరవిధి. *

శ్లో॥ సంశుద్ధపాదరసంపూర్వంశోధయేచ్ఛుద్ధమానసే। పశ్చాచ్ఛుద్ధేన
ప్రత్యేకంతుల్యంకృత్వారసేనహి ॥ గైరికంఖటికామిష్టింసౌ
రాష్ట్రీంసైంధవంతథా । టంకణంక్షారలవణంమృత్స్నాచచూ
ర్ణంసుసూక్ష్మకం ॥ ఏతచ్చూర్ణాన్వితంసూతంయామైకంమర్ద
యేత్తతః । ఊర్ధ్వపాతనయంత్రేవహ్నిందద్యాచ్ఛనైశ్శనైః॥
అహోరాత్రైశ్చతుర్భిశ్చతతోవైస్వాంగశీతలం। ఉద్ఘాట్యోర్ధ్వ
విలగ్నంవైరసంకర్పూరసంజ్ఞకం ॥ గృహీత్వాసర్వరోగఘ్నం
బలబుద్ధివివర్ధనం। వృంతాకశతకైశ్శుద్ధంభక్షితంగుణవత్తరం॥

తా॥ నిర్మలమగు మనస్సుగల ఓ ప్రియురాలా ! శుద్ధిజేసిన పాదరసము, ఇందుకు సమముజేగురాయి, ఖటిక, ఇటికెరాయి, సౌరాష్ట్రి, సైంధవలవణము, వెలిగారము, క్షారలవణము, శ్రేష్ఠమగు మట్టి, వీటిచూర్ణములను పైరసముతో కలిపి వాకర్ఘామువర్ధించి ఊర్ధ్వపాతనయంత్రమునందునిచి నాలుగు అహోరాత్రములు మందాగ్నిచే పక్వముజేసి స్వాంగశీతలముగదించి పైభాగమునంటంటి యుండురసమును యెత్తుకొనిన నది రసకర్పూరమనంబడు. ఇది సమస్తరోగముల నశింపంజేసి బలము బుద్ధి వీటివృద్ధిని గలుగంజేయు. మఱియు నీరసకర్పూరమును (౧౦౦) వంకాయలతో శుద్ధిచేసి భక్షించిన అనేకగుణములను గలుగంజేయు. రసకర్పూరమును వంకాయతో శుద్ధిజేయుటెట్లనిన:—వంకాయమధ్యలో రసకర్పూరమును వునిచి దానిని నిప్పుమీద బెట్టి ఆవంకాయ పాకమైనతోడనే యెత్తి అందులోనుండు రసకర్పూరమును యెత్తుకొని మఱియొక వంకాయలోపలనునిచి పాకముజేయవలయు. ఇటుల నూరువంకాయలతో పక్వముజేసిన ఆరసకర్పూరము మిగుల శ్రేష్ఠమైనదిగనుండు.

## ❋ హింగుళమారణము. ❋

శ్లో॥ వల్లమాత్రంతాలపిష్టంశరావేస్థాపయేత్తతః । తస్మిన్కర్షరసమందేయంసకలందరదస్యచ ॥ పూరయేదార్ద్రకరసైర్ద్విగుణం
తత్రబుద్ధిమాన్ ।పుష్పాణిశాణమాత్రాణిపరితఃస్థాపయేత్తతః।
శరావసంపుటేదత్వాచుల్ల్యాంమధ్యాగ్నినాపచేత్ । ఘటికా
త్రయపర్యంతంతతఉత్తార్యపేషయేత్ । తాంబూలేగుంజమా
త్రంతుదేయంపుష్టికరంపరం । పాండౌక్షయేచశూలేచసర్వ
రోగేషుయోజయేత్॥ ౧౫౭॥

తా॥ వల్లప్రమాణము శుద్ధిజేసిన హరితాళచూర్ణమును మూకిటియందునిచి దానిలో కర్షప్రమాణము ఇంగిలీకమునునిచి, ఇంగిలీకమునుగునటుల అల్లపురసముచే పూరించి, శాణప్రమాణము జిల్లేడుపూలను దానిపైపరచి మరియొకమూకిటిచే మూతపెట్టి చీలగుచ్చి పొయిమీదపెట్టి మూడుఘడియలు మధ్యాగ్నిచే పాకముజేసిన హింగుళము భస్మమగు. పిదప దించి స్వాంగశీతలమునదీసి నూరి దానిని తమలపాకులో గురిగింజప్రమాణము సేవించిన పాండువు - క్షయ - శూల- సమస్తరోగములు యిటి నివర్తించుటయేగాక శరీరపుష్టి సగాగలుగు.

## ❋ అభ్రకమారణము. ❋

శ్లో॥ కృత్వాధాన్యాభ్రకంతత్తుశోషయిత్వాథమర్దయేత్ । అర్క
క్షీరైర్దినంఖల్వేచక్రాకారంచకారయేత్॥ వేష్టయేదర్కపత్రై
శ్చసమ్యగ్గజపుటేపచేత్ । పునర్మర్ద్యంపునఃపాచ్యంసప్తవా
రంప్రయత్నతః । తతోవటజటాక్వాథై స్తద్వద్దేయంపుటత్ర
యం । మ్రియతేనాత్రసందేహస్సర్వరోగేషుయోజయేత్ ।
మృతంత్వభ్రంహరేన్మృత్యుంజరాపలితనాశనం ॥ అనుపానై
శ్చసంయుక్తంతత్తద్రోగహరంపరం॥ ౧౫౮॥

తా॥ శుద్ధిజేసిన అభ్రకమును ఎండనెండిచి జిల్లేడుపాలతో నొకదినము మర్దించి బిళ్లచేసి యెండించి దానిపై జిల్లేడాకులుచుట్టి ప్రమిదెలయందునిచి చీల యిచ్చి అడవియేరుపిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల జిల్లేడుపాలతో (౭) గజపుటంబులిడవలయు. పిదప దీనిని మఱ్ఱియూడలకషాయముతో నొకదినముమ ర్దించి మూడు గజపుటంబులిడవలయు. ఇటుల (పదిగజపుటంబులిడిన నిస్సంశయ ముగ అభ్రకము నిర్జీవితముగ భస్మంబగు.) ఈభస్మమును యుక్తానుపానములచే సేవించిన నది సర్వరోగములను నశింపంజేసి మృత్యువు, ముదిమి, వీటినితొలగించి తెల్లవెండ్రుకలను నల్లనగు నటులంజేయు.

## ❋ గ్రంథాంతరే. ❋

శ్లో॥ వజ్రీక్షీరైరర్కదుగ్ధైర్ధేనుమూత్రైర్బలాజలైః। బ్రాహ్మీరుదంతీ
స్వరసైర్వాసాగ్నిశాల్మలీద్రవైః ॥ కూశ్మాండస్వరసైరేవందా
డిమీసలిలైస్తథా । వరాక్వాథేనగోజిహ్వాసలిలైరమృతాద్ర
వైః ॥ జాతీగోక్షురమేఘనాంకషాయైర్బర్బరీద్రవైః। శంఖ
పుష్పీరసైర్ద్రాక్షారసైర్ధాత్రీలకజైరసైః ॥ రాక్షసీతులసీముండీ
విశాలాసలిలైరపి। విదారీలతికాభృంగీమదాక్వాథైఃపృథక్పృ
థక్ ॥ సేతికాతపనక్వాథైరుగ్రగంధాశృతైరపి । సప్తకృత్వో
విశాలాక్షిపాచయేదభ్రకంతతః ॥ వటారోహకషాయేణకుకు
ద్రుమస్వరసైస్తథా। కపిత్థస్యామ్లికాయాశ్చఫలోద్భవరసేనచ॥
పృథగ్వింశపుటైరేవంపాచయేద్గగనంతతః । నింబూకస్వరసైః

పంచదశకృత్వోవిపాచయేత్ ॥ తత్సంఖ్యాకైఃపుటైరేవంగుడ
దుగ్ధవిమిశ్రితమ్। గవాందధియుతంతద్వద్ఘృతఖండవిమిశ్రితమ్॥
పాచయేదభ్రకంశుద్ధంరమ్యంరక్తతరంభవేత్ । చంద్రికార
హితంశుద్ధమశుద్ధంస్యాత్తదన్వితమ్ ॥ పుటాన్యేవంసహస్రాణి
భిషగ్బుధ్యాప్రదాపయేత్। అథవాకన్యకాద్రావైఃపుటేద్వార
సహస్రకమ్॥ ౧౫౯॥

తా॥ జెముడుపాలు - జిల్లేడుపాలు- గోమూత్రము - ముత్తవపులగపుకషా
యము - మండూకబ్రహ్మిరసము - రుదంతిరసము - అడ్డసరరసము - చిత్రమూల
రసము - గూరుగరసము - గుమ్ముడురసము - దానిమ్మరసము - త్రిఫలాకషాయ
ము- బరివెంకరసము - తిప్పతీగెరసము . జాజికషాయము - పల్లేరుకషాయము-
తుంగముస్తలకషాయము - భార్గిరసము . పద్మపుతీగెరసము - ద్రాక్షరసము- ము
ల్లంగిరసము - బలురక్కసిరసము - తులసిరసము - బోడతరరసము - పాపరరస
ము - నేలగుమ్ముడుగడ్డ కషాయము - గుంటగలగరరసము - మదాకషాయము-
జీడిగింజలకషాయము - వెల్లుల్లికషాయము- వీటిలో ఒక్కొకమూలికారసమునందు
ప్రత్యేకము ఏడేసిమార్లునూరి ఏడేసిమార్లుపుటము వేయవలయును. పిదప మఱ్ఱిఊ
డలకషాయములోనూరి (౨౦) పర్యాయములు పుటముపేయవలయు. ఈప్రకారము
తెల్లలొద్దుగురసము - వెలగపండురసము - చింతపండురసము - వీనిలో ప్రత్యేక
ప్రత్యేకము (౨౦) మార్లు పుటంబులిడవలయును. పిదప నిమ్మపండ్లరసములోనూరి
(౧౫) పుటములువేయవలయు. ఈప్రకారముగానే బెల్లము - పాలు వీనిలోను
ఆవుపెరుగులోను, నెయ్యి - ఖండశర్కరవీనిలోను (౧౫) పుటంబులిడవలయును
ఇటుల(౧౦౦౦) పుటములువేశిన అభ్రకము చంద్రికలేనిదిగశుద్ధముగ మిగులరక్త
వర్ణముతోగూడినదిగనుండు భస్మంబగును. చంద్రికతో (అనగా తళుకులతో) గూ
డియుండిన నదిశుద్ధముకాదు. నీయభ్రికమునుకలబంద రసములోనూరి(౧౦౦౦)
పుటంబులిడిన శుద్ధభస్మంబగును.

❋ అన్యచ్చ. ❋

శ్లో॥ పీతామలకసౌభాగ్యపిష్టంచక్రికృతాభ్రకం । పుటితంషష్టివా
రాణిసిందూరాభంప్రజాయతే। క్షయాద్యఖిలరోగఘ్నంభవే
ద్రోగానుత్తమే॥ ౧౬౦॥

తా॥ పచ్చయిరుగుడురసము ఉసిరికరసము వెలిగారము వీటితో అభ్రిక మునునూరి గుండ్రముగ బిళ్లజేసి (౬౦) పుటములువేసిన అభ్రికము సిందూరమగు దీనిని సేవించిన క్షయ మొదలగు సకలరోగములు నివర్తించు.

### ❊ హరితాళమారణము. ❊

శ్లో॥ పలమేకంశుద్ధతాళంకౌమారీరసమర్దితం । శరావసంపుటేక్షి
ప్త్వాయామాన్ద్వాదశకంపచేత్ । స్వాంగశీతంసమాదాయ
తాలకంచమృతంభవేత్ । గలతుష్టంహరేచ్చైవతాలకంచన
సంశయః॥ ౧౬౧॥

తా॥ ఒకపలము శుద్ధిజేసిన హరితాళమును కలబందరసముతోనూరి దానిని శరావమునందునిచి (౧౨) యామములువండిన హరితాళము భస్మమగు. పిదప దానిని స్వాంగశీతలముగదించి సేవించిన గళత్కుష్ఠరోగము నివర్తించు. (గళత్కుష్ఠరోగమనగా : రసికస్రవించుకుష్ఠరోగము.)

### ❊ వజ్రమారణము. ❊

శ్లో॥ తప్తంతప్తంతుతద్వజ్రంఖరమూత్రేనిషేచయేత్ । పునఃస్తా
ప్యంపునస్స్వేచ్ఛ్యమేవంకుర్యాత్త్రిసప్తధా । మత్కుణైస్తాలకం
పిష్ట్వాయావద్భవతిగోలకం । తద్గోలేనిహితంవజ్రంతద్గోళం
వహ్నినాధమేత్ । సేచయేదశ్వమూత్రేణతద్గోలేచక్షిపేత్పు
నః । రుధ్వాధ్మాతంపునస్స్వేచ్ఛ్యమేవంకుర్యాచ్చసప్తధా । ఏవం
చక్రమియతేవజ్రంచూర్ణంసర్వత్రయోజయేత్॥ ౧౬౨॥

తా॥ వజ్రమును అగ్నియందుకాచి గాడిదెమూత్రముతో (౨౧) మార్లు చల్లార్చవలయు. ఇటుల చల్లార్చినపిదప నల్లులు, తాళకము వీటిని ఉంటగనగువరకు మర్దించి దానిమధ్యంబున శుద్ధిజేసిన పై వజ్రమునునిచి మూసలోపెట్టి ఆమూసను కొలిమియందునిచి యందలి వుంటు చక్కగకాలినపిదప నందు గుఱ్ఱపుమూత్రమును కొంచముగచల్లి నావజ్రమును వెలికిదీసి మరల పైజెప్పినప్రకారమె నల్లులు, తాళకము వీటినినూరి యుంటజేసి యందు వజ్రమునునిచి పైజెప్పినరీతిగనే కొలిమినినూది కొంచముగ గుఱ్ఱపుమూత్రమునుచల్లి వెలికిదీయవలయు. ఇటుల నేడుమార్లుజేసిన వజ్రము నిర్జీవమగు పిదప దీనిని ఖల్వమున చూర్ణముజేసి సర్వరోగంబుల యందును బ్రయోగించవలయు.

### ✻ ప్రవాళమారణము. ✻

శ్లో॥ శోధయేద్వజ్రవచ్చైనంమారయేచ్చాపివజ్రవత్। అథవాత్వరకా
జేక్షీరేమారయేతే కుకుటేపుటే॥ ౧౬౩॥

తా॥ వజ్రమునకు విధించియుండు శుద్ధిప్రకారము పగడమును శోధన జేసి, వజ్రమారణమునకు చెప్పియున్నరీతిగ పగడమును పుటంబిడవలయు. లేక శుద్ధిజేయబడిన పగడమును జిల్లేడుపాలతో కుక్కుటపుటమిడిన నది భస్మంబగు.

### ✻ సర్వరత్నమారణము. ✻

శ్లో॥ కుమార్యాస్తండులీయేన స్తన్యేనచనిషేచయేత్ । ప్రత్యేకం
సప్తవేళాంచత ప్తతప్తానికృచ్ఛ్రశః । మౌక్తికానిప్రవాళాని
తథారత్నాన్యశేషతః । క్షణాద్వివిధవర్ణానిమ్రియంతేనాత్ర
సంశయః।ఉక్తమౌక్తికవన్ముక్తాప్రవాళానిచమారయేత్ ।వజ్ర
వత్సర్వరత్నానిశోధయేన్మారయేత్తథా॥ ౧౬౪॥

తా॥ సూర్యకాంతమణి, ముత్తియము, పగడము, యివి మొదలగు రత్నములను అగ్నియందుకాచి కలబందరసము, చిర్రికూరరసము, చనుబాలు, వీటిలో ప్రతిదానిచేతను ఏడేడుమార్లు చల్లార్చిన నవి నిస్సందేహముగ భస్మంబగు. లేక స్వర్ణమౌక్తికమును భస్మము జేసినటులనే ముత్తియమును పగడమును భస్మముజేయందగు. లేక వజ్రమును శోధన మారణంబులు జేసినటులనే,యితరరత్నములను సగా శోధనమారణంబులు జేయవలయు.

ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
ధాతూపధాతురసోప రస,రత్నోపరత్న,విషోపవిషా
ణాం మారణ వివేకకథనన్నామ
పంచమ స్తరంగః.



శ్రీ ర స్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

ఆంధ్ర తాత్పర్య సహిత

# అనుపానరత్నాకరము.

## షష్ఠస్తరంగము.

### ※ పక్వసువర్ణభస్మగుణము. ※

శ్లో॥ స్వర్ణంశీతంపవిత్రంక్షయవమికసనశ్వాసమేహాస్రపిత్త । ఘ్నైశ్యోత్వేడక్షతాస్రప్రదరగదహరం స్వాదుతిక్తంకషాయం । వృష్యంమేధాగ్నికాంతిప్రద మథమధురంకార్శ్యహంచత్రిదోషోన్ । మాదాపస్మారశూలజ్వరజిదపివపుర్బృంహణంనేత్రపథ్యం॥ ౧౬౫॥

తా॥ స్వర్ణభస్మము చలువగను, పరిశుద్ధముగను, రుచికరముగను, చేదుగను, వగరుగను, వీర్యవృద్ధికరముగను, సూక్ష్మబుద్ధికరముగను, దీపనకారిగను, కాంతికరముగను, తీపుగనునుండు. మఱియుక్షయ - వాంతి - కాస - శ్వాస - మేహము - రక్తపిత్తము - బలహీనత - విషము - గాయము - రక్తదోషము - ప్రదరము - కృశత్వము - త్రిదోషములు - ఉన్మాదము - అపస్మారము - శూల - జ్వరము వీటిని నివర్తింపంజేయుటయేగాక శరీరపుష్టి, నేత్రములకుహితము వీటినిసగా గలుగంజేయు.

శ్లో॥ మృతంహాటకందివ్యకాంతింతనోతిక్షతశ్వాసకాసక్షయంపిత్తవాతౌ । ప్రమేహాగ్రహణ్యాతిసారంచకుష్ఠంజ్వరహంతిచాఖండకందర్పదంచ॥ ౧౬౬॥

తా॥ స్వర్ణభస్మము, గాయము, కాస, శ్వాస, క్షయరోగము, వాతపిత్తము, ప్రమేహము, గ్రహణి, అతిసారము, కుష్ఠువు, జ్వరములు [illegible]సంజేయుటయేగాక శరీరమునకు దివ్యమైనకాంతి, మిగులకా[illegible]లు - పలితము - [illegible]యుర్వృద్ధి వీటిని గలుగంజేయు.

శ్లో॥ స్వర్ణంతిక్తంకషాయంమధురమతివయఃస్థాపనంకాంతిదంచ।
వృష్యంహృద్యంచబల్యంరుచికరమఖిలంవాగ్విశుద్ధిప్రదంచ ।
ఆయుర్ధంవైవలీనాంహరణమచిరతోనాశనందుర్విషాణాం ।
రోగేశోన్మాదమాంద్యంజ్వరపరిహరణంసర్వరోగాభినాశం॥

తా॥ స్వర్ణభస్మము చేదుగను, వగరుగను, మధురముగను, ముసలితనము నుబోగొట్టునదిగను, కాంతి, వీర్యవృద్ధి, మనస్సంతోషము, బలము, రుచి, విశేష బుద్ధి, వాక్పటుత్వము,ఆయుర్వృద్ధి వీటిని గలుగంజేయునదిగనునుండు. మఱియు నిది ముదిమి, దుష్టవిషము, ఉన్మాదము,జ్వరము యివి మొదలైన సర్వరోగములను బోగొట్టును.

శ్లో॥స్వర్ణంవిధత్తేకిలరోగనాశంకరోతిసౌఖ్యంప్రబలేంద్రియత్వం। శు
క్రస్యవృద్ధింబలతేజరుద్ధింక్రియాసుయుక్తించయుతంచహేమం॥

తా॥ పక్వస్వర్ణభస్మము సర్వరోగములను బోగొట్టునదిగను, ఇంద్రియము లకు పటుత్వమును గలుగజేయునదిను, శరీరమునకు సౌఖ్యమునుగలుగజేయునదిగను, శుక్రము, బలము, తేజస్సు వీటివృద్ధిని గలుగజేయునదిగను, సర్వశోధనాది క్రియలను గలుగజేయునదిగనునుండు.

శ్లో॥ తపనీయంమృతంకాంతింకందర్పంతనుతేతథా । వాతంపిత్తం
ప్రమేహంచకాసంశ్వాసంక్షతంక్షయం ॥ గ్రహణీమతిసారం
చజ్వరంకుష్ఠంవిషంహరేత్ । వయసఃస్థాపనంస్వర్యబల్యం
వృష్యంరుచిప్రదం॥
౧౬౯॥

తా॥ స్వర్ణభస్మము, కాంతి, కామోద్దీపనము, స్థిరయౌవనము, స్వరము, బలము, శుక్రము వీటివృద్ధి యివిగలుగు. మఱియు వాతము, పిత్తము, ప్రమేహము కాసము, శ్వాసము, క్షతము (గాయము) క్షయ, గ్రహణి,అతిసారము,జ్వరము, కుష్ఠువు, విషము వీటిని నశింపంజేయు.

※ అపక్వసువర్ణభస్మదోషము. ※

...వీర్యంహరతేనరాణాంరోగవ్రజాన్పోషయతీహకాయే।అ
...చసద్దైవహేమాఽపక్వంసదోషంమరణంకరోతి॥

తా॥ అపక్వ స్వర్ణభస్మము, బలము వీర్యము వీటిని నాశనము, శరీరమునందు రోగప్రాబల్యము, ఎల్లపుడు అస్వాఖ్యము, మరణము వీటిని గలుగఁజేయు.

* అపక్వస్వర్ణదోషశాంతి. *

శ్లో॥ అభయాసితయాభుక్తాత్రిదినంన్నభిరంగనే। హేమదోషహరీఖ్యా
తాసత్యంసత్యంనసంశయః॥ ౧౭౧॥

తా॥ కరక చూర్ణము, తెల్లచక్కెర వీటిని సమముగఁ జేర్చి మూడు దినములు పుచ్చుకొనిన అపక్వమైన స్వర్ణభస్మసేవనచే గలిగిన దోషములు నిస్సందేహముగ నశించు.

* పక్వరౌప్యభస్మగుణము. *

శ్లో॥ తారంచతారయతిరోగసముద్రపారం దేహస్యసౌఖ్యదమిదం
పలితంనిహంతి । హన్తిహరోగవిషదోషమలంప్రసహ్యావృ
ష్యంపునర్నవకరంకురుతేచిరాయుః॥ ౧౭౨॥

తా॥ రౌప్యభస్మము, రోగమనెడి విషముయొక్క దోషమును బలాత్కారముగ హరించి రోగమనెడి సముద్రమును దాటించుటయేగాక దేహసౌఖ్యము - పలితనాశనము - వీర్యవృద్ధి - వార్ధకమునుపోగొట్టి యవ్వనము - దీర్ఘాయువు వీటిని గలుగఁజేయు.

శ్లో॥ తారంకరోత్యామయసింధుపారంపిత్తాపహంవాతకఫానిహ
న్తి। గుల్మంప్రమేహంశ్వసనంచకాసంప్లీహక్షయక్షీణయకృద్వి
షార్తిమ్ ॥ వలీపలితనాశనంక్షుధాకాంతిపుష్టిదం। పాండు
శోఫహందదాతిచాయుషంన్నణామిదం॥ ౧౭౩॥

తా॥ రౌప్యభస్మము విశేషముగ సర్వరోగములను హరింపఁజేయు. మఱియు పిత్తము - వాతము - కఫము - గుల్మము - ప్రమేహము - శ్వాస - కాస - ప్లీహము - క్షయరోగము - క్షీణత్వము - యకృత్తు - విషము - వళులు - పలితము - శోఫ - వీటిని నివర్తింపఁజేయుటయేగాక శరీరకాంతి శరీరపుష్టి - ఆయుర్వృద్ధి వీటిని సగాగలుగఁజేయు.

## ❊ అపక్వరౌప్యభస్మదోషము. ❊

శ్లో॥ అశుద్ధంరజతంకుర్యాత్పాండుకండుగళగ్రహాన్ । వివిధంవీర్య
నాశంచబలహానింశిరోరుజం॥ ౧౭౪॥

తా॥ అపక్వ రౌప్యభస్మము, పాండువు, దురద, గళగ్రహము, పలువిధము లగు వీర్యనాశనము, బలహాని, తలనొప్పి వీటిని గలుగంజేయు.

శ్లో॥ తారంచదేహస్యకరోతి తాపంవిడ్గంధతాంయచ్ఛతిశుక్రనాశం।
అపాటవంవీర్యబలప్రహానింమహాగదాన్పోషయతీహకామే॥

తా॥ అపక్వ రౌప్యభస్మము, శరీరమునందు జ్వరతాపము, మలముచెడు ర్గంధము, శుక్రక్షయము, దుర్బలము, వీర్యహాని, రోగప్రాబల్యము వీటినిగలుగంజేయు.

## ❊ అపక్వరౌప్యదోషశాంతి. ❊

శ్లో॥ శర్కరాంమధుసంయుక్తాంసేవయేద్యోదినత్రయం । అపక్వ
రౌప్యదోషేణవిముక్తస్సుఖమశ్నుతే॥ ౧౭౬॥

తా॥ శర్కరయందు తేనెవైచి కలిపి దానిని మూడుదినములు సేవించిన అపక్వ రౌప్యభస్మసేవనచే గలిగిన దోషములన్నియు తొలగు.

## ❊ పక్వతామ్రభస్మ గుణము. ❊

శ్లో॥ కుష్ఠప్లీహజ్వరకఫమరుచ్ఛ్వాసకాసార్తిశోఫాస్తంద్రాశూలోదరకృమివమీపాండుమోహాతిసారాన్ । అర్శోగుల్మక్షయ
భ్రమిశిరోవ్యాధిమేహాదిహీకాః శుద్ధంశుల్బంహరతిసతతం
వహ్నివృద్ధింకరోతి॥ ౧౭౭॥

తా॥ శుద్ధమైన తామ్రభస్మము, కుష్ఠువు, ప్లీహ, జ్వరము, కఫము, వాతము, శ్వాస, కాస, వాపు, తంద్ర, శూల, ఉదరరోగము, కృమిరోగము, వాంతి, పాండువు, మూర్ఛ, అతిసారము, మూలవ్యాధి, గుల్మరోగము, క్షయ, భ్రమ, శిరోరోగము, ప్రమేహము మొదలగు రోగములు, ఎక్కిళ్లు, వీటిని పోగొట్టుటయేగాక ఆ పచనమును సగాగలుగంజేయు.

శ్లో॥ కాసంశ్వాసంకఫంవాతంప్లీహానముదరంకృమీన్। కుష్ఠంశూ
లంజ్వరంతంద్రావమింశోఫంచపాండుతాం। మోహమర్శోతి
సారంచక్షయంగుల్మంశిరోవ్యథాం। హిక్కాంమేహంభ్రమం
హంతిరవిర్వహ్నింవిభోధయేత్॥ ౧౨౮॥

తా॥ తామ్రభస్మము, కాస, శ్వాస, కఫము, వాతరోగము, ప్లీహ, ఉదరరోగము, క్రిమిరోగము, కుష్ఠువులు, శూలలు, జ్వరములు, తంద్ర, వాంతి, వాపు, పాండువు, మూర్ఛ, అర్శస్సు, అతిసారము, క్షయ, గుల్మము, తలనొప్పి, ఎక్కిళ్లు, ప్రమేహము, భ్రమము, వీటినిహరింపఁజేయుటయేగాక అగ్నిదీపనమును సగాగలుగంజేయు.

శ్లో॥ వహ్నింప్రనీపయతినాశయతీహకుష్ఠమర్శాంసిపాండుప్రమేహ
గదంసశోఫం। అన్యాశ్చమస్తరగదానఖిలాస్తనూత్థాంస్తా
మ్రంప్రయుక్తమచిరాశ్చనిహంతిశీఘ్రం॥ ౧౨౯॥

తా॥ శుద్ధమగు తామ్రభస్మము కుష్ఠువు, మూలవ్యాధి, పాండువు, ప్రమేహము, వాపు ఇవిమొదలైన అసాధ్యరోగంబులన్నియు అతిత్వరలో నివర్తించుటయేగాక దీపనమును సగాగలుగంజేయు.

❊ అపక్వతామ్రభస్మదోషము. ❊

శ్లో॥ ఏకోదోషోవిషే తామ్రేత్వసమ్యఙ్మారితేఽష్టతే। దాహస్వేదోఽ
రుచిర్మూర్ఛాక్లేదోరేకోవమిభ్రమః॥ ౧౩౦॥

తా॥ విషమునకు వొక్కదోషమేనుండును. తామ్రభస్మము అపక్వముగ నుండినదాహము, స్వేదము, అరుచి, మూర్ఛ, శరీరమందలి జిగటు, రేకమనేరోగము, వాంతి, భ్రమము యిటుల యెనిమిదివిధములయిన దోషములుగలిగియుండుటగాన నిది విషమునకంటె క్రూరమని యెరుంగవలయు.

శ్లో॥ పాకేనహీనంవమంకరోతివిరేచనం తాపమతోతిమూర్ఛాం।
హన్త్యాయురుచ్చైర్భ్రమమోహపాకేశు క్రాపహం దేహబలా
పహారి॥ ౧౩౧॥

తా॥ అపక్వమగు తామ్రభస్మము వమనము, విరేచనము, సంతాపము, అతిమూర్ఛ, భ్రమము, మోహము, పాకము, శుక్రక్షయము, దుర్బలము వీటిని గలుగజేయుటయేగాక ఆయువును సగానశింపజేయు.

శ్లో॥ తామ్రమపక్వంవమనంవిరేకతాపాదికంభ్రమంమూర్ఛాం।మే
హంబలస్యనాశంకరోతిశుక్రస్యచాయుషశ్చాపి॥ ౧౮౨॥

తా॥ అపక్వమైన తామ్రభస్మసేవనచే వమనము, విరేచనము, తాపము, భ్రమ, మూర్ఛ, ప్రమేహము, బలనాశము, వీర్యనాశము, ఆయుక్షీణతయివిగలుగు.

* అపక్వతామ్రదోషశాంతి. *

శ్లో॥ మునిప్రీహిసితాపానంవాధాన్యాకంసితాంచకైః । తామ్రదో
షమశేషంవైపిబన్హన్యాద్దినత్రయాత్॥ ౧౮౩॥

తా॥ తెల్లచక్కెర, అడవిధాన్యపుబియ్యము లేక ధనియాలు. వీటిని సమముగచేర్చి వుదకముతోనూరి మూడుదినములు ప్రాతఃకాలములయందు, సేవించిన అనగా పానముజేసిన అపక్వతామ్రభస్మసేవనచేగలిగిన దోషములు హరించు.

* పక్వవంగభస్మగుణము. *

శ్లో॥ బల్యందీపనపాచనంరుచికరంప్రజ్ఞాకరంశీతలం । సౌందర్యం
కవివర్ధనంహృతరుజంచారోగతాకారకం ॥ ధాతుస్థైర్యకరం
క్షయక్షయకరంసర్వప్రమేహాపహం । వంగంభక్షయతోనర
స్యనభవేత్స్వప్నేపిశుక్రక్షయః॥ ౧౮౪॥

తా॥ పక్వవంగభస్మము క్షయ, ప్రమేహము వీటిని నివర్తింపజేయుటయేగాక బలకరముగను, దీపనకారిగను, జీర్ణకారిగను, రుచికరముగను, తీవ్రబుద్ధిని గలుగజేయునదిగను, శీతలముగను, సౌందర్యకరముగను, కవిత్వశక్తికరముగను, రోగహరముగను, ఆరోగ్యకరముగను, వీర్యస్తంభనకారిగనునుండు. మరియు వంగభస్మము సేవించువానికి స్వప్నమునందు సగావీర్యనాశనము గలుగదు.

* వంగేశ్వరగుణము. *

శ్లో॥ భ్రమతమకకఫేవాశ్వాసకాసక్షయేవావిషరుధిరకకీలేవాతపిత్త
ప్రమేహేజ్వరగ్రహణి సశూలేకుష్ఠపాండ్వల్పవీర్యే బహుగద
వతిశస్తోగమ్యవంగేశ్వరోసౌ॥ ౧౮౫॥

తా॥ శుద్ధమగు వంగేశ్వరరసము భ్రమ, తమము, కఫము, శ్వాస, కాస, క్షయ, విషవికారము, రక్తవికారమువలన గలిగినపీడ, వాతము, పిత్తము, ప్రమేహము, జ్వరము, గ్రహణి, శూల, కుష్ఠువు, పాండువు, చిక్కిపోవుటయివిమొదలైన అనేకరోగములను హరింపంజేయు.

శ్లో॥ భ్రమతిమిరకఫప్రమేహకాసాన్ శ్వసనపవనపిత్తరక్తదోషాన్।
గ్రహణిగదసశూలకుష్ఠపాండుజ్వరగదమపిహంతివంగరాజః॥

తా॥ వంగేశ్వరరసమును సేవించుటవలన భ్రమ, తిమిరరోగము, కఫము, ప్రమేహము, కాస, శ్వాస, వాతము, పిత్తము, రక్తదోషము, సంగ్రహణి, శూల, కుష్ఠము, పాండువు, జ్వరము యివితొలగు.

శ్లో॥ శ్వసనమేహసమీరణనాశనః ప్రదరశూలయకృత్కఫపాండుహృత్। భ్రమవమిక్షయజిద్బలవీర్యకృత్సకలరోగహరశ్శుచివంగకః॥

తా॥ వంగభస్మము, శ్వాస, ప్రమేహము, వాతము, ప్రదరరోగము, శూల, యకృత్తు, కఫము, పాండువు, భ్రమ, వాంతి, క్షయ యివిమొదలైన సర్వరోగములను నశింపంజేయుటయేగాక బలము, వీర్యము వీటినిసగా గలుగంజేయు.

❊ అపక్వవంగభస్మదోషము. ❊

శ్లో॥ పాకేనహీనఃఖలువంగకోసౌకుష్ఠానిగుల్మానిమహన్తిరోగాన్।
పాండుప్రమేహాపచివాతశోణితంబలాపహారంకురుతేనరాణామ్॥

తా॥ అపక్వమగు వంగభస్మము కుష్ఠువు, గుల్మము, యివిమొదలైన గొప్ప రోగంబులు, పాండువు, ప్రమేహము, అపచి, వాతము, రక్తవికారము, కామక్షయము వీటిని గలుగంజేయు.

శ్లో॥ యద్యపక్వంభవేద్వంగంగుల్మకుష్ఠప్రమేహకృత్। వాతశోణితమందాగ్నిపాండుదౌర్బల్యరుక్ప్రదమ్॥ ౧౮౯॥

తా॥ అపక్వమైన వంగభస్మము, గుల్మము, కుష్ఠువు, ప్రమేహము, వాతము, రక్తదోషము, అగ్నిమాంద్యము, పాండువు, దుర్బలము వీటిని గలుగంజేయు.

### * అపక్వవంగదోషశాంతి. *

శ్లో॥ మేషశృంగింసితాయుక్తాంయస్సేవతిదినత్రయం । వంగదోష విముక్తోసౌసుఖంజీవతిమానవః॥ ౧౯౦॥

తా॥ తెల్లశర్కర, వద్దివేరుపట్టచూర్ణము వీటిని సమముగజేర్చి మూడు దినములు సేవించిన అపక్వ వంగభస్మదోషమువలన గలిగిన రోగములన్నియు నివర్తించు.

### * పక్వజసదభస్మగుణము. *

శ్లో॥ జసదంతువరంతిక్తంశీతలంకఫపిత్తహృత్ - చక్షుష్యంపరమం మేహంపాండుంశ్వాసంచనాశయేత్॥ ౧౯౧॥

తా॥ పక్వమగు సత్తుభస్మము వగరుగను, చేదుగను, శీతలముగను, నేత్రములకు మిగుల హితకారిగనునుండు. మఱియు నిది కఫము,పిత్తము, ప్రమేహము, పాండువు, శ్వాస వీటిని నశింపజేయు.

శ్లో॥త్రిదోషప్రమేహాగ్నిమాన్ద్యాక్షిరోగానతీసారపిత్తజ్వరాజీర్ణకాసాన్ । విబంధామవాతంహరేద్రీతిహేతుర్వమింశూలశీతజ్వరాస్రస్రుతీశ్చ॥ ౧౯౨॥

తా॥ జసద (సత్తు) భస్మసేవనచే త్రిదోషము, ప్రమేహము, అగ్నిమాంద్యము, నేత్రరోగము, అతిసారము, పిత్తజ్వరము, అజీర్ణము, కాస, మలబంధము, ఆమవాతము, వాంతి, శూల, శీతజ్వరము, రక్తాతిసారము యివినివర్తించు.

### * అపక్వజసదభస్మదోషము. *

శ్లో॥ అపక్వంజసదంరోగాన్ప్రమేహాజీర్ణమారుతాన్ । వమింభ్రమింకరోత్యేనంశోధయేన్నాగవత్తతః॥ ౧౯౩॥

తా॥ అపక్వమగు సత్తుభస్మము, ప్రమేహము, అజీర్ణము, వాతరోగములు, వాంతి, భ్రమ వీటిని గలుగజేయునుగాన నాగము శుద్ధిజేయురీతిగా దానిని శుద్ధిచేసి పుచ్చుకొనవలయు.

### * అపక్వజసదదోషశాంతి. *

శ్లో॥ బాలాభయాంసితాయుక్తాంసేవయేద్యోదినత్రయం । జసదస్యవికారోస్యానాశమాయాతినాన్యథా॥ ౧౯౪॥

తా॥ కొరకపిండెల చూర్ణమునందు శర్కరవైచి మూడుదినములు సేవించిన అపక్వపుగు సత్తుభస్మసేవనచేగలిగిన దోషమునివర్తించు.

## ❋ పక్వనాగభస్మగుణము. ❋

శ్లో॥ క్షయపవనవికారే గుల్మపాండ్వామయేషుభ్రమ కృమికఫశూలే మేహకాసామయేషు । గ్రహణిగుదగదేవైనష్టవహ్నౌప్రశస్తశ్శుభవిధకృతనాగః కామపుష్టిందదాతి॥ ౧౯౫॥

తా॥ నాగభస్మము, క్షయ, వాతవికారము, గుల్మము, పాండువు, భ్రమ క్రిమి, కఫము, శూల, ప్రమేహము, కాస, సంగ్రహణి, భగందరము, అగ్నిమాంద్యము యివిమొదలయిన వ్యాధులను బోగొట్టుటయేగాక వీర్యవృద్ధిని సగాగలుగంజేయు.

శ్లో॥ నాగోవానాగశతతుల్యబలందదాతివ్యాధీంశ్చనాసయతి జీవితమాతనోతి । వాయుంకృమీనపినిహంతి సతిక్తమేవంవృష్యంచపిత్తకరమాశు మృతంనిహంతి॥ ౧౯౬॥

తా॥ నాగభస్మము నూరుయేనుగులబలమును పుట్టించునదిగను, సమస్తరోగముల నశింపజేయునదిగను, ఆయుస్సును వృద్ధిజేయునదిగను, వాతము, కృమి యివిమొదలయిన రోగములబోగొట్టునదిగను, చేదుగను, శీతకారిగను, వీర్యవృద్ధికరముగను, పిత్తకరముగను, అకాలమృత్యువును నివర్తించునదిగనునుండు.

శ్లో॥ వాతరోగం క్షయంగుల్మంపాండుశూలభ్రమాన్కఫం। వహ్నిమాంద్యం శుక్రదోషం కాసార్శోగ్రహణీకృమీన్ ॥ అపమృత్యుంనిహంత్యాసు శతనాగ సమంబలం। దదాతిచాయుషోవృద్ధించేతహృతం విధినాప్రియే॥ ౧౯౭॥

తా॥ ఓప్రియురాలా ! శాస్త్రానుసారముగ క్రమముగాచేయబడిన నాగభస్మము, వాతము, క్షయరోగము, గుల్మము, పాండువు, శూల, భ్రమ, కఫము, అగ్నిమాంద్యము, శుక్రదోషము, కాస, అర్శోరోగము, సంగ్రహణి, క్రిమి, అపమృత్యువు వీటిని నశింపంజేయుటయేగాక నూరుయేనుగులబలము, ఆయుర్వృద్ధి వీటిని సగాగలుగంజేయు.

### ✻ అపక్వనాగభస్మదోషము. ✻

శ్లో॥ కుష్ఠాని గుల్మారుచిపాండురోగాన్ క్షయం కఫం రక్తవికార
కృచ్ఛ్రం । జ్వరాశ్మరీశూలభగందరాఢ్యం నాగం హ్యపక్వం కు
రుతే నరాణాం॥ ౧౯౮॥

తా॥ అపక్వమగు నాగభస్మము కుష్ఠువు, గుల్మరోగము, అరుచి, పాండువు, క్షయ, కఫము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అశ్మరీరోగము, శూల, భగందరరోగము వీటినిగలుగంజేయు.

### ✻ అపక్వనాగదోషశాంతి. ✻

శ్లో॥ హేమాహరీతకీం సేవేత్ సితాయుక్తాం దినత్రయం । అపక్వ
నాగదోషేణ విముక్తస్సుఖమేధతే॥ ౧౯౯॥

తా॥ వస, కరక్కాయ వీటిని చూర్ణించి అందులో శర్కరకలిపి దానిని మూడుదినములు సేవించిన అపక్వనాగభస్మ సేవనజే గలిగిన వ్యాధులు నివర్తించు.

### ✻ పక్వలోహభస్మగుణము. ✻

శ్లో॥ లోహం మృతం కజ్జలసన్నిభం తు శుభం క్తే సదా యోరస రాజయు
క్తం । తస్యైవ దేహేన భవంతి రోగా మృతోపి కామః పునరే
తి ధామ ॥ ఆయుః ప్రదాతా బలవీర్య కర్తా రోగస్య హర్తా మద
నస్య కర్తా । అయస్సమానం నహి కించిదన్య ద్రసాయనం శ్రే
ష్ఠతమం వదంతి॥ ౨౦౦॥

తా॥ కజ్జలితో సదృశమగు లోహభస్మము శుద్ధిజేయబడిన పాదరసమూ వీటిని జేర్చి సేవించిన శరీరమునందు యెట్టిరోగమున్ను కలుగకుండుటయేగాక కామహీనులకు అధికకామమును సగాగలుగంజేయు. మఱియు నీలోహభస్మము ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, కామవృద్ధి వీటిని గలుగజేసి సమస్తరోగములను హరింపంజేయు. గాన యీ భస్మముతో సమానమైనది యెద్దియు లేదనియును, సమస్తరసంబులలో లోహభస్మమే శ్రేష్ఠమైనదియును వైద్యవేత్తలు చెప్పెదరు.

శ్లో॥ లోహెూజంతువికార పాండుపవనక్షీణత్వ పిత్తామయస్థౌల్యా
ర్శోగ్రహణీజ్వరార్తికఫజిచ్ఛ్లేష్మప్రమేహవ్రణజిత్ । గుల్మప్లీహ

విషాపహంబలకరం కాంతాజనానందకం ॥ సౌఖ్యాలంబిరసా
యనం మృతిహరంద్రుష్టేశ్చకాంతిప్రదం । ఆమవాతగదేషుశో
ఫనం పాండుమేహగదనాశనేగజః । దుష్టకుష్ఠపలితాస్రవాత
జిత్సాన్యజ్జరామృతివలీవినాశనః॥ ౨౦౧॥

తా॥ లోహభస్మము జంతువికారము, పాముకాటువిషము, పాండురోగము, వాతక్షీణత్వము, పిత్తరోగము, శరీరస్థూలత్వము, మూలవ్యాధి, సంగ్రహణి, జ్వరము, కఫము, శోఫ, ప్రమేహము, గుల్మము, ప్లీహము, ముసలితనము, నేత్రరోగము, ఆమవాతము, మహాకుష్ఠువులు, శ్వేతకుష్ఠము, రక్తవికారము, మృత్యువు, వళులు, పలితము (వెండ్రుకలు నెఱయుట) యివిమొదలైన వ్యాధులను బోగొట్టుటయేగాక మిక్కిలి బలము, పెక్కు స్త్రీలతోరమించు శక్తి వీటిని సగా గలుగంజేయు.

శ్లో॥ శశోఫపాండుక్షయకామలామయ ప్రమేహ హానీరహలీమకా
ని। తతేరావలంలోహమిదంనిహంతిని సేవితంహ్యాత్మవతానరేణ॥

తా॥ లోహభస్మ సేవనచే శోఫతోగూడినపాండువు, క్షయ, కామిల, ప్రమేహము, హలీమకము యివిమొదలైన వ్యాధులు నివర్తించు.

శ్లో॥ పాండుంఖండయతిక్షయం క్షపయతి క్షైణ్యం క్షిణోతి క్షణా
తారాసంనాశయతిభ్రిమాంశమయతి శ్లేష్మాణయింఖాదతి। అర్శో
గుల్మసమూలపీనస వమిశ్వాసప్రమేహారుచిం శీఘ్రింనాశయతి
ప్రభూతగుణకృల్లోహంపరంమారితం॥ ౨౦౩॥

తా॥ లోహభస్మము పాండువు, క్షయ, క్షీణత్వము, కాస, భ్రిమ, శ్లేష్మరోగము, అర్శస్సు, గుల్మరోగము, పీనస, వాంతి, శ్వాస, ప్రమేహము, అరుచి వీటిని హరింపంజేయు.

శ్లో॥ మృగవిలోచనకుంజరగామిని శ్రుణువదామ్యహం, లోహగుణా
నహం । సువిధిమారిత మేవహరత్యయః క్రిమిసమీరణపాండు
విషజ్వరాన్ । భ్రిమవమిశ్వాసగ్రహణిగదానరాఫ జరాకసన
క్షయకామలాః । అరుచిపీనసపిత్తప్రమేహకాన్ గుదజగుల్మరు
గామసమీరణాన్ ॥ ప్లీహస్థౌల్యవినాశనంబలకరం కాంతాజ

నానందదం । క్షీణత్వంవిధునోతి దృష్టిజనకం శోఫాపహంకు
ష్ఠనుత్ ॥ భుక్తంశుద్ధరసేంద్రసంయుతమిదం సర్వామయధ్వం
సనం । కాంతాశ్రేష్ఠరసాయనం నహిపరంకాంతే౽స్తిబిం
బాధరే॥ ౨౦౪॥

తా॥ లేడి నేత్రములతో సమానమగు నేత్రములుకలదియును, మదించిన యేనుగ నడకవంటి నడకగలదియునునగు ఓ ప్రియరత్నమా! లోహభస్మగుణమును చెప్పెదనువినుము. శాస్త్రోక్తముగ పక్వముచేయబడిన లోహభస్మము, క్రిమి, వాతరోగము, పాండువు, విషము, జ్వరము, భ్రమ, వాంతి, శ్వాస, గ్రహణి, కఫము, మదిమి, కాస, క్షయ, కామిల, అరుచి, పీనస, పిత్తము, ప్రమేహము, అర్శస్సు, గుల్మము, ఆమవాతము, ప్లీహ, స్థౌల్యము కృశత్వము, శోఫ, కుష్ఠువు, వీటిని హరింపంజేయుటయేగాక రతిసలుపునపుడు స్త్రీలకు సంతోషమునుపుట్టించునట్టి సమర్థత, కండ్లకు నైర్మల్యము వీటినిసగా గలుగంజేయు. దొండపండువంటి పెదవిగల ఓ స్త్రీరత్నమా! లోహభస్మమును శుద్ధిజేసిన పాదరసముతోసేవించిన సమస్తరోగములుతొలగు గాన యీలోహభస్మమునకంటె రసాయనములలో శ్రేష్ఠమైనదియేదియునులేదు.

శ్లో॥ అల్పౌషధస్తోకపుటైర్విహీనగంధకపారదైః । అపక్వలోహజం
చూర్ణమాయుఃక్షయకరంపరం ॥ షణ్ఢత్వకుష్ఠామయమృత్యుదం
భవేత్ హృద్రోగశూలౌ కురుతేశ్మరించ । నానారుజానాం
చతథాప్రకోపంకరోతి హృల్లాసమశుద్ధలోహం॥ ౨౦౫॥

తా॥ అయోమారణముకు చేర్చవలసిన ఔషధములు తక్కువైనను లేక పుటములు తక్కువైనను, గంధకము, పారదము యివి మిశ్రితముకాకపోయినను లోహభస్మము అశుద్ధమగు. ఇట్టిలోహభస్మమును సేవించిన అయుస్సు క్షీణించు. మఱియు నిది షండత్వము - కుష్ఠము - మృత్యువు - హృద్రోగము- శూల-అశ్మరి- నానావిధరోగములు - హృల్లాసరోగము వీటినిగలుగంజేయు.

శ్లో॥ విషంక్లేదంకరోత్యేవవీర్యంకాంతింనిహంతిచ । అపక్వంహియ
తోలోహంతతస్సమ్యగ్విపాచయేత్॥ ౨౦౬॥

తా॥ అపక్వమగు లోహభస్మము విషము, క్లేదము వీటినిగలుగంజేయు, మఱియు నిది వీర్యము - కాంతివీటినినశింపంజేయు. గనుక లోహమును శుద్ధభస్మమగునటుల చక్కగ పక్వముజేసి దానిని సేవించవలయు.

శ్లో॥ గరళంక్లమవాంతివీర్యహాఇతిదోషాఃప్రవదంతిలోహకే । అథ
శోధనభావకాన్‌పుటాన్‌విధినైకేనవదంతిసూరయః॥ ౨౦౭॥

తా॥ లోహమునకు విషము, గ్లాని, వాంతి, వీర్యహాని అనునీదోషంబులున్నవని ఆయుర్వేదవేత్తలుచెప్పెదరు. గనుక వాటినివారణకొరకై శోధనభావనపుటములను తామ్రమునకు జేయురీతిగా జేయవలయు.

*అపక్వలోహభస్మశాంతి, *

శ్లో॥ మునిరసపిష్టవిడంగం మునిరసలీఢం చిరస్థితేఘర్మే ద్రావయతి
లోహదోషాన్‌వహ్నిర్నవనీతపిండమివ॥ ౨౦౮॥

తా॥ వాయువిడంగములను అగశిఆకు రసముతోనూరి యెండలో చక్కగ యెండించి దానిని అగశిఆకురసముతోసేవించిన అగ్ని వెన్ననుకరిగించుచందంబున లోహభస్మ జనితదోషములను బోగొట్టు.

* అపక్వలోహజన్యకీటశాంతి. *

శ్లో॥ ఆరగ్వధస్యమజ్జోత్థరేచనంకీటశాంతయే । భవేదప్యతిసారశ్చ
పీత్వాదుగ్ధంతుతజ్జయేత్॥ ౨౦౯॥

తా॥ అపక్వలోహభస్మమును సేవించిన కడుపునందు పురుగులుజనించుగాన రేలబంకతో విరేచనమునకు పుచ్చుకొనిన అవినశించు. లేక అతిసారమైనను జనించు. అది నివర్తించుటకై పాలుత్రాగవలయు.

శ్లో॥ సైంధవంత్రివృతాయుక్తంసేవయేత్తప్తవారిణా । అయోవికా
రశాంతిస్స్యాత్పాపంకేశవదర్శనాత్॥ ౨౧౦॥

తా॥ సైంధవలవణము, తెల్లతెగడ వీటినిసమముగచేర్చి చూర్ణించి ఉష్ణోదకములోకలిపి సేవించిన ‘‘విష్ణువునుచూచినమాత్రమున పాపములుతొలగుచందంబున’’ అశుద్ధలోహభస్మసేవనచే గలిగినవికారమునివర్తించు.

శ్లో॥ ఖండమాక్షికసంయుక్తమేలాచూర్ణం దినత్రయం। వికారోలో
హజస్తస్యభుక్త్వానాశంసమాప్నుయాత్॥ ౨౧౧॥

తా॥ కలకండచూర్ణము - ఏలకులచూర్ణము వీటినిమాక్షికమను తేనెయందు కలిపి మూడుదినములుసేవించిన అపక్వ లోహభస్మసేవనచే గలిగినదోషములు నివర్తియగు.

శ్లో॥ సింధూత్థంత్రివృతాచూర్ణం సేవితంకోష్ణవారిణా । లోహజా
వికృతిస్తస్యవినశ్యతినసంశయః॥ ౨౧౨॥

తా॥ సైంధవలవణము, తెల్లతెగడచూర్ణము వీటిని కొంచెముపేడిగనుండు నీళ్లలోకలిపి పానముజేసిన అపక్వలోహభస్మసేవనచే గలిగినదోషములు నివర్తియగు.

శ్లో॥ సితయామధునావాపి శ్వేతదూర్వారసంపిబేత్। వికారంలోహ
జంత్యక్త్వా సుఖమేవహిజీవతి॥ ౨౧౩॥

తా॥ తేనె - శర్కర వీటియందు దేనితోనైనను తెల్లగరికెరసమును మిశ్రితముజేసి సేవించిన అపక్వలోహభస్మమును సేవించుటవలన గలిగినదోషములన్నియు తొలగి సుఖజీవిగనుండు.

## ❋ పక్వసువర్ణమాక్షిక భస్మగుణము. ❋

శ్లో॥ స్యాన్మాక్షికస్తిక్తసుదీపనఃకటుర్దుర్నామకుష్ఠామయభూతనా
శనః । పాండుప్రమేహక్షయనాశనోలఘుస్సత్వంమృతంతస్యసు
వర్ణవద్గుణైః॥ ౨౧౪॥

తా॥ సువర్ణమాక్షికభస్మము చేదుగను, దీపనకారిగను, కారముగను, చులకనగనునుండు. మఱియు దుర్నామము - కుష్ఠము - భూతబాధ - పాండు-ప్రమేహము - క్షయ వీటిని నశింపజేయు. మఱియు నిది స్వర్ణభస్మముతో సమానముగనుండు-

శ్లో॥ వివిధపాండుగదాన్ భ్రమికంక్షయంశ్వసనకంచ జయేన్మృత
మాక్షికం॥ ౨౧౫॥

తా॥ స్వర్ణమాక్షికభస్మమును సేవించిన నానావిధములగు పాండురోగము, భ్రమ, క్షయరోగము, శ్వాస యివి నివర్తించు.

శ్లో॥ వృష్యంస్వర్యహితంచక్షుష్యంవ్యవాయ్యపిరసాయనం । హంతి
వస్త్యర్తిశోఫార్శోమేహకుష్ఠోదరక్షయాన్॥ పాండురోగం

విషంపిత్తంకామలాంచహాలీమకం । వాతంవాతాత్మజఃపుత్రం
రావణస్యయథాహానత్॥ ౨౧౬॥

తా॥ స్వర్ణమాక్షికభస్మము వీర్యవృద్ధి, కంఠమునకు సుస్వరము, స్త్రీసంభోగమునందు అధికశక్తి వీటినిగలుగంజేయుటయేగాక నేత్రరోగములను సగానశింపంజేయు. మఱియు నీస్వర్ణమాక్షికభస్మము,పొత్తికడుపునొప్పి, వాపు, అర్శస్సు, ప్రమేహము, కుష్ఠువు, ఉదరరోగము, క్షయ, పాండువు,విషము, పిత్తము, కామిల, హాలీమకము, వాతరోగము వీటిని హరింపంజేయు.

* అపక్వస్వర్ణమాక్షికభస్మదోషము. *

శ్లో॥ అపక్వస్వర్ణమాక్షికేణాశుదేహంసంక్రమతేరుజా॥ ౨౧౭॥

తా॥ అపక్వస్వర్ణమాక్షికభస్మమును సేవించిన శరీరమునం దనేకరోగములు జనించు.

* అపక్వస్వర్ణమాక్షిక దోషశాంతి. *

శ్లో॥ కులుత్థస్యకషాయేణమాక్షీవికృతిశాంతికృత్ । తథైవదాడిమ
త్వగ్వాదేయాదేహసుఖార్థినే॥ ౨౧౮॥

తా॥ ఉలవలకషాయముగాని, దాడిమతోలుకషాయముగాని సేవించిన అపక్వస్వర్ణమాక్షిక సేవనచే జనించినదోషము నివర్తించు.

* పక్వరౌప్యమాక్షికభస్మగుణము. *

శ్లో॥ రౌప్యమాక్షికగుణస్తుహేమవచ్ఛోదితోఽతిగుణచస్సుసేవితః ।
మేహకుష్ఠకృమిశోఫపాండుతాపస్మృతీర్హ్యరతిసోస్మరీంజయేత్॥

తా॥ పక్వమగు రౌప్యమాక్షికభస్మము, మేహము - కృమిరోగము-శోఫ-పాండువు - అపస్మారము - అశ్మరి వీటినిహరింపంజేయుటయేగాక శరీరమునకు బంగారువంటి కాంతిని సగాగలుగంజేయు.

* అపక్వరౌప్యమాక్షికభస్మఽనేకాదోషము. *

శ్లో॥ అపక్వరౌప్యమాక్షికేణామయానేకాశ్చభవంతి॥ ౨౨౦॥

తా॥ పక్వముగాని రౌప్యమాక్షికభస్మమును సేవించిన అనేకరోగములు గలుగు.

* అపక్వరౌప్యమాక్షికదోషశాంతి. *

శ్లో॥ వికారోయదిజాయేతంవిమలాయానిషేవణాత్ । శర్కరాసహితాభక్ష్యామేషశృంగీదినత్రయం॥ ౨౨౧॥

తా॥ ఓద్దిపట్టకషాయములో శర్కరవైచి మూడుదినములు సేవించిన అపక్వ రౌప్యమాక్షికభస్మ సేవనచే గలిగిన వికారము నివర్తించు.

* తుత్థభస్మ గుణదోషములు. *

శ్లో॥ తుత్థభస్మ కఫంహన్తిపామాంకుష్ఠవిషంకృమీన్ । చక్షుష్యం లేఖనంభేదిశుద్ధిహీనంహిదోషకృత్॥ ౨౨౨॥

తా॥ శుద్ధిజేయబడిన మైలుతుత్థభస్మము కఫము, దురద, కుష్ఠువు, విషము, క్రిమివాతాదిదోషములు వీటినినివారింపంజేయుటయేగాక నేత్రములకు హితము, మలవిసర్జనము వీటినిసగాగలుగంజేయు. శుద్ధిజేయని తుత్థభస్మము త్రిదోషములకు ప్రకోపమును గలుగఁజేయునదిగనుండు.

* అపక్వతుత్థదోషశాంతి. *

శ్లో॥ జంబీరస్వరసంవాపిలాజావారిసమన్వితాః । లామజ్జకజలంవాపి పిబేత్తుత్థకశాంతయే॥ ౨౨౩॥

తా॥ నిమ్మపండ్లరసము, పేలాలనునానవేసిన నీళ్లు, వట్టివేరును నానవేసిన నీళ్లు వీటిలోదేనినైనను మూడుదినములు త్రాగిన అపక్వతుత్థభస్మసేవనచేగలిగిన దోషములు నివర్తించు.

* పక్వశిలాజతు భస్మ గుణము. *

శ్లో॥ పాండురంసికతాకారంకర్పూరాభంశిలాజతు । మూత్రకృచ్ఛ్రాశ్మరీమేహకామలాపాండునాశకృత్॥ ౨౨౪॥

తా॥ పక్వమగు శిలాజతుభస్మము ఇసుకవలెను, కర్పూరమువలెను తెల్లగనుండు. మఱియు మూత్రకృచ్ఛ్రము - అశ్మరీరోగము - ప్రమేహము- కామిల- పాండువు వీటిని నశింపంజేయు.

* అపక్వశిలాజతుభస్మ దోషము. *

శ్లో॥ అశుద్ధందాహమూర్ఛాదీన్భ్రమపిత్తాస్రశోణితం । శిలాజతు ప్రకురుతేమాంద్యమగ్నేశ్చపిట్కహం॥ ౨౨౫॥

తా॥ అశుద్ధశిలాజతుభస్మము దాహము - మూర్ఛాదిరోగములు - భ్రమ - రక్తపిత్తము - రక్తస్రావము - అగ్నిమాంద్యము - మలబద్ధము వీటినిగలుగంజేయు.

* అశుద్ధశిలాజతుదోషశాంతి. *

శ్లో॥ మరిచంఘృతసంయుక్తంసేవయేద్దినసప్తకం । శిలాజతుభవం
దోషంశాంతిమాప్నోతినిశ్చితం॥ ౨౨౬॥

తా॥ మిరియాలచూర్ణమునునేతితో ౭ దినములుసేవించిన అపక్వశిలాజతుభస్మసేవనచే జనించిన వికారము నివర్తించు.

* శుద్ధపారదభస్మపక్వగుణము. *

శ్లో॥ యావన్నహారబీజంతుభక్షయేత్పారదంమృతం । తావత్తస్య
కుతోముక్తిర్ముక్తిర్గాత్రరోగాద్భవాదపి॥ ౨౨౭॥

తా॥ మనుజుడెంతపర్యంతము పారదభస్మమును సేవించడో అంతపర్యంతము పాపానుభవము - రోగము - సంసారము - యివియెటులనివర్తించు?

* అన్యచ్చ. *

శ్లో॥ మూర్ఛాతోగదహృత్తథైవస్వగతింధత్తేవివృద్ధ్యాఽర్థదం।స్యాద్భ
స్మామయవార్ధకాదిహరణందృక్పుష్టికాంతప్రదం । వృష్యంమృ
త్యువినాశనంబలకరంకాంతాజనానందదం । శార్దూలాతుల
సత్వకృచ్ఛుభవిజాన్రోగాన్హరేద్వైస్ఫుటం॥ ౨౨౮॥

తా॥ శుద్ధపారదభస్మము ఆకాశగమనము - శరీరపుష్టి - ధనము - నేత్రనైర్మల్యము - కాంతి - వీర్యవృద్ధి - బలము - స్త్రీలకుతృప్తినిగలుగజేయుట - పెద్దపులితో సమానమైనబలము - వీటిని గలుగంజేయు. మఱియురోగము, ముసలితనము మొదలైనవి, మృత్యువు, సమస్తరోగములు వీటిని నివర్తింపంజేయు.

శ్లో॥ రసోరసరసైర్యుక్తఃశోధితోభస్మసాత్కృతః ।త్రిదోషశమనః
కామఃవర్ధనఃసర్వరోగహృత్ ॥ కామినీదర్పదలనఃసుధాస్వర్గీ
సువర్ణకృత్ । చక్షుష్యస్మృతిదౌర్బల్యరూపదఃకృమికుష్ఠహా ॥
జరామరణజాడ్యఘ్నోయోగవాహీవరాంగనే । దహత్యగ్ని
స్తృణానీవధాతుస్థానామయాన్రసః॥ ౨౨౯॥

తా॥ పాదరసము షడ్రసములతో చేరియుండును, దానిని శుద్ధిపరచి భస్మము చేసి సేవించిన నది త్రిదోషములు, సర్వరోగములు వీటిని నివర్తింపజేయు. మరియు నిరుక్రిమిరోగము, కుష్ఠువు, ముదిమి, అపమృత్యుజాడ్యము ధాతుగతరోగములు వీటిని "అగ్ని తృణములను దహించుభంగి" నివర్తించుటయేగాక కామవృద్ధికరముగను, సురతకాలమునందు వీర్యవృద్ధికరముగను, అమృతతుల్యముగను, శరీరమునకు మంచికాంతిని గలుగజేయునదిగను, నేత్రములకు బలకరముగను, స్మృతి-సౌందర్యము వీటిని వృద్ధిపరచునదిగనునుండును.

## ※ అశుద్ధాఽపక్వపారదభస్మదోషము. ※

శ్లో॥ సంసారహీనంఖలుసూతరాజం యస్సేవతేతస్యకరోతిబాధాం । దేహస్యనాశంవిదధాతినూనంకుష్ఠాదిరోగాఞ్జనయేన్నరాణాం॥ ౨౩౦॥

తా॥ అశుద్ధాపక్వపారదభస్మమును సేవించినవానికి శరీరబాధ - దేహనాశనము - కుష్ఠాదిరోగములు వీటినిగలుగం జేయు.

## ※ అన్యచ్చ. ※

శ్లో॥ అశుద్ధోజడతాంకుష్ఠందాహంవీర్యప్రణాశనం। మూర్ఛాంస్ఫోటంచమృత్యుంచక్రమాత్కుర్యాన్నసైరసః॥ ౨౩౧॥

తా॥ శుద్ధిచేయని పాదరసమునాగదోషముచే జడత్వము, వంగదోషముచే కుష్ఠరోగము, అగ్నిచాంచల్యముచే అధికతాపము, అసహ్యాగ్నిచే వీర్యనాశము, విషముచే మూర్ఛయు, మలముచే స్ఫోటకమును, పర్వతముచే మరణము వీటిని యథాక్రమముగ గలుగంజేయు.

## ※ అశుద్ధాఽపక్వపారదదోషశాంతి. ※

శ్లో॥ వికారాయదిజాయంతేపారదాన్మలసంయుతాత్ । గంధకం సేవయేద్ధీమాన్పాచితంవిధిపూర్వకం॥ ౨౩౨॥

తా॥ విధిపూర్వకముగ పక్వముచేయబడినగంధకమును సేవించిన అశుద్ధాఽపక్వపారదభస్మ సేవనచేగలిగిన దోషము నివర్తించు.

## ※ అన్యచ్చ. ※

శ్లో॥ గవాందుగ్ధయుతంపీత్వాగంధకందినసప్తకం। పారదస్యవికారేణ ముక్తస్సుఖమవాప్నుయాత్॥ ౨౩౩॥

తా॥ శుద్ధిజేసిన గంధకమును ఆవుపాలులోవైచి దానిని ఏడుదినములుత్రాగిన పాదరససేవనచేగలిగిన దోషములు తొలగి సౌఖ్యముకలుగు.

✻ రససిందూరశుద్ధభస్మగుణము. ✻

శ్లో॥ హరతిచరససిందూరంకాసశ్వాసాగ్నిమాంద్యమేహగణాన్ ।
రక్తవికారంకృచ్ఛ్రంజ్వరాదిరోగాన్యథానుపానయుతం ॥

తా॥ రససిందూరమును తగుమైన అనుపానములో సేవించినకాస, శ్వాస, అగ్నిమాంద్యము, నానావిధప్రమేహములు, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము యివిమొదలగు రోగములునశించు.

✻ రససిందూర అపక్వదోషశాంతి. ✻

శ్లో॥ రససిందూరమశుద్ధాద్రసాద్విజాతంపారదవద్రోగాన్ । కు
ర్యాచ్చేత్తచ్ఛాంత్యైఘృతమరిచరజఃపిబేత్తుసప్తదినం॥ ౨౩౫॥

తా॥ అశుద్ధపాదరసముచేరససిందూరముచేసినను, లేకవిధిప్రకారముపక్వము కాకపోయినను ఆరసిందూరము పక్వము కానిపాదరసమువలె పెక్కుదారుణమగు వ్యాధులను గలుగంజేయు. అందులకై మిరియాలచూర్ణమును, ఆవునేతిలోమిళితము జేసి ఏడుదినములుసేవించిన అపక్వరససిందూరసేవనచే గలిగిన దోషములన్నియు నివర్తించు.

✻ రసకర్పూరపక్వగుణము. ✻

శ్లో॥ దేవకుసుమచందనకస్తూరికుంకుమైర్యుక్తం। ఖాదన్హరతిఫిరంగం
వ్యాధింసోపద్రవంఘోరం। విందతివహ్నేర్వృద్ధింపుష్టింవీర్యంబలం
విపులం। రమయతిరమణీశతకంరసకర్పూరస్యసేవకస్సతతం॥

తా॥ శుద్ధిజేసిన రసకర్పూరమును, లవంగము - చందనము - కస్తూరి - కుంకుమపువ్వు - వీటినినూరిదానితోసేవించిన ఫిరంగరోగము - వుపద్రవములతో గూడిన భయంకరమగు వ్యాధులు యివి నివర్తించు. మఱియు, అగ్నిదీపనము - శరీరపుష్టి - వీర్యవృద్ధి - మిగులబలము-నూరుస్త్రీలతోరమించుశక్తివీటిని గలుగంజేయు.

✻ రసకర్పూరఅపక్వదోషము. ✻

శ్లో॥ సేవితోవిధినాకుష్ఠంసంధివాతంకఫాధికం। రసకర్పూరకఃకుర్యా
త్తస్మాద్యత్నేనసేవయేత్॥ ౨౩౬॥

తా॥ శాస్త్రోక్తప్రకారము శుద్ధిజేయని రసకర్పూరము కుష్ఠువు, సంధివాతము, కఫాదిరోగములు వీటినికలుగంజేయుగాన దీనినిమిగుల ప్రయత్నముతో శుద్ధిజేసి పుచ్చుకొనవలయు.

※ అశుద్ధరసకర్పూరదోషశాంతి. ※

శ్లో॥ మహిషీశకృతోనీరంధాన్యాకంవాసితాయుతం । పిబేన్నీరేణ
ముక్తస్స్యాద్రసకర్పూరజైర్గదైః॥ ౨౩౮॥

తా॥ ఎనపపేడరసముగాని, ధనియాలచూర్ణము-తెల్లచక్కెర వీటిని ఉదకములోవైచిదానినిగాని, త్రాగిన అశుద్ధమగురసకర్పూరసేవనచే గలిగినదోషము లన్నియు నివర్తించు.

※ శుద్ధగంధకభస్మగుణము. ※

శ్లో॥ శుద్ధోగంధోహరేద్రోగానుకుష్ఠమృత్యుజ్వరాదికాన్ । అగ్ని
కారీమహానుష్ణోవీర్యవృద్ధింకరోతిహి॥ ౨౩౯॥

తా॥ శుద్ధగంధకభస్మము కుష్ఠము - మృత్యువు - జ్వరము యివి మొదలైన రోగములను హరించుటయేగాక అగ్నిదీపనము - శరీరమునకు పుష్టిను - వీర్యవృద్ధి వీటినిసగా గలుగంజేయు.

※ అశుద్ధగంధకభస్మదోషము. ※

శ్లో॥ అశుద్ధగంధఃకురుతేచకుష్ఠంతాపంభ్రమంపిత్తరుజాంతథైవ ।
రూపంసుఖంవీర్యబలంనిహన్తితస్మాద్విశుద్ధోవినియోజనీయః॥

తా॥ అశుద్ధగంధకభస్మము కుష్ఠము - తాపము - భ్రమ - పిత్తము-వీటిని గలుగంజేయుటయేగాక రూపము - సుఖము - వీర్యము - బలము- వీటినిసగానశింపంజేయుగాన శుద్ధగంధకభస్మమునే సేవించవలయు.

※ అశుద్ధగంధకదోషశాంతి. ※

శ్లో॥ గవాంపయోఘృతైర్యుక్తంవలీవిక్రృతిశాంతికృత్ । తథైవదేవ
కుసుమంవచాయుక్తంచశాంతికృత్॥ ౨౪౦॥

తా॥ ఆవుపాలు - నెయ్యివీటిని కలిపిత్రాగిన అశుద్ధగంధక భస్మసేవనచే గలిగిన దోషములుహరించు. మఱియు లవంగములు, వస వీటిని నేకముగచూర్ణించి పుచ్చుకొనిన - అశుద్ధగంధకభస్మసేవనచేజనించిన దోషములుశాంతమగు.

### * శుద్ధహింగుళగుణము. *

శ్లో॥ తిక్తంకషాయంకటుహింగుళంస్యాన్నేత్రామయఘ్నంకఫపిత్తహారీ । హృల్లాసకుష్ఠజ్వరకామిలాశ్చప్లీహామవాతౌచగదాన్నిహంతి॥ ౨౮౨॥

తా॥ శుద్ధహింగుళ భస్మము చేదుగను, వగరుగను, కారముగనునుండును. మఱియునిది నేత్రరోగము - కఫము - పిత్తము - హృల్లాసరోగము - కుష్ఠము - జ్వరము - కామిల - ప్లీహము - ఆమవాతము వీటినినివర్తింపంజేయు.

### * అశుద్ధహింగుళదోషము.

శ్లో॥ అశుద్ధోదరదఃకుర్యాత్కుష్ఠంక్లైబ్యంక్లమంభ్రమం। మోహంచ శోధయేత్తస్మాత్సిద్ధవైద్యస్తుహింగులం॥ ౨౮౩॥

తా॥ అశుద్ధహింగుళభస్మము కుష్ఠము - నపుంసకత్వము - శ్రమము - భ్రమము - మోహము - వీటినిగలుగంజేయుగాన దీనిని శుద్ధిజేయుట యత్యావశ్యకము.

### * అశుద్ధహింగుళదోషశాంతి. *

శ్లో॥ ఉత్పద్యతేయదావ్యాధిర్దరదస్యనిషేవణాత్ । తదాసూతకవత్సర్వాకార్యాశాంతిప్రతిక్రియా॥ ౨౮౪॥

తా॥ అశుద్ధహింగుళభస్మ సేవనచే గలిగిన దోషములకు, అశుద్ధరసభస్మ జన్య దోషమునకు చెప్పబడిన శాంతినిజేసిననవి నివర్తించు.

### * పక్వఅభ్రకభస్మ గుణము. *

శ్లో॥ మృతాభ్రకంకామబల ప్రదంచవిషంమరుచ్ఛ్వాసభగందరాఖ్యం । మేహాభ్రమంపిత్తకఫంచకాసంక్షయంనిహన్త్యేవయథానుపానాత్॥ ౨౮౫॥

తా॥ శుద్ధిజేసిన అభ్రకభస్మమును యుక్తానుపానములో సేవించిన నది, విషము - వాతము - శ్వాసము - భగందరము - మేహము - భ్రమ - పిత్తము - కఫము - కాసము - క్షయము - వీటిని నివర్తింపంజేయుటయేగాక కామము - బలము - వీటిని సగాగలుగంజేయు.

### * గ్రంథాంతరే. *

శ్లో॥ శుద్ధాభ్రింననువల్లకద్వయమితంకృష్ణామధుభ్యాంయుతం । మే
హాశ్వాసవిషంచకుష్ఠమతులంవాతాంశ్చపిత్తాన్కఫాన్॥ కాస
క్షీణక్షతక్షయగ్రహణికాపాండుభ్రమంకామలం । గుల్మా
ద్యంచయథానుపానవిధినామృత్యుంచజేజీయతే॥ ౨౪౬॥

తా॥ శుద్ధాభ్రకమును, ఆరుగురిగింజల ప్రమాణముగల తేనెలో పిప్పలిచూర్ణమువైచి దానితో సేవించిన మేహము, శ్వాస, విషవికారము, కుష్ఠురోగము, వాతరోగములు, పిత్తరోగములు, కఫరోగములు, కాస, క్షీణత్వము, గాయము - క్షయరోగము - గ్రహణి - పాండువు, భ్రమ, కామిల, గుల్మము యివి మొదలగు రోగములు - అకాలమృత్యువు వీటిని నశింపంజేయు.

### * మతాంతరే. *

శ్లో॥ వాతపిత్తకఫాన్మేహకుష్ఠశ్వాసవిషభ్రమాన్ । గుల్మకాస
క్షతక్షీణగ్రహణీపాండుకామలాః । భగందరాదికాన్హన్యాద
భ్రింకామబలప్రదం॥ ౨౪౭॥

తా॥ అభ్రకభస్మము వాతము, పిత్తము, కఫము, ప్రమేహము, కుష్ఠువు శ్వాస, విషము, భ్రమ, గుల్మము, కాస, క్షతక్షయము, గ్రహణీరోగము, పాండువు, కామిల, భగందరము, యివి మొదలగురోగములను నశింపంజేయుటయేగాక వీర్యవృద్ధి - బలము వీటిని సగాగలుగంజేయు.

### * అపక్వఅభ్రకభస్మదోషము. *

శ్లో॥ చంద్రికాసహితమభ్రకంయదాజీవితంఝుడితినాశయేత్తదా ।
వ్యాఘ్రిరోమయివచోదరస్థితంవాతసావితనుతేగదాన్బహూన్॥

తా॥ తళుకుతోకూడియుండిన అభ్రకభస్మమును సేవించిన ప్రాణహానిగలుగు. లేక, "పెద్దపులివెండ్రుక కడుపులోపోయిన అనేకరోగములను పుట్టించుచందంబున" అనేకరోగములనైనను గలుగంజేయు.

శ్లో॥ స్తోకాయుస్తైఃపుష్టైస్సైకైరపక్వైరభ్రకస్తథా । యథావ్యా
ఘ్రిస్యరోమేవపంచత్వముపజాయతే॥ ౨౪౮॥

తా॥ మాత్రా ప్రమాణవిహీనంబును, పుటహీనంబునునగు అభ్రకము, వ్యాఘ్రరోమముతో సమానమై ప్రాణహానినిగలుగంజేయు.

* అపక్వాభ్రకదోషశాంతి. *

శ్లో॥ ఉమాఫలంవనేపిష్ట్వా సేవయేద్వ్యాదినత్రయం అశుద్ధాభ్రకదో
షేణవిముక్తస్సుఖమేధతే॥ ౨౫౦॥

తా॥ ఉసిరికవలుపును వుదకముతో నూరి మూడుదినములు సేవించిన అశుద్ధ అభ్రకభస్మసేవనవలన జనించిన వికారములు తొలగి సుఖముగనుండును.

* పక్వహరితాళభస్మగుణము. *

శ్లో॥ అశీతివాతాన్కఫపిత్తరోగాన్ కుష్ఠంచ మేహంచ గుదామయాం
శ్చ । నిహంతిగుంజార్ధమితంతు తాళం షడ్వల్లఖండేనసమంచ
యుక్తం॥ ౨౫౧॥

తా॥ అర (½) గురుగింజయెత్తు హరితాళభస్మమును ఆరువల్లముల కలకండచూర్ణమునుచేర్చి సేవించిన అశీతివాతములు, కఫము, పిత్తరోగములు, కుష్ఠువు, మేహము, గుదరోగము, యివినివర్తించు.

శ్లో॥ హంతివాతామయాన్సర్వాన్కఫపిత్తగుదామయాన్ । హరి
తాళంమృతంకుష్ఠం ప్రమేహం జ్వరాదికాన్॥ ౨౫౨॥

తా॥ హరితాళభస్మము యెనభై విధములగువాతరోగములు, పిత్తరోగములు, కఫరోగములు, గుదరోగము, కుష్ఠురోగము, ప్రమేహరోగము, జ్వరాదిరోగములు వీటిని హరింపంజేయు.

* అపక్వహరితాళభస్మదోషము. *

శ్లో॥ అశుద్ధతాళంఖలుపీతవర్ణం సధూమకం వాతచయంచపిత్తం। పంగు
త్వకుష్ఠంతనుతేనరాణాం దేహస్యనాశంప్రకరోతిసద్యః॥ ౨౫౩॥

తా॥ అశుద్ధహరితాళకభస్మము, వాతసమూహము, పిత్తము, పంగుత్వము, కుష్ఠువు వీటిని గలుగంజేయుటయేగాక, శరీరమునకు పీతధూమవర్ణములు - శీఘ్రముగనాశనము వీటిని సగా గలుగంజేయు.

* అపక్వహరితాళభస్మదోషశాంతి. *

శ్లో॥ అజాజీశర్కరాయుక్తం సేవయేద్వ్యాదినత్రయం । వికృతీస్తాల
జాహన్యాద్యథా దారిద్ర్యముద్యమే॥ ౨౫౪॥

తా॥ తెల్లజీలకఱ్ఱను శర్కరతో మూడుదినములు సేవించిన "ఉద్యోగము దారిద్ర్యమును బోగొట్టుచందంబున" అపక్వహరితాళభస్మజనితదోషమును నివర్తింపంజేయు.

శ్లో॥ దాడిమస్యఫలంపక్వంజలంతస్యాపిచేన్నరః । పింగవికారశాంతి
స్స్యాత్పాతకంగురువందనే॥ ౨౫౫॥

తా॥ చక్కనిదానిమ్మపండు విత్తులరసమును త్రాగిన అపక్వహరితాళక భస్మ సేవనచేగలిగినదోషములు "గురువందనముచేత పాతకములు నశించుభంగి" నశించు.

శ్లో॥ జీరకంశర్కరాయుక్తంసేవయేద్దినసప్తకం। తాళవికారశాంతి
స్స్యాద్దారిద్ర్యముద్యమేయథా॥ ౨౫౬॥

తా॥ జీలకఱ్ఱ, శర్కర, వీటినిసమముగజేర్చి ఏడుదినములు పుచ్చుకొనిన "ఉద్యోగముచేదారిద్ర్యము తొలగుచందంబున" అపక్వహరితాళక భస్మమును సేవించుటవలన గలిగినదోషములునశించు.

శ్లో॥ కూష్మాండస్యరసం దేయందురాలభాంతథైవచా । రాజహం
సీరసంతావత్తాలవికృతిశాంతికృత్॥ ౨౫౭॥

తా॥ బూడిదగుమ్మడు, దురదగొండివేళ్లు, రాజహంస వీటిరసమును సమముగజేర్చి పానముచేసిన, అపక్వ హరితాళక భస్మసేవనచేజనించిన దోషములు నివర్తించు.

శ్లో॥ సువర్ణపుష్పభూనింబక్వాథం సేవేద్దినత్రయం। తాలవికారశాం
తిస్స్యాత్కామశాంతిర్యథాస్త్రియాః॥ ౨౫౮॥

తా॥ నల్లవుమ్మెత్తపూలుగాని లేక, వ్రాకుఁపువేళ్లు - నేలవేము వీటినిసమభాగములుగాజేర్చి దంచి కషాయముబెట్టిత్రాగిన "సౌందర్యవతియగు స్త్రీసంగముచే కామముతృప్తిజెందుచందంబున" అపక్వహరితాళక భస్మసేవనవలన గలిగిన దోషములుహరించు.

శ్లో॥ యథారసవిషంహన్యాద్గోదుగ్ధేనచగంధకం । ససితాసర్పా
క్షీరసస్తథాతాళవిషంపునః॥ ౨౬౯॥

తా॥ ఆవుపాలలో శుద్ధగంధకచూర్ణమునువైచి దానిని సేవించిన పాదరస దోషంబును, శర్కర - సర్పాక్షిరసము వీటినిసమముగజేర్చి పుచ్చుకొనిన అపక్వ హరితాళక భస్మసేవనచే గలిగిన దోషములు పోలగు.

## * పక్వమనశ్శిలగుణము. *

శ్లో॥ మనశ్శిలాసర్వరసాయనాఖ్యాతిక్తాకటూష్ణాకఫవాతహంత్రీ।
సత్వాత్మికాభూతవిషాగ్నిమాంద్యం కండూంచకాసక్షయ
హారిణీచ॥ ౨౬౦॥

తా॥ మణిశిల భస్మము సర్వరసాయనములతో సమానముగను, చేదుగను, కారముగను, ఉష్ణముగను, సాత్వికముగనునుండు. మఱియు కఫము - వాతము - భూతబాధ - విషము - అగ్నిమాంద్యము - దురద - కాస - క్షయ - వీటిని నశింపంజేయు.

శ్లో॥ జ్వరంనేత్రామయంశ్వాసంకాసంభూతభయంకఫం। కృచ్ఛ్రం
విషంమనోగుప్తాహంతికుష్ఠాదికామయాన్॥ ౨౬౧॥

తా॥ శుద్ధమణిశిలభస్మము, జ్వరము, నేత్రరోగము, శ్వాస, కాస, భూతపీడ, కఫరోగము, మూత్రకృచ్ఛ్రము, విషము, కుష్ఠువు యివి మొదలగు రోగములను నశింపంజేయు.

## * అపక్వమనశ్శిలదోషము. *

శ్లో॥ మనశ్శిలామందబలంకరోతిజంతూన్ధ్రువంశోధనమంతరేణ। మ
లస్యబంధంకిలమూత్రరోగంసశర్కరంకృచ్ఛ్రగదంచకుర్యాత్॥

తా॥ పక్వముగాని మనశిలభస్మమును సేవించిన బలహీనత- జంతురోగము- మలబంధము- సున్నపుసుద్దతో గూడియుండు మూత్రకృచ్ఛ్రము వీటినిగలుగంజేయు.

శ్లో॥ అశుద్ధాకునటీకుర్యాద్వాంతిర్భ్రాంత్యాదికాన్గదాన్॥ ౨౬౩॥

తా॥ శుద్ధిజేయని మనశ్శిలభస్మమును సేవించిన వాంతి- భ్రాంతి యివిమొదలగు అనేక రోగములను గలుగజేయు.

## * అశుద్ధమనశిలదోషశాంతి. *

శ్లో॥ గోక్షీరంమాక్షికయుతంపిబతేయోదినత్రయం। కునటీతస్యదే
హేచవికారంనకరోతిహి॥ ౨౬౪॥

తా॥ ఆపుపాలలో తేనెనైచి మూడుదినములు సేవించిన అశుద్ధ మనుశిల భస్మ సేవన చేజనించిన దోషము నివృత్తియగు.

## ✻ శుద్ధసౌవీరభస్మగుణము. ✻

శ్లో॥ సౌవీరం గ్రాహిమధురం చక్షుష్యం కఫవాతజిత్ । సిధ్మక్షయా
స్రనుచ్ఛీతం స్రోతోఞ్జనమపీదృశం॥ ౨౬౫॥

తా॥ శుద్ధ సౌవీరభస్మము గ్రాహకముగను (భేదికట్టుట) తియ్యగను, నేత్రహిత కారిగను, శీతలముగనునుండును. మఱియు కఫము - వాతము - సిధ్మరోగము - క్షయ - రక్తదోషము కండ్లనీరుగారుట వీటిని హరింపంజేయు.

## ✻ అశుద్ధసౌవీరభస్మదోషము. ✻

శ్లో॥ అశుద్ధసౌవీరాద్దేహే నేత్రే చ భవంతి రోగాః॥ ౨౬౬॥

తా॥ అశుద్ధ సౌవీరభస్మమును సేవించిన శరీరము నేత్రము వీటియందనేక రోగములను గలుగంజేయు.

## ✻ అశుద్ధసౌవీరదోషశాంతి. ✻

శ్లో॥ త్రిఫలాసేవనాద్భవతి సౌవీరజనితవికారాణాం శాంతిః॥ ౨౬౭॥

తా॥ త్రిఫలములను సేవించిన అశుద్ధ సౌవీరభస్మ జనితదోషములు నివృత్తియగు.

## ✻ పక్వఖర్పరభస్మగుణము. ✻

శ్లో॥ త్రిదోషజిత్పిత్తకఫాతిసారక్షయజ్వరఘ్నో రసకో ఽతిరూక్షః । నే
త్రామయానాం ప్రకరోతి నాశం శ్యాద్రంజకః కామలనాశనశ్చ॥

తా॥ పక్వమైన ఖర్పరభస్మము రూక్షముగను, మనోల్లాసకరముగనునుండు, మఱియు త్రిదోషములు - పిత్తము - కఫము - అతిసారము - క్షయ - జ్వరము - నేత్రరోగములు - కామిల వీటిని నశింపంజేయు.

శ్లో॥ రసకోహరతే రోగాన్ రక్తదోషం గుదామయం । జీర్ణజ్వరమతీ
సారం ప్రదరాదిగదానపి॥ ౨౬౮॥

తా॥ శుద్ధిజేసిన ఖర్పరభస్మము, రక్తదోషము, గుదరోగము, జీర్ణజ్వరము, అతిసారము, ప్రదరరోగము యివి మొదలైన యనేకరోగముల నశింపంజేయు.

### * అపక్వఖర్పరభస్మదోషము. *

శ్లో॥ అశుద్ధః ఖర్పరః కుర్యాద్వాంతింభ్రాంతిం విశేషతః। తస్మాచ్ఛోధ్య ప్రయత్నేన యథావద్వాంతి వివర్జితః॥ ౨౭౦॥

తా॥ అశుద్ధ ఖర్పరభస్మము వాంతి భ్రాంతి వీటిని గలుగఁజేయు. గానయి ట్టిగుణములు గలుగకయుండునటుల శుద్ధిజేయఁదగు.

### * అశుద్ధఖర్పరభస్మదోషశాంతి. *

శ్లో॥ రసకనిషేవణతోయదిరోగాః ప్రాదుర్భవంతి మనుజానాం। తే నాశమాప్నువంతి పీతం గోమూత్రపానతః సప్తాహం॥ ౨౭౧॥

తా॥ గోమూత్రమును ఏడుదినములు పానముజేసిన అశుద్ధ ఖర్పరభస్మజనిత రోగములు నివర్తించు.

### * పక్వవజ్రభస్మగుణము. *

శ్లో॥ ఆయుః ప్రదం సద్గుణదం చ వృష్యం దోషత్రయప్రశమనం సకలామయఘ్నం సూతేంద్రబంధవధసద్గుణదం ప్రదీప్తం మృత్యుంజయం తదమృతోపమమేవ వజ్రం॥ ౨౭౨॥

తా॥ శుద్ధవజ్రభస్మము ఆయుస్సు, సద్గుణము, వీర్యపుష్టి, శరీరకాంతి వీటిని గలుగఁజేయుటయేగాక అమృతతుల్యముగనుండు. మఱియు త్రిదోషములు, సమస్త రోగములు, అపమృత్యువు వీటిని బోగొట్టును. ఇది కట్టుబడిన రసము, మారితమైన రసము దీనితో సమానమైన గుణమును గలుగఁజేయు.

### * అశుద్ధాఽపక్వవజ్రభస్మదోషము. *

శ్లో॥ పీడాం విధత్తే వివిధాం నరాణాం కుష్ఠం క్షయం పాండుగదం చ దుష్టం। హృత్పార్శ్వపీడాం కురుతే తిదుస్సహామశుద్ధవజ్రం గురుమాత్మహంత్యాజేత్॥ ౨౭౩॥

తా॥ అశుద్ధపక్వవజ్రభస్మము, శరీరమునకు నానావిధములైన బాధలు, కుష్ఠము, క్షయము, దుష్టమగుపాండురోగము, హృద్రోగము, పార్శ్వపీడ, సహింపఁ గూడని రొమ్మునొప్పి, పార్శ్వనొప్పి, ఆత్మహత్య వీటిని గలుగఁజేయుగాన దీనిని సేవించవలదు.

* అశుద్ధాఽపక్వవజ్రభస్మదోషశాంతి. *

శ్లో॥ సితామధుఘృతైస్సాకంగోదుగ్ధందినసప్తకం। విధినాసేవితం హంతివజ్రదోషంచిరోత్థితిం॥ ౨౭౪॥

తా॥ పాలయందు చక్కెర, తేనె, నెయ్యి వీటినివైచి యేడుదినములు విధిపూర్వకముగ సేవించిన బహు కాలమునుండి గలిగియుండిన అశుద్ధాపక్వ వజ్రభస్మసేవనచే గలిగినదోషము నివర్తించు.

* పక్వవైక్రాంతభస్మగుణము. *

శ్లో॥ వైక్రాంతోవజ్రసదృశోదేహంలోహంకరోతిహి। విషఘ్నోరసరాజస్యజ్వరకుష్ఠక్షయప్రణుత్॥ ౨౭౫॥

తా॥ శుద్ధవైక్రాంతభస్మము, వజ్రభస్మముతో సమానమైనగుణము గలిగియుండు. శరీరమును యినుమువలె దృఢముగజేయు. మఱియునిది అశుద్ధరసభస్మదోషము, జ్వరము, కుష్ఠము, క్షయము వీటిని నివర్తింపంజేయు.

* అపక్వవైక్రాంతభస్మదోషము. *

వాక్యం॥ అశుద్ధవైక్రాంతోవజ్రవద్దోషకర్తాభవతి॥ ౨౭౬॥

తా॥ అశుద్ధవైక్రాంతభస్మము, అశుద్ధవజ్రభస్మమునకుగల దోషములను గలుగంజేయు.

* అశుద్ధాఽపక్వవైక్రాంతభస్మదోషశాంతి. *

వాక్యం॥ అశుద్ధవైక్రాంతభస్మశాంతిర్వజ్రవజ్జ్ఞేయా॥ ౨౭౭॥

తా॥ అశుద్ధాపక్వ వైక్రాంతభస్మదోషమునకు, అశుద్ధాపక్వవజ్రభస్మదోషమునకు జెప్పియుండు శాంతినిజేయందగు.

* పక్వప్రవాళభస్మగుణము. *

శ్లో॥ ప్రవాళంమధురంసామ్లంకఫపిత్తాదిదోషనుత్। వీర్యకాంతికరంస్త్రీణాంధృతేమంగళదాయకం ॥ క్షయపిత్తాస్రకాసఘ్నందీపనంపాచనంలఘు । విషభూతాదిశమనంవిద్రుమంనేత్రరోగనుత్॥ ౨౭౮॥

తా॥ పక్వమగు ప్రవాళభస్మము, తీపుగను, పుల్లగను, చులకనగనునుండును. మఱియు వీర్యవృద్ధి, శరీరకాంతి, దీనినిధరించిన స్త్రీలకు మంగళము, అగ్నిదీపనము, జీర్ణము వీటినిగలుగంజేయు. మఱియు నిది కఫము, పిత్తము,క్షయ,రక్తపిత్తము, కాసము, విషము, భూతాదిదోషము నేత్రరోగము వీటిని నివర్తింపంజేయు

## ❋ అపక్వప్రవాళ భస్మదోషము. ❋

వాక్యం॥ అశుద్ధప్రవాళభక్షణాద్భవంతిరోగాహ్యనేకే॥ ౨౭౯॥

తా॥ అశుద్ధప్రవాళ భస్మమును సేవించిన అనేకరోగములు గలుగు.

## ❋ అశుద్ధప్రవాళభస్మదోషశాంతి. ❋

వాక్యం॥ అశుద్ధప్రవాళమౌక్తికయోరపివికారశాంతిర్వజ్రవజ్జ్ఞేయా॥

తా॥ అశుద్ధ ప్రవాళభస్మసేవనచే జనించిన దోషములకు, వజ్రభస్మ దోషమునకు జెప్పంబడిన శాంతిని జేయందగు. ఇటులనే అశుద్ధమౌక్తికభస్మ దోషమునకు గూడ శాంతిని జేయవలయు.

## ❋ మౌక్తికాదిదోషశాంతి. ❋

శ్లో॥ ఘృతంమధుసితాయుక్తంగోదుగ్ధేనసమంపిబేత్ । తస్యమౌక్తి
ప్రవాళస్యహీరకస్యవిషంహరేత్॥ ౨౮౧॥

తా॥ నెయ్యి, తేనె, కలకండ, ఆవుపాలు, వీటిని సమభాగములుగ చేర్చి పుచ్చుకొనిన అశుద్ధమగు ముత్యములు - పగడములు - వజ్రములు మొదలగువాని భస్మసేవనచే జనించిన దోషములు మానును.

## ❋ వజ్రమందారయోర్విషశాంతి. ❋

శ్లో॥ శీతవారిసితాయుక్తంపానంవజ్రీవిషాపహం । వస్త్రవాయు
స్తథాకార్యశ్శీతచ్ఛాయాంచసేవయేత్॥ ౨౮౨॥

తా॥ చల్లనినుదకములో కలకండ చూర్ణమునువైచి పుచ్చుకొనినను, వస్త్రముచేనచ్చెడిగాలిని సేవించినను, చల్లనినీడయందుండినను, బొంతజెముడుపాలు - తీగజముడుపాలు - జిల్లేడుపాలు - వీటిసేవనవలన జనించినదోషము మానును.

## ❋ విషముష్టివిత్తుల దోషశాంతి. ❋

శ్లో॥ ఘృతంమధుసితాయుక్తంసదాపిబతియోనరః । విషకోచవికా
రస్యశాంతిస్తస్యప్రజాయతే॥ ౨౮౩॥

తా॥ నెయ్యి, తేనె, ఖండశర్కర యీటిని నేకముగ జేర్చి ప్రాతస్సాయం కాలములయందు సేవించిన విషముష్టివిత్తుల భక్షణచే జనించినదోషము మానును.

❊ అశుద్ధ భల్లాతకదోషశాంతి. ❊

శ్లో॥ సితయాసహయామాచ్ఛ మేఘనాదరసస్యచ। తస్మాద్భల్లవిషం
హంతియథాలింగప్రసేవనాత్॥ ౭౮౩॥

తా॥ జీడిగింజలసేవనచేజనించిన దోషము, చిర్రికూరరసములో, ఖండశర్కరకలిపి, పుచ్చుకొనిన, లింగారాధనచే పాతకంబులు తొలంగుచందంబున, నాశయామములో నివర్తించు.

❊ అశుద్ధకర్పూరదోషశాంతి. ❊

శ్లో॥ ధాన్యాకంసితయాయుక్తంవారిమర్దితపానతః। కర్పూరస్యని
వృత్తిస్స్యాన్మహిషీశకృతంస్తథా॥ ౭౮౪॥

తా॥ కర్పూరసేవనచేజనించిన దోషము, ధనియాలు,ఉదకముచేనూరి ఖండశర్కరవైచి పానము జేసిన, లేక, గేదెపేడరసము పుచ్చుకొనినను, శాంతియగు.

❊ అశుద్ధగురుగింజలదోషశాంతి. ❊

శ్లో॥ మేఘనాదరసోగ్రాహ్యంశర్కరాయుక్తపానతః। ఉచ్చటా
యావికారస్యశాంతిస్స్యాద్దుగ్ధసేవనాత్॥ ౭౮౫॥

తా॥ గురిగింజసేవనచే జనించినదోషము,చిర్రికూరరసములో ఖండశర్కర కలిపి పుచ్చుకొనినను, లేక, ఆవుపాలు పానముజేసినను శాంతినిజెందు.

❊ అశుద్ధగన్నేరువిషదోషశాంతి. ❊

శ్లో॥ సితాయుక్తంసదాదేయందధివామహిషంపయః। తథాచా
రకత్వచాపీతంకరవీరవిషాపహం॥ ౭౮౬॥

తా॥ గన్నేరు సేవనచేజనించినదోషము, ఖండశర్కరచూర్ణము పెరుగులో వైచి పానము జేసినను, లేక, గేదెపాలులో జిల్లేడువేరుపట్ట చూర్ణము వైచి పుచ్చుకొనినను నివర్తియగు.

❊ అశుద్ధ నేపాళగింజల దోషశాంతి.

శ్లో॥ ధాన్యాకంసితయాయుక్తందధినాసహయఃపిబేత్। దంతిబీజ
వికారస్యనివృత్తిస్తస్యజాయతే॥ ౭౮౭॥

తా॥ నేపాళపుగింజల సేవనచే జనించినదోషము, ధనియాలుకలకండ, వీటిని పొడిచేసి పెరుగులోవైచి త్రాగిన శాంతినిజేయు.

## ❋ అశుద్ధ నవాసాగరదోషశాంతి. ❋

శ్లో॥ గర్దభస్యవిశంభక్షే త్తథైవనవసాగరం। మృత్తికాగైరికాసీమ
కాంచత్రుట్యంచశాంతికృత్॥ ౭౯॥

తా॥ నవాసాగర సేవనచే జనించినదోషము, గాడిదెపెంటికలరసమును త్రాగిన, తాలుగుటయగాక, మట్టి, కావిరాయి, అన్నభేది, వీటినిసేవించిన వాని వలన జనించినదోషములు నగామానును.

## ❋ శీతలాదాహదోషశాంతి. ❋

శ్లో॥ మధూదకయుతంపీతంశీతలందాహనాశనం। నీలికాంచఘృతే
పిష్ట్వాదేహలేపేచశాంతికృత్॥ ౮౦॥

తా॥ శీతలాదాహముచే జనించినదోషము, తేనెను ఉదకములోవైచి పానముజేసినను, లేక, నీలియాకులో నెయ్యివైచి నూరి శరీరమునకు లేపనము చేసినను నివర్తించు.

## ❋ అశుద్ధ వత్సనాభిదోష శాంతి.

శ్లో॥ పటూశనస్యవృక్షస్యరసఃపలప్రమాణతః। శర్కరాయుక్త
పానేనవత్సనాగవిషంహరేత్॥ ౮౧॥

తా॥ వత్సనాభి సేవనచేజనించిన దోషము, పలప్రమాణపు పటూశనవృక్ష రసములో శర్కరవైచి సేవించిన నివృత్తియగు.

## ❋ అశుద్ధఖదిరదోషశాంతి. ❋

శ్లో॥ ఖదిరోద్భంగోపయసాసితాయుక్తంతథైవచా। యస్సేవయే
ద్వాపమేకంభల్లవికృతిశాంతికృత్॥ ౮౨॥

తా॥ చంద్రసేవనచేజనించినదోషము - ఆవుపాలలో ఖండశర్కరచూర్ణమువైచిపానముజేసిన నాకర్షూములో నివర్తించుటయగాక జీడిగింజలచేజనించిన దోషముసగానివర్తియగు.

## ❋ దుష్టవాతజాదిరోగదోషశాంతి. ❋

శ్లో॥ దుష్టవాతోరవేస్తాపైర్లూకరోకప్రజాయతే। చించామ్లకసితా
క్షౌద్రాద్దాపయేత్తుపృథగ్జలే॥ ౮౩॥

తా॥ వాయువు - సూర్యతాపముచే దుష్టమగుటం జేసి లూకరోగము జనించు. అది శాంతిజెందుటకై - చింతపండు - నెల్లికాయలరసము - ఖండశర్కర - తేనె వీటిని ప్రత్యేకప్రత్యేకముగా వుదకములో కలిపి పానముచేయవలయు.

❋ భ్రమరమాక్షికవిషదోషశాంతి. ❋

శ్లో॥ మహిషీనవనీతంచటంకణైస్సహమర్దయేత్ । మాక్షికభ్రామర
స్యాంతంనాఘఫేనేనతత్సమం॥ ౯౪॥

తా॥ తుమ్మెదలు - అడవిఈగలు వీటి విషదోషమునకు - ఎనుము వెన్న - వెలిగారము వీటిని సమభాగముగ గ్రహించి - మర్దించి - శరీరమునకు లేపనము జేసికొనిన - మానుటయేగాక నల్లమందుచే జనించిన వికారమునగా మానును.

❋ జంగమవిషదోషశాంతి. ❋

శ్లో॥ వంధ్యాకర్కోటికామూలంభాగమాత్రేణభావితం । నస్యం
కాంజికసంపిష్టంవిషోపహతచేతసాం॥ ౯౫॥

తా॥ గొడ్డుబీరవేళ్లను మేకమూత్రములో మర్దించి అందులో పుల్లనికలి చేర్చి నస్యముచేసిన జంగమ విషదోషము నివర్తించు.

❋ కోద్రవధాన్యదోష శాంతి. ❋

శ్లో॥ కోద్రవాణాంభవేన్మూర్ఛాదేయంక్షీరంసుశీతలం। సగుడఃకూ
ష్మాండకరసోహంతిమద్యంసకొద్రవం॥ ౯౬॥

తా॥ ఆరికెఅన్నమును భుజించినందున మూర్ఛగలిగినేని ఆవుపాలలో గాని, బూడిదెగుమ్మడికాయరసములో బెల్లమును కలిపిగాని పుచ్చుకొనిన కోద్రవధాన్య భక్షణచే గలిగిన వికారము మానును.

❋ నాగఫేనవిషదోషశాంతి. ❋

శ్లో॥ బృహత్క్షుద్రారసందుగ్ధంపలమాత్రంనిషేవణాత్ । నాగఫేనం
విషంయాతిసజీవతిచిరంపుమాన్॥ ౯౭॥

తా॥ నాగఫేన భక్షణచేజనించిన దోషము - వ్రాకుడురసము - ఆవుపాలలో కలిపియుంధాక పలమువంతున సేవించిన నివర్తించుటయగాక చిరకాలము జీవించు.

* మూషకాద్యల్పజంతు విషదోషశాంతి. *

శ్లో॥ భల్లాతారక్షపలంముస్తాకపికచ్ఛుఫలంతథా । రాలసిద్ధార్థపత్రే షాంచూర్ణధూపప్రభావతః॥ మూషకామశకామక్షీమత్కుణా విషకీటకాః । పలాయంతేగృహం ముక్త్వా యుథాయుద్ధేతి కాతరః॥ ౨౮॥

తా॥ ఎలుకలు - దోమలు - ఈగలు - నల్లులు - విషజంతువులు - ఇవినశించుటకై - జీడిగింజలు - జిల్లేడుకాయలు - తుంగముస్తెలు తీటకోవెలకాయలు-యక్షధూపము - తెల్ల ఆవాలు వీటినిచూర్ణముచేసి గృహములో ధూపమిడిన "యుద్ధమున భయమునుజెంది బరుగిడువాని చందంబున" యివి ఫలాయనంబులగు.

* దంష్ట్రివిషదోష శాంతి. *

శ్లో॥ త్రిఫలాచందనంకుష్ఠమార్ద్రికంఘృతసంయుతం । పానలేపనమాయోగోదంష్ట్రిస్యవిషనాశనః॥ ౨౯॥

తా॥ తేనెటీగల విషముచే జెనించిన దోషము, త్రిఫలములు, శ్రీగంధము, కోష్ఠు, అల్లము, వీటిని చూర్ణముజేసి నేతిలోకలిపి పాన లేపనములు జేసిన, హరించు.

* ఉమ్మెత్త విత్తుల విషదోషశాంతి. *

శ్లో॥ వృంతాకఫలబీజస్యరసోద్విపలమాత్రయా। భక్షణాద్వ్యుక్తధుత్తూరవిషంనశ్యతినిశ్చితం॥ ౩౦॥

తా॥ ఉమ్మెత్తవిత్తులభక్షణచే జెనించిన దోషము, వాకుడువిత్తులను ఉదకమువైచినూరి రసముదీసియందునాలుగుపలములు సేవించిన, హరించు.

* వృశ్చికవిషదోషశాంతి. *

శ్లో॥ హింగుశ్చార్కపయోఘృష్టో దేయోపరిచదాపయేత్ ।వృశ్చికస్య విషంహంతిరజనీంద్యుపతిర్యథా॥ ౩౧॥

తా॥ వృశ్చికవిషదోషము, ఇంగువ - జిల్లేడుపాలు వీటిని సమముగనూరి వృశ్చికదష్టమైనచోట పదేపదే లేపనుజేయుచుండిననది "సూర్యుడుదయించుటచే అంధకారము తొలగుభంగి" తొలగు.

* మృగాంకవిషదోషశాంతి. *

శ్లో॥ గవాంఘృతంసితాయుక్తం మృగాంకస్యచశాంతికృత్ । తథైవచాంమ్లకరసస్సద్యోవికృతిశాంతికృత్॥ ౩౨॥

తా॥ కస్తూరిసేవనచే జనించినదోషము, శర్కరలో ఆవునెయ్యికలిపి సేవించినను - లేక ఉశిరికాయలరసము త్రాగినను నివర్తియగు.

## ❋ తుమ్మెదలకాటుచేజనించుదోషమునకుశాంతి. ❋

శ్లో॥ గోదధిశుంఠిసంయుక్తం పానంభృంగివికారనుత్ । శిఫస్సదం
శజంతద్వజ్జలేపిష్ట్వాపిబేన్నరః॥ ౩౦౩॥

తా॥ తుమ్మెదలకాటుచే జనించినదోషము, శొంఠిలో ఆవుపెరుగునైచినూరి ఆపెరుగులో నేయికలిపిపానముజేసినను - లేక - సోపు - పసపు - వీటిని - వుదకమునైచినూరి ఆఉదకానుపానములో సేవించినను, నశించు.

## ❋ సర్పాదివిషదోషశాంతి. ❋

శ్లో॥ గోజిహ్వాఫలినీశక్రవారుణీవాత్రిపర్ణికా । ఏకైకాపానమాత్రే
ణసర్పాదిగరళంహరేత్॥ ౩౦౪॥

తా॥ సర్పాదివిషదోషము, ఎద్దునాలుకచెట్టు - తరిగొట్టుచెట్టు - అగసిపెక్కుడుతీగె వీటిలో ఏరసమునైనను పానముజేసిన, తొలుగు.

## ❋ పోకలుమొదలగువానిదోషశాంతి. ❋

శ్లో॥ పూగీఫలంజదేశీతవస్త్రవాతోహితంభవేత్ । శర్కరాభక్షు
ణాదేయామధువాశర్కరాన్వితం॥ ౩౦౫॥

తా॥ వక్కలను భక్షించుటచేకలిగెడుదోషము, (సొక్కు) చల్లనినీటియందు వస్త్రముతడిపి నావస్త్రముయొక్క ఘాలిసేవించినను, లేక - శర్కర - లేక శర్కరనెయ్యికలిపి సేవించిన, నివర్తించు.

## ❋ శ్వానవిషదోషశాంతి. ❋

శ్లో॥ శ్వానస్యాపివిషంహంతిలేపంకుక్కుటవిష్ఠయా। గుడైస్తైలార్క
దుగ్ధైశ్చలేపశ్శ్వానవిషంహరేత్॥ ౩౦౬॥

తా॥ కుక్కకరచినదోషము, కోడిమలమునైనను - లేక - బెల్లము-తిలతైలము-జిల్లేడుపాలు వీటిని నేకముగకలిపియైనను లేపనముజేయుచుండిన, నివర్తియగు.

## ❋ సింహాబాలవిషదోషశాంతి. ❋

శ్లో॥ మధోశ్చపలమానంతుదినంవింశతియఃపిబేత్ । తస్యసింహస్య
బాలస్యవిషనస్యాత్కదాచన॥ ౩౦౭॥

తా॥ శ్వింహబాలవిషదోషము, (వ్యాఘ్రరోమజంతువిషము) పూటుకుపలము చొప్పున యిరువదిదివసంబులు తేనెను పానము జేసిన, తొలుగును.

* శరటవిషదోషశాంతి. *

శ్లో॥ అర్కమూలవచాచూర్ణంపీతంశ్శీతేనవారిణా । తస్యాశరటవిషం సద్యశ్శాంతిర్భవతినిశ్చితం॥ ౩౦౮॥

తా॥ తొండకాటుచేజనించిన విషదోషము, జిల్లేడువేరు, వస, వీటిని చూర్ణము జేసి శీతోదకములో వైచి పానము జేసిన,హరించును.

* యూకాదిదంశనవిషదోషశాంతి. *

శ్లో॥ శ్రీమూలంగోజలేఘృష్ట్వాదేహలేపంచకారయేత్ । యూకాచ లిక్షుకావాపినాశయంత్యపితత్క్షణాత్॥ ౩౦౯॥

తా॥ గోమూత్రముచేత మారేడువేరును, గంధముతీసి శరీరమునకు లేపనము జేసికొనిన, పేనులు, ఈరులు, చీదపేనులు మొదలగునవి తత్క్షణమేనివర్తించును.

* దుష్టజంతువిషదోషశాంతి. *

శ్లో॥ విశంక్రౌంచంజలేఘృష్ట్వానిత్యంపిబతియోనరః । తస్యోదరేదుష్ట జంతోర్విషంనస్యాతతత్క్షణాత్॥ ౩౧౦॥

తా॥ క్రౌంచపక్షిమలమును జలముచేనూరి ప్రతిదినము పానము జేయుచుండిన, నట్టిమనుజుని దుష్టజంతువులు కరచినను అట్టిజంతువుల విషము అతిశీఘ్రముగ నశించును.

* గృహగోధికావిషదోషశాంతి. *

శ్లో॥ కటుత్రయంసింధుకరంజబీజంద్వయంనిశాయాః కపికచ్ఛుబీజం। నిహంతిపానేనవిలేపనేనవిషంసమస్తంగృహగోధికాయాః॥

తా॥ బల్లిమొదలగువానివిషదోషములు, శొంఠి,పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, కానుగవిత్తులు, పసుపు, మానిపసుపు, దురదగొండివిత్తులు, వీటిని ఉదకముతో నూరిత్రాగినను, శరీర లేపనము జేసికొనినను, నివర్తించును.

* చెవులయందుప్రవేశించిన జోరీగవికారశాంతి. *

శ్లో॥ కర్ణప్రవేశేఖర్జూరతరుపర్ణైమూత్రకంక్షిపేత్ । తథాచతిలతైలంచఘం కేవత్సస్యశ్లత్తకం॥ ౩౧౧॥

తా॥ చెవులయందుప్రవేశించిన జెర్రిగలవిషదోషము, గోమూత్రము తిలతైలము, వీటినికలిపి, కొంచము వెచ్చజేసియైనను, లేక, ఆవుదూడపేడరసమునైనను, చెవులలో వేయుచుండిన,నివర్తియగు.

❋ శ్వేతమూషకకృతగ్రంధిదోషశాంతి. ❋

శ్లో॥ ఊర్ధ్వాత్తుపలితంమూషం శ్వేతవర్ణంసుదారుణం । పాతస్థానే
భవేద్గ్రంథిస్స్యాద్గ్రంధిర్మృతుదాయికా। శస్త్రేణగ్రంధీంవిస్ఫో
ట్యాఖరస్యశకృతంక్షిపేత్ । తేనదుష్టస్యగ్రథితోవికృతేశ్శాంతి
కృద్భవేత్॥ ౩౧౩॥

తా॥ అతిదుష్టమగు శ్వేతమూషకము ఊర్ధ్వంబుగనుండి శరీరముమీదపడెనేని నచటగ్రంధులుజనించి మరణముగలుగు; గనుక, గ్రంధులుజనించినతోడనే, నచట శస్త్రముచే కొంచముగీచి, గాడిదెపెంటికలను లేపనముజేసిన నాగ్రంథులుశమించు.

❋ భ్రమరకృతజలోదరదోషశాంతి. ❋

శ్లో॥ షట్పాదేచోదరేప్రాప్తేజలోదరఃప్రజాయతే । తస్యశుక్పిప్పలీ
దేయావికృతేశాంతికృత్సదా॥ ౩౧౪॥

తా॥ కడుపులోతుమ్మెదప్రవేశించుటచే జలోదరరోగముజనించు. దానికి, పిప్పళ్లనుసేవింపుచుండిన నాదోషము నివర్తియగు.

❋ సర్వవిషములదోషశాంతి. ❋

శ్లో॥ తైలంచామ్లంతథానిద్రాంవర్జయేద్విషపీడితః । తండులంఘృత
దుగ్ధంచశ్రేష్ఠంపథ్యంవిషాతురే॥ ౩౧౫॥

తా॥ విషపీడితులు, మంచినూనె, పులుసు, నిద్ర, మొదలగువాటిని వర్జించి బియ్యపుఅన్నము, నెయ్యి, పాలు, వీటిని అనుపానములుగ సేవింపుచుండిన, హితముగనుండు.

ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపాన రత్నాకరే
షువర్ణాదీనాంపక్వాపక్వభస్మనాం గుణదోష
తచ్ఛాంతి వివేక కథనన్నామ
షష్ఠస్తరంగః.



శ్రీ ర స్తు.



శ్రీమద్ధన్వంతరయేనమః

ఆంధ్రతాత్పర్యసహిత

# అనుపానరత్నాకరము.

## సప్తమస్తరంగము.

### * యోగరాజగుగ్గులు. *

శ్లో॥ నాగరంపిప్పలీచవ్యంపిప్పలీమూలచిత్రకైః । భ్రష్టంహింగ్వజమోదంచసర్షపాజీరకద్వయం ॥ రేణుకేంద్రయవాః పాఠావిడంగంగజపిప్పలీ । కటుకాతివిషాభార్గీవచామూర్వేతిభాగతః । ప్రత్యేకంశాణికానిస్యుర్ద్రవ్యాణీమానివింశతిః । ద్రవ్యేభ్యస్సకలేభ్యశ్చత్రిఫలాద్విగుణాభవేత్ । ఏభిశ్చూర్ణీకృతైస్సర్వైస్సమోదేయస్తుగుగ్గులుః ।వంగంరౌప్యంచనాగంచలోహసారం తథాభ్రకం । మండూరంరససిందూరంప్రత్యేకంపలసమ్మితం । గుడపాకసమంకృత్వాఇమందద్యాద్యథోచితం । ఏకపిండంతతఃకృత్వాధారయేద్ఘృతభాజనే । గుటికాశ్శాణమాత్రాస్తు కృత్వాగ్రాహ్యాయథోచితాః । గుగ్గులుర్యోగరాజోయంత్రిదోషఘ్నోరసాయనః । మైథునాహారపానానాంత్యాగోనైవాత్రవిద్యతే। సర్వాన్వాతామయాన్కుష్ఠానర్శాంసిగ్రహణీగదం । ప్రమేహంవాతరక్తంచనాభిశూలంభగందరం । ఉదావర్తంక్షయంగుల్మమపస్మారమురోగ్రహం । మందాగ్నిశ్వాసకాసాంశ్చనాశయేదరుచింతథా । రేతోదోషహరఃపుంసాంరజోదోషహరస్స్త్రియాం । పుంసామపత్యజనకోవంధ్యానాంగర్భదస్తథా॥ ౩౧౬॥

తా॥ శొంఠి, పిప్పళ్లు, చవ్యము, మోడి, చిత్రమూలము, వేయించినయింగువ, అజామోదము, తెల్లఆవాలు, జీలకఱ్ఱ, సహజీర, రేణుకలు, కొడిశపిత్తులు, అగురుశొంఠి, వాయువిడంగములు, గజపిప్పలి, కటుకరోహిణి, అతివస, గంటుభారంగి, వస, చాగమట్ట, ఇవి ప్రత్యేకప్రత్యేకముగ శాణప్రమాణము, త్రిఫలములు (౮౦) శాణములు, ఇటుల వీటినన్నిటిని చూర్ణించి, యిందుకుసమానముగ ※ శుద్ధిజేయబడిన గుగ్గులమును మెత్తగనూరి బెల్లమువలె పలచనగ సాగుబెట్టి అందు పైచూర్ణమునుజేర్చి బాగుగకలియబెట్టి అందు వంగభస్మము, రౌప్యభస్మము, నాగభస్మము, లోహభస్మము, అభ్రకభస్మము, మండూరభస్మము, రససిందూరము వీటినన్నిటిం ప్రత్యేకముగ నాకపలముచొప్పునవైచి బాగుగకలియబెట్టి శాణప్రమాణముగ గుటికలుజేసి వాటినినెయ్యివాడిన కుండయందునిచ్చి యంథాకమాత్రను పుచ్చుకొనిన త్రిదోషములు, సమస్తవాతరోగములు, కుష్ఠువులు, మూలవ్యాధులు, సంగ్రహణులు, ప్రమేహములు, వాతరక్తము, నాభిశూల, భగందరము, ఉదావర్తము, క్షయరోగము, గుల్మములు, అపస్మారము, ఉరోగ్రహరోగము, అగ్నిమాంద్యము, శ్వాసకాసలు, అరుచి, శుక్లధాతుగతదోషములు, రజోగతదోషములు, ఇవియన్నియునశించు. ఇది యోగరాజగుగ్గుల రసాయనమని జెప్పంబడు. దీనిని మైధునాహారపానాదిపథ్యంబులులేకనే సేవింపవలయు. మఱియు నీయోగరాజగుగ్గులమును సేవించెడి పురుషులకు పుత్రోత్పాదశక్తి, స్త్రీలవంధ్యాకు గర్భధారణశక్తి యివి గలుగు.

## ※ నారాయణచూర్ణవిధి. ※

శ్లో॥ చిత్రకత్రిఫలావ్యోషంజీరకంహాపుషావచా । యవానీపిప్పలీ
మూలంశతపుష్పాజగంధికా । అజమోదాశఠీధాన్యంవిడంగం
స్థూలజీరకం । హేమాహ్వాపౌష్కరంమూలంక్షారోలవణపం
చకం । కుష్ఠంశేతిసమాంశానివిశాలాస్యాద్ద్విభాగికా । త్రివృ
త్త్రిభాగావిజ్ఞేయాదన్త్యాభాగత్రయంభవేత్ । చతుర్భాగాసా
తలాహ్యేత్సర్వాణ్యేకత్రచూర్ణయేత్ । పాచనస్నేహనాద్యై
శ్చస్నిగ్ధకోష్ఠస్యరోగిణః । దద్యాచ్చూర్ణంవిరేకాయసర్వశూ
లప్రణాశనం । హృద్రోగేపాండురోగేచకాసేశ్వాసేభగంద
రే । మందాగ్నౌచజ్వరేకుష్ఠేగ్రహణ్యాంచగలగ్రహే॥ ౩౧౪॥

---

※ గుగ్గులము, దశమూలకషాయముతోనైనను లేక త్రిఫలకషాయముతోనైనను శుద్ధిజేయవలయును.

తా॥ చిత్రమూలము, కరక, తాండ్ర, యుసిరికలు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, జీలకర్ర, బోడతరము, వస, ఓమము, మోడి, పెద్దసోపు, అడవితులసి, అజామోదము, కచ్చోరములు, ధనియాలు, వాయువిడంగములు, పెద్దజీలకర్ర, ఉమ్మెత్త, పుష్కరమూలము, సద్యక్షారము, యవక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, సాంబరలవణము, చంగల్వకోష్టు యి విదినసుకొక్కొక్కభాగము, పెద్దపాపరవేళ్లు రెండుభాగములు, తెగడ మూడుభాగములు, నేపాళపువేళ్లు మూడుభాగములు, సంబరేణు నాలుగుభాగములు, ఇటుల వీటినన్నిటినిదంచి చూర్ణించి దీనిని రోగికిచ్చుటకుముందు పాచనస్నేహరేచనాదులచే వానియుదరము శుద్ధియగునటులంజేసి పిదపనీచూర్ణమును యుక్తానుపానములతో నొసంగిన వృధ్రోగము, పాండురోగము, శ్వాసకాసలు, భగందరము, అగ్నిమాంద్యము, జ్వరము, కుష్ఠువు, సంగ్రహణి, గళగ్రహము మొదలగు సర్వరోగంబులు నశించు.

## ❋ మృత్యుంజయరసనిర్మాణవిధి. ❋

శ్లో॥ విషస్యైకంతథాభాగంమరీచంపిప్పలీంకణాం । గంధకస్యత
థాభాగంభాగంస్యాట్టంకణస్యచ।సర్వత్రసమభాగంస్యాద్హింగు
ళస్తుద్విభాగకం। చూర్ణమేతల్ఖమధ్యేతుముద్గమానాంవటీంచ
రేత్ । జంబీరస్యరసేనాత్రకార్యంహింగుళశోధనం । రస
శ్చేత్సమభాగస్యాద్హింగుళంనేష్యతేతథా । గోమూత్రశోధితం
చాత్రవిషస్సైరవిశోధితం । మృత్యురూపంజ్వరంహంతిమృత్యుం
జయరసస్స్మృతః । తీవ్రజ్వరేమహాఘోరేపురుషేయావనాన్వి
తే। పూర్ణమాత్రాప్రదాతవ్యవిచారీచభిషగ్వరైః । స్త్రీబాల
వృద్ధక్షీణేషుహ్యర్ధమాత్రాప్రకీర్తితా । అతివృద్ధేచక్షీణేచశిశౌ
చాల్పవయస్యపి। తూర్యమాత్రాప్రదాతవ్యావ్యవస్థాసారనిశ్చి
తా। నవజ్వరేమహాఘోరేయాంమైకానాశమేధ్రువం।మధ్యజ్వరే
తథాజీర్ణేత్రిరాత్రాన్నాశమేధ్రువం । సప్తాహాత్సన్నిపాతో
త్థంజ్వరంజీర్ణకసంజ్ఞకం॥ ౩౧౮॥

తా॥ గోమూత్రములో శుద్ధిజేసిన వసనాభి (౧) భాగము, మిర్యాలు(౧) భాగము, పిప్పలి (౧) భాగము, జీలకర్ర (౧) భాగము, గంధకము (౧) భాగము వెలిగారము (౧) భాగము, నిమ్మరసముతో శుద్ధిజేసిన * ఇంగిలీకము (౨) భాగము లుసీటినన్నిటిని ఖల్వమునందునిచి నిమ్మపండ్లరసముతో నూరి పెసరగింజంతమాత్రలు జేసి సేవించిన మృత్యురూపమగు జ్వరమును బోగొట్టుగాన మృత్యుంజయ రసమనం బడు. మఱియు యౌవ్వనపురుషులకు ఘోరమైన తీవ్రజ్వరమునందు (౧) మాత్ర యివ్వవలయు. మఱియు స్త్రీలు, బాలురు, వృద్ధులు, క్షీణత్వమును జెందినవారు వీర్ల కు (౪) మాత్రయివ్వవలయు. అతివృద్ధులు, అతిక్షీణులు, శిశువులు వీర్లకు నాక మాత్రలో నాలుగోభాగమివ్వవలయు. మహాఘోరమగు నవజ్వరమునందు సే వించిననది నాకయామమున కునివర్తించు. మధ్యజ్వరము, జీర్ణజ్వరము, వీటియందు సేవించిన మూడుదినములలో నశించు. సన్నిపాతమువలన గలిగిన జీర్ణజ్వరమునందు సేవించిన యేడు దినములలో హరించు.

## * వసంతకుసుమాకరరసనిర్మాణవిధి. *

శ్లో॥ ప్రవాళరసమౌక్తికాభ్రకమిదం చతుర్భాగభాక్పృథగ్భస్మి
తేరజితహేమనీద్వ్యంశకే। అథోభుజగరంగకంత్రిలవకాంవిమ
ర్ద్యాఖిలం। శుభేహనిసిభావయేద్భిషగియందియాసప్తశః। ద్ర
వైర్వృషనిశేక్షుజైఃకమలమాలతీపుష్పజైః। రసైఃకదలికందజై
ర్మలయచందనాదుద్భవైః। వసంతకుసుమాకరోరసపతిర్ద్విప
ల్లోశితస్సమస్తగదహృద్భవేతిద్విలనిజానుపానైరయం॥ ౩౧౯॥

తా॥ ప్రవాళభస్మము (౮) భాగములు, రసభస్మము (౮) భాగములు, ము క్తికభస్మము (౮) భాగములు, అభ్రకభస్మము (౮) భాగములు, రౌప్యభస్మము (౨)భాగములు, స్వర్ణభస్మము (౨) భాగములు, లోహభస్మము (౩) భాగములు, నాగభస్మము (౩) భాగములు, వంగభస్మము (౩) భాగములు వీటినన్నిటిని ఖల్వ మునందునిచి అడ్డసరము, మానిపసము, చెఱుకు, తామరపూలు, జాజిపూలు, అర టిగడ్డ, కృష్ణాగరు, చందనము, వీటిరసములచేతగాని, లేకకషాయములచేతగాని ప్రత్యేకముగ నొక్కొకదానిచే యేడుభావనలుచేసి, కరాటమునందునిచికొని రెం డు వల్లములప్రమాణము అనుపానవిశేషములచే సేవించిన సమస్తరోగములు నివ ర్తించు.

* రసము (౧) భాగము చేర్చునెడ ఇంగిలీకమును చేర్చవలెను.

### * లోకనాధరసనిర్మాణవిధి. *

శ్లో॥ శుద్ధోబుభుక్షితస్స్నాతోభాగద్వయమితోభవేత్ । తథాగంధ
స్యభాగావ్వౌకుర్యాత్కజ్జలికాంతయోః ॥ సూతాశ్చతుర్గుణే
ష్వేవకపర్దేషువినిక్షిపేత్ । భాగైకంటంకణందత్వాగోక్షీరేణ
విమర్దయేత్ । తథాశంఖస్యఖండానాంభాగానష్టౌప్రకల్పయే
త్।క్షిపేత్సర్వంపుటస్స్యాంతశ్చూర్ణంలిప్తశరావయోః। గర్తే
హస్తోన్మితేఖృత్వాపచేద్గజపుటేనచ । స్వాంగశీతంసముద్ధృ
త్యపిష్ట్వాతత్సర్వమేకతః । షడ్గుంజాసమ్మితంచూర్ణమేకోన
త్రింశమూషకైః । ఘృతేనవాతజేదద్యాన్నవనీతేనపిత్తజే। క్షౌ
ద్రేణశ్లేష్మజేదద్యాదతీసారేక్షయేతథా । అరుచౌగ్రహణీరో
గేకాశ్యేమందానలేతథా । కాసేశ్వాసేషుగుల్మేషులోకనా
థోరసోహితః । తస్యోపరిఘృతాన్నంచభుంజీతకబలత్రయం।
మంచేశక్తైకముత్తానంశయీతానుపధానకే । అనమ్లమన్నం
సఘృతంభుంజీతమధురందధి । ప్రాయేణజాంగలంమాంసం
ప్రదేయంఘృతపాచితం । సదుగ్ధభక్తందద్యాచ్చజాతేగ్నౌ
సాంధ్యభోజనే । సఘృతాన్ముద్గవటకాన్వ్యంజనేష్వేవచారయే
త్।తిలాఽమలకకల్కేనస్నాపయేత్సర్పిషాథవా । అభ్యంజ
యేత్సర్పిషాచస్నానంకోష్ణోదకేనచ। క్వచిత్తైలంనగృహ్ణీయా
న్నబిల్వంకారవేల్లకం । వార్తాకంశపరీంచించాంత్యజేద్వ్యా
యామమైథునం । మద్యంసంధానకంహింగుశుంఠీమాషాన్మ
సూరికాన్ । కూశ్మాండంరాజికాంకోపంకాంజికంచైవవర్జయే
త్యజేదయుక్తనిద్రాంచకాంస్యపాత్రేచభోజనం । కకారాది
యుతంసర్వంత్యజేచ్చాకఫలాదికం । పథ్యోయంలోకనాథస్తు
శుభనక్షత్రవాసరే । పూర్ణాతిథౌశుక్లపక్షేజాతేచంద్రబలేత
థా। పూజయిత్వాలోకనాథంకుమారీంభోజయేత్తతః । దా
నందద్యాద్ద్విఘటికామధ్యేగ్రాహ్యోరసోత్తమః । రసాత్స్వం

జాయతే తాపస్తదా శర్కరయా యుతం । సత్వం గుడూచ్యా
గృహ్ణీయాద్ద్వంశరోచనయా యుతం । ఖర్జూరం దాడిమం ద్రా
క్షా నిక్షుఖండాని చారయేత్॥ అరుచౌ సిస్తు షంధాన్యం ఘృతభృ
ష్టం సశర్కరం । దద్యాత్తథాజ్వరే ధాన్యం గుడూచీ క్వాథమా
హరేత్ । ఉశీరవాసక క్వాథం దద్యాత్స మధుశర్కరం । రక్త
పిత్తే కఫే శ్వాసే కాసే చ స్వరసంక్షయే। అగ్నిభృష్టం జయా చూ
ర్ణం మధునా నిశిదీయతే । నిద్రానాశేతిసారే చ గ్రహణ్యాం మం
దపావకే । సౌవర్చలాభయా కృష్ణా చూర్ణముష్ణ జలైః పిబేత్।
శూలే జీర్ణే తథా కృష్ణా మధుయుక్తా జ్వరే హితా । ప్లీహాదరే
వాతరక్తే భర్ద్యాం చైవ గుడాంకురే। నాసికా ప్లుతరక్తే షురసం
దాడిమ పుష్పజం । దూర్వాయాస్స్వరసం నస్యే ప్రదద్యాచ్ఛ
ర్కరాయుతం । కోలమజ్జా కణాబర్హి పక్ష భస్మ సశర్కరం।మ
ధునా లేహయేచ్ఛర్ది హిక్కాకోపస్య శాంతయే । విధిరేషః ప్ర
యోజ్యస్తు సర్వస్మిన్పోటలీ రసే । మృగాంకే హేమగర్భే చ మౌ
క్తికాఖ్యే రసేషు చ । ఇత్యేవం లోకనాథోక్తో రసస్సర్వరుజో
జయేత్॥ ౩౨౦॥

తా॥ శుద్ధ * బుభుక్షితమగు పాదరసము రెండుభాగములు, శుద్ధి జేసిన గంధకము రెండుభాగములు, ఇటులవీటిని నూరి కజ్జలిచేసి పాదరసమునకు నాలుగింతలు పసపుఛాయగల గవ్వలను దెచ్చి అందు యీకజ్జలినునిచి వెలిగారమును వొకభాగము గ్రహించి ఆవుపాలతో నూరి ఆగవ్వలయందలి కజ్జలిపైకి రాకుండు నటుల దానినోటికి పూసి పిదప శంఖపుతునకలను (౮) భాగములు గ్రహించి రెండు మంటిశరావములను దెచ్చి యందొకదానికి సున్నము పూసి శంఖపుతునకలలో సగము వైచి దానిపై కజ్జలిజేసిన గవ్వలనునిచి దానిపై మిగిలియుండెడి సగము శంఖపుతునకలను వైచి సున్నముచే లేపనము జేసిన రెండవశరావమును మూసి బాగుగ చీలయి

* సువర్ణాదిధాతువులను గ్రసించుటకు యోగ్యమగునటుల గంధకాదులచే సంస్కారము చేయబడిన పాదరసము, బుభుక్షిత మనంబడును.

చ్చి రెండింటిని నాలుగుమూలలును చదరముగనుండునటుల గజములోతున పల్లము త్రవ్వి దానిలోపల నొకమూర ప్రమాణముగల మరియొక పల్లమును త్రవ్వి అందు శరావ సంపుటమునునిచి దానిపై మన్నునూసి అడవియేరుపిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున దానిని వెలికిదీసి శరావమందలి యౌషధములను ఖల్వమున జక్కగ నూరి చూర్ణము జేయవలయు. ఇదియ లోకనాథరసమనంబడు. ఈలోకనాథరసము ఆరుగురిగింజలయెత్తును (౭౯) మిరియములచూర్ణములో కలిపి, వాతరోగంబులయందు నేతి అనుపానములోడను, పిత్తరోగంబులయందు వెన్నలోడను, శ్లేష్మరోగంబులయందు తేనెతోడను, యివ్వవలయు. మఱియు నీలోకనాథరసము అతిసారము, క్షయరోగము, అరుచి, సంగ్రహణి, కృశత్వము, అగ్నిమాంద్యము, దగ్గు ఉబ్బసము, గుల్మము, వీటికి ప్రశస్తంబుగనుండు దీనిని సేవించినతోడనే ఘృతాన్నమును మూడుగ్రాసములు భుజించి మంచముమీద పరుపులేకనే క్షణకాలము వెల్లకిలబరుండవలయు. మఱియు పులుసువర్జించి ఘృతాన్నము, తియ్యనిపెరుగు, వీటిని పుచ్చుకొనవలయు. విశేషముగ అడవిలోనుండెడు జింకమొదలగువాని మాంసములను నేతితో పక్వముజేసి భక్షింపవలయు. సాయంకాలమున ఆకలిగలిగినన్ నేతి పాలు అన్నమును భక్షించి నోటిరుచికై పెసలవడలను నేతిలోజేసిపుచ్చుకొనవలయు మఱియు నువ్వులు, ఉసిరికెపాలుపు, వీటిని నూరి కల్కమును జేసియైనను, లేక నెయ్యియైనను శరీరమునకు లేపనము జేసికొని కించిదుష్ణోదకముతో స్నానము జేయవలయును తిలతైలమును బొత్తిగ స్పర్శింపఁదగదు. మారేడుపండు, కాకరకాయలు, వంకాయలు, చిన్నమత్స్యములు, చింతపండు, మద్యములు, ఇంగువ, శొంఠి, మినుములు మసూరధాన్యములు, కూష్మాండము, ఆవాలు, కాంజికము, కారవల్లి మొదలగు కకారాదులుగనుండెడి కూరలు, కూరఆకు, ఫలములు, వీటిసేవనయు, శ్రమగలుగ జేసికొనుట, మైథునంబొనర్చుట, ఆగ్రహించుట, పగలునిద్రించుట, కంచుపాత్రయందుభుజించుట, వీటినివర్జించవలయు. ఇదియ దీనికిపథ్యము. మఱియు నీలోకనాథరసమును శుక్లపక్షమునందు శుభనక్షత్రముతోగూడిన పంచమి, దశమి, పూర్ణమి మొదలగు సంపూర్ణతిథులయందు తనకు చంద్రతారాబలముల చూచుకొని పూజించి కన్యకకు భోజనంబిడి శక్త్యనుసారముగ సువర్ణాదిదానంబులనొసంగి ఉద్యానమున రెండుగడియలలోపల సేవింపవలయు. దీనిని సేవించుటచే శరీరము తాపముగలిగెనేని శర్కర తిప్పసత్తు వెనుపప్పు ఈటిని నేకముగజేసి పుచ్చు

వలయును. మఱియు ఖర్జూరము, దాడిమపండు, ద్రాక్షపండు, పొటుకుతుంటలు వీటిని కొంచకొంచముగ భుజించుచుండవలయును. ఇటులంజేసిన తాపముశమించును. ధనియాలనుదంచి పొట్టుదీసి దానిని నేతిలోవేయించి అందుశర్క్కరను,లోకనాథరసమునుకలిపి పుచ్చుకొనిన అరుచినశించును. ధనియాలు, తిప్పతీగె,వీటికషాయమున లోకనాథరసమునుకలిపి పుచ్చుకొనిన జ్వరమునశించును.వట్టివేళ్లు,అడ్డసరపాకు,వీటికషాయమున తేనె, శర్క్కర, కలిపియందు లోకనాథరసమునుజేర్చి పుచ్చుకొనిన రక్తపిత్తము, కఫము, శ్వాస, కాస, స్వరభంగము, యువినశించును. బంగిఆకును కొంచముగవాడ్చి చూర్ణముచేసి అందులోకనాథరసమును, కొంచెముగ తేనెయును కలిపి రాత్రులయందు పుచ్చుకొనిన నిద్రపట్టనివానికి నిదురవచ్చుటయగాక, అతిసారము, సంగ్రహణి యువినశించి, అగ్నిదీపనముగలుగును. సౌవర్చలవణము కరకపిందెలు, పిప్పళ్లు, వీటినిచూర్ణించి అందులోకనాథరసమునుకలిపి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన శూలలు, అజీర్ణములు, యువినశించును. పిప్పలిచూర్ణమున తేనె, లోకనాథరసము, వీటినికలిపి పుచ్చుకొనిన జ్వరములునశించు. దాడిమపూలరసమున లోకనాథరసమునుకలిపి పుచ్చుకొనిన జ్వరములునశించు. దాడిమపూలరసమున లోకనాథరసమునుకలిపి పుచ్చుకొనిన కడుపులో యెడమపార్శ్వమునజనించెడి ప్లీహోదరము, వాతరక్తము, వాంతులు,మూలవ్యాధి, ముక్కులోరక్తముకారుట ఇవినశించును. గరికెస్వరసమున శర్క్కరకలిపి అందు లోకనాథరసమునుజేర్చి నస్యముజేసిన ముక్కులోస్రవించెడి రక్తమునశించును. రేగుపిత్తులోనిపప్పు, పిప్పళ్లు, నెమలిరెక్కలభస్మము, వీటియందు శర్క్కర, తేనెకలిపి లోకనాథరసమునువైచి పుచ్చుకొనిన వాంతులు, ఎక్కిళ్లు యువినశించును. మఱియు పోటలీ, మృగాంకము, హేమగర్భము, మౌక్తికము మొదలగు స్వరసములయందును, లోకనాథరసమునకు జెప్పబడిన పథ్యములు, అనుపానములు వీటిని అనుష్ఠింపవలయును. ఈలోకనాథరసము సర్వరోగములను హరింపంజేయును.

**❋ స్వర్ణమాలినీవసంతరసనిర్మాణవిధి. ❋**

శ్లో॥ స్వర్ణంముక్తాదరదమరిచంభాగవృద్ధ్యాగృహీతం। ఖర్పరష్టౌ ప్రథమమఖిలంమర్దయేన్మ్లక్షతక్రేణ। యావత్స్నేహోవ్రజతివిలయంమర్దనేదీయతేఽస్మా। గుంజాద్వంద్వంమధుమగధయా మాలినీప్రాగ్వసంతః॥ ౩౭౧॥

తా॥ స్వర్ణపత్రము (అపరంజి) (౧) భాగము, మౌక్తికభస్మము (౨) భాగములు, పాదరసభస్మము (౩) భాగములు, మిరియాలు (౪) భాగములు, కర్పరభస్మము (౫) భాగములు వీటిని ఖల్వమునందునిచి మైనమురీతిగ నగువరకు జక్కగ మర్దించి మాత్రలుజేసి, తేనె, జీలకఱ్ఱచూర్ణము వీటితో రెండుగురిగింజలప్రమాణము సేవించిన సమస్తరోగములునివర్తించు.

❋ బృహన్మాలినీవసంతరసనిర్మాణవిధి. ❋

శ్లో॥ వైక్రాంతమభ్రంరవితాప్య రౌప్యంగంధప్రవాళంరసభస్మలోహం। సటంకణంశంబుకభస్మసర్వంసమస్తమేతచ్చవరీరజన్యోః।
ద్రవైర్విమర్ద్యంమునిసంఖ్యయాచకస్తూరికాసీతకరేణపశ్చాత్।
తదాబృహత్పూర్వకమాలినీప్రాక్వసంతనామారసదోరసోయం॥

తా॥ వైక్రాంతభస్మము, అభ్రకభస్మము, తామ్రభస్మము, హేమమాక్షికభస్మము, రౌప్యభస్మము, శుద్ధగంధకము, పగడభస్మము, రసభస్మము, లోహభస్మము, వెలిగారము, శంఖభస్మము, వీటినిఖల్వమునందునిచి, పిల్లపీచర, నీలిఆకు, వీటిరసముతో మర్దించి భావనజేయవలయు. ఇటులయేడుమార్లుచేసి పిదప కస్తూరి పచ్చకర్పూరము వీటినిచేర్చి మరల పైరసములతో మర్దించి భావనజేసిన నిదిబృహన్మాలినీవసంతరసమనంబడు. ఇది సర్వరోగములను నశింపంజేయు.

❋ పాశుపతరసనిర్మాణవిధి. ❋

శ్లో॥ శుద్ధంసూతంద్విధాగంధంత్రిభాగంతీక్ష్ణభస్మకం । త్రిభిస్సమం విషందేయం చిత్రకక్వాథభావితం । ధూర్తబీజస్యభస్మాపి ద్వాత్రింశద్భాగసంయుతం। కటుత్రయంత్రిభాగంస్యాల్లవంగైలాచతత్సమం। జాతీఫలంతథాకోశమర్ధభాగంసయోజయేత్। తథార్ధంలవణంపంచస్నుహ్యార్కైరండతిన్త్రిడీ। అపామార్గాశ్వత్థజఞ్చక్షారందద్యాద్విచక్షణః। హరీతకీయవక్షారంస్వర్జికాహింగుజీరకం। టంకణంచసూతతుల్యమమ్లయోగేనమర్దయేత్। భోజనాంతేత్రయోక్త్వ్యాగుంజాఫలప్రమాణతః। రసఃపాశుపతోనామసద్యఃప్రత్యయకారకః। దీపనఃపాచనోహ్యాద్యసదోహ్యహన్తివిషూచికాం॥

తా॥ శుద్ధరసభస్మము (౧) భాగము, గంధకము (౨) భాగములు, కాంతలోహభస్మము (౩) భాగములు, వసనాభి (౬) భాగములు, ఉమ్మెత్తవిత్తులభస్మము (౩౨) భాగములు, త్రికటుకములు (౩) భాగములు, లవంగములు, ఏలకులు, ఇవి ప్రత్యేకముగ (౩) భాగములు, జాజికాయ (౪) భాగము, జాపత్రి (౪) భాగము, పంచలవణములు (౪) భాగము, వాంతజెముడు, జిల్లేడు, ఆముదపుచెట్టు, చింతచెట్టు, ఉత్తరేణి, రావి, నీటిభస్మము, కరక్కాయ, యవక్షారము, సర్జక్షారము, ఇంగువ, జీలకర్ర, వెలిగారము యివియన్నియు ప్రత్యేకముగ (౧) భాగము, వీటినన్నిటిని చిత్రమూలకషాయముతో నూరి పిదప ఎండించిమరల నిమ్మపండ్లరసముతో నూరి, గురిగింజలంతమాత్రలు జేయవలయు. ఇదే పాశుపతరసమనంబడు. దీనిని భోజనము జేసినతర్వాత వాకమాత్ర సేవించిన విషూచికారోగము నివర్తించుటయే గాక అగ్నిదీపనము, పాచనము, మనోల్లాసము వీటినిసగాగలుగంజేయు.

## ✻ పర్పటీరసనిర్మాణవిధిః ✻

శ్లో॥ రసంత్రిగుణగంధేనమర్దయిత్వాసభృంగకం । లోహపాత్రేషు తాభ్యక్తేద్రావితంబదరాగ్నినా ॥ ఊర్ధ్వాధోగోమయందత్వా కదళ్యాఃకోమలేదళే । స్నిగ్ధేప్రతేహ్యాయోదర్వ్య పర్పటాకారతాంనయేత్ । పాదేలోహేవినిక్షిపేలోహపర్పటికాభవేత్ । తామ్రేపాదేవినిక్షిప్తేతామ్రపర్పటికాభవేత్ । విషపాదంచయుంజీతత్వసాధ్యేష్వామయేషుచ। సురసాయాజయన్త్యాశ్చకన్యకాధకయూషయోః । త్రిఫలాయామునేర్వార్యాముండ్యాత్రికటుసంజ్ఞయోః । భృంగరాజస్యవహ్నేశ్చస్రత్యహం ద్రవభావితం । ఆర్ద్రకస్యద్రవేణాథసప్తధాభావయేత్పునః। అంగారేస్వేదయేదీషత్పర్పటీరసముత్తమం । గుంజాష్టకందదీతాస్యతామ్బూలీపత్రసంయుతం। పిప్పలీరసకైశ్చాపిసిర్గుండ్యాహ్యనుపానయేత్ । త్రికంటకస్యమూలానిశుంఠీచ్ఛిత్వావినిక్షిపేత్ । అజాక్షీరేసనీరార్ధంయావత్క్షీరంవిపాచయేత్ । తత్క్షీరంపాయయేద్రాత్రౌసకఃంభోజయేదపి । కూష్మాండంవర్జయేచ్చించావృంతాకంకరకాటీమపి। ఆరనాలంచతైలంచమైథునంచవివర్జయేత్ । మాసత్రయంతుసేవేతకాసశ్వాసాపనుత్తయే॥

తా॥ రసము (౧) భాగము, గంధకము (3) భాగములు వీటినిఖల్వమందుని చి గుంటగలగరాకురసముతోనూరి, లోహపాత్రమునకు లోపలనెయ్యి చరిమి అందునిచి, రేగుకట్టెలతో మంటవేసి ద్రవించునటుల కాచిపిదప ఆవుపేడను గుండ్రముగతట్టి దానిపై అరటిఆకుతును పరచి దానిపై మరల ఆవుపేడను గుండ్రముగ తట్టి అందు ఇనపగరిటలో కరిగినపైరసమును బోసి అప్పడమువలె గుండ్రముగునటుల ఇనపగరిటతో చేయవలయు. ఇదిపర్పటీరసమనంబడు. పైరసగంధకములు మిళితముగకరుగునపుడు అందురసమునకు నాలవభాగము లోహభస్మము వైచిన లోహ పర్పటీయనబడును. రసమునకు నాలవభాగము తామ్రభస్మము వైచిన తామ్రపర్పటీయనబడును. అసాధ్యరోగములయందు రసమునకు నాలవభాగము వసనాభిని జేర్చవలయు. తులసి, ఉసిరికె, కలబంద, కంచి, అడ్డసరము, అగసి, చిత్రి, గుంటగలగర, చిత్రమూలము, వీటియొక్క రసములు, త్రిఫలములు, గంటుభారంగి, త్రికటుకములు వీటియొక్క కషాయములు, పైరసకషాయములలో ప్రతిదానితోన ఒక్కొకదినము భావనజేసిపిదప అల్లపురసముతో యేడుమార్లు భావనజేసిపిదప బొగ్గులనిప్పుసెగయందు కొంచముగ కాచినసిద్ధమైన పర్పటీరసమగు. దీనిని ౨ గురుగింజలయెత్తు తమలపాకులోపెట్టి సేవించి పిదప పిప్పళ్లకషాయమునుగాని, లేక వాపిలికషాయముగాని పానము జేయవలయు. మేకపాలకు సమముగ వుదకము జేర్చి అందుపల్లేరువేరు, శొంఠివీటిని నలగగొట్టివైచి నీరంతయు యిగురునటులకాచి అందు పిప్పలీచూర్ణమును వైచి దానిని రాత్రియందుసేవించి భోజనము జేయవలయు. ఈ ఔషధమును సేవించునపుడు గుమ్మడికాయ, చింతపులుసు, వంకాయ, దోసకాయ, కూటినీళ్లు, నూనె, స్త్రీసంభోగము వీటినివర్జింపవలయు. ఇటులమూడు మాసములు సేవించిన కాసశ్వాసలు నివర్తించు.

❊ జయావతీ నిర్మాణవిధి. ❊

శ్లో॥ విషంత్రికటుకంముస్తంహరిద్రానిమ్బపత్రకం । విడంగమష్టమం
చూర్ణంభాగమాత్రైస్సమంస్సమం। చణకాభావటీకార్యాస్యా
జ్జయాయోగవాహికా॥ ౩౨౪॥

తా॥ వసనాభి, త్రికటుకములు, తుంగముస్తెలు, మానిపసపు, వేపాకు, వాయువిడంగములు, వీటినిసమభాగములుగ గ్రహించిచూర్ణించి మేకమూత్రముతోనూరి శనగగింజలంతమాత్రలు జేయవలయు. ఇదియేజయావటీయనంబడు. దీనినితగినైనఅనుపానములతో సేవించిన సర్వరోగములునివర్తించు.

### * జయంతీవటీనిర్మాణవిధిః *

శ్లో॥ విషంపాఠాశ్వగంధాచవచాతాలీసపత్రకం। మరీచంపిప్పలీనింబముజామాత్రేణతుల్యకం। వటికాపూర్వవత్కార్యా జయన్తీయోగవాహికా॥ ౩౨౮॥

తా॥ వసనాభి, విషబొద్ధి, పెన్నేరుగడ్డ, వస, తాళీసపత్రి, మిరియాలు, పిప్పళ్లు, వేపాకు, వీటినిసమముగ చేర్చి చూర్ణించి మేకమూత్రములో నూరి శెనగగింజలంతమాత్రలుజేయవలయు. ఇదియే జయంతీవటియనంబడు. దీనినియుక్తానుపానములతో సేవించిన సమస్తరోగములు హరించు.

ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
రోగరాజగుగ్గులు, నారాయణచూర్ణ, మృత్యుంజయాది
రసానాంనిర్మాణవివేకకథనన్నామ
సప్తమస్తరంగః.

శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

ఆంధ్రతాత్పర్యసహిత

# అనుపానరత్నాకరము.

## అష్టమస్తరంగము.

{ ధాతువులు, ఉపధాతువులు, రసములు, ఉపరసములు, విషములు, ఉపవిషములు, రత్నములు, ఉపరత్నములు, వీట్లయొక్క వివరములు. }

### ధాతువులవివరము.

శ్లో॥ స్వర్ణంరూప్యంచ తామ్రంచరఙ్గంయశదమేవచ। సీసంలోహంచసప్తైతేధాతవోగిరిసంభవాః॥ ౩౨౯॥

తా॥ స్వర్ణము, రౌప్యము, తామ్రము, వంగము, జసదము, సీసము, లోహము యీయేడున్ను సప్తధాతువులకు పేళ్లు. ఇవియన్నియు పర్వతమునందుజనించునవి.

# అష్టమస్తరంగము.

## ※ ఉపధాతువులు. ※

శ్లో॥ సప్తోపధాతవస్స్వర్ణ మాక్షికం తారమాక్షికం । తుత్థంకాం స్యంచరీతిశ్చసింధూరశ్చశిలాజతుః॥ ౩౨౮॥

తా॥ స్వర్ణమాక్షికము, రౌప్యమాక్షికము, తుత్థము, కాంస్యము, ఇత్తడి, సింధూరము, శిలాజతు, యీ(౭)న్ను ఉపధాతువులకు పేళ్లు.

## ※ రసము. ※

శ్లో॥ రసాయనార్థిభిర్లోకైః పారదోరస్యతేయతః । తతోరసఇతి ప్రోక్తస్సచధాతురపిస్మృతః॥ ౩౨౯॥

తా॥ రసాయనమును కోరినజనులచేత కోరబడునుగనుక రసమనంబను. ఇది ధాతువయనియును జెప్పంబడు.

## ※ ఉపరసములు. ※

శ్లో॥ గంధోహింగుళమభ్రితాళకశిలాస్రోతోఽఞ్జనంటంకణం । రాజావర్తకచుమ్బకౌస్ఫటికయాశఙ్ఖఃఖటీగైరికం । కాసీసంరసక కపర్దసికతాబోలంచకంకుష్ఠకం । సౌరాష్ట్రీచమతాఅమీఉప రసాస్సూతస్యకించిద్గుణైః॥ ౩౩౦॥

తా॥ గంధకము, హింగుళము, అభ్రికము, హరితాళకము, మనుశిల, స్రోతోంజనము, (నల్లసురమ) వెలిగారము, రాజావర్తకము, చుంబకపాషాణము, పటికము, శంఖము, ఖటీ, గైరికము, కాసీసము, రసకము, గవ్వ, యిసుక, బోళము, కంకుష్ఠము, సౌరాష్ట్రిము, యివి ఉపరసములనంబడు. ఇది రసమునకంటె కొంచముతక్కువగుణముగలది.

## ※ విషములు. ※

శ్లో॥ విషంతుగరళఃక్ష్వేడస్తస్యభేదానుదాహరే । వత్సనాభస్సహారిద్రఃసక్తుకశ్చప్రదీపనః । సౌరాష్ట్రికఃశృంగకశ్చకాలకూటస్తథైవచ । హాలాహలోబ్రహ్మపుత్రోవిషభేదాఅమీనవ॥ ౩౩౧॥

తా॥ విషము, గరళమనియు, క్ష్వేడమనియుజెప్పంబడు. వత్సనాభి, హారిద్ర, సక్తుక, ప్రదీపన, సౌరాష్ట్రిక, శృంగక, కాలకూట, హాలహాల, బ్రహ్మపుత్ర యిటులవిషము(౯)భేదములుకలదిగనుండు.

## ❋ ఉపవిషములు. ❋

శ్లో॥ అర్కాక్షీరంస్నుహీక్షీరం తథైవకరిహారికా । కర్వీరకోథధత్తూ
రఃపఞ్చోపవిషాస్స్మృతాః॥ ౩౩౨॥

తా॥ జిల్లేడుపాలు, బొంతజెముడుపాలు, ముంటువిత్తు, గన్నేరు, ఉమ్మెత్తయని ఉపవిషములు(౫)విధములుగనుండును.

## ❋ రత్నములు. ❋

శ్లో॥ వజ్రంగారుత్మకంపుష్పరాగోమాణిక్యమేవచ । ఇంద్రనీలశ్చగో
మేదస్తథావైడూర్యమిత్యపి । మౌక్తికంవిద్రుమశ్చేతిరత్నాన్యు
క్తానివైనవ॥ ౩౩౩॥

తా॥ వజ్రము, మరకతము, పుష్యరాగము, మాణిక్యము, యింద్రనీలము, గోమేధకము, వైడూర్యము, ముత్తియము, పవడము, ఇవి నవరత్నములనబడును.

## ❋ ఉపరత్నములు. ❋

శ్లో॥ ఉపరత్నానికాచశ్చకర్పూరాశ్మాతథైవచ । ముక్తాశుక్తిస్త
థాశంఖఇత్యాదీనిబహూన్యపి॥ ౩౩౪॥

తా॥ కాచమణి (గాజుపూస) కర్పూరపురాయి, ముత్తెపుచిప్ప, శంఖము యివి మొదలైనవి ఉపరత్నములనబడును.

ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
రోగరాజగుగ్గులు, నారాయణచూర్ణ, మృత్యుంజయాది
రసానాంనిర్మాణవివేకకథనంనామ
అష్టమస్తరంగః.

